# చేరాపీఠికలు




ప్రచురణ

సాహితీ మిత్రులు - రాజమండ్రి.

అక్టోబరు - 1994

# చేరాపీఠికలు

ఆచార్య వేటూరి ఆనందమూర్తిగారికి
సగౌరవంగా - చేరా
1995 ఆగస్టు 31



ప్రచురణ

సాహితీ మిత్రులు - రాజమండ్రి.

అక్టోబరు - 1994

CHERA PEETHIKALU (Telugu)



Fist Published, Oct 1994

Copies : 1000

Price ; Rs. 60/-

For Copies :

Professor C. RAMA RAO

New Found Land Street - 7

Habsi guda

HYDERABAD-500007.

Printed at :

Vijaya Block Making & Printing Works

Innespeta, RAJAHMUNDRY.

Ph : 71444

# పీఠికా క్రమం బెట్టిదనిన ....

(ii)

# కృతజ్ఞతలు

ఈ పీఠికలను పుస్తకంగా ప్రచురించే అవకాశం మాకు ఇచ్చిన శ్రీ చేరా గారికీ, షష్టిపూర్తి సన్మాన సంఘానికి;

కృతిస్వీకర్తలు ఆచార్య తూమాటి దొణప్పగారికి ;

దీని ముద్రణలో చేదోడుగా నిలిచిన సాహితీప్రియులు సర్వశ్రీ డా. ఎమ్. కాంతారావు (ఐ.పి.యస్) వి. హరిబాబు (ఆంధ్ర పేపర్ మిల్స్) డా. ఆరుమిల్లి ప్రసాద్ చౌదరి (డెర్మటాలజిస్ట్) -వీరికి ;

వాదోడుగా నిలిచిన సాహితీపరులు డా, టి. పతంజలిశాస్త్రి, డా. యెండ్లూరి సుధాకర్, డా. కె. సంజీవరావు, యెర్రాప్రెగడ రామకృష్ణ, గంధం నాగసుబ్రహ్మణ్యం -వీరికి :

ఇంకా — ఎప్పుడూ మా తోడుగా నిలిచే సాహితీసఖులు సర్వశ్రీమద్దూరి శివానందకుమార్ (న్యాయవాదులు), ఎమ్. కె. మూర్తి (సిద్ధార్థ రెసిడెన్షియల్) ఎమ్.ఎస్.రెడ్డి (ఇంజనీర్)కంచి మధుసూదనరావు (హోలీఏంజల్స్) మరియు సి. ఎస్. వెంకటరావు (ఆంధ్ర పేపర్ మిల్స్) -వీరికి ;

అందంగా ముద్రించి ఇచ్చిన విజయ బ్లాక్ మేకింగ్ అండ్ ప్రింటింగ్ వర్క్స్ అధినేత ఆత్మీయులు కొండపల్లి విజయకుమార్ గారికి కంపోజిటర్స్‌కి ప్రెడిల్ మెన్‌కి తక్కిన సిబ్బందికి :

సంపాదకుడు

రాజమండ్రి — బేతవోలు రామబ్రహ్మం

22-10-94 — శ్రీభావ ఆశ్వయుజ బహుళ తృతీయ



మా మంచి మాష్టారు

ఆచార్య తూమాటి దోణప్పగారికి

సగౌరవంగా సమర్పితం

# ముందుకు పోయే ముందు

ఆధునిక భాషాశాస్త్ర పద్ధతుల్లో తెలుగుభాష మీదపరిశోధన ప్రారంభమైతే ఎంతోకాలం కాలేదు. అందులో వాక్య నిర్మాణ పరిశీలన మరీ ఇటీవలిది.

తెలుగు వాక్యాన్ని నేను అర్థం చేసుకోటానికి చేస్తున్న ప్రయత్నాల్లో ఇప్పటికి ఇది ఒక మజిలీ. దాదాపు పదేళ్లనుంచి తెలుగు వాక్యం గురించి నేను చేస్తున్న పరిశీలనను నా జాతి జనులతో పంచుకోవాలని చేసిన ప్రయత్నం ఇది. ఇందులో ఎక్కువ భాగం— ముఖ్యంగా సంశ్లిష్ట వాక్యాలనుంచి— నా ఆలోచనల ప్రతిబింబాలే. ఇందులో కొన్ని అభిప్రాయాలు అక్కడక్కడా వ్యాసాల రూపంలో అచ్చయినా ఈ పుస్తకంలోకి వచ్చేటప్పటికి కొన్ని మార్పులు జరిగినై. అవి. చేదర్థకాలను గురించి. అనుకృతిని గురించి ఈ పుస్తకంలోనే తొలిసారిగా చెప్పిన అభిప్రాయాలు చాలా ఉన్నై. ఆ అధ్యాయాల్లో చేసిన కొన్ని ప్రతిపాదనలు తెలుగు భాషా పరిమితిని దాటి ఇతర భాషలకు కూడ వర్తించగలవన్న ఆశ లేకపోలేదు. ఏ శాస్త్రం ప్రతిపాదనైనా నిల్చేది అంతకన్నా మేలైన ప్రతిపాదన వచ్చేటంతవరకే. అట్లాంటి కొత్త ప్రతిపాదనలను ప్రేరేపించటమే ఈ పుస్తకానికి ప్రధాన లక్ష్యం.

విషయ ప్రతిపాదన పదునుగా ఉండాలంటే సాంకేతిక పదజాలం తప్పనిసరి అవుతుంది. అది మితిమీరితే విషయం దురవగాహమై పాఠకులకు చికాకు కలిగిస్తుంది. ఇందులో అట్లాంటి పదజాలాన్ని చాలా పరిమితం చెయ్యటానికి విశేషంగా ప్రయత్నించాను.

భాషను గురించి తెలుసుకోగోరే జిజ్ఞాసువులకు ఈ పాటికే పరిచయం అయి ఉండయ్యన్న ఉద్దేశంతో గుప్తనిర్మాణం, వ్యక్తనిర్మాణం, గర్భితవాక్యం, గర్భవాక్యంవంటి కొన్ని మాటలను అక్కడక్కడా వాడాను. సూత్రాల క్రమవర్తనను ఒకటి రెండు చోట్ల ప్రస్తావించాను. ఈ మాత్రం సాంకేతికతను పాఠకులు భరించగలరనుకుంటాను. అధిక వివరణ కావల్సి

వస్తుందనీ, అచ్చువేయ్యటంలో క్లిష్టంగా ఉన్నాయనీ. ఇట్లాంటి పరిశీలనకు అవసరమైన చెట్టుబొమ్మల్ని (Phrase markers) వెయ్యలేదు.

ఈ పుస్తకంలో వ్యాకరణ సమ్మతమైన వాక్యాలను వ్యాకరణ విరుద్ధమైన వాక్యాలతో పోల్చిచూపటం ద్వారా వివరించటానికి ప్రయత్నించాను. వ్యాకరణం అంటే వ్యవహర్తలను ఇట్లా మాట్లాడమని గాని, రచయితలను ఇట్లా రాయమని గాని శాసించే లిఖిత సూత్రాల పుస్తకం అనే అర్థంలో వాడటం లేదు. భాషా వ్యవహారంలో వ్యవహర్తలు పాటించే నియమావళి అనే అర్థంలో వాడుతున్నాను. ఈ నియమాలు, వ్యవహర్తల మనస్సులో అజ్ఞాతంగా ఉంటై. వాటిని జాగ్రత్తగా గ్రహించి వ్యక్తరూపం ఇయ్యటమే భాషాపరిశోధకులు చేసే పని.

వ్యాకరణ సమ్మతిని నిర్ణయించటానికి పనిముట్లు ఉండవు. భాషా పరిశీలన ద్వారా పరిశోధకుడు ఏర్పరచుకున్న అంతర్దృష్టి తప్ప వేరే ఆధారం లేదు. అదీగాక వ్యాకరణ సమ్మతి వ్యవహర్తల ప్రాంతాలనుబట్టి అలవాట్లనుబట్టి సమ్మతాలను బట్టి ఉండవచ్చు. అందువల్ల ఈ పుస్తకంలో కొన్ని వాక్యాల వ్యాకరణసమ్మతి అసమ్మతులను గురించి నేను చేసిన నిర్ణయాలతో కొందరు పాఠకులు ఏకీభవించక పోవచ్చు. అంతేగాక ఉదాహృత వాక్యాలకు సందర్భాలు కేవలం ఊహ్యాలే గనుక సమ్మతి అసమ్మతులలో వ్యత్యాసం రావటం సహజం. అందుకోసం సాధ్యమైనంత సహజంగా ఉండే ఉదాహరణలను ఎన్నుకోటానికి చాలాచోట్ల ప్రయత్నించాను.

పూర్తిగా వ్యాకరణవిరుద్ధమని తోచిన వాక్యాలకు, అక్కడ ఉద్దిష్టమైన అర్థాన్ని ఇయ్యలేని వాక్యాలకు, పువ్వు గుర్తుంచాను. వ్యాకరణ సమ్మతి సందేహమని తోచిన వాక్యాలముందు ప్రశ్నార్థక చిహ్నం ఉంచాను. ఒక సంఖ్యముందు పువ్వు గుర్తుంటే అంకెతో ఉదాహరించిన వాక్యాలన్నీ వ్యాకరణ విరుద్ధాలనీ (లేక ఉద్దిష్టార్థబోధక సమర్థాలు). a, b, c, d అనే అక్షరాలముందుంటే కేవలం ఆ వాక్యాలు మాత్రమే వ్యాకరణ విరుద్ధాలని ఉద్దేశించాను. ఈ పద్ధతి ప్రశ్నార్థక చిహ్నం విషయంలో కూడా పాటించబడింది.

ఈ పుస్తకంలో ఏ అధ్యాయమూ ఏమాత్రం సమగ్రం కాదని ఎవ రైనా వెంటనే గ్రహించగలరు. ఏ రెండు ఉదాహృత వాక్యాలను తీసు కున్నా, మళ్ళీ ఇంతకు రెండింతలు గ్రంథం రాయొచ్చు. అంటే నేను రాయగలనని కాదు. అంత విషయం ఉంటుందని. తెలుగు వాక్యాన్ని గురించి ఇంతవరకు తెలుగులో ఒకపాటి పుస్తకమైనా లేనందువల్ల అసమ గ్రంగా నైనా ఇప్పటివరకు గ్రహించినంత మట్టుకు ఒకచోట కూర్చి స్తే తెలుసుకోదల్చుకున్నవాళ్ళకు, మరింత కృషి చెయ్యదల్చుకున్న వాళ్ళకూ ఉపయోగిస్తుంది గదా అని ఈ సాహసానికి పూనుకున్నాను. ఇంకా కొన్నేండ్లు కృషిచేస్తే ఇంతకన్నా సమగ్రమైన విపులమైన పెద్దపుస్తకం రాయటానికి వీలుపడొచ్చు: ఇంతకుముందే సూచించినట్టుగ ఈ పుస్తకంలో ప్రతిపాదించిన విషయాలు శాశ్వత సత్యాలనే భ్రమ (అసలు శాశ్వత సత్యాలనేవి ఉంటే) నాకు లేదు.

దారిన నడుస్తున్నప్పుడో, ఏ అల్పాహారమో పానీయమో సేవిస్తు న్నప్పుడో శాస్త్రవిషయాలను ముచ్చటించుకోటం భాషాపరిశోధకులకు అల వాటు. ఆ విధంగా తెలుగు వ్యాకరణాంశాలను గురించి మా గురువుగారూ (భద్రిరాజు కృష్ణమూర్తిగారు) నేనూ తరచు చర్చించుకుంటుంటాం. ఒకరి ప్రతిపాదనలకు ఇంకొకరు విరుద్ధోదాహరణ చూపించటం ఆ చర్చల్లో ఒక భాగం. దానివల్ల సూత్రీకరణలు పదునుదేరతై. ఈ పుస్తకంలో చేసిన కొన్ని సూత్రీకరణలకు అట్లాంటి లాభం జరిగింది. ఫలానివని ఇప్పుడు వేరు చెయ్యటం కష్టమైనా, క్వార్థక వాక్యాల్ని గురించి. నామ్నీ కరణాల్ని గురించి చెప్పిన కొన్ని అంశాలు అట్లా బాగుపడ్డట్టు స్పష్టంగా గుర్తు. మిగతావాటికికూడా అట్లాంటి లాభం జరిగితే అవికూడా నిస్సందేహంగా మెరుగయ్యేవే. కాని సమయాభావం అట్లా జరగనియ్యలేదు.

విస్కాన్సిన్ యూనివర్సిటీ (మేడిసన్) లో ఒక పుష్కరం కిందట భాషాశాస్త్రం చదువుకొనేటప్పుడు జెరల్డ్ కెలీ గారు నాకు ఉపాధ్యాయులు. తెలుగు భాషను ఆధునిక పద్ధతుల్లో పరిశీలిస్తూ ఆయన అమెరికన్ విద్యా

ర్థులకు పాఠాలు చెపుతుండేవారు. ఉద్యోగరీత్యా నేను ఆ క్లాసుల్లో కూర్చునే అవసరం కలిగింది. ఆ తరువాత అట్లాంటి క్లాసులు పూర్తిగా నాకే వది లేసేవారు. అప్పుడు విద్యార్థుల ప్రశ్నలకు సమాధానా లియ్యటంకోసమై సొంతంగా ఆలోచించాల్సి వచ్చేది. ఈ విధంగా తెలుగుభాషా నిర్మా ణాన్ని గురించి శాస్త్రీయంగా ఆలోంచిచటానికి నాకు దారిచూపి ప్రేరణ కలిగించిన ఉపాధ్యాయులు కెలీగారికి ఈ పుస్తకం అంకితమియ్యడం ఈ సందర్భంలో ఆయన్ను గుర్తుచేసుకోటం కోసమే గాని ఇది ఆయనకు అంకితమియ్యదగిన ఉద్గ్రంథం అనే ఉద్దేశంతో కాదు.

కెలీగారు 1963 నుంచి కోర్నెల్ యూనివర్సిటీలో భాషా శాస్త్రా చార్యులుగా ఉంటున్నారు.

చదువులోను, విద్యార్థి ఉద్యమాల్లోనూ చురుగ్గా పనిచేస్తూ కూడా అంత చురుగ్గా ఈ పుస్తకానికి అచ్చుకోసం శుద్ధ ప్రతిని త్వర త్వరగా తయారు చేసి ఇచ్చిన అయిలోని (ూ అయినవోలు) ఉషాదేవికి చాలా రుణపడి ఉన్నాను. ఈ అమ్మాయి భాషాశాస్త్రం ఎమ్. ఏ. రెండోభాగం చదువుతున్నది. విషయంమీద అభిలాష, నామీద అభిమానం వల్ల ఈ పని శ్రమ అనుకోకుండా సంతోషంగా చేసింది.

"తెలుగువాక్యం" ఆం. ప్ర. సా. అకాడమీ.
హైదరాబాద్. స్వపీఠిక. 1975 మార్చి 8.

— 0 —

# సుహృల్లేఖ

డియర్ శాస్త్రీ!—

పదిహేనురోజుల క్రిందట మనం గుంటూరులో కలుసుకున్నప్పుడే చెప్పావు వ్యాసాల సంపుటం అచ్చేస్తున్నాననీ, దానికి నేను అభిప్రాయం రాయాలనీ. ఈ మధ్య పీఠికా పరమేశ్వరుణ్ణి అవుతున్నానని నా మీద నేను జోక్ వేసుకున్నా కూడా. మనం సమకాలికులం. విశాఖపట్నంలో తెలుగు ఆనర్సు కలిసిచదువుకున్నాం. నీ పుస్తకానికి నేను 'సర్టిఫికేటు' ఇయ్యటం ఏమిటి? అందువల్ల చాలా వెనకాడాను. నువ్వేమాత్రం పట్టువిడవని విక్రమార్కుడివయ్యావు. అప్పుడప్పుడు ఆపత్సమయాల్లో ఉపయోగించే టెక్నిక్ ప్రయోగించి చూశాను. గొప్ప గొప్ప పండితులు, పీఠాధిపతులు ఉండగా నా అభిప్రాయం నీకేం పనికొస్తుందయ్యా అన్నా. అయినా విన్నావు కావు. కొద్దిరోజుల క్రిందట రిజిష్టరుపోస్టులో నీ వ్యాసాల అచ్చయిన ఫారాలు పుస్తకంగా నాకొచ్చింది. నీ పుస్తకంతో నన్ను మన్నన చేసే ఉద్దేశంతో రాయమని ఉంటావు. లేకపోతే నా అభిప్రాయంవల్ల నీకు ప్రయోజనం ఏముంటుంది. పైగా నా అభిప్రాయంలో అన్నే ఉగాదిపచ్చడిలో వేపపూత కాస్త ఎక్కువ పడుతుంది.

నీ వ్యాసాలు చూడగానే నా మనస్సు 20 సంవత్సరాల వెనక్కు వెళ్ళింది. విశాఖపట్నంలో తెలుగు సంస్కృతసాహిత్యాలు డిగ్రీలకోసం చదువుకునే రోజులకు వెళ్ళిపోయాను. శ్రీశ్రీ బహుళపంచమి జ్యోత్స్న అనేపాట ఎక్కడ కూర్చొని రాసాడు? ఎక్కడ కూర్చొని రాస్తే యారాడ కొండ 'కరికళేబరములా' కనిపిస్తుంది? రామకృష్ణామిషన్ దగ్గర బీచిలో బహుళపంచమినాటి వెన్నెల ఎట్లా కనిపిస్తుంది? ఇవి ఆనాటి కొన్ని సమస్యలు నాకు. అయితే నిన్నవి కలవరపెట్టేవి కావు. నీమానాన నువ్వు షడంగిమాస్టారు చెప్పిన కాళిదాస కుమారసంభవ శ్లోకాలో, లేకపోతే ఖండార్కర్ ధాతు పాఠాలో వల్లెవేస్తుండేవాడివి. మన విశాఖరోజులను గురించి

మరీ ఎక్కువరాస్తే అంత సందర్భోచితంగా ఉండదు కనుక ఆ ప్రస్తావన మానేస్తాను. ఇప్పటికీ విశాఖ వెళ్తే పదోనంబరు బస్సు పలకరిస్తుంది. సముద్రపుగాలి మనసును చల్లగా పరామర్శిస్తుంది. సిరిపురం దగ్గర్లో జీడిచెట్లు యోగక్షేమాలు అడుగుతై. మరి అక్కడి మనుషులో! ఇప్పటికీ తెలుగు డిపార్టుమెంటులో పనిచేస్తున్న ఆ కొందరు ఆప్యాయంగా మనస్ని చూసి చిరునవ్వు నవ్వుతాడు, స్వచ్ఛంగా.

అంతకీ నీపుస్తకంగురించి ఇంకా ఏమీచెప్పనేలేదు గదూ. "మీరు దయతోబంపిన వ్యాసపూర్ణిమ అందందు బఠించితిని. పూర్ణిమనాటి చంద్రకిరణములవలె ఆంధ్రసాహిత్య ప్రపంచమున మీ వ్యాసపూర్ణిమ వెన్నెలలు వెదజల్లునన్నుటలో నాకావంతయు సందియము లేదు. పాండిత్యప్రౌఢిమముతో బాటు విషయ వివేచనమును, విషయమై విధ్యముతోబాటు రచనమున నేకసూత్రతయు, లోతైన పరిశీలనముతోబాటు. ప్రసాదగుణశోభితమునై మీ గ్రంథము ఎసలారుచున్నది. మేలైన పండితవంశమునందు జన్మించిన మీవంటివారి విరచితగ్రంథ ప్రాశస్త్యమును గూర్చి ప్రశంసించుటకు నేనెంతటివాడ? ఖయుదవ్యాఘ్రపు గర్భమున హరిణశాబకము జనించునే?" అని ఇట్లా నాలుగైదు పేజీలు, కావాలంటే పదిపేజీలుకూడా రాసి పంపగలను. పైగా విశాఖపట్నంలో మనం నేర్చుకున్నది ఇట్లాంటి తెలుగేకదూ.

నీ వ్యాసాలన్నీ జాగర్తగా చదివాను. విశాఖలో మనం నేర్చుకున్నదేమన్నా ఉంటే దాన్ని బాగా ఉపయోగంలో పెట్టింది నువ్వే. నీ పరామర్శకు గురిఅయిన పుస్తకాల్లో చాలాభాగం మనం అప్పుడు చదువుకున్నాం. అంతటితో ఆపకుండా నువ్వింకా ముందుకువెళ్లి వాటిమీద వ్యాసాలు రాశావు. నేనాపుస్తకాల జోలికి తరచుగా పోలేదు. వ్యాసాలు రాయాలనే ఆలోచన ఎప్పుడూ రాలేదు.

నీ వ్యాసాల లక్ష్యం ఏమిటా? అని చాలాసేపు ఆలోచించాను. తెలుగు సంస్కృత కావ్యాల్లో విశేషాలను ఆసక్తిపరులైన సాహిత్యా

విద్యార్థులకు పరిచయం చెయ్యటమేనని అనుకొంటున్నాను. ఆమేరకు ఈ వ్యాసాలు తమపనిని చక్కగా నిర్వహించాయి. ఈ వ్యాసాలన్నిట్లోనూ శ్రీనాథుని సామెతలు, ఆంధ్రవాఙ్మయము నందలి శతకరచనాపద్ధతి అనే రెండు నన్ను బాగా ఆకర్షించినై. మొదటిదాంట్లో ఒరిజినాలిటి ఉంటే రెండో దాంట్లో విస్తృత పరిశీలన ఉంది. మిగతా వ్యాసాలు బాగాలేవని కాదు. మిగతా వ్యాసాల్లో నువ్వుచెప్పిన విషయాలను ఆ పుస్తకాలు ఒకసారి చదివితే ఇంకెవరైనా కూడా చెప్పిఉండొచ్చు. ఈ రెండూ అట్లాకాదు. నువ్వు పడ్డశ్రమ, తీసుకున్నశ్రద్ధ స్పష్టంగా కనిపిస్తున్నాయ్.

కన్యాశుల్కం, ఆధునిక కవిత్వంవైపు కూడా నీదృష్టి ప్రసరించినందుకు సంతోషిస్తున్నాను. సంస్కృతకావ్యాలు, ప్రాచీనాంధ్ర కావ్యాలు, ఆధునిక కవిత్వం- ఈ మూడిటి మీద సమదృష్టి ఏర్పర్చుకోవటానికి నీ పుస్తకం పనికొస్తుంది.

మనం వేరువేరు వాతావరణాల్లో పెరిగాం. మీఇంట్లో నీకో సాహిత్య వారసత్వం ఉంది. మీనాన్నగారు పేరొందిన సంస్కృత విద్వాంసులు. నాకు ఏరకమైన సాహిత్య వారసత్వం లేదు. నీ సాహిత్య దృక్పథానికి ఒక ప్రణాళిక ఉంది, ఒక డైరెక్షన్ ఉంది. నా సాహిత్య దృక్పథం అవ్యవస్థనుంచి పుట్టింది. స్వేచ్ఛావర్తన ద్వారా ఏర్పడింది. అందువల్ల మన దృక్పథాల్లో భేదాలు ఉండటం సహజం. నీ పుస్తకంలో నువ్వు చెప్పిన అభిప్రాయాలలో నేను ఒప్పుకోలేని ఘట్టాలున్నై. ఆలోచింపజెయ్యటమే ఏమంచి పుస్తకానికైనా లక్ష్యం. అందువల్ల నేను భేదించే విషయాలు కూడా ప్రస్తావిస్తాను. విద్యావిషయాల్లో అభిప్రాయభేదాల వల్లే అభివృద్ధి జరుగుతుంది. జ్ఞానం పెరుగుతుంది. సత్యశోధనకు మార్గం పడుతుంది.

రేడియోకోసం రాసిన వ్యాసం తప్ప అన్నీ మనం ఆనర్సు పరీక్షలు రాసిన భాషలో రాశావు. ఆఖరికి కన్యాశుల్కం మీదకూడా అదే భాషలో

రాశావు. ఈ భాషవల్ల నీపుస్తకానికి ఒకేలాభం. విద్యాశాఖవారు అభ్యంతరం లేకుండా ఈ పుస్తకాన్ని ఏ బి. ఏ. కో టెక్స్టుబుక్‌గా పెట్టొచ్చు.

మొదటివ్యాసంలో ఆంధ్రసాహిత్య వికాసం రాజుల ప్రోత్సాహంతో ప్రారంభమైందన్నావు. కాని జానపద సాహిత్యం ఆంధ్రసాహిత్యంలో భాగంకదా!

నన్నెచోడుని గురించి రాస్తూ 'మ,ర' గణాలు క్రమంలో వాడటం వల్ల ఆతను యుద్ధంలో మరణించాడనే వాదాన్ని ప్రస్తావిస్తూ "నిజము నిర్ణయింపజాలము' అన్నావు. ఈ రకమైన నమ్మకానికి benefit of doubt కూడా ఇవ్వొచ్చా ?

16 వ పేజీలో ఈశ్వరుణ్ణి సామాన్య మానవుడిగ చిత్రించటం అనుచితం అన్నావు. నన్నెచోడుడు "హరుడాదిగ సకల చరాచర జీవాళి" అన్నాడు. మనిషే కానక్కరలేదు. చరజీవాళిలో భాగం అవుతాడు. మనలో మనమాట. దేవుళ్లు పెళ్లిచేసుకోవచ్చు, పిల్లల్నికనొచ్చు, మనుషుల్లాగే కోపతాపాలు రావచ్చు, మనుషుల్తో పోలిస్తే ఏం కొంప మునిగిందంట ?

కలభాషిణిని గురించి రాస్తూ (పే. 77) "వారకాంతగాన జాతినిష్ఠమైన యపవిత్రత కొంతవరకుగాకున్న కొంతవరకైన నున్నదని యంగీకరించక తప్పదు.'' అని అన్నావు. జాతివల్ల అపవిత్రత అంటుతుందన్న నీ నమ్మకాన్ని ఒప్పుకొలేను. అది అశాస్త్రీయమని వేరే చెప్పక్కర్లేదు.

కన్యాశుల్కాన్ని ప్రతాపరుద్రీయంతో పోల్చటం అన్యాయం (పే. 123) తెలుగు జీవద్భాషకున్న శక్తిని చూపించటం కోసం ప్రతాపరుద్రీయంలో వ్యావహారిక భాష వాడలేదు. నీచపాత్రలకు మాత్రమే గ్రామ్యభాష పనికొస్తుందని చూపించటానికి వాడారు.

అభ్యుదయ కవిత్వం భావకవిత్వం మీద తిరుగుబాటుగా వచ్చిందని అభిప్రాయపడ్డావు. (పే. 125) చాలామంది అట్లాగే అనుకుంటున్నారు గాని చరిత్రలో సాక్ష్యం వేరుగా ఉంది. నవ్యకవిత్వంలో భాగంగానే శ్రీశ్రీ కవిత్వం వచ్చింది. అభ్యుదయ కవిత్వాన్ని తొలిరోజుల్లో సమర్థించినవారు

భావకవులే. అట్లాగే అదే పేజీలో అభ్యుదయకవిత్వం "సమాజానికి యథాతథ ప్రతిబింబమని' అభిప్రాయపడ్డావు. కానీ అభ్యుదయ కవిత్వ లక్షణం అదికాదు. ఈ సమాజంకన్న మేలైన సమాజంవైపు నడిపించే కార్యశీలమైనది అభ్యుదయ కవిత్వం.

సెక్సు-కామవాంఛ ఒకటేనన్నట్టు ఇదే వ్యాసంలో (పే. 128) అభిప్రాయపడ్డావు. ఫ్రాయిడ్ సెక్సును చాలా విస్తృతార్థంలో వాడాడు. వ్యక్తమైన కామవాంఛ ఉండొచ్చు ఉండకపోవచ్చు.

130వ పేజీలో "ఇలియట్ ప్రభావానికి తెలుగులో లోనైనవాడు ఆరుద్ర ప్రథముడు" అన్నావు. 131వ పేజీలో "ఇలియట్ ప్రభావానికి లోనైన అభ్యుదయ కవులలో బైరాగి, శ్రీశ్రీ, శ్రీరంగం నారాయణబాబు ముఖ్యులు" అన్నావు. ఇందులో వైరుధ్యం గమనించలేదా ? చివరి ఇద్దరు ఆరుద్రకన్నా సీనియర్ కవులు.

లయలేని వచన గేయం జీవకళలేని చిత్రంలాంటిది (పే. 135) అన్నావు. కాని వచన కవిత్వానికి లయ ముఖ్యం కాదు. దీనిమీద నాకూ సంపత్కుమారకూ భారతిలో నడిచిన చర్చ చూడలేదా ?

ఆరుద్ర 'బ్రెయిన్‌లో బ్రెన్‌గన్' నీ [పే. 135] 'తండులాని గృహమందు న సంతి- అనే మణిప్రవాళ పద్యాన్నీ ఒకే రకంగా భావించటం రిడక్షనిజం అవుతుంది. వాటిమధ్య భేదాలే ఎక్కువున్నై.

పై వ్యాఖ్యలు నీ వ్యాసాల విలువను తగ్గించటానికి చెయ్యలేదు. నీ దృక్పథంకంటే భిన్నంగా ఆలోచించటానికి వీలుందని చూపించటానికి రాశాను. నీమీద నాకున్న చనువుకొద్దీ నా అభిప్రాయాలకు కూడా నీపుస్తకంలో చోటుచేసుకున్నాను. మొదలే చెప్పానుగా నా ఉగాదిపచ్చట్లో వేపపూత ఎక్కువ పడుతుందని. ఉంటా.

నేతి **అనంతరామశాస్త్రి** వ్యాసపూర్ణిమకు పీఠికగా రాసింది.1981 మార్చి 4.

# పాఠకులతో

మనకింతకు పూర్వం రచించిన ఆంధ్ర దేశ చరిత్రలున్నాయి. అవి సాధారణంగా రాజవంశాలనో, ప్రముఖ వ్యక్తులనో కీర్తిస్తూ సామ్రాజ్య విస్తీర్ణతను ప్రశంసించేవిగా ఉన్నాయి. శాతవాహనులు తెలుగు వారేనా ? విజయనగర సామ్రాజ్యం తెలుగు వారిదేనా ? కాకతీయుల వర్ణమేది ? ఇలాంటి ప్రశ్నలకు ఆ చరిత్ర గ్రంథాల్లో ప్రాధాన్యమెక్కువ. ప్రజల సాంస్కృతిక చరిత్రను సాహిత్యం ద్వారా పునర్నిర్మించటానికి సురవరం ప్రతాపరెడ్డి (1896-1953) గారు కృషిచేసి "ఆంధ్రుల సాంఘిక చరిత్ర"ను ప్రకటించారు. ఆ తరువాత ఖండవల్లి లక్ష్మీ రంజనం, బాలేందు శేఖరం గార్లు ఆంధ్రుల చరిత్ర-సంస్కృతి అనే గ్రంథం రచించారు. ఇందులో సాంస్కృతికాంశ పూర్వపు చరిత్రలకన్నా కొంత ఎక్కువున్నమాట నిజమే. అయినా ఈ రెండు పుస్తకాలు సమాజ ఆర్థిక వ్యవస్థను గురించి పట్టించు కొన్నవి కావు.

కంభంపాటి సత్యనారాయణగారు స్వాతంత్ర్యోద్యమ కాలం నుంచి వివిధ ప్రజోద్యమాల్లో పాల్గొన్నారు. బహు గ్రంథ రచయితలు. మార్క్సిస్టు మూలసూత్రాలు చూపిన వెలుగులో ఆంధ్ర దేశ ప్రజల ఆర్థిక సాంస్కృతిక చరిత్రను ఇంగ్లిషులో రచించారు. సత్యనారాయణ (సీనియర్) గారు పరిణత వయస్సులో బహు ప్రయాసలకోర్చి, ఎన్నో గ్రంథాలు పరిశీలించి స్వతంత్ర పరిశోధన చేసి ఈ గ్రంథాన్ని రచించారు. యూరపులో ఫ్యూడలిజానికి, మన దేశంలో చిరకాలం వర్ధిల్లిన స్వయం పూర్ణ గ్రామీణ వ్యవస్థకూ భేదాల్ని చాలా స్వతంత్రంగా ప్రతిపాదించారు. ఈ పద్ధతిలో ఆంధ్రదేశానికి చరిత్ర కూర్చటం ఇదే ప్రథమం. తరవాత రాబోయే విపుల చరిత్రలకిది మార్గదర్శక మవుతుందని మా నమ్మకం. ఈ పుస్తకంలో చేసినప్రతిపాదనలు తుది నిర్ణయాలనే భ్రమ రచయితకూ లేదు, ప్రకాశకులకూ లేదు. మహీధర రామమోహనరావుగారు ఈ గ్రంథాన్ని తెలుగు చేసి పెట్టారు.

కంభంపాటి సత్యనారాయణగారి "ఆంధ్రుల చరిత్ర" పీఠిక 1981 జూలై

# వేమన్న ఆదర్శం

తనకాలపు పరిధిలోనైనా సామాజిక చైతన్య దృష్టితో కవిత్వం చెప్పిన తొలి తెలుగు కవి వేమన్న. అదే దృష్టితో రచన చేస్తున్న ఈనాటి కవులు -తమకన్నా పూర్వుల సంప్రదాయాన్ని తెలుసుకోటం ఆరోగ్యకరమే గాక అవసరమని కూడా భావిస్తున్నాం. వెనకటి మంచిని జీర్ణించుకొని కొత్త పరిస్థితులను గుర్తించి ముందు చూపుతో రచనలు చేయటం ఈనాటి రచయితల కర్తవ్యం.

ఆనాటి (17వ శతాబ్దం) సామాజిక పరిస్థితులను వేమన్న సమూలంగా అర్థంచేసుకున్నాడని చెప్పలేం. గొప్ప, పేద తారతమ్యాలు అర్థం చేసుకోగలిగాడు గాని వాటి వెనకాల ఉన్న ఆర్థిక వ్యవస్థ లోతుపాతులు తెలుసుకోటానికి వేమన్న ఆర్థికశాస్త్రవేత్త కాదు. వేశ్యల గురించి గాని, అసలు స్త్రీల గురించి గాని వేమన్నకు కనీసం ఉదారమైన అభిప్రాయాలు కూడా ఉన్నట్లు లేదు. అయితే తన కాలాన్ని మించి కొన్ని విషయాల్లో ముందుకు చూడగలిగిన కవిగా వేమన్నను మనం గౌరవించాలి. విగ్రహారాధనను వ్యతిరేకించాడు. శైవ వైష్ణవ మతాలవారి ఆర్భాటాలను, వారి దురాచారాలను, మోసాలను బట్టబయలు చేశాడు. చిలుక పలుకుల చదువులను విమర్శించాడు. కాకులకు పిండాలు పెట్టటం వంటి మూఢాచారాలను తీవ్రంగా ఖండించాడు. శ్రమశక్తిలోనే సర్వమూ ఉన్నది అనేంత నిశిత పరిశీలన చెయ్యగలిగిన వేమన్న మామూలు కవికాదు. తనకాలపు చట్రంలో ఇమడని గొప్ప కవి.

వేమన్న రచనా మార్గంలో మూడు అంశాలు గుర్తించవచ్చు. 1. ప్రజల భాషలో ప్రచురంగా ఉన్న పదాలను. మాండలికాలను ప్రయోగించి ప్రజలకు సన్నిహితమైన రచన చెయ్యటం. 2. చెప్పదలచుకున్న భావాన్ని తగిన విస్తీర్ణంలోనే క్లుప్తంగా చెప్పటం. 3. ఊహలోనుంచికాక జీవితంనుంచి ఉపమానాలను ఏరుకోవటం, కవితా దృక్పథం విషయంలో

మాత్రమే కాక రచనా విధానంలో కూడా వేమన్న ఆదర్శం నుంచి ఈనాటి కవులు నేర్చుకోవలసింది చాలా ఉందని దృఢంగా భావిస్తున్నాం.

వేమన్న గురించి ఇది పరిశోధన గ్రంథం కాదు. వేమన్న పద్య సర్వస్వ సంకలనం కాదు. వేమన్న పద్యాలలో ప్రసిద్ధమైన ఆటవెలదులలో ఈనాటి పరిస్థితులలోనూ పూర్తిగా కాలదోషం పట్టలేదు అనుకున్న వాటిని కొన్నిటిని ఏరి తెలుగు పాఠకులకు పరిచయం చెయ్యటమే మా ఉద్దేశం. వేమన్న గురించి ప్రత్యేక పరిశోధన చేసిన మా డా॥ గోపి ఆ పద్యాల ముందు వెనుకలు చూపే విపులమైన పీఠికా, సరసమైన వ్యాఖ్యా కూర్చాడు. పద్యాల పాఠ నిర్ణయంలో విశేషంగా శ్రమపడ్డాడు. ప్రచురణ సంస్థ తరపున అతనికి ప్రత్యేకాభినందనలు.

ఈ కృషిని మా పాఠకులు తప్పకుండా ఆదరించగలరని ఇకముందు చెయ్యబోయే మా ప్రయత్నాలకు ప్రోత్సాహమియ్యగలరని మేం నిశ్చయంగా నమ్ముతున్నాం.

ఎస్. గోపి 'వేమన్నవాదం' అనే<br>
వ్యాఖ్యా గ్రంథానికి హైదరాబాదు బుక్<br>
ట్రస్టు తరపున సంపాదకీయం<br>
1980 జులై 8

# భాషాగతి తర్కం : 'శాస్త్రీ'య కృషి

అభిప్రాయప్రకటన సాధనాలన్నిట్లోనూ భాష మహితమైనది. అందుక్కారణం అతిపటిష్ఠమైన యంత్రాంగం (System) భాషకు ఉండటమే. ఈ యంత్రాంగంలో కొన్ని అంతరువులు, ఆ అంతరువుల్లో పరస్పర నిర్దిష్ట సంబంధమున్న అంశికాలు (Units) ఉంటై. ఇదంతా కంటికి కనిపించేదికాదు. అంతమాత్రంచేత ఊహకందని బ్రహ్మపదార్థమూకాదు. బుద్ధికౌశల్యంచేత, పరిశీలనపాటవంవల్ల జిజ్ఞాసతో చేసే అన్వేషణ మూలంగా ఆ యంత్రాంగ నిర్మాణాన్ని, అది పనిచేసే తీరును అంతా ఒక్కసారికాకపోయినా, కొంత కొంత క్రమక్రమంగా గ్రహించగలుగుతాం. అట్లా గ్రహించటానికి తర తరాలుగా వివిధదేశాల్లో భిన్నసంస్కృతులవారు ప్రయత్నిస్తున్నారు. వారందరి కృషిఫలితమైన విజ్ఞానాన్నే భాషాశాస్త్రమని పిలుస్తున్నాం.

ఈ భాషాయంత్రాంగాన్ని బహుకోణాలనుంచి పరిశీలించవచ్చు. ఈ యంత్రాంగం సమాజావసరాలకు ఎట్లా ఉపయోగిస్తున్నది ? ఈ యంత్రాంగాన్ని మనిషి ఎట్లా వయసుతోపాటు నిర్మించుకుంటాడు? ఇది ఒక భాషను వ్యవహరించే వాళ్ళందరికీ ఒకే రకంగా ఉంటుందా? ఉంటే ఎట్లాంటి భేదాలు ఉంటై ? భిన్నభాషా వ్యవహర్తల యంత్రాంగాలు భిన్న మైనా, సామ్యాలెట్లాంటివి? ఈయంత్రాంగం ఏకాలంలో ఎట్లాంటి మార్పుల్ని పొందుతుంది ? ఈ ప్రశ్నలకు సమాధానాలిచ్చే ప్రయత్నంతోనే భాషా ధ్యయన భేదాలు మొదలయినై. అవే భాషాశాస్త్రంలో భిన్నశాఖలుగా ప్రవర్తిల్లినై.

భాషా యంత్రాంగాన్ని ఒక స్వయంసంపూర్ణ యంత్రంగా కూడ దర్శించవచ్చు. ఈ యంత్రాంగం మామూలు వస్తూత్పాదన యంత్రంలాంటిది కాదు. సజీవయంత్రం. ఈయంత్రాన్ని ఛేదించే శక్తులు కాలంలో ఉన్నై. ఈ ఛేదనయత్నాలు నిరంతరం జరుగుతుంటై. ఈ యత్నాలను నిరోధించే

శక్తి భాషాయంత్రానికి లేదు. ఈ ఛేదన ప్రక్రియలో కొన్ని అంశికాలు ముక్కలు కావచ్చు. జారికొన్ని జారిపోవచ్చు. అట్లా జరగటాన్ని అట్లాగే అనుమతిస్తే కొన్నాళ్ళకి ఈ యంత్రమే నామరూపాలు లేకుండా పోవచ్చు. ఈ పరిస్థితులను తట్టుకోటానికి ఉన్న అంశికాల్లోనుంచే కొత్తవాటిని తయారుచేసుకొని వాటినన్నింటిని పరస్పరాపేక్షక నిర్దిష్టస్థానాల్లో సర్దుకొని భాషా యంత్రాంగం తన్నుతాను రక్షించుకొంటుంది. సృష్టినాశాలు నిర్మాణ చ్ఛేదనలు నిరంతరం జరుగుతూనే ఉంటై. యంత్రాంగచ్ఛేదన ప్రక్రియ ప్రతిక్షణం జరుగుతున్నదే. ఏ నిర్దిష్టకాలంలో చూసినా భాషాంశికాలు (Linguistic units) పరస్పరాపేక్షక నిర్దిష్టస్థానాల్లో ప్రవర్తిస్తూ భాషా యంత్రాంగ నిర్మాణాన్ని పరిరక్షిస్తూనే ఉంటై. ఈ యంత్రాంగ నిర్మాణం (Structure) ఎప్పటికప్పుడు కొన్ని సూత్రాలమీద ఆధారపడి ఉంటుంది. ఎప్పటికప్పుడు కొన్ని సూత్రాలమీద ఆధారపడి ఉంటుంది. సూత్రాలు మారుతుంటై. కొన్ని పాతసూత్రాలు మాయమయి కొత్త సూత్రాలు ఏర్పడుతుంటై. వీటి పరస్పర సంబంధాల్లోనూ మార్పులు వస్తుంటై. అంతే కాని అసలు సూత్రాలులేని స్థితి ఉండదు. భాషాయంత్రాంగస్థితికి - ఈ సూత్రాలే ఆధారాలు.

భాషను సజీవంగా నిలిపేది భాషాయంత్రాంగ నిర్వహణలో కనిపించే ఈ విరుద్ధ ప్రవృత్తుల పరస్పర (సృష్టినాశాలమధ్య, నిర్మాణ చ్ఛేదనలమధ్య) సంఘర్షణే. దీన్నే భాషాగతితర్కం (Linguistic dialectics) అంటున్నాను. ఇది అర్థంచేసుకుంటేనే భాషను సరిగ్గా అర్థంచేసుకోగలుగుతాం.

పరిశీలన సౌలభ్యంకోసం ఒకకాలపు భాషను, వ్యక్తి భాషను, స్వీకరించి పరిమితమైన భాషాయంత్రాంగాన్ని వర్ణిస్తాం. దీనికే వర్ణనాత్మక వ్యాకరణం అనే పేరు ప్రసిద్ధంగాఉంది. ఈ వ్యాకరణం మౌఖిక భాషకూ రాయొచ్చు లిఖితభాషకూ రాయొచ్చు, ఒకనాటి భాషకూ రాయొచ్చు, ఒక ప్రాంతపు భాషకూ రాయొచ్చు, ఇట్లా భిన్నకాలాల భిన్నప్రాంతాల భాషాం

తర్గత యంత్రాంగాన్ని వర్ణిస్తే ఆ భాషాగతితర్కం అర్థం అవుతుంది. ఆ భాషాపరిణామం తెలుస్తుంది. భాషాయంత్రాంగ విశ్వరూప సందర్శనానికి ప్రాతిపదిక ఏర్పడుతుంది.

ఈ పద్ధతిలో తెలుగుభాషను అర్థంచేసుకోడానికి ప్రయత్నాలు చాలా ఇటీవల ప్రారంభమయినై. బూదరాజు రాధాకృష్ణ, ఎం. కందప్పచెట్టి, కె. కె. రంగనాధాచార్యులు వంటివారు దొరుకుతున్న శాసనాలను కాలక్రమానుసారంగా విశ్లేషించి లక్షణ ప్రదర్శన చేశారు. మరోప్రక్క కావ్య భాషను కూడా ఇట్లా విశ్లేషించటానికి మరికొందరు పరిశోధకులు ప్రారంభించారు. కె. నాగభూషణరావు నన్నెచోడుని భాషను విశ్లేషించి చూపారు. ఆ వరసలో శ్రీనాధుడి కృతులలో భాషను బహుపరిశ్రమచేసి విశ్లేషించి భాషాపరిశోధక బృందంలో శాశ్వతస్థానాన్ని కల్పించుకున్నాడు నేతి అనంత రామశాస్త్రి. శ్రీ నా ధు డి కి పూర్వకవులలో చాలా మంది భాష ఇంకా అస్పష్టంగానే ఉండిపోయింది. కవిత్రయ భాషా విశ్లేషణ పూర్తి కానే లేదు. నిర్వచనోత్తర రామాయణం, 15 పర్వాల భారతం, నృసింహ, హరివంశపురాణాలు, ఇంకా పరిశోధకులకోసం వెతుక్కుంటూనే ఉన్నై. పండితారాధ్యచరిత్ర, బసవపురాణాలవంటి భాషోదధులు అనవగాహాలుగానే ఉండిపోయినై, ఆపని ఇతరపనిమంతులకు వదిలి తానుమాత్రం శ్రీనాథ భాషాసముద్రపు లోతులు దర్శించివచ్చాడు. ఆ కథాకథనమే ఈ గ్రంథం.

అనంతరామశాస్త్రి శ్రీనాధుడిభాషను- మామూలుభాషలో చెప్పితే చీల్చిచెండాడాడు. ఏ ఒక్క అంశమూవదలలేదు. ఇట్లాంటిపని చెయ్యాలంటే సూక్ష్మదర్శకత సంగతి అట్లాఉంచి ఎంత జబ్బపుష్టికావాలి ? ఎంత ఓర్పు కావాలి? ఇవన్నీ ఉండబట్టే శాస్త్రి ఈపనికి పూనుకున్నాడు. భాషాచరిత్ర నిర్మాణానికి అత్యంతావశ్యకమైన ఈ పుస్తకాన్ని పనికొచ్చే పద్ధతిలో రచించాడు. అసలు సిద్ధాంతగ్రంథసారాన్ని సింహావలోకనంలో 153 'పాయింట్లు' గా క్రోడీకరించాడు. పరమప్రయోజనకరమైన నాలుగనుబంధాల్ని కూర్చాడు.

(అయిదోది ఉపయుక్త గ్రంథసూచి. ఇది పుస్తకంలో ఉండాల్సిన భాగమే. దానిస్థానంలో "లోకోక్తులు, నుడికారము" అన్న ఆరో అధ్యాయాన్ని (పే. 345-364) అయిదో అధ్యాయంగాచేర్చి ఉండవచ్చు.) ఒక్కోసారి అనుబంధాలు అసలు పుస్తకంకన్నా ఎక్కువ ప్రయోజనకరంగా ఉంటై. జార్జి లేకాఫ్ **(George Lakoff)** వాక్యనిర్మాణక్రమంలో అపక్రమాల **(Irregularity in Syntax)** గురించి సిద్ధాంతగ్రథం రాస్తూ ఆరు అనుబంధాల్ని చేర్చాడు. అసలు గ్రంథాన్ని మించి అవి భాషాపరిశోధకుల్లో బహుళప్రచారాన్ని పొందినై. ఒక అనుబంధంలో "క్రియలు, నామవిశేషణాలు ఒకే రకంగా ప్రవర్తిస్తాయి" అనిచేసిన అతని సిద్ధాంతంమీద భాషాపరిశోధకుల్లో ఎన్నో ఎన్నో తర్జనభర్జనలు జరిగినై. అట్లాగే అనంతరామశాస్త్రి కూడా మొదటి అనుబంధంలో శ్రీనాథుని వైకృతపదాలు, వాటి మూలాలు చూపించాడు. సంస్కృత ప్రాకృతపదాలు తెలుగులోకి ఎట్లా, ఎన్ని, ఏకాలానికి ప్రవేశించినయ్యో తెలుసుకోటానికి ఈపట్టిక ఎంతో ఉపయోగం. రెండో అనుబంధం ఇంకా విలువైనది. శ్రీనాథుడు వాడిన తెలుగు సమాసాల్ని రెండంశాలు మొదలుకొని ఆరంశాలవరకూ ఉన్నవాటిని మొత్తం పట్టికగా కూర్చాడు. అంశాల సంఖ్య పెరుగుతున్న కొద్దీ సమాసాలసంఖ్య తరగటం మనం గమనించవచ్చు. నిజానికి వీటిలో ఇంకాకొన్ని భేదాలు సూచించవచ్చు ఉదాహరణకు అలుక్సమాసాలను వేరుచేస్తే సమాసాలనుగురించి ఇంకా లోతుగా పరిశీలించవచ్చు. అలుక్సమాసాలు పేరుకు సమాసాలేకాని వాటిలో 'ఏకపదత్వం' కనిపించదు. అందువల్ల వాటిని వేరుచెయ్యాలి. అట్లాచేస్తే మూడంశాల సమాససంఖ్య, ఇంకా తగ్గుతుంది. అట్లాగే సమాసాలను. సమానాధికరణ, వ్యధికరణ భేదాలుగా విడదీస్తే వాటిని గురించి కొన్నివిషయాలు చెప్పుకోవచ్చు. అయితే అన్నీ అనంతరామశాస్త్రి చేసిపెట్టాలనుకోవటం పరాశ. అరవైగుంజిళ్లు తీశావు ఇంకో ఆరు తియ్యరాదా? అనటంలాంటిది. ఇప్పటికి ఇతను చేసిందాన్ని ఉపయోగించుకొని ఇంకా ఎన్నో చెయ్యొచ్చు.

మూడో అనుబంధంలో తెలుగు సంస్కృత శ్లిష్టాశ్లిష్ట ధాతువుల పట్టిక ఇచ్చాడు. ఈ పట్టిక సంశ్లిష్ట ధాతువులేర్పడే తీరుగమనించటానికి, ఉన్న ధాతువుల వ్యాకరణాన్ని అర్థభేదాల్ని గ్రహించటానికి ఉపయోగిస్తుంది. నాలుగో అనుబంధంలో వ్యాకరణపరిభాషాపదాలువాటి ఆంగ్లసమాలు ఉన్నై.

అసలు పుస్తకంలో వర్ణాలూ, సంధులూ, నామాలూ, క్రియలూ, వాక్యాల గురించిన విశేషాలు వివరించారు. కొన్ని సంస్కృత శబ్దాలను ఆనాడు ఎట్లా ఉచ్చరించేవారో తెలుసుకోటానికి తెలుగుపద్యాల్లో యతినియమం చాలా ఉపయోగకారి. జ్ఞానం- అనే శబ్దాన్ని ఈనాడు 'గ్నానం' అని చాలామంది ఉచ్చరిస్తున్నారు. శ్రీనాథుడి కాలానికి కూడా ఇట్లాంటి ఉచ్చారణ ఉండేదని చెప్పటానికి అనువైన ప్రయోగం 'జ్ఞానేంద్రియ జ్ఞానకళ గాఢసాంద్రగా' [కాశీ 1-139] అనేది చూపించి తిక్కనలోనూ ఇట్లాంటి ప్రయోగాలు ఉన్నయ్యన్నాడు. అట్లాగే 'స్నానం' అనేమాట ఇప్పటి వారి భాషలో 'స్తానం' అనే ఉచ్చారణతో ఉంది. ఈరకమైన ఉచ్చారణలేకపోతే "స్నానముచేసి ధౌతపరి ధానముగట్టి" అనేచోట యతి సరిపోదు. ఈ విషయంకూడా ఈ పుస్తకం [పే.16] లో చెప్పాడు.

శబ్దరూప వైవిధ్యంలో అచ్చుల, హల్లుల మార్పులవల్ల ఏర్పడిన రూపవైవిధ్యాన్ని పట్టిక కూర్చాడు. వీటిని ఇంకా పరిశీలిస్తే గణాల కోసం కవులు కల్పించుకున్నవాటినీ భాషలో సహజంగా మారిన వాటినీ వేరుచెయ్యొచ్చు. రూపవైవిధ్యాన్ని పరిశీలిస్తే ఎన్నోరకాల మార్పులు శ్రీనాథుడి భాషలో ఎట్లాప్రవర్తిల్లిందీ తెలుసుకోవచ్చు. స్వరసమీకరణంవల్ల 'చనపు> చనువు, 'పసపు>పసుపు' అని నామాల్లోనూ, 'ఉరలు▷ఉరులు, తొరగు▷ తొరుగు, నలగు>నలుగు' అని క్రియల్లోనూ మార్పు వచ్చింది, ధాతువుల్లో జరిగిన ఈ మార్పువల్ల నేటిభాషలో అన్నీ ఉన్మధ్యాలుగామారి అప్పటికే భాషాయంత్రంలో ప్రవర్తిస్తున్న స్వరసమీకరణ సూత్రానికి విషయాలు అయినై. రెండు మూడక్షరాల మాటల్లో పూర్వపరిసరంలో 'ఇ' వర్ణబలం

వల్ల పదాంత 'అ' వర్ణం'ఎ' వర్ణంగామారిన రూపాలు నేటిభాషలో చాలా ఉన్నై. ఉదా॥ గాదిద>గాదిదె, తడిక▷తడికె, దీన్ని స్వరతాలవ్యీకరణం అనొచ్చు. ఇట్లాంటిమార్పు శ్రీనాథుడి కాలానికే ఉన్నట్టు 'ఒరిమ▷ఒరిమె. తీగ▷తీగె అనే ప్రయోగాలవల్ల తెలుస్తుంది. అట్లాగే మూడక్షరాల మాటల్లో చివరి వ్యంజనం శ్వాసమైతే, నడిమి నాదంకూడా శ్వాసంగామారిన రూపాలు నేటిభాషలో చాలాఉన్నై. 'అదుకు>అతుకు.' ఈ రకమైనమార్పు శ్రీనాథుడి కాలానికే ఉన్నట్టు 'బ్రతుకు' అనే ప్రయోగంవల్ల తెలుస్తుంది. నేటి తెలంగాణా భాషలో కనిపించే పదమధ్య 'నలడరట'ల మీది అజ్లోపం శ్రీనాథుడి భాషలోనూ కనిపిస్తుంది. అంతేకాక ఇది ఆ కాలానికి రెండుపదాల మధ్య జరిగే సంధిసూత్రంగాకూడా విస్తరించినట్టు, 'ఏడ్నూరు. చెవ్వడ్పుడు చన్కట్టు, ఎదుర్కట్టు ఆనవాల్పట్టు'వంటి ప్రయోగాలవల్ల తెలుసుకోవచ్చు.

నామరూపవిజ్ఞానంలో శ్రీనాథుడు ప్రయోగించిన అరబ్బీ. పార్సి. మరాఠీభాషాపదాలన్నీ వ్యుత్పత్తులతో, అర్థాలతోసహా ప్రదర్శించాడు శాస్త్రి. భాషావిషయంగా ఆనాటికి ఎన్ని అన్యదేశ్యాలు చేరినయ్యో తెలియటమేకాక శాస్త్రి చేర్చిన టిప్పణివల్ల ఆనాటి సంస్కృతివిశేషాలుకూడా తెలుస్తున్నై.

'పట్టి' అనే విభక్తి ప్రత్యయం నేటిభాషలోలాగా శ్రీనాథుడికాలంలో కూడ అన్నంత క్రియమీద వచ్చినపుడు హేత్వర్థబోధకం అవుతుందని "సి టోటి పుణ్యవతులు గనుగబట్టి" [కాశీ 2-93] 'సురలు నసురులు సంప్రీతిఁ దరువంబట్టి" [కాశీ 5.283] వంటి ప్రయోగాలవల్ల తెలుస్తుంది (పే.200)

'చు' వర్ణాంతమైన రెండక్షరాల ధాతువుల్లో చివరవచ్చే 'చు' ఈనాటి భాషలో "యు' గా మారింది. ఉదా॥ కాచు<కాయు, తూచు▷తూయు దాచు>దాయు. దోచు▷దోయు, ఈరకమైన మార్పు శ్రీనాథుడి కాలానికే ఉన్నట్టు, అది కావ్యభాషకు ఎక్కినట్టు, 'మోచు▷మోయు, రాచు▷రాయు వంటి ప్రయోగాలవల్ల తెలుస్తున్నది. ఈనాటి భాషలో ఇట్లామారిన ధాతువుల ప్రయోగం నాగరికంగా ఒప్పుకోరు.

భాషాగతితర్కం 'శాస్త్రి'య కృషి 20

ఇట్లా శ్రీనాథుడిభాషను తరచి ఎంతో శ్రమకోర్చి ఎన్నో విశేషాలు సేకరించాడు శాస్త్రి. 'నేను సైతం ప్రపంచాగ్నికి సమిధనొక్కటి ఆహుతిచ్చాను" అన్నట్లుగా తానుసైతం భాషాచరిత్రకు అవసరమైన సంభారాల్ని తనవంతుగా కూర్చిపెట్టాడు. ఇంతవిలువైన కృషిచేసి భాషా పరిశోధకుల కందించిన అనంతరామశాస్త్రిని అభినందిస్తున్నాను.

నిజానికి ఈ పుస్తకానికి ఏ పీఠికా అక్కర్లేదు. నాగార్జున విశ్వవిద్యాలయంవారు ఈ"థీసిస్"ను ఉత్తమమైందిగా గుర్తించి స్వర్ణపతకాన్ని బహూకరించారు. నన్ను పీఠిక రాయమన్నప్పుడు అమాటే అన్నాను. ఆంధ్రాయూనివర్శిటీలో M. A; తెలుగు కలిసి చదువుకున్నాం గనుక నన్ను మన్నన చేసే ఉద్దేశంతో ఈపీఠిక రాయమన్నాడనుకుంటున్నాను. ఇక్కడ ఇంకో విశేషంకూడా ఉంది. మా క్లాసువాళ్ళలో భాషాపరిశోధనలో తల దూర్చింది మేమిద్దరమే. నాకులేని పట్టుదల, పరిశ్రమచేసే శక్తి మా శాస్త్రికి ఉన్నై గనుక తానుచేసే కృషికి ఇది ప్రారంభంగానే పరిగణించి తన పరిశోధన మహాప్రస్థానాన్ని సాగించవలసిందిగా కోరుతున్నాను.

నేతి అనంతరామశాస్త్రి "శ్రీనాథభాషా పరిశీలన"కు- పీఠిక,
1982 ఫిబ్రవరి 22,

# మరో పరిశోధకుడికి ఆహ్వానం

గిడుగు రామమూర్తిగారితో తెలుగునాట మొదలైన భాషాశాస్త్ర పరిశోధన ఇంకా ప్రాథమిక దశలోనే ఉంది. లెక్కవేసుకుందామంటే గట్టిగా కృషిచేసేవాళ్లు పట్టుమని పదిమందయినా దొరుకుతారో దొరకరో; వీళ్లల్లో అయినా అందరూ తెలుగులో రాయలేరు. రాయగలిగిన వాళ్లంతా తెలుగులో రాయటంలేదు. ఇటువంటి దశలో కుంబముక్కల లక్ష్మినారాయణశర్మ భాషా పరిశోధకుడిగా బయటకి రావటం, అప్పుడే అతని వ్యాసాలు పుస్తకంగా రావటం చాలా సంతోషించదగిన విషయం. నిండుమనస్సుతో ఈపుస్తకాన్ని ఆహ్వానిస్తున్నాను.

ఇంకో విశేషమేమంటే, శర్మ 'సెక్టేరియన్' కాదు. వైద్యవృత్తిలో లాగా, ఇటీవల భాషాశాస్త్రంలో కూడా స్పెషలిస్టులు తయారవుతున్నారు. ఫోనాలజిస్టు సింటాక్సు జోలికిపోడు. సింటాక్సువాడు ఫోనాలజీ తనపని కాదంటాడు. సోషియోలింగ్విస్టు తనదే అసలైన భాషాశాస్త్రం అంటాడు- దీన్నే నేను సెక్టేరియనిజం అంటున్నాను. శర్మ ఇట్లాంటి సెక్టేరియన్ కానందుకు సంతోషించాలి. వాక్యనిర్మాణం, మాండలికాలు, ధ్వని, వర్ణ విజ్ఞానం, శైలీ విజ్ఞానం, జానపద సాహిత్యం—ఇట్లా ఎన్నో విషయాల్లో శర్మ కృషి చేస్తున్నాడు.

ఇన్ని చేస్తున్నా అతను వాక్యనిర్మాణంలో చేస్తున్న కృషి – నాకు ఎక్కువగా నచ్చింది. 'మరో 'లా' ఉందా?' అనే వ్యాసం మంచి విశ్లేషణ. ఇతను ఈ వ్యాసం మొదట ఇంగ్లీషులో రాశాడు. అన్నామలై యూనివర్సిటీలో ఒక సెమినార్లో చదివాడు. అప్పుడే అందరి సమక్షంలో మెచ్చుకున్నా. అప్పుడే అనుకున్నా-ఆహ్వానించదగ్గ మరో పరిశోధకుడు తయారవుతున్నాడని. అట్లాగే 'తెలుగు'లో 'కర్తృవిషయమీమాంస'లో నాతో పేచీపెట్టుకున్నా- తగిన రీతిలో పెట్టుకున్నాడు. కృతక ప్రామాణిక రూపాల్ని దార్ఢ్యతా సూత్రంద్వారా వివరించడం కొత్త ఆలోచన. ఫలవంతమైన పరిశోధన.

శర్మ ఒక పొరపాటు చేస్తున్నాడు. కొన్ని పారిభాషిక పదాలను తెలుగు అకాడెమీ వారి పట్టికనుంచి సరాసరి దించేస్తున్నాడు. వికసన వ్యాకరణం, వ్యవస్థా వ్యాకరణం అట్లాంటివే. వాటికి అర్థ ప్రేరణశక్తి లేదు. **Lexical insertion** అనే అర్థంలో 'నైఘంటుకీకరణం. అని వాడాడు. దీనికి ఉద్దేశించిన అర్థంరాదు. ఆ భావాన్ని వివరించకుండా పదానువాద పద్ధతిలో పరిభాషను వాడటం సరయిన పద్ధతిగా ఒప్పుకోలేను. ఇతను రాసిన 'వ్యవస్థా వ్యాకరణ స్వరూపం'లో తెలుగు నాకర్థం కాలేదు. అర్థమయిన వాళ్లు ఎవరన్నా ఉంటే తెలుసుకొని సంతోషిస్తాను. అందుకే శర్మకి తెలుగు సరళంగా రాయవయ్యా అని నిర్మొహమాటంగా సలహా ఇయ్యదల్చుకున్నాను.

అయితే శర్మ ఇప్పుడిప్పుడే రంగంలోకి అడుగు పెట్టాడు. ఇతను చెయ్యదల్చుకున్న, చెయ్యవలసిన, చెయ్యగలిగిన కృషిలో ఇప్పటికి చేసింది అతిస్వల్పం. తప్పకుండా సరళమైన తెలుగులో రాస్తాడని నా నమ్మకం.

కృషికులు తక్కువగా ఉన్న ఈ రంగంలోకి ప్రవేశించి ఎన్నాళ్లో కాకపోయినా, అప్పుడే నిలదొక్కుకున్న ఈ పరిశోధకుడిని అభినందిస్తూ, ఇతని కృషివల్ల తెలుగుభాషా రహస్యాలు ఎన్నో బయల్పడతయ్యని ఆశిస్తాను. నా ఆశ నిష్కారణం కాదు. ఈ పుస్తకంలోనే అందుకు ఆధారాలున్నై.

కుంటముక్కల లక్ష్మీనారాయణ శర్మ
"భాషాశాస్త్రం - లా - ఎంకి"
వ్యాస సంపుటికి పీఠిక.
1982 మార్చి 19
దుర్మతి ఫాల్గుణ నవమి

— 0 —

# మార్క్సిజానికి కార్టూన్ల ప్రవేశిక

మార్క్సిజం సామాన్య ప్రజలకు అర్థంకాని బ్రహ్మపదార్థంగా పరిగణింపబడుతున్నది. ఇంతాచేస్తే ఇది సామాన్యుడికోసమే ఏర్పడ్డ సిద్ధాంతం. మార్క్సిజం కొద్దిమంది పండితుల సొత్తుగానే చాలాకాలం నుండి ఉంటున్నది. మళ్ళీ ఈ పండితులలో ఏకాభిప్రాయం లేదు. వాళ్ళవాళ్ళ వాద భేదాలనుబట్టి రకరకాల భాష్యాలు, ఖండనమండనలూ కనిపిస్తున్నాయి. వీటన్నిటి మధ్య మార్క్సిజం నిజంగానే బ్రహ్మపదార్థమయి కూర్చున్నది.

ఈపై పరిస్థితి ఒక్క తెలుగు ప్రాంతానికే పరిమితమయినదికాదు. ప్రపంచమంతా ఇదే పరిస్థితి ఉంది, దీనికెక్కడో ఎవరో గండికొట్టకపోతే, మార్క్స్ తన సిద్ధాంతాన్ని ఎవరికోసం ఉద్దేశించాడో వారి కందకుండాపోయే ప్రమాదం ఉంది. ఈపాటికే మార్క్సిజం విశ్వవిద్యాలయాల 'ఎకాడమిక్' చర్చల్లో భాగమైంది. 'మార్క్సిస్టు' అనేమాట కొంతమంది పేర్లకు బిరుద భాగంగాకూడా తగిలిస్తున్నారు. (వాళ్ళకిష్టమున్నా లేకపోయినా) ఇదేదో 'పెద్ద పెద్ద' వాళ్ళకు ఉద్దండ పండితులకూ సంబంధించిన విషయమనుకొని, సామాన్యుడు దీన్నుంచి దూరంగా తొలగిపోతున్నాడు. ఇది హాస్యాస్పదం మాత్రమే కాదు. విచారించదగింది కూడా.

మార్క్సిజాన్ని తెలుగులో చెప్పే ప్రయత్నాలు చాలాకాలంనుంచి జరుగుతున్నాయి. తెలుగు పత్రికలు, తెలుగు ప్రచురణ సంస్థలు, ఔత్సాహికులైన వ్యక్తులూ, ఈ పనిచేస్తున్నారు. వాళ్ళ సిన్సియారిటీని ఏ మాత్రం శంకించటానికి వీల్లేదు. కాని వాళ్ళ ప్రయత్నం ఆశించినంతగా ఫలవంతం కాలేదు. విషయం కఠినమయింది కావటం ఒక్కటే అందుకు కారణంకాదు. ఉపయోగించిన భాష "గొట్టు"ది కావటం ఇంకో ముఖ్య కారణమనుకుంటా. అయితే పూర్వప్రయత్నాలు పూర్తిగా నిరర్థకమయినవిగా భావించడం పొరబాటు. ఇప్పటివాళ్ళు స్వేచ్ఛగా వాడుకోటానికి వీలుగా, మాట్లాడు కోటా

నికి అనువుగా బోలెడు పదజాలాన్ని వెనకటితరంవాళ్ళు సృష్టించి ప్రచారం చేశారు. పెట్టుబడిదారీవిధానం, కార్మికవర్గం, వర్గసామరస్యం. వర్గవైరుధ్యం వర్గ పోరాటం, చారిత్రక భౌతికవాదం, గతితర్కం, వంటి ఎన్నో మాటలు ఇవాళ ఏమంత కొత్తవిగా అనిపించకపోవటానికి కారణం, ఇంతకు ముందటి వాళ్ళ కృషే. అంతేకాక "ఫ్యూడలిజం, బూర్జువా, బూర్జువాజీ, సోషలిజం" వంటి ఇంగ్లీషు ఫ్రెంచి మాటలు తెలుగుమాటలతోబాటు ప్రచారం కావటానికి కూడా వాళ్ళ ప్రయత్నమే కారణం. అయితే ఆ ప్రయత్నంమాత్రమే చాలదు. వీలైనన్ని పద్ధతులద్వారా, మార్గాలద్వారా ఆపని జరగాలి.విషయం సాధ్యమయినంత ఎక్కువమందికి బోధపరచాలి. తప్పులుపోతాయని భయ పడుతూ కూర్చుంటే అసలు పనే జరగదు.

మార్క్సిజాన్ని సంప్రదాయేతర మార్గాలద్వారా చదివేవాళ్ళకు ఆసక్తి కలిగించేలాగా చెయ్యాల్సిన అవసరాన్ని మెక్సికోలో "ర్యూస్" అనే మారుపేరుతో బొమ్మలు వేసే ప్రఖ్యాత కార్టూనిస్టు ఎడువార్డోడెల్-రియో, అనే ఆయన గుర్తించాడు. దాని ఫలితమే ఈ పుస్తకం. అంతర్జాతీయ బహుమతులందుకున్న కార్టూనిస్టు ఇతను. కార్టూను బొమ్మలద్వారా మార్క్సును (అంటే మార్క్సిజాన్ని) పరిచయం చెయ్యటం ఒక కొత్త ప్రయత్నం. చదివేవాళ్ళను ఆకట్టుకొని ముందుకు లాక్కుపోయే గుణం ఈ కార్టూన్లకుంది. బొమ్మలద్వారా సున్నితమైన హాస్యం కలిగిస్తూ, మాటల్లోకూడా సాధ్యమైనంత చమత్కారాన్ని నింపుతూ సాగిన ఈ రచన పుస్తకరచనలలోనే సరికొత్త ప్రయోగం. అనుకున్న లక్ష్యానికి అత్యంత ప్రయోజనకారి.

"ర్యూస్" చెప్పుకున్నాడు తాను చదువుకున్నది అయిదవ తరగతి మాత్రమేనని (నమ్మటం కష్టమే). అదే నిజమయితే డిగ్రీలులేని అతని "పాండిత్యం" వన్నెకు వచ్చిందనుకోవాలి. కనీసం తనలాంటి పాఠకుల

యినా దృష్టిలో పెట్టుకుని ఉంటాడు. ఈ ప్రయత్నంలో మార్క్సిస్టు సిద్ధాంత వేత్తల సహాయాన్ని తాను అడిగాననీ, అయితే తనకి బుర్ర సరిగ్గాలేక పోవడంవల్ల ఈ పని తలపెట్టి ఉంటానని వాళ్ళు మర్యాదగా సమాధానం చెప్పారనీ ర్యూస్ చెప్పుకున్నాడు. వాళ్ళ 'సహకారానికి' కృతజ్ఞతలు చెప్పుకుంటూ వాళ్ళ సలహాను పాటించనందుకు "విచారాన్ని" వ్యక్త పరచాడు. ఈ పుస్తకం దోషరహితమని "ర్యూస్" ఎక్కడా చెప్పుకోలేదు. దోషాలని తనకుతోచిన ఒకటి రెండు అంశాలను అనువాదకులు బాలగోపాల్ గారు తమ చివరిమాటలో చెప్పారు. ఇంకా నిశిత పరిశీలన చేసినవారు ఇంకా లోపాలు చూపించొచ్చు. లోపాలున్నప్పటికీ ఈ పుస్తకం ఉపయోగ కరం అని భావించినందువల్ల ఈ పుస్తకాన్ని తెలుగు పాఠకులకు తెలుగులో అందించదల్చుకున్నాం.

కార్టూన్ చిత్రకళ ఎంత ప్రాచీనమో తెలీదుగాని ఆధునికకాలంలో దిన, వార, మాసపత్రికల ద్వారా బాగా ప్రచారమయిన కళ ఇది. మన దేశంలో ఇటీవల బాగా ప్రచారానికొచ్చింది. ఏవో మరీ సీరియస్ సిద్ధాంత పత్రికలు తప్ప కార్టూన్ బొమ్మలులేని పత్రికలుండటంలేదు. కాని ఇప్పటి వరకూ వచ్చిన కార్టూన్లను స్థూలంగా పరిశీలిస్తే ఇవి రాజకీయ, సాంఘిక, విమర్శలకూ, విసుర్లకూ, వ్యాఖ్యానాలకూ ఎత్తిపొడుపులకూ మాత్రమే వినియోగపడ్డట్టు కనిపిస్తుంది. కేవలం పిల్లలకోసం హాస్యం కలిగించడానికి కొన్ని కార్టూన్ పుస్తకాలు వచ్చిన మాట నిజమే. కాని అతిసీరియస్ విష యాలను అంతే సీరియస్ ప్రయోజనంకోసం వాడుకోవటంలో 'ర్యూస్'దే మొదటి ప్రయత్నమేమో. వ్యంగ్య విమర్శలకోసం వేసే కార్టూన్లలో అప హాస్యం ఉంటుంది. సీరియస్ విషయంకోసం వేసే కార్టూన్లలోనూ రాతలోనూ అప హాస్యం ఉండకూడదు. అసలు హాస్యం లేకపోతే కార్టూన్ల ప్రయోజనం

లేదు. హాస్యం ఉండాలి. కాని సున్నితంగా ఉండాలి. ప్రతిభావంతుడయిన కార్టూనిస్టుమాత్రమే ఆపని చెయ్యగలడు. ర్యూస్ ఆపని చేసి చూపించాడు.

తెలుగులో ఇట్లాంటి ప్రయత్నం మౌలికంగా ఎవ్వరూ చెయ్యలేదు. ఇకముందు రావచ్చు. అందాక ఇంగ్లీషులో ఉన్న ఇట్లాంటి పుస్తకాలను తెలుగులోకి తెచ్చుకోవటమే ప్రస్తుతానికిమార్గం. ఆ ప్రయత్నంలో భాగంగా హైదరాబాద్ బుక్ట్రస్ట్- మార్క్సుపుస్తకాన్ని తెలుగులో ప్రచురించటానికి సంకల్పించుకొన్నది. విషయ పరిజ్ఞానం బాగా ఉండి తెలుగు బాగా రాయ గల్గినవారు దొరికితేనే ఈపని సాధ్యమయ్యేది. సరిగ్గా బాలగోపాల్ అట్లాంటివారు. నిజానికి మామూలు సిద్ధాంత గ్రంధాలు తెలుగు చెయ్యడం కన్నా ఈపని చెయ్యటం కష్టం. మూలంలో ఉన్న సంక్షిప్తతనీ, చురుకు దనాన్నీ, హాస్యాన్ని తెలుగులో తీసుకురావాలంటే చాలా శ్రమించాలి. అట్లాంటి శ్రమ తీసుకున్నందుకు బాలగోపాల్‌గారు ప్రత్యేక అభినందల కర్హులు.

అనువాదాన్ని మూలంతో మళ్ళీ సరిపోల్చి చూడటానికి కూడా కొన్ని రోజులు పట్టింది. ఈ పనిలో మిత్రుడు ఎం. టి. ఖాన్, విద్యార్థి కాచినేని రామారావు సాయపడ్డారు. ఒక్కోసారి నిరంతరాయంగా ఐదారు గంటలపైగా కష్టమనుకోకుండా ఈ పనికోసం నాతో కూర్చున్నారు.

ఇందరు ఇంత శ్రమపడ్డా ఇంకా కొంత అసంతృప్తి ఒక మూల కెలుకుతూనే ఉంది. చివరి భాగాలను, ముఖ్యంగా మార్క్సు ఎంగెల్సు రచనలలోంచి తీసుకున్న భాగాలను తెలుగులో అనుకున్నంత సులభశైలిలో రాయటం కుదరలేదు. ఇకముందు సాధ్యమయితే ప్రయత్నించగలమని హామీ ఇయ్యటం తప్ప ప్రస్తుతం చెయ్యగలిగింది ఏమీలేదు.

అనువాదాన్ని మూలంతో సరిపోల్చేటప్పుడు కమ్యూనిస్టు మ్యానిఫెస్టోకు ఇంగువ మల్లిఖార్జున శర్మగారి అనువాదాన్ని కూడా ఉపయోగించుకున్నాం.

ఈ మా ప్రయత్నాన్ని తెలుగుపాఠకులు సహర్షంగా స్వీకరిస్తారని మాకు నమ్మకమే. ఈ వరసలో లెనిన్ మావోలమీద పుస్తకాలు అచ్చుకు దాదాపు సిద్ధంగా ఉన్నాయి. ఆల్బర్ట్ ఐన్‌స్టయిన్, సిగ్మండ్‌ప్రాయిడ్‌ల మీది పుస్తకాలు ఆలోచనలో ఉన్నాయి.

ఈ వరసలో వచ్చే పుస్తకాలమీద పాఠకుల అభిప్రాయాల్ని, విమర్శల్ని, సూచనల్ని ప్రత్యేకంగా ఆహ్వానిస్తున్నాం.

హైదరాబాద్ బుక్ ట్రస్టు వారి కార్టూన్లలో 'మార్క్స్' పుస్తకానికి సంపాదకీయం, 1982 జూన్.



# యజ్ఞ వేదిక

## ప్రస్తావన

ప్రతి సాహిత్యంలోను కవిత్వంతో పాటు కథ ఉంటుంది. (చాలా సార్లు ఇవి కలిసేఉంటై.) భాషలోనే కథన ప్రక్రియను సాధ్యంచేసే నిర్మాణాంశాలు ఉండటం ఇందుకు కారణం. అందుకే ప్రతి సాహిత్యానికి ఇది అతి పురాతన ప్రక్రియగా ఊహించటానికి అవకాశముంది. భాష ఎంత పురాతనమయిందో ఇదీ అంతే పురాతనం అయి ఉండాలి. అయితే కథా వస్తువులూ, రూపాలూ, కథన పద్ధతులూ, భాష భాషకూ వేరుగా ఉంటై. ప్రజల జీవన విధానాల పరిణామాన్ననుసరించి, కాలక్రమంలో వచ్చే మార్పుల వల్ల కూడా ఈ ప్రక్రియా స్వరూపంలో భేదాలు వస్తయ్.

## తెలుగు కథాక్రమం బెట్టి దనిన....

ఇప్పుడు ఆధునిక నాగరక సమాజంలో కథగా వ్యవహరిస్తున్న ప్రక్రియకు స్థూలంగా ఈ శతాబ్దపు తొలి దశకం ప్రారంభం అనుకుందాం అంతకుముందు కూడా ఒకటీ అరా ఉన్నయ్యేమో తెలీదుకాని గురజాడ అప్పారావుగారి చిన్న కథలే తెలుగు కథలకు తొలి ఒరవడిగా దాదాపు అంతా గుర్తించారు. అప్పారావుగారు ఆధునిక తెలుగు సాహిత్యానికి వేసిన పునాది బహు గట్టిది. అతి దొడ్డది. అప్పటినుంచి తెలుగు కథ వస్తు వైవిధ్యంలోనూ కథన భేదాల్లోనూ వింత వింత పోకడలు పోయి, ఇతరదేశాల సంగతి ఎట్లా ఉన్నా, ఇతర రాష్ట్రాల కథలతో పోటీకి నిలబడగల ప్రక్రియగా ఎదిగింది. సాహిత్యపరంగా తలెత్తుకు నిలబడగల ధీమా తెలుగువాడికిచ్చింది. నవలా సాహిత్యపు కొరతను కప్పివేయగలిగింది.

స్త్రీ పురుష సంబంధాల్లో అసమానతను, కృత్రిమతను యాంత్రికతను దుయ్యబడుతూ స్వచ్ఛతను, విజాయితీని స్వేచ్ఛను ప్రబోధిస్తూ జలపాతంలాంటి దూకుడుతో రచించిన చలం కథలు; నడిమితరగతి నగరవాసుల

ఆర్థిక సంబంధాల్ని సామాజికవిశ్లేషణదృష్టితో రచించిన కుటుంబరావు కథలు; పట్నవాసులతో పాటు పల్లీయుల ఆర్థిక సమస్యలను ముందుకు తెచ్చిన గోపీచంద్ కథలు; బ్రాహ్మణ కుటుంబాల్లో ఆచారాల మూర్ఖతను అతి సహజవాక్య విన్యాసంతో ప్రదర్శించిన శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి కథలు; పాత్రల మనోంతరాలను దర్శించి ప్రదర్శించిన పద్మరాజు, బుచ్చి బాబు కథలు; స్త్రీల సమస్యల చిత్రణ, తరవాత విశ్లేషణ ప్రధానంగా ఉన్న రంగనాయకమ్మ కథలు; తెలుగు వారి సాంసారిక జీవితంలోని సున్నితమైన హాస్యపరిమళాన్ని అందించిన మునిమాణిక్యం కథలు; ప్యారడీలతో పద విశ్లేషాత్మక శ్లేషలతో చమత్కారాన్ని కలిగించే ముళ్ళపూడి వెంకట రమణ కథలు; మారుతున్న సమాజంలో నాగరక స్త్రీని రూపు కట్టించిన చింతాదీక్షితులుగారి వటీ రావు కథలు—ఇట్లా ఎంతోమంది కథలను గురించి ప్రస్తావించుకోవచ్చు. వీళ్ళంతా తెలుగుజాతికి గర్వకారణాలు. వీళ్ళ కథలు తెలుగు వాళ్ళు కలకాలం భద్రంగా దాచుకోవలసిన సాహిత్య వారసత్వం. ప్రక్రియాపరంగా జరిగిన, అభివృద్ధికూడా తక్కువేంకాదు.' 'చలం ఓ పువ్వు పూసింది', కుటుంబరావు గల్పికలూ, శ్రీశ్రీ 'చరమ రాత్రి', 'ఒసే తువ్వాలందుకో'. కోనేటిరావు కథలు, బుచ్చిబాబు చైతన్య స్రవంతి. ఇతర దీర్ఘ కథలూ స్వరూప పరంగా సాధించిన అభివృద్ధికి కొన్ని గుర్తులు. సాహిత్య విమర్శకులు విశ్లేషించి లక్షణ నిర్వచనం చెయ్యాల్సినంత వైవిధ్యం తెలుగు కథల కుంది.

గురజాడనుంచి సుమారు అర్థ శతాబ్దం వరకు తెలుగు కథ చాలా ఎత్తు ఎదిగింది. చాలా దిక్కులు విస్తరించింది. వివిధ రూపాలు సంతరించుకుంది. అయితే ఇది నడిమి తరగతి జీవిత పరిధికిమాత్రమే సీమితమయిందని గుర్తుంచుకోవాలి.

## అగ్రగామి మా. గోఖలే

తెలుగుకథా పరిణామంలో మా. గోఖలే పాత్ర మరువరానిది.

తన కాలపు కథల కంటె భిన్నమైన కథలు- ఒట్టిభేదమే కాదు, భవిష్యత్ప రిణామాన్ని ముందుగానే ఇముడ్చుకొన్న కథలు, రచించిన ఖ్యాతి గోఖలేది. సమకాలికులయిన కథారచయితలు చాలా మంది మధ్య తరగతి వలయం దాటలేనప్పుడు తాను మాత్రం దాదాపు ఒంటరిగా 1940 దశకం ఉత్తర భాగంలోనే అడుగు తరగతి బడుగు జీవితాలను చిత్రించటానికి సాహసిం చాడు, అదీ వాళ్ళ భాషలో (కృష్ణా మండల గ్రామీణ శ్రామికుల భాష). తన కాలం కంటె ముందు చూపున్న కథకుడు గోఖలే. బల్లకట్టు పాపయ్య, మూగజీవాలు గోఖలే దూర దర్శకత్వానికి గుర్తులుగా చరిత్రలో నిల్చిన కథా సంపుటులు.

గోఖలే కంటే పదేళ్లు ముందుగానే, గ్రామ్య భాషలో రాయకపో యినా, గ్రామ్య జీవితాన్ని వర్ణించిన కరుణకుమార కథలు గుర్తుకు తెచ్చు కోదగినవి. గోఖలేకు కరుణకుమార కథలు ప్రేరణ అవునో, కాదో తెలీదు. అయితే గోఖలేకు వర్గదృష్టిఉంది. గోఖలే అభ్యుదయ కథకుడు, చిత్ర కారుడు. చిత్రకారుడుగా ప్రజోద్యమాలకు చేసిన సేవ ముందుకు వచ్చి, కథారచయితగా చేసిన కృషి వెనక పడింది.

కరుణకుమార, గోఖలేల కథలను విడివిడిగానూ, తులనాత్మకంగానూ అధ్యయనం చెయ్యాల్సిన అవసరం ఉంది. గురజాడ వేసిన బాటను విస్తృ తం చేసిన వీళ్ళిద్దరి రచనలు ఇప్పుడు దొరకటం లేదు. పునర్ముద్రణ ప్రయ త్నాలు జరుగుతున్నట్టు తెలుస్తున్నది. భవిష్యత్పారదర్శకత్వంలో వీళ్ళిద్దరి కృషికి సరి అయిన అంచనా కట్టటం అప్పటివరకూ ఆగాల్సి ఉంటుంది.

## రా. వి. శాస్త్రి "కావించిన సృష్టి"

గోఖలే నుంచి ప్రత్యక్షంగా గాని, పరోక్షంగా గాని తరవాత కథకులు ప్రభావితమైనట్టు కనిపడదు. రాచకొండ విశ్వనాధశాస్త్రి, కాళీపట్నం

రామారావులు గోఖలే మార్గాన్ని ముందుకు తీసుకెళ్ళిన వాళ్ళైనా గోఖలే నుంచి ప్రేరణ పొందినట్టు తగినసాక్ష్యం దొరకటం లేదు.

మధ్య తరగతి మన స్తత్వ పరిశీలన ప్రధానంగా కధలు రాసి పేరు తెచ్చుకున్న రా. వి. శాస్త్రి సారా కధలతో తెలుగు సాహిత్యాన్ని ఒక కొత్త మలుపు తిప్పారు. ఒక కొత్త జీవితాన్ని చూపించారు. పాఠకులు తామింతకు ముందు చూసిన జీవితం కన్నా అది భిన్నమైంది. అక్కడి నీతి వేరు. ప్రేమలు వేరు, అభిమానాలు వేరు. ఆర్థిక దోపిడీకి వట్టి పోయిన జీవితాల్లో ఏం కనిపించాలో అవే కనిపిస్తయ్యక్కడ.

విశాఖ మాండలికానికి ఉత్తమ సాహిత్య ప్రతిపత్తి కలిగించిన గౌరవం విశ్వనాధశాస్త్రిది. "తన కావించిన సృష్టి తక్కొరులచేతన్ గాదు" అని తిక్కన్నను గురించి ఎఱ్ఱాప్రెగడ అన్నమాట విశ్వనాధ శాస్త్రికీ సరిగ్గా వర్తిస్తుంది. నిశిత పరిశీలన శక్తి ఉన్న రచయిత మాత్ర మే చూడ గలిగిన కోణాల్ని ఆయన దర్శించాడు. ప్రజల భాషలో వాక్య నిర్మాణాన్ని, సంయోజనను, సందర్భోచిత ప్రయోగాన్ని, అందాల్ని జారి పోకుండా అతి సుతారంగా పట్టి సాహిత్యంలో నిలబెట్టటం విశ్వనాధశాస్త్రి విశిష్టత. ఇది పాత్రల సంభాషణలో కనిపిస్తుంది. అసాధారణమైన పోలి కలు, కవిత్వానికి చేరువగా వెళ్లే వాక్యాల పేర్పు, ఆయన శైలిని మరింత ఆకర్షణవంతం చేసినై.

### కా. రా. నిర్వహణ

విశ్వనాధశాస్త్రి సాహిత్యలక్ష్యాన్ని విస్తరింప జేయటానికి పాటు బడుతున్న కథకుడు కాళీపట్నం రామారావు (కా. రా.). విశాఖమాండలి కంలో రా. వి. శాస్త్రి చేస్తున్న కృషి వంటిదానినే కా. రా. శ్రీకాకుళ మాండలికంలో చేస్తున్నారు. ఈయనా బలంగా ఉన్న సమకాలిక సాహిత్య ధోరణులకు ముందు లొంగినా, తరవాత కొద్దికాలంలోనే తన సొంత

బాణీతో కథా సాహిత్యంలో భూగర్భం చీల్చుకు వచ్చే జలధారలాగా 'యజ్ఞం' కథతో ప్రవేశించారు.

శ్రీకాకుళభాష విశాఖమాండలికానికి సన్నిహితమైనదైనా దాని ప్రత్యేకత దానికుంది. ఆ ప్రత్యేకతకు సాహిత్య గౌరవం కలిగించే బాధ్యత తనమీద వేసుకొని కా. రా. నిర్వహిస్తున్నారు.

## కా. రా. ప్రత్యేకత

కథా రచనలో కా. రా. కంటె రా. వి. శాస్త్రి సీనియర్. వ్యక్తిగత సాన్నిహిత్యం ఉంది. వీరిద్దరి రచనల్లో పోలికలున్నై. ఇరుగు పొరుగు మాండలికాలను రచనల్లో ప్రతిష్ఠిస్తున్నారు. ఇద్దరి రచనా లక్ష్యాలు ఒకటే. దోపిడీ వ్యవస్థలో అణగారే జీవితాలను చిత్రించటం, ఆ దోపిడీకి కారణాలు గుర్తించే చైతన్యాన్ని కలిగించటం- వీరిద్దరికీ సమాన ధ్యేయాలు. అయితే ఈ పోలికలింతవరకే. రా. వి. శాస్త్రి నగర జీవితంలో సందుగొందుల చీకటి కోణాలను పరిశీలించి, పరిశోధించి ప్రదర్శిస్తే, కా. రా. పల్లెవాసుల కంబారి బతుకులలోని బాధల పల్లవిని పలికిస్తున్నారు. ఇద్దరి కృషీ పరస్పర పరిపూరకమైనది.

వీరిద్దరి రచనా మార్గాల్లో భేదం ఉంది. రా. వి. శాస్త్రి కథల దేశకాల పరిధి చిన్నది. (పాత్రల్లో సన్నివేశాల్లో వైవిధ్యం ఎక్కువ). రా. వి. శాస్త్రి వచనం చాలా సార్లు కవిత్వ స్థాయికి ఎదుగుతుంది. కా. రా. వచనం నింపాదిగా నిండునదిలా ప్రవహిస్తుంది. రా. వి. శాస్త్రి వచనంలో లాగా మెరుపులు, విరుపులు, గమ్మత్తులు, చమక్కులు కా. రా. వచనంలో ఉండవు కా. రా. వచనంలో నిసర్గ సౌందర్యం ఉంది.

## కా. ర. కథలు కధలేనా?

1972 లో పదేళ్ల కిందటి తన్ను తాను కోట్ చేసుకొంటూ "నాకు కథానిక యొక్క స్వరూప స్వభావాలు పూర్తిగా పట్టుబడలేదు" అన్నారు.

కా. రా. తన కథల పుస్తకం పీఠికలో. "నా కథలు పొడుగ్గా వుంటాయని, అవి చదువుకోడానికి అంత హాయిగా నడవ్వనీ కొందరు మిత్రులు తరుచు చెపుతూ వుంటారు" అని కూడా అన్నారు. గురజాడ అప్పారావు గారికి నాటక లక్షణాలు తెలీవని కొన్నాళ్ల కింద కొందరు విమర్శకులు అన్నారు. ఈ రెండు మాటలూ నిజమే కావచ్చు. సాంప్రదాయిక పద్ధతిలో చూస్తే కన్యాశుల్కం నాటకం కాదు. కా. రా. గారివి కథలూ కావు. కానీ రెండిట్లోనూ సజీవమైన పాత్రలూ వాళ్ల జీవితమూ కనిపిస్తయ్. వాళ్ళు చిత్రించ దల్చుకున్న జీవితం విశాలమైనది. లోతైనది. వాళ్ళు దానికి తొడిగిన దుస్తులు చాలలేదు. ఎన్నుకున్న సాహిత్యరూపానికి అది ఇమడలేదు. కన్యాశుల్కం నాటకం కాదంటే బాధపడక్కర్లేదు. కా. రా. గారివి కథలు కావంటే పేచీ పెట్టుకో అక్కర్లేదు. సున్నితంగా చిత్రించిన జీవితం, ప్రదర్శించిన జీవిత సత్యాలు ఉన్నై. ఆ ప్రక్రియలకు అవసరమైతే వేరే పేర్లు పెట్టుకోవచ్చు. లేకపోతే మానెయ్యనూవచ్చు. అది అంత ప్రధానం కాదు. కానీ వాళ్ళను గొప్ప కళాకారులుగా గుర్తింవటం ముఖ్యం.

"నేను చిత్రించ దలచిన జీవితం చిత్రించదలచిన పద్ధతిలో చెప్పా లంటే పెద్ద కేన్వాసు తీసుకోక తప్పదనుకుంటాను" అన్నారు అదే పీఠికలో, 'నవలకు తీసుకోవలసిన కేన్వాసు" తన కథలకు తీసుకున్నట్టుగా కూడా ఒప్పుకున్నారు. "ఒక నవలగా చిత్రించవలసిన స్వభావం గల వస్తువుని యజ్ఞం కథలో ఇమిడ్చినట్టు రంగనాయకమ్మ విమర్శించారు. (చూ. పే. 136). ప్రక్రియ పరంగా 'యజ్ఞం' కథను నవలగా మల్చుకోవలసిన అవసరం వుంది" అని రామకృష్ణారెడ్డి- కథలో పాత్రల స్థాయినిగురించి మాట్లాడుతూ అన్నారు. (చూ. పే. 149) ఈ విమర్శలను 'చావు' లాంటి ఇతర కథలకు కూడా వర్తింపుకోవచ్చు. సాంప్రదాయికంగా నాటకం అంటున్న ప్రక్రియ కన్యాశుల్కం కథకు ఇమడనట్టుగానే, కథానిక అనే రూపం కా. రా. చిత్రించదల్చుకున్న జీవిత విస్తృతికి సరిపోలేదు. గురజాడ కాలానికి నవల ఏమంత ప్రజాదరణ పొందిన సాహిత్యప్రక్రియ కాదు.

అప్పటి ప్రజలకు నాటకాలు చూసే అలవాటున్నట్లు అప్పటి నాటకాలను బట్టి, ప్రహసనాలను బట్టి, తెలుసుకోవచ్చు. పైగా గురజాడ కాలానికి ప్రేక్షకులున్నంతగా పాఠకుల లేరు. తక్షణ ప్రచారానికి నాటకం బాగా పనికొస్తుందని గురజాడ గుర్తించి ఉంటారు. గురజాడ ప్రహసన ప్రాయమైన నాటకంగా రాయబోయి తన పాత్రలకు తానే ముగ్ధుడై జీవితమంత విస్తృతమైన నాటకం రాశారు. అందువల్ల నవల కావలసిన కన్యాశుల్కం నాటకం అయి కూర్చుంది.

కా. రా. కాలానికి నవల అధిక ప్రచారం పొందిన ప్రక్రియగా కుదురుకున్నది. దగ్గరివాడూ, సీనియర్ రచయితా అయిన రా. వి. శాస్త్రి నవల- కథ రెండూ సవ్యసాచిలా నిర్వహిస్తున్నారు. అయినా కా. రా. నవల అందుకోకపోవటం ఆశ్చర్యకరమైన, ఆలోచింపదగిన, చింతించవలసిన విషయం. ఆయన తీసుకున్న జీవితకథలు నవలలుగా మలచదగినంత తీరికగాని, ఓర్పు (పేషన్సు) గాని ఆయనకు లేకపోవటం కారణం కావచ్చు. విషయపరంగానూ, చిత్రణపరంగానూ, ఇంకా లోతైన పరిశీలన అవసరమని గుర్తించటం కారణం కావచ్చు. కా. రా. కథలను చదివిన వారు ఆయన తనకథల్లో ప్రతిచిన్న అంశానికి ఇచ్చే ప్రాధాన్యం గుర్తించ గలుగుతారు. వాతావరణ నిర్దేశంలో, పరిసర చిత్రణలో, పాత్ర నిర్వహణలో, కా. రా. చాలా శ్రద్ధ తీసుకుంటారు, ఎంత శ్రద్ధ తీసుకుంటారంటే కొందరు పాఠకులు 'ఎందుకు అనవసరంగా ఇన్ని వివరాలు వర్ణిస్తారు?' అని అనుకునేటంతగా. ఇన్ని వివరాలను వర్ణిస్తూ కథలు రాసినన్ని నవలలు రాయటం సాధ్యం కాదు. బహుశా అందుకే కా. రా. నవలలంత పెద్ద కథలతో సంతృప్తి పడి ఉంటారు. ఇప్పటికైనా ఆయన దగ్గరినుంచి ఒక మంచి నవలను ఆశించటం దురాశ కాదు.

అయితే ఇప్పటి కథా రాశి మరీ అంత తక్కువేమీ కాదు. కొత్త

కథలకు పథనిర్దేశం చేసేవి. విమర్శకులను ఆలోచింపజేసేవి అయిన కథలు కా. రా. రాశారనటానికి ఈ సంపుటి ఒక విదర్శనం.

## తెర తీయగరాదా!

ఇది కా. రా. కథలమీద వివేచనాత్మక పరిశీలక వ్యాసాల సంపుటి. వ్యాసకర్తలు చెప్పిన ప్రధానాంశాలను పాఠకులు ఏమరుపాటున వదిలెయ్యకుండా ఉండటానికైనా పనికొస్తుందనే ఉద్దేశంతో ఆయా వ్యాసాలలో రచయితలు ప్రధానంగా చెప్పారనుకున్న విషయాలను సంపాదకుడిగా సమీక్షించే బాధ్యత నెత్తిన వేసుకుంటున్నాను. నాకు తోచిన అంశాలు ఇతరులకు అంత ముఖ్యంగా కనపడకపోవచ్చు. సమర్థులైన పాఠకులు వేరే ప్రధానాంశాలను గుర్తించొచ్చు. ఈ పరిమితులను గుర్తెరిగి ఈ సమీక్షకు ఉపక్రమిస్తాను. ఇట్లాంటి వ్యాసాలమీద పుస్తక సంపాదకులు పీఠికల్లో సవిమర్శక వ్యాఖ్యలు చేసే సంప్రదాయమొకటి విద్వల్లోకంలో ఉంది. తెలుగులో ఆ సంప్రదాయాన్ని ఇప్పుడప్పుడే ప్రారంభిస్తే వచ్చే అపార్థాలను గుర్తుచేసుకొని కేవలం విషయసూచనకు మాత్రమే ఈ సమీక్షను పరిమితం చేస్తాను. కొటేషన్ మార్కులు అన్నిచోట్లా పెట్టకపోయినా, సాధ్యమైనంత వరకు రచయితల వాక్య, వాక్యాంశాల్లోనే విషయ సూచనచేస్తాను. నా సొంత మాటలు వాడినచోట అయినా రంగూ, రుచి, వాసనలు, వెదజల్లని నిరలంకృత, నిర్లిప్త (న్యూట్రల్) పద జాలాన్ని మాత్రమే ఎన్నుకునే ప్రయత్నం చేస్తాను. (ఇటుపైని "తెరతీస్తే" అనే ఉపశీర్షికతో వ్యాససారాంశాలున్నాయి. ఆ తరవాత-)

## తెర వెనుక

హైదరాబాదు ఎకౌంటెంట్ జనరల్ ఆఫీసు వారి తెలుగు సాంస్కృతిక సంస్థ 'రంజని' రకరకాల సాహిత్య సాంస్కృతిక కార్యక్రమాలు

నిర్వహిస్తున్న విషయం పట్టణ వాస్తవ్యులకు తెలిసిందే. 'కథా యజ్ఞం' సంపుటికి తొలి ప్రణాళిక వేసింది 'రంజని' వారే. కొంతమంది రచయితల నెన్నుకొని విషయాలు సూచించి వ్యాసాలు రాయమని అడిగారు. అడిగిన వాళ్ళంతా రాయకపోవటం అలవాటులో ఉన్న ఆనవాయితే గనుక, ఎక్కువ వ్యాసాలు రాలేదు. ఇతర ఇబ్బందులవల్ల కూడా ఈ సంపుటి భారాన్ని హైదరాబాద్ బుక్ ట్రస్టుకు అప్పగించారు. ప్రణాళికను పునః పరిశీలించు కోటానికి అనుమతించారు. ఉన్న వ్యాసాల్లో కొన్నిటిని, మార్చుకున్న ప్రణాళికలో ఇమడ్చటం కుదరలేదు. ఆ వ్యాసాలు గుణరహితమైనవని దీని అర్థం కాదు. ఈ సంపుటికి నేనూహించిన ప్రణాళికకు సరిపడలేదు. అంతే.

భారతి. సృజన, అరుణతార. ప్రజా సాహితి. నూతన పత్రికల్లో వచ్చిన కొన్నిటిని ఈ సంపుటిలో చేర్చాను. ఈ భారం బుక్ట్రస్టు స్వీకరించిన తరవాత వచ్చిన వ్యాసాలు కూడా ఇందులో ఉన్నై.

## సంపాదకుడి సంజాయిషీ

ఇది కా. రా. సన్మాన సంపుటి కాదు. ఆయన కథలమీద విమర్శక వ్యాసాలసంపుటి. ఈ వ్యాసకర్తల్లో చాలా మంది కా. రా. కథల్లో గుణాలను మెచ్చుకుంటూనే తమకు లోపాలని తోచినవాటిని ఎత్తి చూపించటానికి మొహమాటపడలేదు. "యజ్ఞం, ఆర్తి కథల్లో జీవిత సంఘర్షణలు" (పే. 72-85) భయంలో కథాశ్లేష (పే. 86-89) పేదల అధికార ప్రవేశం(పే. 145-156) అనే వ్యాసాల్లో ఈపద్ధతి ఎక్కువ స్పష్టంగా చూడొచ్చు. కా.రా. రచనల్లో లోపాల్నే ఎక్కువ చూపినవారు లేకపోలేదు. "యజ్ఞం-రచయిత అవగాహనలో లోపాలు" (పే. 120-136) అనే వ్యాసం అందుకు ఉదాహరణ. కా. రా. కథల మీద వివిధ రకాల అభిప్రాయాలను ఒకచోట చేర్చే ఉద్దేశంతో వాటిని ఈ సంపుటిలో చేర్చాను. ఆ అభిప్రాయాలలో వేటితోనైనా సంపాదకుడికిగాని బుక్ట్రస్టులో మరే ఇతర సభ్యులకు గాని తప్పనిసరిగా అంగీకారం గాని, సానుభూతిగాని ఉన్నట్టు భావించకూడదు.

రచయితల అభిప్రాయాలతో స్పష్టమైన అనంగీకారం ఉన్నచోట కూడా వాటిని తొలగించలేదు. ఉదాహరణకు ఒక వ్యాసంలో "మనలో కలిగే దీర్ఘాలోచనే విప్లవం", "తలలు నరకడం రచయితకిష్టమైన విప్లవం కాదని ధ్రువం ఔతూంది" (పే. 101) వంటి వాక్యాలు కా. రా. ఆలోచనను ప్రతిబింబించవని సంపాదకుడు భావించినా, వాటిజోలికి పోలేదు.

'ఎడిటర్' అనే ఇంగ్లీషు మాటకు 'సంపాదకుడు' అనే మాట వాడుతున్నాం. 'ఎడిట్' అనే మాటకు తెలుగులో ఏ మాట వాడతారో తెలీదు. "సంపాదకుడు 'సంకలనకర్త' అనే మాటల్ని కొన్ని సందర్భాల్లో సమానంగా వాడుతున్నాం. అందువల్ల ఎవరు ఏ బాధ్యతలను నిర్వహిస్తారో స్పష్టత లేకుండా పోయింది.

'ఎడిట్' అనే ఇంగ్లీషు మాటకు విస్తృతమైన అర్థం ఉంది. మనం ఆలోచనలను సన్నిహిత మిత్రుల దగ్గర ఒక రకంగానూ, పదిమంది ముందు ఇంకో రకంగానూ, రాతలో మరో రకంగాను వ్యక్తం చేస్తాం. ఆలోచనలను 'ఎడిట్' చేసుకోటంలో వచ్చే భేదాలవల్ల ఈ రూప భేదాలు వస్తాయి. వేసుకున్న ప్రణాళికనుబట్టి, పెట్టుకున్న లక్ష్యాల ననుసరించి, ఉద్దేశించిన పాఠకులను దృష్టిలో ఉంచుకొని వ్యాసాలను 'ఎడిట్' చేసుకోవాల్సిన బాధ్యత సంపాదకులకు ఉంటుంది. ఇది సంకలనాన్ని మించినపని. ఈ సంపుటిలో వ్యాసాలను కూడా ప్రణాళికను అనుసరించి 'ఎడిట్' చేసుకోవాల్సి వచ్చింది.

యజ్ఞం కథలో లోపాల్ని గురించి రంగనాయకమ్మ రాసిన వ్యాసంలోనూ, అందుకు సమాధానంగా నరసింహయ్య రాసిన వ్యాసంలోనూ కథా విషయాన్ని దాటి ప్రస్తావించిన విషయాలను వ్యాస ప్రధాన భాగం నుంచి తొలగించాల్సి వచ్చింది. అయితే తొలగించిన భాగంలోని సారాంశాన్ని కింద ఇచ్చిన చిన్న నోట్‌లో సూచించాను. దీనివల్ల ఏ విషయాన్నీ అణిచిపెట్టకుండా వ్యాస ప్రధాన విషయానికి భంగం కలక్కుండా సూచిం

షటానికి వీలయింది. వ్యాస ప్రధాన విషయంలో ఇమడని అంశాలను ఈ విధంగా నోట్‌లో సూచించే బాధ్యత సంపాదకుడికుందనే భావిస్తున్నాను.

కొన్ని ఇతర వ్యాసాలను స్వల్పంగా 'ఎడిట్' చేసుకోవాల్సి వచ్చింది. అన్ని వేళలా రచయితలను సంప్రదించటానికి కుదరలేదు. అయితే ఆ మార్పులు రచయితల అభిప్రాయాలను వికృతం చేసేవి కావు గనుక వాటికి అభ్యంతరం ఉండదనే అనుకుంటాను. కథలమీద విమర్శ కనుక చాలా మంది కథాంశాన్ని ప్రస్తావించి అందులో మంచి చెడ్డలు విమర్శిం చారు. అట్లాంటి చోట్ల పునఃకథితాంశాలను అక్కడక్కడ తొలగించాను. చాలామంది యజ్ఞం కథను ప్రస్తావించారు గనుక, పుస్తకం పేరు కూడా 'కథాయజ్ఞం' అని రంజని వారెన్నుకున్న పేరే ఉంచాం కనుక - పాఠకుల సౌకర్యంకోసం కా. రా. అనుమతితో యజ్ఞం కథను అనుబంధంగా చేర్చాం.

ఈ సంపుటిని ఇంతకన్నా ఇంకా బాగా తీసుకురావచ్చు ననటానికి సందేహం లేదు. ఇంకా కొన్ని మంచి వ్యాసాలు రాయించొచ్చు. ఇంకా కొందరు రాస్తామన్నారుకూడా. ఈ పుస్తకంకోసం ఎదురుచూస్తున్నవారి ఓపిక ఈ పాటికే తగ్గిపోయింది. ఇంకా వారి ఓపికను పరీక్షించే ఉద్దేశం లేక, ఎక్కడోచోట హద్దు గీచుకోవాలిగనుక ఉన్నవాటితోనే సంతృప్తిపడి పుస్తకం తయారుచేశాం. అచ్చయిన తరవాత ఎడిటర్‌గా నేను నిర్వహించా ల్సిన బాధ్యతలు ఇంకా కొన్ని మిగిలిపోయినట్లు గుర్తించాను. కొన్ని వ్యాసాల్లో కథాంశాన్ని ఇంకా తగ్గించి ఉండొచ్చు. వ్యాస రూపాల్లో సమ త్వం కోసం ఒక వ్యాసంలో (పే. 111-118) ఫుట్ నోట్లను తొలగించి ఉండాల్సింది. ఇంకో వ్యాసం (పే. 170) చివర రచయిత నోట్‌ని (అవ సరం లేదు గనుక) తొలగించి ఉండాల్సింది. ఇంకా ఇట్లాంటి పనులు మరి కొన్ని మిగిలిపోయిఉండొచ్చు. వీటిని గురించి ప్రస్తుతం చెయ్యగలిగింది ఏమీలేదు. ఎడిటింగులో అన్ని లోపాలకు సంపూర్ణ బాధ్యతవహిస్తూ పాఠ కులను క్షమాపణ కోరుతున్నాను.

ఋణ విముక్తి

మాకు తెలిసినంతవరకు ఒక తెలుగు కథకుడి మీద సవిమర్శక వ్యాసాల సంపుటిని ప్రకటించటం ఇదే ప్రథమం. అట్లాంటి ప్రణాళికను తొలిసారిగా వేసినందుకు రంజని వారికి అభినందనలు. దాని నిర్వహణ బాధ్యత హైద్రాబాద్ బుక్‌ట్రస్టుకు అప్పగించటానికి ప్రధాన కారకులైన సహవాసి, మినన్ గార్లకు సంతోషాభివందనాలు. ఈ ప్రయత్నంలో మాతో సహకరించిన మిత్రులకు, వ్యాసాలు పంపిన రచయితలకు, తమ పత్రికల్లోనుంచి వ్యాసాలను తీసుకోటానికి అనుమతించిన పత్రికాధిపతులకు, రచయితలకు, సలహాల నందించిన కా. రా. గారికి, భావ స్ఫోరకమైన ముఖపత్ర చిత్రరచన చేసిన చంద్రకూ కృతజ్ఞతలర్పించటం మాకు సంతోషకరమైన విధి.

ప్రచురణ ఆలస్యమవుతున్నదని విసుక్కుంటూనే హెచ్చరించిన కృష్ణాబాయి గారికీ, పుస్తకం ఎడిటింగు విషయంలో బరువైన సలహాలను కటువైన విమర్శలను అందించిన నర్సింగుకూ, ఇంకా ఇతర హైదరాబాదు, విశాఖ మిత్రులకు కూడా మేం చాలా ఋణపడి ఉన్నాం. పుస్తకం గుణం పెంచటానికి వీరి విమర్శలు సలహాలు ఎంతో ఉపకరించినయ్యని మనఃస్ఫూర్తిగా అంగీకరిస్తున్నాను.

ఇక ఈ పుస్తకం మీచేతిలో ఉంది. సవిమర్శకంగా చదవండి. గుణదోష విచారణ చెయ్యండి. మీకు తోచిన విషయాలు మాకు రాయాలనిపిస్తే రాయండి. అయితే, నిర్మొహమాటంగా రాయండి.

కథాయజ్ఞం
కాళీపట్నం రామారావు కథలపై యజ్ఞం అనుబంధంగా
చర్చావ్యాసాలు- సంపాదకీయం.
హైదరాబాద్ బుక్ ట్రస్ట్.
జూలై 1982

— 0 —

# భాషావగాహన కథాక్రమం

కాలేజిలో చదువుకొనే రోజుల్లోనే ఛందో వ్యాకరణాల గురించి ఆలోచించటం అలవాటయినా భాషను పరిశోధక దృష్టితో పరిశీలించటం విదేశాల్లో భాషాశాస్త్రం చదువుకొనేటప్పుడు ప్రారంభమయింది. విస్కాన్సిన్ యూనివర్సిటీలో 1962 చివర్లో ఒకకోర్సుకు. తెలుగు బహువచనాల గురించి వ్యాసం రాయాల్సి వచ్చింది. ఎనిమిదేళ్ళ తర్వాత (1970) అదే బహువచన రూపనిష్పత్తిగా భారతిలో అచ్చయింది. 1963 నుంచి కోర్నెల్ యూనివర్సిటీలో చదువుసాగిస్తూ. తెలుగుభాషలో ధ్వని నిర్మాణం గురించి. 1965 నుంచి జనరేటివ్ ఫోనాలజి పద్ధతిలో పరిశోధన సాగించాను. ఆ పరిశోధన ఫలితాలు వ్యాసరూపంలో ఎక్కడా అచ్చుకాలేదు. భారత ప్రభుత్వం వారికి 1969 లో ఇంగ్లీషులో రాసిచ్చిన తెలుగు వ్యాకరణ సంగ్రహంలో ఆ విశేషాలు కొన్ని చేర్చాను. తెలుగుభాషా చరిత్రలో ఆధునిక భాషకు చేసిన సంగ్రహవర్ణనలో మరికొన్ని విశేషాలున్నై. ఆ వ్యాసం ఈ సంపుటంలో చేర్చలేదు.

1966 ప్రాంతం నుంచి తెలుగువాక్య నిర్మాణం గురించి ఆలోచించటం ప్రారంభించాను. 1966 - 1967 మధ్యలో **'A Transformational study of Telugu Nominals'** అనే పేరుతో ఒక థీసిసు డాక్టరేటు డిగ్రీకోసం తయారుచేశాను. దానికి 1968లో డిగ్రీవచ్చింది. ఆ పరిశోధనా ఫలితాలు. తరువాత మారుతూవచ్చిన అభిప్రాయాలూ కలిసి నామ్నీకరణాల వ్యాసాలుగా తయారయి 1968-1969 సంవత్సరాల్లో భారతిలో అచ్చయినై. అప్పటినుంచి తెలుగు వాక్యనిర్మాణాన్ని గురించి. ద్రావిడభాషలో వాక్య నిర్మాణ సామ్యాల్ని గురించి ఇంకా ఇతరేతర అంశాల్ని గురించి ఇంగ్లీషులోనూ. తెలుగులోను అప్పుడప్పుడు కొన్నివ్యాసాలు ఆయాచోట్లఅచ్చయినై.

ఇది నా సర్వరచనల సంకలిత సంపుటి కాదు. తెలుగులో అచ్చయిన వ్యాసాల్లో పరిశోధన నిండుగా ఉందనుకున్న వ్యాసాల సంకలనం మాత్రమే

సంవేదనలో అచ్చయిన 'వ్యాకరణ శ్లేష" వంటి వ్యాసాలు ఇందులో చేర్చ లేదు. వివిధ విషయాల మీద రేడియోలో చదివిన ప్రసంగ వ్యాసాలను భద్రపరచలేదు.

భాషాశాస్త్రంలో పరివర్తన సిద్ధాంతం అనే మొదటి వ్యాసం పరిశోధక వ్యాసంకాదు. సిద్ధాంతాన్ని తెలుగు పాఠకులకు పరిచయంచేసేది మాత్రమే. ఇందులో చేర్చిన చాలా వ్యాసాలు ఈ సిద్ధాంత భూమికలో తయారయినవి కావటంవల్ల ఈ వ్యాసానికి ఇందులో స్థానం కల్పించబడింది.

ఈ వ్యాసాలను పుస్తకముద్రణకోసం కొద్దిగామార్చినా ప్రధాన విషయాల్లో మార్పులు లేకుండానే సంకలితం అవుతున్నై. నామ్నీకరణాల విషయంలో- ప్రధానంగా ఇత్యర్థక నామ్నీకరణం పేరుతో అనుకృతిమీద రాసిన వ్యాసంలో చాలా మార్పులు చెయ్యాల్సిఉంది. క్త్వార్థక క్రియ గురించిరాసిన వ్యాసంలో సూత్రనిర్మాణం, సూత్రక్రమం ఎంతో మార్చాల్సిఉంది. అయినా మార్పులు లేకుండానే ఇందులో పునర్ముద్రిత మవుతున్నై. అందుకు సంజాయిషీ ఇది: ఈ వ్యాసాలను మార్చాలంటే పూర్తిగా తిరగరాయాలి. ఇట్లాగే ఉంచితే- ఈ చేసినపద్ధతిలో ఆలోచించే వీలుంది అని తెలుసుకోవచ్చు. ఒకప్పటి ఆలోచనాక్రమం రికార్డు అవుతుంది, ఒక్కోసారి పాత ఆలోచనలే కొత్త వాటికన్నా మెరుగు కావచ్చు.

తెలుగు వాక్యనిర్మాణం గురించి ఈ వ్యాసాలలో లేని కొన్ని సూచనలు, విశ్లేషణలు 'తెలుగు వాక్యం' (1975) అనే చిన్న పుస్తకంలో సంక్షిప్తంగా ఉన్నై. ఆ పుస్తకాన్ని సవరించి, పెంచి రాయాల్సిన అవసరాన్ని గుర్తించాను. అందుకు ఇంకా సమయం రావాలి. కనీసం అందాకా అయినా ఈ వ్యాసాల అవసరం ఉందనుకుంటాను.

తెలుగుభాష గురించి నా ఆలోచనలన్నీ ఇందులో లేవు. అవి వ్యాసాలరూపంలో ఇంకా తయారుకాలేదు. తెలుగులో క్రియారహిత వ్యాక్యాల

గుప్తనిర్మాణంలో "అవు' వంటి క్రియను ప్రతిపాదించే విషయం మీద, తెలుగుక్రియల్లో అనుబంధక్రియగా కొను ప్రయోగం మీద, చేస్తున్న ఆలోచనలు ఇంకా స్థిరరూపానికి రాలేదు. ఈ పుస్తకానికి పునర్ముద్రణ వుంటే అప్పటికి మరికొన్ని వ్యాసాలు ఇందులో చేర్చటానికి సిద్ధం కావచ్చు.

తొలినుంచీ నా భాషావ్యాసాల మీద తగిన ఆసక్తి చూపిస్తూ వచ్చారు శ్రీదేవులపల్లి రామానుజరావుగారు. ఆంధ్రసారస్వత పరిషత్తులాంటి విద్వత్సంస్థ ఈ పుస్తకం అచ్చేయటానికి పూనుకోవటంవల్ల ఈ పుస్తకానికి విలువ పెరుగుతుంది. అందుకు కారకులైన రామానుజరావుగారికి కృతజ్ఞత చెప్పుకోటం విధి నిర్వహణలో భాగంగా భావిస్తున్నాను. ఇదే సందర్భంలో ఈ వ్యాసాలు సంకలితం కావడానికి సహకరించిన కె.కె. రంగనాథాచార్యులు పి. సి. నరసింహారెడ్డి, అయిలోని ఉషాదేవి, కాచినేని రామారావు, కుంటముక్కల లక్ష్మీనారాయణశర్మ, అట్లూరి విజయలక్ష్మి- వీరికి కృతజ్ఞతలు.

ఈ వ్యాసాల్లో ఎక్కువభాగం భారతిలో అచ్చయినై. భారతి పత్రికాధిపతులను ఈ సమయంలో గుర్తుచేసుకుంటున్నాను. భాషా పరిశోధకుడుగా స్థిరపడటానికి రకరకాల పరిస్థితులు, వివిధ వ్యక్తులు కారణం అయ్యారు అందులో ముఖ్యులయినవారు నాయని కృష్ణకుమారి. భద్రిరాజు కృష్ణమూర్తి జెరల్డ్ కెలీగార్లు. చివరి ఇద్దరూ నా థీసిస్‌కు పర్యవేక్షకులుగా ఉన్నారు.

వీరందరినీ కృతజ్ఞతతో స్మరించుకోటం ఆచారంకోసం గాదు. ఆత్మసంతృప్తికోసం.

"తెలుగులో వెలుగులు" భాషావ్యాసాల సంపుటికి స్వపీఠిక.

1982 నవంబరు 30, ఆంధ్రసారస్వత పరిషత్తు హైదరాబాదు ప్రచురణ

# ఆహ్వానం

ఆదిమ సమాజాల్లో భాష ప్రయోజనాలు పరిమితం. ఎక్కువ భాగం ఆ సమాజాల్లోనివారు నిత్య జీవితావసరాల కోసమే మాట్లాడుతారు. శ్రమలో భాగంగా కావొచ్చు, ఉల్లాసం కోసం కావొచ్చు. వినోదం కోసం కావొచ్చు, అనుభవాలనూ జ్ఞానాన్నీ నలుగురితో పంచుకోవటం కోసం కావొచ్చు, బహుశా ఎప్పుడో ఒక పాటో, పదమో అల్లుకోవచ్చు. ఎప్పుడన్నా కాసిని ఊకుడు కథలో, గాథలో చెప్పుకోవచ్చు. ఒక జాతి తన తరంలో నేర్చుకున్న విజ్ఞానాన్ని తరువాతి తరానికి అందించడం ఈ విధంగా నోటిద్వారానే సాధ్యంకాదు. అందువల్లనే సామాజికావసరాలు పెరిగిన ఒక దశలో మానవ జాతులవారు లిపి ఏర్పరచుకున్నారు. అంటే సమాజాభివృద్ధికీ భాషాభివృద్ధికీ విడదీయరాని సంబంధం ఉందన్నమాట.

అభివృద్ధిచెందిన అన్ని సమాజాల్లోనూ రాసే అలవాటుంది. రాసే భాష మాట్లాడే భాషనుంచి తయారయింది. మొదట మొదట రెండూ ఒకటే అయినా రానురాను భేదాలు ఏర్పడతాయి. మాట్లాడేభాష అయినా అన్ని సందర్భాల్లోనూ ఒకటిగా ఉండదు. పిల్లలతో ముద్దుముద్దుగా మాట్లాడే భాష, కుటుంబంతో మాట్లాడేభాష, కొత్తవాళ్ళు వచ్చినప్పుడు మాట్లాడే భాష, సభల్లో మాట్లాడే ఉపన్యాసపు భాష — ఇట్లా మాట్లాడే భాషల్లో రకరకాలుంటాయి. ఆదిమ సమాజాల్లో కూడా ఇట్లాంటి భాషా భేదాలను పరిశోధకులు గమనించారు. అక్కడకూడా కథాకథనంలో ఉపయోగించే సాహిత్య భాషకూ, మంత్రతంత్రాల్లాంటి వాటికి ఉపయోగించే భాషకూ, రోజువారీ సంభాషణ కుపయోగించే భాషకూ తేడాలున్నాయి.

రాసేభాషకు మాట్లాడే భాషే మూలమయినా రెంటికీ కొద్దో గొప్పో తేడాలు ఉండకుండా ఉండవు. అయితే ఒక్కో సమాజం ఆ తేడాలను కొంతవరకు సహిస్తుంది. రాసేభాష ప్రధాన ప్రయోజనం సాహిత్యరచనే

అయినప్పుడు, ఆ సాహిత్యం చాలా కొద్దిమంది చదువరులనే ఉద్దేశించి నప్పుడు రాసే భాషకూ, మాట్లాడే భాషకూ తేడా ఎక్కువున్నా ఫరవాలేదు. ఆ గ్రంథాల్లో విషయాలు ఎక్కువ మందికి తెలియాలని సమాజంలో కొందరు భావిస్తే రాసే భాషలో పండితులైనవారు ఇతరులకు అర్థమయేట్టు వివరించి చెపుతారు. మన ప్రాచీన సాహిత్య రచనా సంప్రదాయం అట్లా ఏర్పడ్డదే. పురాణ కాలక్షేపాలు, హరికథలు-సంప్రదాయ సాహిత్యంలో విషయాలు ఎక్కువ మందికి అందజెయ్యాలనే ప్రయత్నంలో భాగాలే.

సమాజంలో మార్పులు ఒక దశలో అతి త్వరితంగా వస్తాయి. ఆధునిక యుగంగా మనం పిలిచే ఈ ఇరవయ్యో శతాబ్దంలో మానవ జీవితంలో అన్ని రంగాల్లోనూ వచ్చిన మార్పులను అంతకు ముందటి శతాబ్దాల్లో వచ్చిన మార్పులతో పోల్చిచూస్తే ఈ తేడాను గుర్తించవచ్చు. ఇప్పటి సంఘ జీవితం అత్యంత సంక్లిష్టమూ విస్తృతమూ అయింది. అంతేకాక ఈ మార్పులు అంతకు ముందటికన్నా ఎక్కువమంది అనుభవంలోకి వచ్చినాయి. ఈ మార్పులు వచ్చిన అన్ని రంగాలలోనూ భాషా ప్రయోగం అవసరమయింది. ఎన్నో రకాల విజ్ఞాన విశేషాలకు భాష ప్రయోగించాల్సిన అవసరం వచ్చింది. అందువల్ల అతి పరిమిత ప్రయోజనం కలిగిన ప్రాచీన రచనాభాష, సమాజంలో కొద్దిమందికి మాత్రమే అందుబాటులో ఉన్న ప్రాచీన సాహిత్యభాష ఈనాటి అన్ని సామాజిక అవసరాలకూ సరిపోదు. ఆ భాషలో నియమాలు రాసేవారి ఆలోచనలకూ, స్వేచ్ఛకూ, సంకెళ్ళుగా తయారయ్యాయి, రాసే విషయం కన్నా, రాసే భాషలో ఎక్కడ తప్పులు పోతాయో అనే భయమే రాసేవాళ్ళ మనసులను ఆక్రమించింది. ఆ భాషలో నియమాలను కొన్నిటిని సడలించి కొత్త రచనా భాషను తయారుచేసే ప్రయత్నాన్ని కందుకూరి వీరేశలింగం, చిలకమర్తి లక్ష్మీనరసింహారావు, కట్టమంచి రామలింగారెడ్డి, రాళ్ళపల్లి అనంతకృష్ణ

శర్మ గార్ల వంటివారు చేశారు. అతి విస్తృతమైన ఆధునిక ప్రయోజనాలకు పై పెద్దల ప్రయత్నం కూడా సరిపోలేదు.

ఈనాటి సామాజిక అవసరాలకు సరిపోవాలంటే ఈనాటి రచనా భాష ప్రాచీన సాహిత్యభాష నుంచి కాక నేటికాలపు మాట్లాడే భాషనుంచి తయారు కావాలని మరికొందరు పెద్దలు భావించారు. అందులో ప్రధానమైన వారు గురజాడ అప్పారావుగారు, గిడుగు రామమూర్తి గారు.

పత్రికా రచన, వార్తా రచన, వార్తాప్రసారం, కథ, నవల, నాటకం, వ్యాసం వంటి ఆధునిక సాహిత్యరూపాలు అధిక ప్రచారానికి వచ్చిన తరువాత ఆధునిక రచనాభాష ఇప్పటి మాట్లాడే భాషనుంచే తయారు అవుతుందన్న పెద్దల వాదం రుజువయింది. ఈనాటి ఆ రచనాభాష ఈనాటి మాట్లాడేభాష నుంచే తయారయింది. దాదాపు ఇప్పటి రచనా వ్యాసంగమంతా ఈనాటి భాషలోనే సాగుతున్నది.

ఈ రచనా భాష ఒకే మూసలోనుంచి తయారయిన భాష కాదు. వివిధ ప్రాంతాలవారు, అనేక ఆర్థిక సాంస్కృతిక అంతరువులవారు పాల్గొని తయారు చేసిన భాష ఈనాటి రచనా భాష. అందుకని అందులో సహజంగా వైవిధ్యం ఉంటుంది. అందరూ ఒప్పుకున్నది కాబట్టి ఏకత్వమూ ఉంటుంది.

ఇంతవరకూ తెలుగు పాఠ్యప్రణాళికల్లో భాషా బోధన అంటే సాహిత్య బోధనే అనే అపోహ ఉండేది. భాషా బోధన ప్రణాళికలో అంశాలు చూస్తే ఒక్కోసారి విద్యార్థులందరినీ సాహిత్యస్రష్టలుగా తయారు చెయ్యటానికి ఉద్దేశించినట్లు కన్పిస్తుంది. ప్రాచీనకావ్యభాషా రచనలో, లేదా ఆ రకపు భాషను అనుకరించిన ఆధునికుల రచనలో పాఠ్యపుస్తకాలుగా ఉండేవి. ప్రాచీన రచనాభాషను అర్థం చేసుకోటానికి ఉద్దేశించిన సూత్రగ్రంథాలు తప్పనిసరిగా చదవాల్సి వచ్చేవి. ప్రాచీన సాహిత్య రచనకు అవసరమైన సంధులు, సమాసాలు, ఛందస్సూ, అలంకారాలు,

ఇతర సాహిత్యాంశాలు పాఠ్యప్రణాళికలో ప్రధాన భాగాలుగా ఉండేవి. ఆ పద్ధతిలో శిక్షణ పొందినవారు మళ్ళీ అవే విషయాలను పరంపరగా బోధించే వారు. ఎక్కడన్నా కొన్ని ఆధునిక ప్రక్రియలను ప్రణాళికలో చేర్చినా చాలా కొద్దిగా ఉండేవి.

తెలుగు చదువుకునే వాళ్ళంతా కవిత్వం రాయరు. అందులో కవిత్వం ఎంతమంది చదువుతారో చెప్పలేము. వాళ్ళల్లో ప్రాచీన కావ్యాలు, ప్రబంధాలు చదువుకునేవాళ్ళు చాలా కొద్దిమందే ఉంటారు. కాని అందరూ ఎప్పుడో ఒకప్పుడు తెలుగు వచనం రాయాల్సిన అవసరం ఉన్నవాళ్ళే. కొంతమంది ప్రభుత్వోద్యోగాల్లో ఇమిడిపోవచ్చు. మరికొంతమంది వ్యాపార సంస్థల్లో ఉద్యోగాలు చెయ్యవచ్చు. ఇంకా కొంతమంది వివిధపత్రికల్లో జర్నలిస్టులుగా చేరవచ్చు. అనేకమంది అనువాదకులుగా స్థిరపడాల్సి రావచ్చు. వీళ్ళందరికీ భాషారచనలో, భాషను ఉపయోగించుకోవటంలో తరిఫీను అవసరమవుతుంది. వీళ్ళల్లో అత్యధిక భాగం వచనం రాయాల్సి ఉంటుంది. వీళ్ళకి రానే ఆలవాట్లు తెలియాలి. లిపి సంప్రదాయాలు తెలియాలి. పదాల అర్థాలు, అర్థాల్లోవచ్చే మార్పులు తెలియాలి. మాటలు కలిసే విధం తెలియాలి. ప్రాచీన భాషాగారంనుంచి తీసుకున్న మాటలకు అర్థాలు తెలియాలి. పదాలు ఏర్పడే పద్ధతులు తెలియాలి. వాక్యాలు తెలియాలి. వాక్యభేదాలు తెలియాలి, వాక్య ప్రయోగ పరిమితులు తెలియాలి. శైలీభేదాలు తెలియాలి. వ్యాసరచన తెలియాలి. వ్యాస భేదాలు తెలియాలి, లేఖా రచన సూత్రాలు తెలియాలి. ఇంతకు ముందు పాఠ్యప్రణాళికలో లేని ఎన్నో అంశాలు తెలుసుకోవలసిన అవసరం ఈనాటి భాషా విద్యార్థులకుంది. ఈ అవసరాలను గుర్తింపజేయడమే ఈ పాఠ్య ప్రణాళిక లక్ష్యం. అందుకు శిక్షణ ఇవ్వడమే ఈ పాఠాల ప్రయోజనం. తెలుగు వచన రచనా రీతులను పరిచయం చేసి, వాటిలో గ్రహించాల్సిన అంశాలను సూచించడం ఈ పాఠాల లక్ష్యాలలో ఒకటి.

కళాత్మకమైన భాషాప్రయోగం సాహిత్యం. కళాత్మకతా భేదాల్ని బట్టి, రకరకాల సాహిత్య ప్రక్రియా భేదాలుంటాయి. మనిషికి కళాదృష్టి అతి సహజమైనది. ఆ కళాదృష్టిని పూర్తిగా వదిలివేయడం అభిలషణీయం కాదు. అందుకే ఈ ప్రణాళికలో-ఈ కాలంలో అధిక ప్రచారంలో ఉన్న సాహిత్య రూపాలను పరిచయం చేసే ప్రయత్నంకూడా జరిగింది. అయితే ఈ పరిచయం అతి స్థూలమైనది మాత్రమే. అభిలాష ఉన్నవారు తమ ఆసక్తిని పెంచుకోటానికి ఈ పరిచయం కొంత ఉపస్కారకంగా ఉంటుంది. అయితే పరిధి పరిమితులవల్ల ఈ పాఠాల్లో ఎంతో జనాదరణం పొందిన నవలను పరిచయం చేయటం వీలుపడలేదు.

ఔచిత్యాన్ని మరచిపోకుండా ఏ సందర్భంలో అయినా భాషను కళాత్మకంగా ప్రయోగించవచ్చు. పద ప్రయోగంలో, సమాసఘటనలో, వాక్యవిన్యాసంలో, విషయ సంయోజనంలో-ఇంకా ఎన్నో అంశాల్లో భాషను కళాత్మకంగా ప్రయోగించవచ్చు. అట్లాంటి రీతులను రకరకాల రచనల నుంచి తీసి ఈ పాఠాల్లో చూపించాం. వాటిని గ్రహిస్తే విషయ బోధన ప్రధానమైన వచనంలో కూడా కళాదృష్టిని ఎట్లా ఇమడ్చవచ్చునో కొంతలో కొంతయినా తెలుస్తుంది. సాధారణ భాషాప్రయోగంలో కూడా విషయ గ్రహణకు అడ్డురాకుండా ఉండేంతవరకూ కళాత్మకతను ఎట్లా జోడించవచ్చునో తెలియజేయడానికి ఈ పాఠాల్లో ప్రయత్నం జరిగింది.

ఈ భాగాల్లో పాటించిన పద్ధతి ఇది : భాషను గురించి తెలుసుకోవలసిన అంశాలు ప్రధాన పాఠ్యాంశాలుగా ఉంటాయి. భాగం వెంటనే చదివే అభ్యాసం కోసం ప్రసిద్ధంగా ఉన్న ఒక రచయిత వచన రచన ఉంటుంది.

రచయితల బృందం తయారుచేసిన ప్రధాన పాఠంలో ఇచ్చిన అంశాలను శ్రద్ధగా గ్రహించాలి. అనుబంధంగా ఇచ్చిన వచన రచనలో శైలిని గుర్తించాలి. రాసే అభ్యాసంలో ఈ రెంటినుంచీ చెయ్యాల్సిన

పనులుంటాయి. భాషను గురించి తెలుసుకోవటం, భాషారచనా పద్ధతిలో భిన్నాంశాలను గ్రహించడం ఈ ప్రణాళికలో గ్రహించాల్సిన అంశాలు. వచన రచనలకు నమూనాలుగా ఇచ్చిన ఖండికల్లో విషయానికన్నా నమూనా ధోరణికి ప్రాధాన్యం ఎక్కువ. అందుకే ఆ నమూనాలు.

ఈనాటి తెలుగు రచనలో కనిపించే నమూనాలన్నిటినీ ఈ భాగాల్లో పరిచయం చెయ్యలేకపోయాం. ముఖ్యమనుకున్న వాటిని మాత్రమే చూపించగలిగాం. భాషను రకరకాలుగా ప్రయోగించాల్సిన అవసరమున్న వాళ్ళు తమ అనుభవంలోనుంచి చాలా గ్రహించాల్సిఉంది. ఏ పాఠ్యప్రణాళికయినా మార్గం మాత్రమే సూచించగలదు. పరిసరాల నుపయోగించుకొని, స్వయం ప్రతిభవల్ల రచనలో తన మార్గాన్ని ఎన్నుకోవడమే విద్యార్థి చెయ్యగలిగింది. అందుకవసరమైన వాతావరణంలో ఒక ముఖ్య భాగాన్ని సరఫరా చెయ్యడమే ఈ పాఠాలు సాధించగలిగిన ప్రయోజనం.

ఈనాటి చదువులూ, శిక్షణా తెలిసో తెలియకో చాలాభాగం పరీక్షల దృష్టితో జరుగుతున్నాయి. విద్యార్థుల దృష్టి చదివే విషయంమీద కాక పరీక్షాపత్రాల మీద ఉంటుంది. పరీక్షాపత్రాల్లో ఏ ప్రశ్నలు ఇస్తారు? సమాధానాలు ఎట్లా రాయాలి? మార్కులెట్లా తెచ్చుకోవాలి? అనే దృష్టే ఎంత సేపూ. స్థిరీకృత పరీక్షా విధానం ఉన్నంతకాలం ఈ దృష్టిపోదు. ఈ దృష్టిని పూర్తిగా మార్చటం ఇప్పుడప్పుడే సాధ్యం కాకపోవచ్చు. ఇందుకు ప్రయత్నం మాత్రం ఎప్పుడో ఒకప్పుడు ఒకచోట ప్రారంభం కావాలి. ఈ భాగాల చివర ఇచ్చిన అభ్యాసాలు పరీక్షాదృష్టితో తయారుచేసినవి కావని విద్యార్థులూ, బోధకులూ గుర్తించాలి. ఈ అభ్యాసాలు మాత్రమే సరిపోకపోవచ్చు. అవసరమైన అధిక అభ్యాసాలను బోధకులు సమకూర్చుకోవచ్చు. అభ్యాసాలు విషయగ్రహణకు దోహదం చేసేట్టుగా ఉండాలనే

మా లక్ష్యం. బోధకులు అధికంగా సమకూర్చే అధ్యాపాలు కూడా అట్లాగే ఉండాలని మా కోరిక.

ఒక కొత్త దృష్టితో కొత్త లక్ష్యంతో ఈ పాఠ్యప్రణాళిక తయా రయినట్టు గ్రహించడం కష్టం ఏమీ కాదు. ఈ ప్రణాళికకు మాకు నమూనాలు లేవు. అందువల్ల ఈ పాఠ్యాంశాలలో సాధించవలసినదంతా సాధ్యమయిందని మేం అనుకోవడంలేదు. సాధించదల్చుకున్నదంతా సాధించామనికూడా అనుకోవడంలేదు. ఉత్తమ లక్ష్యం కోసం మంచిదారి తొక్కాలని మొదటి అడుగు మాత్రమే వేశాం. ఇంకా ఎన్నో అడుగులు వేస్తేగాని దారి తయారుకాదు. అందరం కలిసి చెయ్యాల్సిన పని ఇది. అందుకే ఈ ఆహ్వానం.

డా॥ బి. ఆర్. అంబేద్కర్ సార్వత్రిక విశ్వవిద్యాలయం హైదరాబాద్.

బి. ఏ. తెలుగు మౌలికాంశాల కోర్సు

సంపాదకీయం - 1984.



# ప్రాచీన కవిత్వం

తెలుగులో లిఖిత సాహిత్యం క్రీ. శ. 9వ శతాబ్దంనుంచి శాసనాల్లో దొరుకుతున్నది. గుణగ విజయాదిత్యుని సేనానాయకుడైన పండరంగడు ధర్మపురంలో కొంతభూమిని ఆదిత్య భట్టారకుడు అనే ఆయనకు దానమిస్తూ వేయించిన అద్దంకి శిలా శాసనం (క్రీ. శ. 849-50)లో తరువోజ పద్యం దొరుకుతున్నది. (ద్విపదను రెట్టిస్తే తరువోజ అవుతుంది). ఈ శాసనంలో పద్యం, వచనం కలిసి ఉంది. సుమారు అదే కాలంనాటి కందుకూరు శాసనంలో- పూర్తిగా దొరకక్కపోయినా-సీసపద్యం ఉన్నట్టు తెలుస్తున్నది. యుద్ధ మల్లుని బెజవాడ శాసనం (క్రీ. శ. 950)లో 'మధ్యాక్కర' పద్యం ఉంది. రెండు ఇంద్రగణాలు, ఒక సూర్యగణం, మళ్ళీ రెండు ఇంద్రగణాలు ఒక సూర్యగణం ఉన్న నాలుగుపాదాల పద్యం మధ్యాక్కర. 5 వ గణం మొదటి అక్షరం యతిస్థానం. ఆతరువాత మనకు దొరుకుతున్నది నన్నయ భారత రచన. (11 వ శతాబ్దం)

నన్నయకు పూర్వరచనలుగా కనిపిస్తున్న శాసనపద్యాల్లో తరువోజ, మధాక్కర, సీసంవంటి తెలుగు పద్యాలే ఉండటం విశేషం. నన్నయ భారతంలో కనిపించే వృత్తాల సంప్రదాయానికి నన్నయకు పూర్వపు ఆధారాలు దొరకలేదు.

నన్నయ భారతంలో కనిపించే గద్య పద్యాత్మక చంపూరచనా పద్ధతి సంస్కృత సమాసభూయిష్ఠ భాషాశైలి, మధ్యాక్కరలో యతివేసిన పద్ధతి, సీస పద్యంలో వాడిన ప్రాసవిశేషాలు- ఇవి శాసనాల్లోనూ కనిపిస్తుండటం వల్ల నన్నయ అవలంబించిన లిఖిత సాహిత్య పద్ధతి అప్పటికి చాలా కాలం నుంచే నలుగుడు పడి ఉంటుందని భాషా సాహిత్య పరిణామ దృష్ట్యా భావించవచ్చు. దొరక్కపోయినా వృత్త రచనకూడా పూర్వంనుంచే ఉండి

ఉండవచ్చు. నన్నయ వ్రాసిన వృత్తాలన్నీ సంస్కృతంలో ప్రసిద్ధాలు కావు. పాదాంతాన విరామం లేకపోవటం యతిస్థానంలో అక్షరమైత్రి, ప్రాసమైత్రి సంస్కృత వృత్తాల సంప్రదాయం కాదు. తెలుగు పద్ధతే. అయితే ఈ పద్ధతి ఎంత కాలంనుంచి ఏర్పడి ఉన్నదీ చెప్పటం కష్టం.

నన్నయ ఆంధ్ర భారత రచనలో వాడిన భాషకూ ఆ కాలపు వచన శాసనాల భాషకూ భేదం ఉంది. వచనశాసనాల్లో భాష ఆనాటి వాడుకభాషకు దగ్గరగా ఉంటుందనుకోవటంలో తప్పులేదు. అందువల్ల నన్నయ తనకన్నా ముందే ఏర్పడిన ఒక సాహిత్య సంప్రదాయాన్ని అనుసరించే కావ్యరచన చేశాడని చెప్పవచ్చు. అయితే ఆ సంప్రదాయంలో ఒక్క పుస్తకమూ దొరక్కపోవటం చరిత్ర మనకు వదలిన ఒక జటిల సమస్య. దొరుకుతున్న లిఖిత గ్రంథాల్లో ఆంధ్ర భారతానువాదం మొదటి పుస్తకం. దానికర్త నన్నయ, ఆదికవి.

భారతం మొత్తం 18 పర్వాలు. అందులో నన్నయగారు రెండున్నర పర్వాలు అంధ్రీకరించారు. తిక్కన (13 వ శతాబ్దం) 15 పర్వాలు రచించారు. ఎర్రన (14 వ శతాబ్దం) అనువాదం కాకుండా మిగిలిపోయిన భాగాన్ని పూరించారు.

సంస్కృతంలో భారత భాగవతాలు పురాణాలు. పురాణాల్లో ఒక ప్రధానోద్దేశమూ, ఒక ప్రధాన కథా ఉంటాయి. వాటిలో మధ్య మధ్య చెప్పదల్చుకున్న ఒక నీతికిగాని, ఒక సూక్తికిగాని సరిపోయే అవాంతర కథలు ఉంటాయి. ఇవన్నీ మొదట ప్రజలలో మౌఖికంగా ప్రచారంలో ఉండవచ్చు. తరవాత లిఖిత సాహిత్యానికి ఎక్కినాయి. పురాణాల్లో సజీవ పాత్రచిత్రణ ఉంటుంది. కథా గమనం ఉంటుంది. అతిమానుషమైన సంఘటనలు వదిలేస్తే పురాణపాత్రల సంభాషణ, ప్రవర్తన మానవ జీవితానికి, మనస్తత్వానికి సన్నిహితంగా ఉంటుంది. పండితులు వీటిని చదువుకునేవారు

వ్యాఖ్యాతలు సభాముఖాన వీటిని చదువుతూ తమ వ్యాఖ్య జోడించి సామాన్య జనానికి అందించారు. పురాణసాహిత్యంలో కథా కథనానికి ప్రాధాన్యం ఎక్కువ. రాసేది కవిత్వం కనుక వర్ణనలూ, అలంకారాలూ, కల్పనలూ ఉంటాయి. అయితే కథకు అడ్డుతగిలేంతగా ఉండవు.

సుమారు 15వ శతాబ్దందాకా ఈ పద్ధతి సాగింది. 16వ శతాబ్దం నుంచి వర్ణనా ప్రధానమైన ప్రబంధ సాహిత్యం వచ్చింది. ప్రబంధంలో పాత్రలు కథకోసం కాదు. కేవలం ప్రబంధనిర్మాణం కోసమే. ఎక్కడో ఏదో పురాణంలో ఉందని చెప్పి, దానికి చిలవలు పలవలు కవి తన కవసరమైనట్టు చేర్చుకుంటాడు. కవి తన ప్రాగల్భ్యాన్ని, పాండిత్యాన్ని వర్ణనలలోనూ, పద్యనిర్మాణంలోనూ చూపిస్తాడు. శ్రీనాథుడు రచించింది పురాణాలే ఐనా వర్ణన మీదమోజు చూపించిన కవి. ప్రబంధధోరణి సాహిత్యంలో ఒక్కసారిగా వచ్చిందికాదని చెప్పటానికి ఈయన రచనలు ఆధారాలు. ఆధునిక కవితాయుగం ప్రారంభమయిందాకా ఈ ప్రబంధ ధోరణే సాగింది.

అయితే ప్రాచీన సాహిత్యమంతా ఇదే కాదు. ప్రక్రియాభేదం ఇంత స్పష్టంగానూ ఉండదు.

"మనుచరిత్ర" వరూధిని ప్రవరాఖ్యుల ఘట్టంలో కథకు ప్రాధాన్యం ఉంది. "ప్రభావతీ ప్రద్యుమ్నం" వంటి సామాన్య ప్రబంధం రచించిన పింగళి సూరన "కళాపూర్ణోదయం" వంటి జిగిబిగి అల్లిక గలిగిన కావ్యాన్ని రచించాడు. పారిజాతాపహరణంలో మానవ సహజమైన సంభాషణా ధోరణి, సంఘటనల ప్రాధాన్యం ఉంది.

ఇవికాక ప్రాచీన సాహిత్యంలో శతకాలు చాలాకాలం నుంచి ఉన్నాయి. అచ్చ తెలుగు కావ్య రచన యయాతి చరిత్రతో ఆరంభమై మొన్న మొన్నటివరకూ సాగింది. జన సామాన్యానికి ప్రత్యక్ష గానం ద్వారా అందిన బసవపురాణం ఉంది. లిఖిత సాహిత్య సంప్రదాయంలో

ఉన్న యతి, గణాల్ని పాటిస్తూ ప్రధానంగా మౌఖికంగానే ప్రసారమైన వేమన పద్యాలున్నాయి. భక్తి ప్రధానమైన సంకీర్తనలూ, పదాలూ ఉన్నాయి. మౌఖిక లిఖిత సాహిత్య లక్షణాలు వీటిల్లో కలగలిసిపోయినాయి.

ప్రాచీన సాహిత్యంలో ఇంత వైవిధ్యం ఉంది. తెలుగు భాషా సాహిత్యాలను అభిమాన విషయాలుగా ఎంచుకున్నవారు ఈ సాహిత్య భేదాలన్నిటితోనూ పరిచయం ఏర్పరచుకోవాలి. అయితే పాఠ్యప్రణాళికల పరిమితులతో ఏర్పడ్డ ఏ కోర్సు అయినా సాహిత్యంలో నేర్పవలసిందంతా నేర్పలేదు. పరిచయం చేయటం మాత్రమే కోర్సు చెయ్యగలిగింది. ఈ పరిచయం ద్వారా అభిరుచి ఏర్పడితే ప్రాచీన సాహిత్యంలో అత్యధిక భాగం మీకు మీరే చదివి ఆనందిస్తారు.

సాహిత్యాభిరుచి పాఠ్య ప్రణాళికలో ఉన్న గ్రంథ భాగాలకు, గ్రంథాలకు పరిమితం కాకూడదు. సాధ్యమైనంతవరకూ ప్రక్రియా వైవిధ్యాన్నీ రచనా భేదాలనూ పరిచయం చెయ్యాలని మేం ప్రయత్నించినా, అవసరమైన వన్నీ ఇక్కడ పరిచయం చెయ్యటం కుదరలేదు. ఈ పుస్తకంలో ఇచ్చిన పాఠ్యాంశాలున్న అసలు పుస్తకాలు సంపాయించి చదవటం ప్రాచీన సాహిత్య ప్రవేశానికి మొదటిమెట్టు. ఒకటి అరా దొరక్కపోయినా చాలా వరకు పుస్తకాల షాపుల్లోనూ, లైబ్రరీలలోనూ, సాహిత్యాభిలాష ఉన్న మిత్రుల దగ్గరా దొరుకుతాయి. ఈ కోర్సు అయిపోయేలోపున ఆ గ్రంథాలు సంపాయించి చదివే ప్రణాళిక పెట్టుకుంటే తెలుగు కవిత్వంలో మీకు మంచి ప్రవేశం ఏర్పడుతుంది. ఆతరవాత ఇతర గ్రంథాలకు విస్తరించాలి. శ్రీనాథుడి భీమేశ్వర పురాణంతో ఆగకుండా "కాశీఖండం, హర విలాసం" వంటి కావ్యాలు కూడా చదవాలి. మనుచరిత్రతో ఆగిపోకుండా "వసు చరిత్ర, విజయవిలాసం" వంటి కావ్యాలు కూడా చదవాలి. అచ్చతెలుగులో కూడా కూచిమంచి తిమ్మకవి రచించిన రామాయణం, నీలాసుందరీపరిణయం

చదవాలి. అన్నమాచార్యుల సంకీర్తనలతోపాటు క్షేత్రయ్య పదాలు, రామదాసు కీర్తనలు చూడాలి. మంచి మంచి శతకాలు ఎన్నో ఉన్నాయి. "ఆంధ్రనాయక శతకం, దాశరథి శతకం" చదవకుండా ఊరుకోవటం తెలుగు సాహిత్య విద్యార్థికి సాధ్యంకాని పని. ఇదంతా మన సాహిత్య సంపద. దాన్ని అనుభవించటం మన హక్కు. ప్రాచీన సాహిత్యంలో భాష ఈనాటిది కాదు. ముఖ్యంగా కవిత్వ భాషకూ, సామాన్య భాషకూ భేదం ఉంటుంది. ప్రాచీన కవిత్వ భాషకూ ఈనాటి భాషకూ వాక్య నిర్మాణంలో భేదాలు చాలాతక్కువ. అందువల్ల ప్రాచీన కవిత్వం చదివేటప్పుడు ప్రధానవాక్యాన్ని, ఉపవాక్యాల్ని ముందు వేర్పరచుకుంటే త్వరగా అర్థం అవుతుంది. సామాన్య వాక్యంలో ఉండే పదక్రమం, కవిత్వంలో వేరుగా ఉంటుంది. అందువల్ల పద్యంలో పద క్రమాన్ని సామాన్య వాక్యంలో లాగా ఏర్పరచుకుంటే వాక్యావగాహన తేలికవుతుంది.

ప్రాచీన సాహిత్యం చప్పున అర్థం కాకపోవటానికి ఇంకో కారణం పదప్రయోగం. తెలుగు సాహిత్యంలో మొదటి నుంచీ సంస్కృత పదాలు విరివిగా ప్రయోగించబడుతూనే ఉన్నాయి. ప్రాచీన కవిత్వంలో వాడిన కొన్ని తెలుగు మాటలు కూడా ఇప్పటి వ్యవహారంనుంచి జారిపోయినాయి. ఆ మాటల అర్థాల్లో వచ్చిన మార్పులూ తక్కువకాదు. ఈ విషయంలో నిఘంటువులు చాలా ఉపయోగిస్తాయి. నిజానికి తెలుగు నిఘంటువులు సాహిత్య భాషకే తయారయినాయి. సి.పి. బ్రౌన్, గెలెటీ వంటి ఒకరిద్దరు మాత్రమే సాహిత్యేతర భాషా పదాలను గ్రహించారు.

ప్రాచీన భాషలో మనను ఇబ్బందిపెట్టే విషయం పద స్వరూపంలో పద నిర్మాణంలో, సమాసంలో, సంధిలో జరిగే వ్యాకరణ కార్యాలు. ప్రాచీన భాషా లక్షణాన్ని వివరిస్తూ పరవస్తు చిన్నయసూరి బాల వ్యాకరణాన్నీ బహుజనపల్లి సీతారామాచార్యులు ప్రౌఢ వ్యాకరణాన్నీ రచించారు. నిజానికి, ఈ వ్యాకరణాలు చేసిన పని వివరించటం కాదు, సూత్రీకరించటం.

వ్యాకరణాన్ని ఒక కళగా ఆరాధించిన ఈ గ్రంథాలు చప్పున అర్థం కావటం కష్టమే. ప్రస్తుతానికి అంతప్ప మనకు వేరే సహాయక గ్రంథాలు లేవు. క్లేశమైనా ఈ వ్యాకరణాలను వ్యాఖ్యాన సహాయంతో అర్థం చేసుకుంటే ప్రాచీన భాషాలక్షణం కొంతైనా తెలుస్తుంది. ఈ రెండు వ్యాకరణాలకూ విడివిడిగా బులుసు వెంకటరమణయ్యగారు, వంతరాం రామకృష్ణ రావుగారు రచించిన వ్యాఖ్యలూ, రెంటినీ కలిపి సూర్యనారాయణ గారు రచించిన వ్యాఖ్యా దొరుకుతున్నాయి. A progressive grammer of Telugu అని A. H Arden రచించిన వ్యాకరణం ఒకటి Christian Litierature Society వారు అచ్చువేశారు. అందులో చివరి అధ్యాయంలో ప్రాచీన భాషా వర్ణన చాలా తేలికైన ఇంగ్లీషులో ఉంది. మన వ్యాకరణాల తెలుగుకన్నా ఆ ఇంగ్లీషు కష్టమైంది కాదు. ముఖ్యంగా ద్రుతకార్యాలు, మగాగమాలు మొదలైన వ్యాకరణ కార్యాలు తెలుసుకొంటే ప్రాచీన భాషలో పదవిభాగం తెలుస్తుంది. పదవిభాగం తెలిసిన తరవాత నిఘంటువు మనకు అక్కరకొస్తుంది.

ఈ పాఠ్య ప్రణాళికలో కవిపరిచయం, గ్రంథపరిచయం, కథా పరిచయం వంటివి అన తరవాతనే పాఠ్యభాగం వస్తుంది. పాఠ్యభాగాన్ని ముందు ఏ సహాయం లేకుండా స్వయంగా చదవటం మంచిది. పాఠ్య భాగమంతా ఒక చోటనే ఉంచి, ఆ తరవాత అర్థాలు పద్యాల వరసనుబట్టి ఉంచాయి. సాహిత్యంలో మీరు ప్రవేశించడానికి ఇవి పనికొస్తాయనే చేర్చాం.

ఆధునిక యుగంలో సాహిత్యాస్వాదన ఉమ్మడిగా జరిగే అవకాశం తక్కువ. (మౌఖిక ప్రసారం ఉన్న సాహిత్యంలో ఆ అవకాశం ఎక్కువ) అందువల్ల గ్రంథపఠనం ఎవరికివారే స్వయంగా చేసుకొంటారు. కోర్సులూ, వ్యాకరణాలూ, నిఘంటువులూ, ఉపాధ్యాయులూ కేవలం సహకారులు మాత్రమే. చదవాల్సింది, ఆనందించాల్సింది మీరే. మీ కృషే ప్రధానం.

చివరగా ఒక మాట. సాహిత్యాన్ని పరీక్షలకోసం చదవం, మన మానసిక వికాసంకోసం, స్పందనకోసం చదువుతాం. డిగ్రీలకోసం పరీక్షలు తప్పనిసరయినా సాహిత్యపఠనాన్ని పరీక్షలకు పరిమితం చేయకండి. సాహిత్యాన్ని– అది ప్రాచీనమైనా, ఆధునికమైనా, కథ అయినా, పద్యం అయినా, ఏ సాహిత్య ప్రక్రియ అయినా, సాహిత్యంగా చదవండి. మీ సొంత అనుభవాన్ని పెంచుకోండి. మీ సొంత అభిప్రాయాల్ని ఏర్పరచుకోండి. సాహిత్యాన్ని గురించి మీరు వినేవీ, చదివేవీ కేవలం సహకారులన్న మాట మరవకండి.

అం॥ ప్ర॥ సార్వత్రిక విశ్వవిద్యాలయం, హైదరాబాద్, "తెలుగుకావ్యకళా పరిచయం విభాగం : 2 ప్రాచీన కవిత్వం" పరిచయం 1984–85



# ఆలోచనలు రేకెత్తించే ఆలోచనలు

సాహిత్యానికీ సమాజానికీ ఉన్న సంబంధ బాంధవ్యాలను నిరూపించ ౦ం ఆధునిక సాహిత్య విమర్శకు ఒక ప్రధాన లక్షణం, లక్ష్యం. దాన్ని ఒక సిద్ధాంత పరిధిలోకి తెచ్చి, ఒక గట్టి పునాదిమీద నిలబెట్టింది మార్క్సి ౩ం. ఈ సిద్ధాంత సహాయంతో చేసే విమర్శను మార్క్సిస్టు సాహిత్య విమర్శ అంటారు.

తెలుగులో ఈ రకపు విమర్శను మద్దుకూరి చంద్రశేఖరరావు గారి వంటివారు ఆధునిక సాహిత్యాన్ని పరామర్శిస్తూ తొలి రోజుల్లో చేశారు. ఇది 1940 వ దశాబ్దిలో జరిగింది. ఆ తరువాత 1950 వ దశాబ్దంలో కె. వి. ఆర్. గారు ఆధునిక కవిత్వంలో భావ, అభ్యుదయ కవిత్వాలనూ, విడివిడిగా కవులనూ, కావ్యాలనూ విమర్శించారు. 1960 వ దశాబ్దంలో రా. రా. విపులమైన గ్రంథ సమీక్షల ద్వారా ఆ పని చేశారు.

1970 లో విప్లవ రచయితల సంఘం ఏర్పడటం ఆధునిక సాహిత్య చరిత్రలో ఒక ముఖ్యఘట్టం. ఈ దశాబ్దంలో సాహిత్య విమర్శ సూత్రాలను పునర్మననం చేసుకునే ప్రయత్నం జరిగింది. (పునర్నిర్మించుకునే ప్రయత్నం అన్నా నా కభ్యంతరం లేదు.) ఈ ప్రయత్నం తొలిరోజుల్లో త్రిపురనేని మధుసూదనరావుగారూ సాగించారు. (ఇది ఇంకా సాగుతూనే ఉంది.)

తెలుగు సాహిత్యానికి సంబంధించినంతవరకు మార్క్సిస్టు విమర్శలో ఇవి మైలు రాళ్లు. పైన చేసిన కాల విభజన ఆతిస్థూలమైనది. అట్లా పేర్కొన్న వ్యక్తులు ఆ పద్ధతులకు బలమైన ప్రతినిధులు మాత్రమే. వాళ్లే సర్వస్వమని నా అభిప్రాయం కాదు.

ఇందరు ఇంతగా కృషిచేసినా మార్క్సిస్టు సాహిత్య విమర్శ (తెలుగులో) శైశవదశను దాటలేదు. ఈ విమర్శకులు ఆధునిక సాహి

త్యాన్నే తమ విమర్శకు ప్రధాన వస్తువుగా ఎన్నుకున్నారు. అందులోను కవిత్వం ఎక్కువ చోటు ఆక్రమించింది. కథ, నవల, నాటకం వంటి వాటి మీద వచ్చిన విమర్శలు చాలా తక్కువ. కాళీపట్నం రామారావుగారి 'యజ్ఞం' మీద, 'మా భూమి' నాటకంమీద, చలం రచనల మీద వచ్చిన స్వల్పమైన విమర్శలు అపవాదంగా నిలుస్తాయి.

మనుషుల సంభాషణలు, ప్రవృత్తులు, స్వభావాలు, జీవన పద్ధతులు వచన సాహిత్యంలోనే ఎక్కువ స్పష్టంగానూ, విస్తారంగానూ కనిపిస్తాయి. అందుకు ప్రక్రియా గతమైన సౌలభ్యం ప్రధాన కారణం. (ఈనాటి) కవిత్వంలో పాత్రలు ఉండక్కర్లేదు. ఉన్నా మనుషులే పాత్రలు కానక్కర్లేదు. ఒక వేళ మనుషులే పాత్రలయినా వాళ్ళు మామూలు భాషతో మాట్లాడుకోరు కవిత్వ భాషలో మాట్లాడుకుంటారు. కవిత్వంలో మనుషులు మామూలు మనుషులు కారు. కవిత్వపు మనుషులు.

సమాజ ప్రతిఫలనానికి అవకాశం ఎక్కువగా ఉన్న సాహిత్యాన్ని విశ్లేషించటంలో మార్క్సిజం ఎక్కువ విజయాన్ని సాధించగలుగుతుంది. ఈ రహస్యాన్ని (నిజానికిదేమంత రహస్యం కూడా కాదు) గుర్తించిన బాలగోపాల్ ఈ విషయంలో గణనీయమైన అభివృద్ధిని సాధించారు.

ఉపరితలానికి పునాదినుండి సాపేక్షమయిన స్వాతంత్ర్యం ఉందన్న మార్క్సిస్టు అవగాహనను విస్తరిస్తూ బాలగోపాల్ "విషయం చిన్నదయే కొద్దీ సాపేక్ష స్వాతంత్ర్యం పెరుగుతుంది. కాబట్టే చాలా మంది మార్క్సిస్టులు పెద్ద విషయాలను గురించి అదీ విశాలమయిన చారిత్రక పరిధిలోనే పరిశీలిస్తారు. నాలుగు లైన్ల కవితను మార్క్సిస్టుదృక్పథంతో పరిశీలించటం కష్టం. 20 వ శతాబ్దపు తెలుగు సాహిత్యాన్ని గురించి విశ్లేషించటం సులభం (పే 40) అని వివరించారు. పరిమాణాత్మకమైన విస్తృతి భేదానికి, గుణాత్మకమైన ప్రక్రియా భేదాన్ని జోడించి చూస్తే మార్క్సిస్టు విమర్శ ఎక్కడ ఎక్కువ ఫలవంతం కాగలదో తెలుసుకోవచ్చు.

సాహిత్యవిమర్శ చర్చలద్వారా అభివృద్ధి చెందుతుంది గాని. ప్రవచనాల ద్వారాగాని, ప్రాచీనుల గ్రంథాలనుంచిచేసే పునర్వచనాల ద్వారా గాని పెరగదు. ఈ విషయాన్ని గుర్తించిన బాలగోపాల్ ప్రవచనాలూ, పునర్వచనాలూ చెయ్యలేదు: చర్చ చేశారు. మరికొంత చర్చజరగటానికి వీలైన ప్రతిపాదనలు చేశారు. తను చెప్పింది గాని, పరాకరు చెప్పింది గాని అతర్కితంగా అంగీకరించటం బాలగోపాల్‌కి సమ్మతం కాదు. విమర్శ రంగంలో ఉన్న బుద్ధిమంతులు చర్చించుకొని నిగ్గు తేల్చుకోవలసిన కొన్ని విషయాలను బాలగోపాల్ ఈ వ్యాసాల్లో ప్రతిపాదించారు.

లంపెన్‌వర్గాల జీవితాన్ని వాస్తవికంగా చిత్రించినా అది వాస్తవిక దృక్పథమవుతుందీ గాని విప్లవ దృక్పథం కాదు (పే. 56)

మన దేశపు బూర్జువా సంస్కృతిలో తొలి నాటి ఉదారవాదంకంటె లంపెన్ లక్షణాలే ఎక్కువ (పే. 13).

లంపెన్ బూర్జువా వర్గాన్ని ఆ వర్గానికి సామాజికంగా సన్నిహిత మైన మధ్య తరగతి కళ్ళతో చూపించడంవల్ల అనివార్యంగా ఏర్పడే శైలి, వ్యంగ్యానికి ప్రాధాన్యత విచ్చేవాళ్ళకు సంతృప్తి కలిగించవచ్చు గాని, మార్క్సిస్టు దృక్పథంనుండి ఒక తీవ్రమయిన పరిమితిగానే పరిగణిలచాలి (పే. 15) దేనిగురించి రాసినా మనకు కుటుంబరావుగొంతే వినిపిస్తుంది గాని మార్క్సిజం గొంతు ప్రత్యక్షంగా వినిపించదు. అంతా చదివిన తరు వాత, ఆ ఆసక్తిగాని మనకు ఉంటే, ఇది మార్క్సిజమేనా అన్న మీ మాంస మనకే మిగులుతుంది. ఒక్కొక్కసారి ఆ ప్రశ్నార్థకం ప్రశ్నా ర్థకంగానే మిగులుతుంది గూడ (పే. 33)

ఎలక్ట్రాన్. ప్రోటాన్ అనే పదాలు వాడకుండా భౌతిక శాస్త్రాన్ని వివరించలేరా అని ఎవ్వరూ అడగరు. కానీ దోపిడీ, బూర్జువా అనే మాటలు వాడకుండా ఈ ప్రపంచాన్ని వివరించలేరా అని మాత్రం ప్రశ్ని స్తారు. ఆ ప్రశ్న న్యాయమైనదనే భ్రమ కలిగించగూడదు (పే. 35)

కళలు నిజజీవితంలోని అడ్డుగోడల్ని తుడిపేసి జీవితంనుండి లభించే వ్యక్తిగత మయిన స్పందనను సార్వజనీనం చేస్తాయనీ. ఒకవర్గం కష్టాల పట్ల తక్కిన వర్గాలకు సానుభూతిని జీవితం కలిగించలేదు గాని కళలు కలిగించగలవనీ వగైరా... ఉపరితలంతో ప్రారంభించి పునాదిని వెతుక్కునే తార్కిక శైలి ఫలితం. కుటుంబరావు కళా సాహిత్య రంగాలను సమాజం కన్నా ఉన్నతంగా భావించాడన్న అనుమానానికి తావు కలుగుతున్నది (పే. 36)

(సాహిత్య విమర్శ చేసేటపుడు పునాదినుంచే ఉపరితలానికి పోవాలా? పై నుంచి కిందకి కూడా పోవచ్చా? **Is it Unidirectional or bidirectional ?)**

ఇన్ని రకాల మౌలిక విషయాలను గురించి చర్చనీయాంశాలను ప్రతి పాదించిన వ్యాసాల విలువను అతిశయించి చెప్పటం కష్టం.

తెలుగు విమర్శకుల్లో సూటిదనం తక్కువ. అతిశయమైన పదాడంబరం, పొడుగాటి డొంక తిరుగుడు వాక్యాల వాడకం. అర్థావగతికి ఆటంకం కలిగించే అలంకారాల ప్రయోగం. విషయాన్ని పక్కదారులు పట్టించే అధిక ప్రసంగాలూ—మన తెలుగు విమర్శకుల శైలిని పట్టి పీడిస్తున్న జబ్బులు. ఇవి సాంప్రదాయిక విమర్శల్లో అధికంగా కనిపించేమాట నిజమేగాని మార్క్సిస్టు పండితులు ఇందులో తక్కువ తిన్నవాళ్ళు కాదు. బాలగోపాల్ శైలిలో ఈ గందరగోళాలు లేవు. చాలా సూటిగా చెపుతారు. సాహిత్య విద్యార్థులకే కాక సీనియర్ రచయితలకు కూడా పాఠ్యగ్రంథం కాదగిన వ్యాసాల సంకలనం ఇది. కావాలంటే మొదటి వ్యాసంలో మొదటి పేరా చదవండి, తను చెయ్యదల్చుకున్న పనిని ఎంత స్పష్టంగా నిర్వచించుకున్నారో!

ఇంకో చిన్న విషయం ప్రస్తావించి ఈ పరిచయం ముగిస్తాను. మార్క్సిస్టు పండితులు వీలుచిక్కినప్పుడల్లా ఎకడమిక్ పాండిత్యాన్ని ఎద్దేవా చేస్తుంటారు. ఫుట్‌నోట్స్, బిబ్లియోగ్రఫీలు తయారు చెయ్యటం ఎకడమిక్ పాండిత్యం అనుకుంటారు. అది పొరపాటు. పరిశోధకుడు తను చేసిన నిర్ణయాలకు ఆధారాలను ఇతర పరిశోధకులకు కూడా తెలియజెయ్యాలని చేసే ప్రయత్నమే ఇది. గాలి పేన కుండా, శుష్కప్రలాపాలు చెయ్యకుండా చేసిన ప్రతిపాదనలను ఉపపత్తులతో సమర్థించుకోటం ఎకడమిక్ పద్ధతి. ఆ దృష్ట్యా బాలగోపాల్‌ని ఎకడమిక్ విమర్శకుడు కాదని ఎవరనగలరు? అయితే ఐడియాలజికల్‌గా ఒక పక్షం వహించక పోవటం కూడా ఎకడమిక్ పద్ధతిగా నిన్న మొన్నటివరకూ అనుకుంటూ వచ్చారు. ఆ రకపు దృష్టికి ఇటీవల ప్రాధాన్యం తగ్గింది. సాంఘిక శాస్త్రాలకే కాక భౌతిక శాస్త్రాలకు కూడా ఐడియాలజీ ఉంటుందని ఇటీవల చాలామంది నాన్ మార్క్సిస్టు రచయితలు కూడా అంగీకరిస్తున్నారు.

"సాహిత్యం నా రంగం కాదు. నన్నెందుకు ఇందులోకి లాగుతారు?" అని తరచు అంటుంటారు బాలగోపాల్. ఈ వ్యాసాల సంపుటం వచ్చాక ఆ మాట అనే హక్కును ఆయన కోల్పోయారు. 1980వ దశాబ్దంలో మార్క్సిస్టు సాహిత్య విమర్శను మరోమైలు ముందుకు తీసుకెళ్ళిన బాలగోపాల్ ఇంకా ఆ మాటంటే ఒప్పుకోడానికి తెలుగు పాఠకులు అమాయకులు కారు. ఈ దశాబ్దంలో ఇప్పటికి సగమే గడిచింది.

కె. బాలగోపాల్
"రూపం - సారం"
వ్యాస సంకలనానికి పీఠిక,
1986 ఏప్రెల్ 5

.... 0 ...

# ఆశాకిరణం

పరిశోధన పిహెచ్.డి. తో ఆగిపోయేది కాదనీ నిజానికి అక్కడ మొదలవుతుందనీ నమ్మే మాబోటివాళ్ల సరసకు గోపి ఈ సంపుటి ద్వారా చేరుతున్నందుకు సంతోషిస్తూ నా ఆహ్వానాన్ని అందిస్తున్నాను.

పరిశోధన ఒక వ్యసనం లాంటిది. మాన్పటానికి వీల్లేని వ్యసనం. డిగ్రీలు, గుర్తింపులు బహుమతులు తమ దారిన తాము వస్తాయి. కానీ పరిశోధకుడు వాటిని దృష్టిలో పెట్టుకొని తన కృషి చెయ్యడు. ఒక కొత్త విషయాన్ని కనుక్కొన్న ఆనందం అతనికి "కిక్కు" ఇస్తుంది. ఆ కిక్కుకు అలవాటు పడ్డవాడు దానికోసం పదేపదే ప్రయత్నిస్తాడు. ఒకమంచి పద్యం, గేయం, కథ, నవల రాసినప్పుడు కలిగే సంతృప్తి లాంటిదే ఒకవిషయాన్ని కనుక్కొన్నప్పుడు కూడా కలుగుతుంది. ఇవన్నీ మానవుల సృజనవ్యాపారాల్లో భాగాలే. ఈ సంతృప్తి మానవులకు మాత్రమే దత్తమైన వరం.

గోపి పండితుడేకాని అతని వచనశైలి (కవితాశైలి కూడా) పండిత శైలికాదు. ఇది అతనిశైలిలో లోపంగా ఎన్నటంలేదు. గుణంగా చూపదల్చుకున్నాను. నా మట్టుకు నేను నిన్న మొన్నటిదాకా- అర్థమయ్యే భాషను గురించి అర్థంకాని తెలుగులో రాస్తుండేవాణ్ణి. ఇప్పుడిప్పుడే అపండితశైలిని అభ్యాసం చేస్తున్నాను. గోపికి ఆ అవస్థలేదు. అతను రచయితగా పుట్టినప్పటినుంచి ప్రజలశైలిని అలవర్చుకున్నాడు. నాబోటివాళ్ళు అసూయపడవలసినంత హాయిగా రాసుకుపోతాడు. ప్రమాణాలను దిగజార్చకుండానే తన పరిశోధనలో తాను గ్రహించిన విషయాలను ఎక్కువమందికి అందించగలగటం చాలా అవసరం. మరీ ముఖ్యంగా మన సమాజంలో మరీ అవసరం. ఆ అవసరాన్ని గుర్తించినందుకు కూడా గోపి అభినందనీయుడు.

ఇది వ్యాసనవకం. అంటే తొమ్మిదివ్యాసాల సంకలనం. మధ్యలో ఇరుక్కున్న బా'బోయ్' భీమన్న అన్నవ్యాసం తప్పిస్తే మిగతావి పరిశోధన

విషయిక వ్యాసాలు. ఈ వ్యాసం ఇతని ఐడియాలజీని తెలుసుకోడానికి మాత్రమే పనికొస్తుంది.

మొదటి వ్యాసంలో పారిస్ ప్రతిలో క్రొత్తగా దొరికిన వేమనపద్యాలను గురించి చర్చించాను. అందులో ఛందస్సు తప్పిన పద్యాలను గురించి చేసిన ప్రస్తావన ఉంది. "ఛందస్సు తప్పినా నడక బాగున్న పద్యాలున్నాయి" అని గుర్తించాను. ఛందస్సుతప్పటం అంటే ఏమిటి? పద్యరచన చేసేటప్పుడు గణభంగం యతిభంగం జరగటం ఒకపద్ధతి. యతిమైత్రిలేని వర్ణాలకు యతిని కూర్చటం, గురులఘువుల వ్యత్యాసం ఇట్లాంటివి. వేమన ఛందస్సులో చేసిన తప్పులివికావు. 'ఒక ఛందస్సులో మరో ఛందస్సు ఇరుక్కుపోయిన పిచ్చిపద్యాలు' (పే.5) అని గోపి గుర్తించిన రకం రెండోపద్ధతి. వీటిని పిచ్చిపద్యాలని కొట్టి పారెయ్యగూడదు. ఈ ఛందోభంగానికి కారణాన్ని నిరూపించడం పరిశోధకుడి బాధ్యత.

వేమన ఎక్కువగా వాడుకున్నది ఆటవెలది. దీనికి సరిపాదాలలో అయిదు సూర్యగణాలుంటాయి. సూర్యగణాలు అనులోమ త్రిశ్రగతిని స్ఫురింపజేసే గణాలు. బేసి పాదాల్లో మూడు సూర్యగణాలు రెండు ఇంద్రగణాలుంటాయి. ఇంద్రగణాల్లో ఐదు మాత్రలవి వాడితే ఖండగతి వస్తుంది. బేసి పాదాల్లో త్రిశ్రఖండగతుల మిశ్రమముందన్న మాట! గుర్తించిన ఛందోభంగాలు ఎక్కువగా బేసి పాదాల్లోనే ఉన్నై. కొన్ని సరిపాదాల్లోనూ ఉన్నాయి. ఈ తప్పులు రెండు రకాలుగా కన్పిస్తున్నాయి. బేసి పాదాల్లో అయితే సగం ఖండగతి సగం త్రిశ్రగతిలోనూ ఉంటాయి. ఈ రెండుపద్ధతులకూ ఈ రెండూ ఉదాహరణలు : 1. మక్కాకు బోనేల మగుడ తారానేల

2. మొలకచింతలలోన మొదటిఇల్లు

ఈ రెండింట్లోనూ జరుగుతున్న పరివర్తనను ఈవిధంగా బొమ్మలో చూపించవచ్చు.

త్రిశ్రగతి-ఖండగతి

బాణం గుర్తు పరివర్తన దిశను సూచిస్తుంది. త్రిశ్రగతి ఉన్నచోటల్లా తప్పనిసరిగా ఖండగతిగా మారుతుందని ఈ సూత్రానికర్థం చెప్పకూడదు. మార్పు అంటూ జరిగితే ఈ దిశగా జరుగుతుందని మాత్రమే దీని అర్థం. భాషా శాస్త్రంలో ఇట్లాంటి వాటిని మార్పు జరిగే ధోరణులు (tendencies) అంటారు. అయితే ఈ ధోరణికి మూలం (source) ఎక్కడుంది? ఆటవెలది ఛందస్సులోనే ఉంది. ఆటవెలదిలో త్రిశ్ర ఖండ గతులు రెండూ ఉన్నాయి. ఖండగతి త్రిశ్రగతిని తనవైపు ఆకర్షించుకోవటంవల్ల ఈ మార్పు జరుగుతున్నది. మూడు సూర్యగణాలున్న ప్రథమ భాగంలోనే జరుగుతున్నది. మూడు సూర్యగణాలు ఉచ్చారణలో ఒక్క మాత్ర పొడిగింపుతో ఖండగతిగా మారే ద్రవస్థితి గణనిర్మాణంలోనేఉంది. ఉదాహరణకు-

'జీవరాశులెల్ల చిత్తర్వు ప్రతిమెలు' అన్నపాదాన్ని "జీవరాశూలెల్ల' అని పొడిగిస్తే ఖండగతి తయారయింది. గణనిర్మాణానికి ఉచ్చారణలో ఉన్న ద్రవస్థితి (flexibility) కి పాదంలో ఉన్న ఖండగతితోడై గతి ఏకీకరణశక్తి (Unifying force)గా పరిణమించి పై సూత్రం వర్తిస్తుంది. అయితే సరిపాదాల్లో తక్కువగా జరగటానికి ఆ పాదాల్లో అన్నీ మూడు మాత్రలుండటం ఒక కారణంగా ఊహించవచ్చు. మొదటి మూడు గణాల్లోనే ఈ మార్పు జరగటానికి ఇంతకుముందు చెప్పిన ద్రవస్థితి ఒక కారణం. ఇట్లాంటిపాదం సీసపద్యపాద ఉత్తరార్ధ భాగంతో పోలిక ఉండటం రెండో కారణం.

వీటన్నిటిని బట్టి వేమన పద్యాలు మౌఖిక సంప్రదాయానికి చెందినవిగా రుజువవుతున్నది.

ఫ్రాన్సులో ఉన్న తెలుగుపుస్తకాల పట్టిక రెండో వ్యాసంవల్ల

తెలుస్తున్నది. కొన్ని పుస్తకాలపేర్లు ఫ్రెంచి భాషలో ఉన్నాయి. ఈ పేర్లు అచ్చులో కొంచెం తికమకలు పెడుతున్నాయి. వాటిలో కొన్నిటిని ఇక్కడ విశదీకరిస్తాను.

16. 608. అదే పుస్తకం.
21. 613. అట్టలేని విడి కాయితాలు
29. 623. కావ్యశకలం
32. 629. తెలుగులో క్రైస్తవ బోధలు
36. 634. నోటి తెలుగు భాషను నేర్చుకోటానికి వ్యాకరణం.
37 635. తెలుగులో నాలుగు ఉత్తరాలు.
38. 636. 'పాత నిబంధన' శకలాలు. తెలుగు అక్షరాల్లో రెండుల్రైన్లు
39. 637. మతగ్రంథం. ముఖపత్రం లేదు.
35. 333. సంఖ్యగల పుస్తకం గురించి చెప్పిన ఫ్రెంచిలో అచ్చు తప్పులు మరీ ఘోరంగా ఉండటంవల్ల దురవగాహంగా ఉంది.

1730లో తెలుగు పుస్తకాలు ఫ్రాన్సుకు పంపిన సిగ్నార్ట్ ఇక్కడి వారికి వచనం రాయటం తెలీదనీ మాట్లాడేభాషలో రాయడమేమిటి? అనే తేలికభావం ఉందనీ రాసిన రాతలవల్ల అప్పటి మన రచనాస్థితీ వచనం గురించి మనవారి దృక్పథమూ తెలుస్తాయి. భాషారచన స్థితి పరిణామాలు తెలుసుకోటానికి ఈ వ్యాఖ్యలు పనికొస్తాయి. ఇప్పటికీ కవిత్వరచనకీ వచనరచనకీ తేడా తెలియని స్థితిలో ఉన్న మనకు ఈవ్యాఖ్యలు కొంతయినా మార్గదర్శక మవుతాయని నా విశ్వాసం.

పరిశోధనలో విషయసేకరణ **(data collection)** విషయవివేచన **(Interpretation of data)** అనే రెండు ప్రధాన దశలున్నాయి. మొదటి పని చాలామంది చేస్తారు. (అది అంత తేలికైన పని అని కాదు. ఒళ్లొంచి పనిచేస్తే సాధ్యమయేది) రెండోపని ఎక్కువ మంది చెయ్యరు. ఎందుకంటే

దానికి ప్రతిభ ఉండాలి, శిక్షణ కావాలి. మన పరిశోధనరంగంలో ప్రధాన దోషం ఇక్కడే ఉంది. విషయమంతా చాలా కష్టపడి సేకరించి వెల్లకిలా పడతారు. గోపికి ఆ నేర్పు పుష్కలంగా ఉంది. వేమన పద్యాలు - బ్రౌన్ అవగాహన అనే వ్యాసం అందుకు అతి చక్కని ఉదాహరణ. బ్రౌన్ వేమన పద్యాలను **neither poetical nor classical** అవి అన్నదాన్ని వ్యాఖ్యానిస్తూ ఈ వాక్యార్థాన్ని భాషాపరంగా వ్యాఖ్యానించాలని గోపి సరిగ్గా గుర్తించాడు. (పే. 74) **Poetical** అనే మాట గ్రాంథికం అనే అర్థంలో వాడిన నిర్దిష్టమైన వేరే ఉదాహరణను వెతికి చూపించాడు. అతి లోతైన పరి శీలన చేసి, బ్రౌన్‌కు వేమన మీద ఉన్నది ప్రధానంగా భాషాదృష్టి అని ఆధారాలతో నిరూపించాడు. అభివృద్ధి చెందిన సమాజం నుంచి వచ్చినవాడ కనుక బ్రౌన్ భాషలో సారళ్యం. సాంఘికమైన ఇతివృత్తంఉన్న సాహిత్యా నికి ఆకృష్టుడయ్యాడు. అయితే వేమనను అభిమానించినందుకు బ్రౌన్‌ను హిందూమతానికి శత్రువుగా భావించారు మన మూఢాచారాలను అభిమా నించే నాటి అగ్రవర్ణాలవారు.

వేమన పద్యాలను ప్రప్రథమంగా వర్గీకరించివాడు బ్రౌనేనని ఈ వ్యాసం వల్ల తెలుస్తుంది.

పద్యాల ఛందస్సు వేరు కావటంవల్ల వేమన పద్యాలను శతకంగా భావించటానికి వీల్లేదని అభిప్రాయపడ్డాడు బ్రౌన్.

ఈ రకంగా వేమనను గురించి బ్రౌన్ అవగాహనను సమగ్రంగా ఆవిష్కరించిన ఈ పరిశోధక వ్యాసం కొత్తగా ఈ రంగంలో కాలుపెట్టే వారికి ఒరవడి కాదగింది.

వేమన పద్యాల్లో నాటి పాలకులమీద విమర్శ ఉంది. దాన్ని ఒక ప్రత్యేకాంశంగా విమర్శిస్తే నాటి రాజకీయవ్యవస్థ తెలుస్తుంది. వేమన

కాలం నాటికి మన గ్రామీణవ్యవస్థలో సంక్షోభం అరంభమయింది. ప్రజలు తిండిలేక బాధపడుతున్నా పాళెగాళ్ళ దోపిడీ అడ్డుకట్టలు లేకుండా సాగింది. సాంఘిక చైతన్యం ఉన్న వేమన దీనికి స్పందించిన తీరువల్ల నాటి రాజకీయ వ్యవస్థ, సాంఘిక సంక్షోభం తెలుస్తుంది. ఇవన్నీ "వేమన పద్యాల్లో నాటి పాలకులు" అనే వ్యాసంలో గోపి పరిశీలించాడు.

పరిశోధకుడు తాను చేస్తున్న విషయంపై అంతకు ముందే ఉన్న సమాచారాన్ని సేకరించాలి. తనకంటే ముందు కృషి చేసిన వారిని స్మరించాలి. అందులో వారి పాలు ఎంతో తను చెప్తున్న కొత్త విషయమేదో స్పష్టంగా వేరుచేసి చెప్పాలి. పాతవారి లేక తోటివారి ప్రతిపాదనలతో విభేదిస్తే అది విద్యాసంబంధమైన వివాదంగా గుర్తించి ఆవేశరహితంగా తమ విభేదాలను సున్నితంగా ప్రకటించాలి. ఈ పనులు చాలామంది చెయ్యటంలేదు. ఇతరుల ప్రతిపాదనలను సొంతంగా తామే ఇప్పుడు కను క్కున్న విషయాలుగా రాసేస్తుంటారు. ఎక్కడన్నా తోటివారు పడ్డ చిన్న పొరపాటు చూచి కోతికి కొబ్బరికాయ దొరికినట్టు చిందులు వేస్తారు. ఇట్లాంటి అపరిణత మనస్కులు సీనియర్ పరిశోధకుల్లోనే కొందరున్నారు. అట్లాంటివారు గోపి రాసిన వేమన-ఆరుద్ర అనే వ్యాసం చదవటం మంచిది.

"వేమనగారి తాత్విక దృక్పథం పట్ల ఆరుద్రగారిలో Loud thinking లాంటి వైఖరి కనిపిస్తుంది." పే. (100)

"ఆరుద్రగారి సూత్రీకరణలు తిరుగులేనివని వారుకూడా భావిస్తున్నారని నేననుకోను." (పే. 101)

ఇట్లాంటి వాక్యాల ద్వారా తోటి పరిశోధకులతో ఎంత నాజూకుగా విభేదించవచ్చునో గోపి నిరూపించాడు.

వేమనను పరిశోధించేవాడు సహజంగా బ్రహ్మంగారి వేపు కూడా

చూపు సారిస్తాడు. వాళ్ల సమకాలికులలో దగ్గరి కాలాలవాళ్లో కావటం ఒక కారణం. వాళ్ల సమాజపు రుగ్మతలకు స్పందించినవాళ్ల కావటం రెండో కారణం.

వేమన, వీరబ్రహ్మం ఇద్దరూ కుల వ్యవస్థను దుయ్యబట్టిన వాళ్లే. బ్రహ్మంగారు అగ్రకులాల అహంకారానికి గురయిన వెనుకబడ్డ తరగతి నుంచి వచ్చినట్లు స్పష్టమైన సమాచారమే ఉంది. ఇన్నింటా భావసామ్యం ఉండబట్టే వేమనపద్యాలు బ్రహ్మంగారి అనుయాయులు పాడుకోటానికి కారణం. అసలా పద్యాలు వేమన మార్గంలో బ్రహ్మంగారి శిష్యులు కూర్చిన వైనా ఆశ్చర్యపడక్కర్లేదు. బ్రేడుమార్కులు, కాపీరైట్లు ఇంకా రావి కాలమది. గోపి 'బ్రహ్మంగారి సంప్రదాయంలో వేమన' అనే వ్యాసంలో ఈ విషయాలను స్పృశించాడు, అంతటితో ఆగలేదు. 'కర్మయోగి వీర బ్రహ్మం' అనే నలభై పేజీల వ్యాసంలో బ్రహ్మంగారి సిద్ధాంతాల్నీ రచన లనూ పరిశీలించాడు.

బ్రహ్మంగారి ఫిలాసఫీ 18 వ శతాబ్దానికే రాయలసీమంతా వ్యాపించిందనడానికి చారిత్రకాధారాలు చూపించాడు. 17 శతాబ్దంలో ఎవరో యుగ పురుషుడు వస్తాడు, అతడు రక్షకుడవుతాడు అనే నమ్మకం ప్రజల్లో వ్యాపించి ఉండడానికి గల సాంఘిక పరిస్థితులను ప్రదర్శించాడు. విశ్వ బ్రాహ్మణ కులాన్ని గురించి చారిత్రకమైనవి, నమ్మకాలమీద ఆధారపడ్డవి వేరుచేసి చూపాడు. ఇది చాలా సున్నితంగా చెయ్యాల్సిన పని. ఇట్లాంటివి సాధించడంలో గోపికి సాటివచ్చేవారు చాలా తక్కువమంది ఉంటారు. ఈ సందర్భంలో వీరబ్రహ్మం కులనిరసనను గురించి గోపి సత్యాన్ని ఎంత ప్రియంగా చెప్పాడో చూడండి:

"వీరబ్రహ్మం కులభేద నిరసన బ్రాహ్మణులకు వ్యతిరేకంగా ఎత్తుగడ కాదు. ఈశ్వరుని దృష్టిలో అందరూ ఒకటేననే వీరబ్రహ్మం వాదం సాంఘిక చైతన్యానికి సంబంధించింది కాదు." (పే. 48)

బ్రహ్మంగారు వెనుకబడ్డ వృత్తికార్మికులను సమీకరించి ఏకీకృతం చేయటానికి పాటుపడ్డ నాయకుడిగా గోపి ఆవిష్కరించాడు.

"కాలజ్ఞానం చెప్పటానికి మహిమలూ దివ్యదృష్టి అక్కర్లేదు. అప్పటి కాలంలో దేశంలో సంచారం చేసిన వారెవరికైనా భవిష్యత్తును కొంత ఊహించటం అసాధ్యంకాదు (పే. 51) అని కాలజ్ఞానాన్ని అధ్యయనం చెయ్యటానికి ఒక మార్గం చూపాడు.

వేమనకు, బ్రహ్మంగారికి ఒక ముఖ్యభేదం ఉంది. వేమనకు స్త్రీల మీద గౌరవంలేదు. బ్రహ్మంగారికి స్త్రీలంటే చిన్న చూపులేదు. ఈ విషయాన్ని చాలా జాగ్రత్తగా గుర్తించాడు గోపి, బ్రహ్మంగారి మీద వచ్చిన పుస్తకాల్లోగాని, ఆయనకు స్త్రీలమీద ఉన్న ఉదార అభిప్రాయాలనుగాని కళ్ళముందు పెట్టిన ప్రథమ ప్రయత్నం బహుశా గోపిదే. అంతేకాకుండా వీరబ్రహ్మం జీవితాన్ని ఆలోచనలనూ చారిత్రక సాంఘిక దృక్కోణాల్లో పరిశీలించిన తొలి వ్యాసంకూడా ఇదే.

ఈ వ్యాసం చివరలో నాటి భాషావ్యవస్థను గురించి, తత్వాల్లో భాషను గురించి గోపి కొన్ని ఆలోచనలు చేశాడు. అయితే భాషా పరిశోధనకవసరమైన సంభారాన్ని గోపి ఇంకా కూర్చుకోలేదు గనుక ఈ ఆలోచనలు ఎంతో దూరం సాగలేదు.

ఈ పుస్తకంలోకల్లా విస్తృతిలోనేగాక విషయగౌరవంలో కూడా గొప్పవ్యాసం ఇది.

గోపికి పరిశోధకుడికి కావలసిన ఉత్సాహమూ ఉంది, నిగ్రహమూ ఉంది. పట్టుదలా ఉంది. పట్టు విడుపులూ ఉన్నాయి. వ్యక్తీకరణలో స్పష్టతా ఉంది, మార్దవమూ ఉంది.

ప్రతిభావంతులైన పరిశోధకుల సంఖ్య క్షీణిస్తున్న ఈ కాలంలో గోపి ఒక ఆశాకిరణం

ఎస్. గోపి "వ్యాస నవమి"కి పీఠిక 1986 నవంబరు.

## ఎవరీ రామమూర్తి? ఎందుకు 'పురోసార'?

### సంస్కర్తలూ - ఆధునిక భావాలు

ఇంచు మించుగా ఈ శతాబ్ది ప్రారంభం నుంచి ఆధునిక భావజాలం భారతీయ మేధావుల్ని ప్రభావితం చెయ్యటం ప్రారంభించింది. మారుతున్న ఆర్థిక రాజకీయ వ్యవస్థల కనుగుణంగా సాంస్కృతిక రంగాల్లో అభివృద్ధి కోసం సంస్కర్తలు కొందరు ఉద్యమాలు నడిపారు. వ్యక్తులుగా కృషి చేశారు. ఆంధ్ర దేశంలో రఘుపతి వెంకటరత్నం నాయుడు గారు, కందుకూరి వీరేశలింగం గారు, గురజాడ అప్పారావు గారు.... ఇంకా ఇంకా అనేకులు ఆయా రంగాలను ఆధునికం చేయటానికి ప్రయత్నించారు. దేశీయులను ఉద్బోధించారు. ప్రజాస్వామ్య భావాలను ప్రచారం చేశారు. భాషారంగంలో ప్రధానంగా ఈ పని చేసినవారు గిడుగు రామమూర్తి గారు.

### భాషలో సంప్రదాయీకరణం

నాగరిక సమాజాల్లో మాట్లాడే భాష, రాసే భాష అని రెండు రకాల వ్యవస్థలుంటాయి. రాసే భాషకు మాట్లాడే భాషే మూలం. అయినా ప్రయోజన భేదాల్ని బట్టి మాట్లాడే భాషకన్నా భిన్నమైన సంప్రదాయాలు రాసే భాషలో ఏర్పడతాయి. ప్రభుత్వ మహజర్లలోనూ, మామూలు ఉత్తరాల్లోనూ, ప్రామిసరీ నోట్లలోనూ, సాహిత్య రచనలోనూ ఇంకా అనేకానేక సందర్భాల్లో వాడే భాషలోనూ వేరు వేరు సంప్రదాయాలు మనం గమనించవచ్చు.

ఇట్లాంటి సంప్రదాయాలు ఏర్పడే పద్ధతిని శైలీకరణం (Stylization) అంటున్నారు. దీన్నే సంప్రదాయీకరణం అనికూడా అనవచ్చు. ఈ సంప్రదాయీకరణం లిపి సౌకర్యం లేని భాషల్లో కూడా కనిపిస్తుంది. ఇద్దరు వ్యక్తులు మాట్లాడే సంభాషణ శైలికీ, మత సంబంధ కార్య కలా

పాల్లో వాడే శైలికీ, కథా కథనం చేసేటప్పుడు వాడే శైలికి భేదాలు కనిపి స్తాయి. ఈ భేదాలు ధ్వనుల్లోనూ, పద స్వరూపంలోనూ, వాక్య రచన లోనూ ఉంటాయి. ఇది సహజమే.

## మాట్లాడే భాషకూ రాసే భాషకూ అంతరం

ఈ భేదాలు సహజమే అయినప్పుడు రాసే భాషకూ మాట్లాడే భాషకూ భేదాలుండటం కూడా సహజమే. అయితే ఈ భేదాలు మరీ ఎక్కువయితే భాషా ప్రయోగ వ్యవస్థలో సంక్షోభం వస్తుంది. చాలా భారతీయ భాషల్లో అదే జరిగింది, తెలుగులోనూ అదే జరిగింది.

ప్రాచీన కాలంలో భాషా రచన అంటే సాహిత్య రచనే. రాజకీయ వ్యవస్థలో భాషా లేఖనం ఉన్నా అది అతి పరిమితమైనది. అప్పటి రాజులకు ప్రజలతో సంబంధం చాలా తక్కువ. రాజ శాసనాలను కూడా చాటింపు వెయ్యటం ద్వారా ప్రజలకు అందించేవారు. శిలా శాసనాలు వేయించేవారు. శాసన భాష వాడుక భాషకు సన్నిహితంగా ఉండేది. ప్రాచీన కాలపు రచనా భాషగా విస్తృతంగా మనకు దొరుకుతున్నది సాహిత్య భాష. తెలుగు లిఖిత రచనా సంప్రదాయంలో సాహిత్యభాష అంటే కావ్యభాష. ఈ కావ్యభాష నన్నయ కంటె ఒకటి రెండు శతాబ్దాల ముందే (సుమారు 9వ శతాబ్దం) సంప్రదాయీకృతమైంది. ఈ కావ్యభాషలో తరవాత్తరవాత కొన్ని మార్పులు వచ్చినా ఇవి సంప్రదాయీకృతమైన భాషా వ్యవస్థను సమూలంగా మార్చేవికావు. సంప్రదాయంలో భాగంగా కలిసిపోయేవి. ఈ కావ్యభాష కాలక్రమంలో సహజంగానే మామూలు భాష నుంచి క్రమ క్రమంగా దూరదూరంగా జరిగిపోయింది. దాదాపు వేరే భాష అన్నంతదూరంగా జరిగిపోయింది. ప్రత్యేక శిక్షణ ఉంటే తప్ప అర్థం కానంత దూరంగా జరిగింది. సమాజంలో చాలా కొద్దిమందికిమాత్రమే అందుబాటులో ఉన్న భాష అయింది. సామాన్య ప్రజల సాహిత్యం

మౌఖిక రూపాల్లో వేరే పాయగా వారి వ్యవహార భాషకు మనుగడ సాగిస్తూనే ఉంది.

## భాషా ప్రయోగ విస్తృతి

ఆర్థిక, రాజకీయ వ్యవస్థల్లో వచ్చిన మార్పుల వల్ల ప్రభుత్వానికి ప్రజలతో సంబంధం ఏర్పడి ప్రజల్లో విద్యావ్యాప్తి ఏర్పడింది. రచనా భాషా ప్రయోగ సందర్భాలు పెరిగాయి. అందుకనుగుణంగా అచ్చు పుస్తకాలు, అచ్చు పత్రికలు వచ్చిన తరువాత ఎక్కువ ప్రతులు తయారయి ఎక్కువ మందికి అందుబాటులోకి వచ్చాయి. విద్యావ్యాప్తి కోసం స్కూళ్ళ సంఖ్య పెరిగింది. వాళ్ళకు కొత్తవిషయాలుఅందించే వాచకాలు తయారయినాయి. ఈ రచనా వ్యాసంగమంతా ఏ భాషలో జరగాలి అనే ప్రశ్న మన మేధావులకు ఎదురొన్నది.

## సులభ గ్రాంథికావతరణం

అప్పటి చదువరుల కందుబాటులో ఉన్న రచనా భాష కావ్య భాష. మొదట్లో ఆ భాషనే వాడుకున్నారు. అయితే ఆ భాషలో స్థిరీకృతమైన సంప్రదాయాలు-నేర్చుకొనే వారికి పెద్ద అడ్డంకులుగా తయారయినాయి. బళ్ళలో వాచకాలు తయారు చేయాల్సిన అవసరం ఉన్న వీరేశలింగం గారు ఈ క్లిష్ట స్థితిని గమనించారు. ప్రాచీన కావ్యభాషకున్న కొన్ని నియమాలను సడలించి సులభ గ్రాంధికం అని ఒకటి తయారుచేసి దానికో వ్యాకరణం రచించారు. ఆ ప్రయత్నంలో భాగంగానే వేదం వేంకటరాయశాస్త్రిగారు విసంధి వివేకం అన్న చిన్నపుస్తకం రచించి తెలుగులో సంధులు పాటించక్కర్లేదనటానికి సంస్కృత వ్యాకరణాల ప్రమాణాలు చూపించారు. వ్యావహారిక భాషాశైలిని గ్రాంథికీకరించటానికి పానుగంటి లక్ష్మీనరసింహారావు గారు సాక్షి వ్యాసాల ద్వారా ప్రయత్నించారు. ప్రాచీన కావ్యభాష

ఆధునిక రచనా వ్యాసంగానికి సరిపడటం లేదన్న సంగతి నాటి విద్యావంతులు గుర్తించినట్టు వీళ్ళ సంస్కరణ ప్రయత్నాలే సాక్ష్యం ఇస్తున్నాయి.

## కొత్త రచనాభాష మాట్లాడే భాషనుంచే రావాలి

శతాబ్దాలుగా స్థిరీకృతమై కేవల సాహిత్య రచనకు మాత్రమే పరిమితమైన భాష ఎన్ని సంస్కరణలు చేసినా ఆధునిక రచనా వ్యాసంగానికి పనికిరాదని గుర్తించిన వారిలో ముఖ్యులు గిడుగు రామమూర్తి గారే. (1863-1940). ఈయన తన కాలంలో పెరుగుతున్న కొత్తశాస్త్రాలు నేర్చుకున్నారు. ముఖ్యంగా నరశాస్త్రం, భాషాశాస్త్రం. మొదట సవర భాషను అధ్యయనం చేసి వాచకాలు ప్రకటించారు. (1911-1913). ఇంకో ఇరవయ్యేళ్ళ తరవాత A Manual of Savara language (1931) అనే వర్ణనాత్మక వ్యాకరణం ప్రకటించారు. భాషాశాస్త్రం మీద విశాఖలో (1910-1912) ఉపన్యాసాలిచ్చారు. తన నాటి మేటి (విదేశ) భాషా వేత్తలతో ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపారు. వాళ్ళలో ఒకడుగా పేరు తెచ్చుకున్నారు. భాషా విజ్ఞాని రామమూర్తిగారు సహజంగానే సులభ గ్రాంథిక వాదాన్ని తిరస్కరించారు. ఈనాటి రచనా భాష, ఈనాటి వ్యవహార భాష నుంచి ఏర్పడాలని ప్రతిపాదించారు. ఎక్కువ మందికి ఉద్దేశించిన ప్రాచీన వచన రచనలో ఉన్న నిజమైన సంప్రదాయం ఇదేనని వాదించారు. వ్యావహారిక భాషా వాదాన్ని స్థాపించారు. తన జీవితంలో ఎక్కువ భాగం అందుకే వెచ్చించారు.

## రామమూర్తి గారి త్యాగం - మన కర్తవ్యం

సవరభాషా మాన్యువల్ వంటి సృజనాత్మక వ్యాకరణాలు రచించాల్సిన అద్భుత మేధాసంపత్తిని రామమూర్తిగారు భాషా వాదోపవాదాలకు త్యాగం చేశారు. ఈనాడు భాషావివాదం లేదు. భాషా శాస్త్రం లాబా

మందికి అందుబాటులోకి వచ్చింది. శాస్త్ర సహాయంతో ఆధునిక భాషాధ్యయనం చేయాల్సిన పనులను రామమూర్తి గారు మనకు వదిలిపెట్టారు. రామమూర్తి గారి ఆదర్శాన్ని ఆచరణను గుర్తుచేసుకొని రామమూర్తి గారు మనకు వదిలిన పనులను నిర్వహించటమే మన కర్తవ్యం. అందుకే ఆ స్ఫూర్తికోసమే 'మరోసారి గిడుగు రామమూర్తి'.

## ఈ పుస్తకం గురించి ఆలోచన : రమేష్‌బాబు

తన సంతకం లేకుండా గురజాడ స్మారక సంచికను తన శ్రమతో వెలువరించిన ఢిల్లీ డాక్టరు కావూరి రమేషుబాబు దీని ప్రారంభకుడు. 1979 మే నెల 20 ప్రాంతంలో హైదరాబాదు వచ్చి ఈ విషయమై నాతో చర్చించాడు. కాంపోజిషన్ కమిటి రిపోర్టు శకలాలకూ, కొన్ని ఉత్తరాలకూ తీయించిన జిరాక్సు కాపీలను నా దగ్గర వదిలి మళ్ళీ ఢిల్లీ తిరిగి వెళ్ళిపోయేటప్పుడు నాతో వివరంగా మాట్లాడతానన్నాడు. కాని ఆ అవకాశం దక్కకుండానే మృత్యువు రమేష్‌బాబును మే 31న కబళించింది. నాతో చెప్పదల్చుకున్నది చెప్పకుండానే ఈ లోకంనుంచి శాశ్వతంగా నిష్క్రమించాల్సి వచ్చినందుకు ఎంతో బాధ పడ్డట్టు ఆ సమయంలో దగ్గరున్న వాళ్ళు చెప్పారు. అంటే రామమూర్తి గారిపై వ్యాస సంకలనం వెలువరించాల్సిన పనిని తన చివరి కోరికగా నాకప్పగించాడన్నమాట! ఈ సంకలన ప్రచురణ, ముద్రణ బాధ్యతలను హైదరాబాద్ బుక్ట్రస్టు సంతోషంతో స్వీకరించింది. నిర్వహణ బాధ్యతను నాకప్పగించింది.

## కార్యనిర్వహణలో సాయపడవారు

కార్య నిర్వహణలో రమేష్‌బాబుతో పోటీ పడగలిగిన శక్తి నాకు లేదు. అయినా పని ప్రారంభించాను. పత్రికా ప్రకటన ఇచ్చాను. రచయితలను అభ్యర్థించాను. అడిగినవడే తడవుగా అందరూ సాయపడ్డారు. అయినా

ఇతర వ్యాసంగాల్లో నిమగ్నుణ్ణి కావటం వల్లా, కొంత అలసత్వం వల్లా ఈ సంకలనం తయారు చెయ్యటం ఆలస్యం అయింది. అడగాగానే రచనలిచ్చి అప్పుకోసం తొందరపెట్టకుండా నా అలసత్వాన్ని క్షమించారు రచయితలు. గిడుగు రామమూర్తిగారి రెండు ఉత్తరాలను అందించారు ఒక అజ్ఞాతవ్యక్తి. (ఆయన పేరు రాసుకున్న కాయితం ఎక్కడో పోయింది.)

ఈ అజ్ఞాత వ్యక్తి
ప్రసిద్ధ కథకులూ, కవులూ అయిన
గిడుగు రాజేశ్వరరావుగారు.

(ఇంకా ఎవరెవరు ఎలా ఎలా సాయపడ్డారో పేరుపేరునా చెప్పడం, ఇది ఇంకా రావాల్సిన ఇల్లాంటి సంకలనాలకు పునఃప్రారంభం మాత్రమే అనడం దీని ముగింపు.)

హైదరాబాద్ బుక్ ట్రస్టు వారి 'మరోసారి గిడుగు రామమూర్తి'
వ్యాస సంకలనానికి సంపాదకీయం-1986 డిసెంబరు 22.



# మనకిప్పుడు కావలసిన విమర్శకుడు

కొత్త తరం సాహిత్య విమర్శకులలో ప్రాచీన సాహిత్యం మీద అపక్తి సన్నగిల్లుతున్నది. యూనివర్సిటీ తెలుగు శాఖల్లో కూడా ఇదే పరిస్థితి కనిపిస్తుంది. అయితే శ్రీకృష్ణదేవరాయల విశ్వవిద్యాలయంలో మాత్రం పరిస్థితి కొంత మెరుగ్గా ఉంది. ప్రాచీనాధునిక సాహిత్యాల మీద సమదృష్టి ఉన్న ఉపాధ్యాయులు కొందరున్నారు. వారిలో ఇంకా ముప్ప య్యోపడివాటని రాచపాళెం చంద్రశేఖరరెడ్డి ముఖ్యుడు. ఈయన పింగళి సూరన్న కావ్యం ప్రభావతీ ప్రద్యుమ్నము మీద డాక్టరేటు చేసి శిల్ప ప్రభావతి అనే పుస్తకం వెలువరించాడు. గురజాడ కథల మీద ఒక పుస్తకం వేశాడు. పాత సాహిత్యపు పట్లు ఎరిగినవాడు. కొత్త సాహిత్యపు పోకడలు గమనిస్తున్నవాడు. అనంతపురంలో ఈయనొక లిటరరీ ఆక్టివిస్టు.

ఇప్పుడీ పుస్తకం "నన్నయ ఒరవడి" అని ప్రకటిస్తున్నాడు. అచ్చుకాకముందే రచయితకు తెలీకుండానే ఈపుస్తకం చదివే అవకాశం కలిగింది. చదివి నాకు నచ్చినవీ, నచ్చనివీ అంశాలు నోట్ చేసి ఆయనకే ఇచ్చాను. నచ్చని అంశాలే ఎక్కువ రాశానేమో! పైగా కాస్త ఘాటుగా రాశానేమో కూడా. అయినా చంద్రశేఖర్ దృఢకాయుడే కాక దృఢమనస్కుడు కూడా. అందువల్ల నా విమర్శలకు తట్టుకోవటమే కాక ఈ పుస్తకానికి మొహమాటంలేని ముందుమాట రాయమన్నాడు. ఆలస్యమయినందుకు నొచ్చుకున్నా ఓర్చుకున్నాడు.

ప్రాచీన సాహిత్యం చదివేవాళ్ళల్లో రెండు పార్టీల వాళ్ళు కనిపిస్తారు. నన్నయ పార్టీ వాళ్ళు కొందరు. తిక్కన పార్టీ వాళ్ళు మరికొందరు. మరీ తమాషా నన్నయలాగే రాస్తూ తిక్కనను అభిమానించేవారు కొందరు. తిక్కన లాగా రాస్తూ నన్నయను అభిమానించేవారు ఇంకొందరు. (భావకవుల్లా రాస్తూ అభ్యుదయ కవులను అభిమానించినట్టు) శ్రీశ్రీగారు

నన్నయలాగా రాస్తారు. ప్రాచీనకాలంలో తిక్కన ఒక్కడే మహాకవి అంటారు. విశ్వనాథ సత్యనారాయణగారు తిక్కన లాగా రాస్తారు. "ఋషి వంటి నన్నయ్య రెండవ వాల్మీకి" అనీ, తెలుగు వారికి పద్య విద్యాభిక్ష పెట్టిన మహాకవి అనీ ప్రశంసిస్తారు.

నన్నయ అక్షర రమ్యత, పద్యధారావేగంవంటి బాహ్యలక్షణాల్ని ఎక్కువ పట్టించుకున్నాడుగాని, నాటకీయత, సంభాషణలో వాక్చాతురి చమత్కారం ఔచిత్యం వంటి అంతర విషయాల మీద తక్కువ శ్రద్ధ చూపించాడనీ, కొన్ని నమ్మకాలు సాహిత్య విద్యార్థులలో ప్రచారంలో ఉన్నాయి. జాగ్రత్తగా పరిశీలిస్తే ఇవి కేవలం అపనమ్మకాలని గ్రహించటం కష్టంకాదు.

తరువాత కవులలో కనిపించే ఎన్నో రచనా విశేషాలు నన్నయలో బీజప్రాయంగా కనిపిస్తున్నాయని 'నన్నయ ఒరవడి'లో చంద్రశేఖర్ నిరూపించాడు. కావ్యరామణీయకత, కవిత్వ కామనీయకత అనే విభాగాలుగా ప్రణాళిక వేసుకొని నన్నయ మార్గదర్శకత్వాన్ని పరిశీలించాడు. కావ్య రచనలో ఆశ్వాస విభజన, ఆశ్వాసాంత విశేష పద్య రచన, కృతి నాయక వర్ణన వంటి నన్నయ ప్రవేశ పెట్టిన సంప్రదాయాలను (Conventions) గురించి మొదటి విభాగంలో వివరించాడు. కథాకథనం, నాటకీయత, పాత్రల వివిధ మనో వృత్తులను నన్నయ చిత్రించిన పద్ధతిని (Treatment) రెండో భాగంలో వివరించాడు. వీటిల్లోనూ, ఇంకా వర్ణనల్లోనూ, పద్యాల ఎత్తుగడల్లోనూ నన్నయ మార్గాన్ని తరవాత కవులు ఎట్లా అనుసరించిందీ చూపించాడు. విశేషమేమిటంటే చంద్రశేఖర్ తన పరిశీలనను కొందరు ప్రసిద్ధ కవులకు మాత్రమే పరిమితం చేయక తరిగొండ వేంగమాంబ, పిన్నకోట పెద్దన, శేషము వెంకటపతి వంటి కవుల కావ్యాలను కూడా పరిశీలించి నన్నయ రచనలో ఉన్న పోలికలను ప్రదర్శించాడు.

ఈ పని చెయ్యటానికి ప్రాచీన సాహిత్యంతో ఎంత గాఢ పరిచయం కావాలో నేను చెప్పక్కర్లేదు. ఈ పుస్తకం కోసమే ఆ కావ్యాలు చదివితే

దొరికే అంశాలు కావవి. విశేషమైన ఆసక్తితో పదే పదే చదివే అలవాటుంటే తప్ప పట్టుబడవు.

ప్రాచీన సాహిత్యం మీద రాసేవాళ్ళు చాలామంది ఎందుకనో గాని పులుముడు ధోరణిలో రాస్తారు. కావాలంటే ప్రాచీన సాహిత్యం మీద ఇటీవలి కాలంలో అచ్చయిన సిద్ధాంత గ్రంథాలను చదివి చూడండి. ప్రాచీన సాహిత్యం మీద అసలే ఆసక్తి తగ్గిపోతున్న ఈరోజుల్లో వీళ్ళ రచనా ధోరణి మరీ బెదరగొడుతుంది. చాలా పుస్తకాల్లో వాగాడంబరం భావాల అయోమయత్వం (Conceptual confusion) ఎక్కువ. చంద్రశేఖర్‌లో అదృష్టవశాత్తూ ఆ ఆడంబరమూ లేదు ఆ అయోమయత్వమూ లేదు. స్పష్టతా, నిరాడంబరతా ఈయన వచన గుణాలు. ఈయన వచనం చదువుతుంటే వెన్నెలలో పడవ ప్రయాణం చేసినంత హాయిగా ఉంటుంది.

చంద్రశేఖరరెడ్డి రచన, ట్రీట్‌మెంటు నాకింతగా నచ్చినై కాబట్టే ఈ పుస్తకంలో నేనంగీకరించని విషయాలుకూడా చెప్ప దల్చుకున్నాను.

ఇటీవలి కాలంలో సత్యనారాయణగారి శిష్యుల ద్వారా అభిమానుల ద్వారా ప్రచారమవుతున్న శబ్దశిల్పాలు, అక్షర శిల్పాల మోజులో ఈ పెద్ద మనిషి కూడా పడ్డాడు. చూడండి.

౧ శిల్ప వాదస్తం :-

1. "ఈక్షణ శబ్దం దర్శనంలో తీవ్రతను వ్యంజించే మాట" (పే. 14)
2. "నగి అనే శబ్దాన్ని ఉచ్చరించటంలోనే తేలిక భావం (పే. 14)
3. "అ తునక వాక్యాలు వక్తృ త్యాగాన్ని ధ్వనిస్తాయి. (పే. 46)
4. ఎఱుకకు సంబంధించిన సంభాషణలో ఆత్మగత తర్కంలో శకటరేఫ ప్రాచుర్యంలో నన్నయ శకుంతల హృదయంలో జరుగుతున్న మథనాన్ని ధ్వనిస్తున్నాడు. (పే. 47)

5. (కణ్వాశ్రమ వర్ణన) "ఈ చిత్రణలోని దుష్యంతుని నడకలోని క్రమాన్ని వ్యంజిస్తుంది."

6. ("దాని శరీర సౌరభము దాని విలోకనంబులన్ దాని విలాసమున్" అనే పద్యంలో శిల్పం గురించి) 'చూడబడిన వ్యక్తి అవయవాల విశేషాలను విడివిడిగా పేర్కొనడం, ప్రతి విశేషానికి ముందు 'ఆ' అనే నిర్దేశకవాచకాన్ని ఉంచటం, చివర మదన పరవశుడైనట్టు చెప్పటం ఈ పద్యంలో శిల్పం. ఈ శిల్పం వల్ల శరీర సౌందర్యంలోని విలక్షణత్వం ధ్వనితమౌతుంది. ఆ మాటి మాటికి రావటంవల్ల సౌందర్యంలోని ఆశ్చర్యకర లక్షణం ద్యోతకమౌతుంది. శంతనుడు మదన పరవశుడు కావడంలో వేగం స్ఫురిస్తాయి." (పే. 68)

7. ప్రమద్వర పాము కాటుకు కిందపడిపోయినప్పుడు స్నేహితురాండ్ర ఆందోళనను- కన్నియలందఱు వెఱచి, పఱచి, యఱచుచుండ అని శకటరేఫ ఆవృత్తితో వ్యంజించినాడు.

ఈ రకమైన ప్రతిపాదనలకు శాస్త్రప్రమాణమూ లేదు. సాహిత్య సంప్రదాయమూ లేదు. ఈ చూపిన అక్షర శిల్పాలకూ వర్ణించిన వస్తువుకూ సహజ సిద్ధంగా గాని, సాంప్రదాయికంగా గాని ఏ సారూప్యసంబంధమూ **(iconicity)** లేదు. **Perceptual basis** ఏమీ లేదు. ఒట్టి గాలి ఊహలు. గట్టిగా చెప్పాలంటే **sheer nonsense.** మరీ ఈ బండి ఱ శిల్పం చాలా మందిని మాయలో పడేస్తున్నట్టుంది. దీని కాది మాధవశర్మగారి ఛంద శ్శిల్పమేనా? వ్యంజించటం, ధ్వనించటం అనేవి **meaningless cliches** అయినై. దీన్ని గురించి ఇతరత్రా ('చేరాతఱ'లో) చర్చించాను గనుక ఇక్కడ ఇంత కన్నా విస్తరించను.

౨. నాటకీయత :-

చంద్రశేఖర్ చాలా వాటిని నాటకీయత కింద జమకడుతున్నాడు.

(పే. 38లో) శకుంతల విషాదస్థితి వర్ణన నాటకీయ శైలి ఎట్లా అయిందో నాకు అర్థం కాలేదు. అట్లాగే 39వ పేజీలో ఇచ్చిన ఉదాహరణలు నాటకీయ శైలిగా నాకు తోచటం లేదు. తాను అనుకునే నాటకీయ శైలీ గురించి ఎక్కడన్నా వివరించమని కోరుతున్నాను.

3. అలంకార, శబ్దప్రలోభాలు :-

1. మంచి వచనం రాసే చంద్రశేఖరరెడ్డి అప్పుడప్పుడు తెలుగు ఎం. ఏ పరీక్షలు గుర్తొచ్చి - ప్రకృష్టంగా ఉన్నాయి (పే. 31) ప్రబంధ కవులకు పథికృత్తులు మాత్రం పురాణ కవులే (పే. 61) అని రాస్తాడు.
2. ఎక్కువగా లేకపోయినా అక్కడక్కడ అలంకారిక శైలి వచ్చింది చూడండి.

"వర్ణన అంటే ఒక వస్తు స్వరూప స్వభావాల్ని కుప్పబోయటం. కవి హృదయ కర్మాగారంలోకి ప్రవేశించిన ముడి పదార్థం కళాత్మకంగా తిరిగి వెలువడటం కళాప్రక్రియ. (పే. 57)

3. సంభాషణ శైలి ఒక్కటే వ్యావహారికం అనుకుంటున్నట్టు కనిపిస్తుంది. (పే. 53)

* విస్తృతమైన ఆధ్యాత్మిక జీవిత వర్ణనకు సీసపద్యం అనువైనది కనుక (పే. 66) ఆధ్యాత్మికతకు సీసపద్యానికి సంబంధం ఉందా?
* తెలుగు రచయితలలో ఏ కవిని గురించి రాస్తుంటే ఆ కవి మీద రచయిత ఆరాధనాభావం ప్రకటిస్తారు. నన్నయ. పోతనలను పోలుస్తూ

(పే. 62-64). "నన్నయలో పాత్రలోని ఆవేశాంశ ప్రతిబింబిస్తున్నది. పోతన రచనలో కవి ఆవేశమే ప్రాధాన్యం వహిస్తున్నట్టున్నది. శబ్దాలంకారం శబ్దాలంకారంగానే మిగిలిపోయిందిక్కడ. అక్కడ భావపోషకంగా ఉంది." ఇది కేవలం ఇంప్రెషనిస్టిక్. నన్నయ మీద ఆరాధన పెరిగి పోతనను కించపరుస్తున్నాడు చంద్రశేఖర్. నాకు పోతన పద్యమే వచ్చింది.

ఈ దోష ప్రకరణం ఇంతటితో ముగిస్తాను. ఇంకా చిన్న చిన్న మత భేదాలున్నా ప్రత్యేకంగా పేర్కొనదగినంత ముఖ్యమైనవి కావు. వీటిని ఛిద్రాన్వేషణ దృష్టితో ఇక్కడ చెప్పడం లేదు. గందరగోళంలేని మంచి విమర్శకుడు కాదగిన చంద్రశేఖర్ లో అస్పష్టప్రతిపాదనలు నాకు అసంతృప్తి కలిగిస్తున్నాయి. అందుకే మరింత స్పష్టత కోసం, స్పెసిఫిటీ కోసం చంద్రశేఖర్ని కొంచెం గిచ్చుతున్నాను. అంతే.

ఇంతకీ ఇది మంచి పుస్తకమనీ, ఇది చదవటం వల్ల సాహిత్య విద్యార్థులు చాలా లాభపడతారనీ నా నిశ్చితాభిప్రాయం.

ప్రాచీనాధునిక సాహిత్యాలను సమదృష్టితో పరిశీలించగల చంద్రశేఖర్ రెడ్డి లాంటి వాళ్ళు మనకిప్పుడు అవసరం.

డా॥ ఆర్. చంద్రశేఖరరెడ్డి
''నన్నయ ఒరవడి" పీఠిక
1987 మే 11

.... 0 ....

# చిత్తశుద్ధి ఉన్న పరిశోధకుడు

ఆదిమ మానవుడు వేసిన తొలికేక కవిత్వమయిందనీ, తొక్కిన చిందులు నాట్యమయిందనీ, మాటకన్నా పాటముందు పుట్టిందనీ ఇప్పటికీ రాస్తూన్నారు. పుస్తకాల్లో అచ్చువేస్తూన్నారు. ఆదిమ మానవుడెట్లా ఉంటాడో మనకు తెలీదన్రా, తప్పో ఒప్పో ఎప్పటికీ రుజువు చెయ్యలేని ఊహలు చెయ్యటం వల్ల ప్రయోజనం లేదన్రా అని ఎంత చెప్పినా పరిశోధకుల చెవి కెక్కటం లేదు. అటువంటి స్థితిలో చెన్నకేశవరెడ్డిలో ఏమంటున్నాడో చూడండి.

> "పైవన్నీ ఊహలే. ఏ భాషాశాస్త్రవేత్తా ఏ మానవ శాస్త్రవేత్తా మాట ముందు పుట్టిందో పాట ముందు పుట్టిందో శాస్త్రీయమైన ఆధారాలతో నిరూపించనంతవరకూ ఊహలను నిజాలుగా భావించ నవసరంలేదు."

తెలుగు థీసిస్సుల్లో నాబోటివాళ్లు కోరుకుంటున్నది సరిగ్గా ఈ దృక్పథమే. ప్రతి థీసిస్సూ బ్రహ్మాండం పొడిచెయ్యదు. ప్రపంచాన్ని కుదిపివేసే ప్రతిపాదనలను ప్రతి థీసిస్సూ చెయ్యదు. ఎప్పటికప్పుడు మారిన ఆలోచనలను జీర్ణించుకుంటూ అప్పటికలవడిన ప్రాపంచిక దృష్టిని గుర్తిస్తే చాలు.

పరిశోధనల పరమార్థ మెట్లాఉన్నా పరిశోధకుడికి ఉండాల్సిన సమ్యక్, సంయమన దృష్టుల్ని చెన్నకేశవరెడ్డి అలవర్చుకున్నాడు. అయితే పాపం చెన్నకేశవరెడ్డి అయినా ఏం చేస్తాడు? చుట్టూ ఉన్న ప్రభావాలనుంచి తప్పించుకోటం కష్టంకదా! అప్పుడప్పుడు నిలదొక్కుకోలేక పాత నమ్మకాల్లోకి సర్రున జారిపోతాడు. చూడండి!

"పలనాటి వీర చరిత్రను మొట్టమొదట జానపద గేయకావ్యంగా పరిగణించవచ్చు. వస్తువు, భాష, ఛందస్సు ప్రజలనుంచి తీసుకొన్నవే కాక అట కవితా సంప్రదాయాన్ని అనుసరించి వెలువడిన గేయ కావ్యమిది. శ్రీనాథుడు కూడా అటువుగా చెప్పి ఉంటారు."

వెల్చేరు నారాయణరావుగారు సోష్ చేస్తూ కూడా మొట్టమొదటి జానపద కావ్యం గురించి మాట్లాడం విచిత్రంగా ఉంది. ఇంకా ఈ కావ్యాన్ని శ్రీనాధుడు ఆటువుగా చెప్పాడనటం మరీ విచిత్రం. పలనాటి వీరచరిత్రను ఒకసారి అటుసాహిత్యంలో భాగంగా గుర్తిస్తే శ్రీనాథ కర్తృత్వం అనే ఆలోచనే రాకూడదు. 'అటు సాహిత్యంలో రచించడం, పాడడం-ఈ రెంటికీ పరస్పర నిరపేక్షమైన అస్తిత్వంలేదని నా. రా. గారు రాయడంలో ఉద్దేశాన్ని చెన్నకేశవరెడ్డి సరిగ్గా గ్రహించలేదనుకుంటారు.

చెన్నకేశవరెడ్డి కొన్ని తమాషా అయిన సిద్ధాంతాలు చేస్తాడు. అవెందుకో నాకు కొరుకుడు పడవు. నానుడుల్లో సామెతల్లో మాత్రాగణాల వల్ల వచ్చిన లయను గుర్తించమంటాడు. బాగానే ఉంది. సామెతల్లో కొన్ని లయబద్ధంగా ఉండటం మనకు పరిచితమే. కాని అంతటితో ఆగ లేదు. 'నానుడులలోను, సామెతలలోను గమనించవలసిన ముఖ్య విషయం ఏమంటే (మాత్రా) ఛందస్సుకు కట్టుబడినంతవరకు నానుడి గాని, సామెత గాని మారదు' అని అంటాడు.

దీని ప్రధానమైన ప్రతిపాదన ఏమిటంటే 'ఛందస్సుల్లో ఉన్నది మారదు' అని. జానపద గేయాల్లో మాత్రా ఛందస్సుంటుందని చెన్నకేశవ రెడ్డి ఒప్పుకుంటాడు. మరి జానపద గేయాల్లో రూప భేదాలు(variations) ఉండవా? అట్లాంటి భేదాలుండటమే జానపద గేయాల ప్రధాన లక్షణమని శాస్త్రజ్ఞులు ఘోషిస్తున్నారే. అయితే సామెతలకిదివర్తించదని చెన్నకేశవ రెడ్డి అభిప్రాయమా? సామెతలను పొడుపు కథలను సేకరించిన వాళ్లని ఆమాట చెప్పమనండి.

థీసిస్సుల్లో ఆలంకారిక (ornate) వాక్యాలూ, ఉద్వేగభరి (emotionally charged) పద ప్రయోగమూ ఉండకూడదు. అం కవిత్వపు శైలి థీసిస్సులలో వద్దని మాటోటివాళ్లం కొన్నాళ్లనుం గొడవ చేస్తున్నాం. కొంతమంది మా సలహా పాటిస్తున్నారు. 'వీళ్ళిట్లా అంటుంటారు. వీళ్లతో మనకెందుకు? మనం చేసేది మనం చేసుకుందా మనం రాసేది మనం రాసుకుందాం' అనేవాళ్ళూ ఉన్నారు. ఇదిట్లా ఉండ కొందరు ఈ రకమైన రచనకు కొత్త డిఫెన్సు తయారు చేస్తున్నార సాహిత్యాన్ని గురించి రాసేటప్పుడు సాహిత్యభాష వాడాలని. ఈ వాదని కొంచెం సాగదీసి చూడండి. ప్రాచీన కావ్యాలను గురించి రాస్తే ప్రాచీ భాషలో రాయాలి, నన్నయ గురించి నన్నయభాషలోనూ, తిక్కన గురించి తిక్కన భాషలోనూ, సూరన గురించి సూరన భాషలోనూ రాయ లనడం లాంటిది. తెలుగు పుస్తకాలను గురించి తెలుగులోనే రాయాలి. ఇంగ్లీషు పుస్తకాల గురించి ఇంగ్లీషులోనే రాయాలి అనే బుద్ధిమంతులు కూడ మనకున్నారు. తెలుగును గురించి ఇంగ్లీషులో రాసిన జయంతి రామయ్య, గురజాడ అప్పారావు, గిడుగు రామమూర్తి, జి. వి. కృష్ణా రావు, వార్ల వెంకటేశ్వరరావు వంటివాళ్ళు బుద్ధి తక్కువపని చేశారని ఈ బుద్ధిమంతుల అభిప్రాయం.

తమ పరిశోధనల ఫలితాలను నలుగురికీ అందించటంకోసం థీసి స్సులు రాస్తారు. అవసరాన్నిబట్టి, అవకాశాన్ని బట్టి అచ్చువేస్తారు. థీసి స్సుల ప్రయోజనం- విషయప్రతిపాదన, విశదీకరణ. ఇది సాదా సీదా వచనంలో జరిగితే నలుగురికీ అందుతుంది. పైగా వస్తువును బట్టి రచ నలో కొంత టెక్నికాలిటీ ఎట్లాగూ తప్పదు. దానికి తోడు అలంకారాలూ, ఆవేశాలూ, ఉత్సాహాలూ, ఉద్వేగాలూ కలిస్తే వస్తుప్రతిపాదనలో స్పష్టత [clarity] పదును [sharpness] తగ్గిపోవచ్చు. చదివేవారి దృష్టిని పక్కదారులు పట్టించే ప్రమాదం [distraction] ఉంది. థీసిస్సు

వినోదంకోసం చదవరు. విజ్ఞానంకోసం చదువుతారు. చాలా కాలం నుంచి ఇట్లా రాతలోనూ, మాటలోనూ గొడవచేస్తూనే ఉన్నాను. ఇది చెన్నకేశవ రెడ్డి మీద కొంత పనిచేసింది. కవిత్వపు శైలిని చాలా తగ్గించాడు. మామూలు సంభాషణలోనే ప్రాసలు వేస్తూ మాట్లాడే చెన్నకేశవరెడ్డి పాపం !. ఇది చాలా కష్టమే. అయినా తంటాలుపడ్డాడు. చాలా వరకు సాధించాడు. కాని అలవాటు అలవాటే కదా ! ఉండి ఉండి "పసిడితున్కల వంటి ఆ పదబంధాలలో కవితాత్మ పరిమళిస్తుంది" అంటాడు. ఇంకా స్త ఆవేశం వస్తే కవిత్వమే చెప్పేస్తాడు. ప్రబంధాలతో పోటీపడే ఈ వర్ణన చూడండి.

> "నన్నయకు పూర్వమే దేశికవితా స్రవంతి తెలుగు పొలాలలో గేయ సాహిత్యాన్ని సమృద్ధిగా పండించగా నన్నయ దానిని మార్గ కవితా పథం వైపు మలుపు తిప్పినాడు. అప్పటి నుంచి మార్గ-దేశి కవితా స్రవంతులు సమాంతరంగా ప్రవహిస్తూ, ఒక్కొక్కసారి ప్రభావితం చేసుకొంటూ ఒకప్పుడు ఒకటి ఉరవళ్ళు వరవళ్ళతో ప్రవహించగా మరొకటి కొంతకాలం అజ్ఞాతంగా ఏ కొండ కోనల లోనో గుసుసుళ్ళు పడి తిరుగుతూ మళ్ళీ ఒళ్ళు విదిలించుకొని, కొండ కొమ్ముల నుంచి జలపాతంలా దూకి, కోటి విద్యుత్కాంతులు వెలయించి తెలుగు నేలను సస్యశ్యామలంగాను ప్రకాశవంతంగాను చేసినాయి."

కవిత్వానికి స్రవంతి అనే పోలిక స్ఫురించిందేమో ఇక కవితావేశం కట్టలు తెంచుకుంది. అసలే కవితా హృదయుడాయె. ఆపుకోలేకపోయాడు, తెలుగు పొలాలు. పంటలు గుర్తు వచ్చాయి. రైతు కుటుంబపు వాతావరణం కూడా గుర్తు వచ్చి ఉంటుంది. ఇంకేం విజృంభించాడు. రూపకాన్ని పోషించాడు. కవిత్వం చెప్పాడు. ఇట్లాంటివి అరుదుగా ఉండటానికి సరదాగానే ఉంది. (అంతమాత్రాన వీటిని నేను సమర్థిస్తున్నానని కాదు).

తాను పరామర్శిస్తున్న విషయం మీద పూర్వులు ఎవరెవరు ఎప్పుడెప్పుడు ఏం చెప్పారో విస్మరించకుండా వివరంగా పరిశీలించాడు చెన్నకేశవరెడ్డి. మాత్రాఛందస్సుమీద, ముఖ్యంగా ముత్యాలసరాల మీద చే.రా. వివిధ సందర్భాల్లో చెప్పిన విషయాలను ఏ ఒక్కదాన్నీ వదల లేదు. తాను చెప్పిన విషయం మీద పూర్వకృషిని సంభావించటం పరిశోధక నీతి. ఈ నీతి చెన్నకేశవరెడ్డికి ఉన్నందుకు-చాలా సంతోషిస్తున్నాను.

ఇంతకీ ఈ పుస్తకంలో చెన్నకేశవరెడ్డి సాధించిందేమిటి ? నేను మొదటే చెప్పినట్టు ప్రతి థీసిస్సూ బ్రహ్మాండం బద్దలుకొట్టక్కర్లేదు. సదుద్దేశాలతో, మంచి సంప్రదాయాలతో, విషయ పరామర్శ పుష్టిగా చేస్తే చాలు నేను సంతోషిస్తాను. ఆ పని చెన్నకేశవరెడ్డి పుష్కలంగా చేశాడు. గేయ ఛందస్సుల మూలాలను వేదాల దగ్గర్నుంచి చూపించాడు. పరిణామాన్ని ఇప్పటివరకూ ప్రదర్శించాడు. తాను పరిశోధిస్తున్న విషయాన్ని గురించి ఎవరెవరు; ఎప్పుడెప్పుడు, ఎమన్నదీ సవిమర్శకంగా పరిశీలించాడు. తన నిష్కర్ష ఏమిటో చెప్పాడు. తను విశ్లేషించే పద్ధతి చూపించాడు. తానే మొదటిసారి చేశాననలేదు. అన్నీ తానే చెప్పాననలేదు. తోటి పరిశోధకుల్ని సమాదరించాడు. పొగడనూ లేదు. తెగడనూ లేదు. సీనియర్ పరిశోధకుల పట్ల, గురువుల పట్ల (పర్యవేక్షకునితో సహా) తగిన వినయం. అణకువ ప్రదర్శించాడు. అట్లని వాళ్ళని ఆరాధించనూ లేదు. విభేదించటానికి వెనుకాడనూ లేదు.

మంచి పరిశోధకుడు ఇంతకంటె ఇంకేం చెయ్యాలి ?

డా॥ జి. చెన్నకేశవరెడ్డి
'ఆధునికాంధ్ర గేయ కవిత్వం'
పీఠిక - 1988 జూలై 24

# రమేష్‌బాబు స్మృతిలో

రమేష్‌బాబు ఆంధ్రా యూనివర్సిటీలో ఆనర్సు చదువుకున్నాడు. అతను చదువుతున్నప్పుడే నేను విశాఖలో ఉన్నట్టు హరి అంటాడు. కాని చదువుకునే రోజుల్లో నాకతనితో పరిచయం లేదు.

నా కెరియర్‌లో వచ్చిన ప్రమోషన్ కోసం 1972 జూలై నెలలో నేను ఢిల్లీ ప్రయాణమయ్యాను. ఏదో పనిమీద నాతోపాటు హరి కూడా ఢిల్లీ వచ్చాడు. ఇద్దరం ఢిల్లీ యూనివర్సిటీ గెస్టుహౌస్‌లో మకాం వేశాం. నీకు తెలుగు భోజనం పెట్టిస్తానని హరి లాజపత్‌నగర్ (నేషనల్ పార్కు) తీసుకెళ్ళాడు. అదే రమేష్‌బాబు, కరుణ నివసించే ఇల్లు. ఆ తరువాత మొదట్లో ఎప్పుడన్నా వెళ్ళేవాణ్ణి, రానురాను ప్రతి శనివారం సాయంకాలం వెళ్ళటం. సోమవారం తిరిగి రావటం అలవాటయింది. రాజకీయంగా మా అభిప్రాయాలు కలిసేవి. సాహిత్య సాంస్కృతిక విషయాలు ఎన్నో మాట్లాడుకుంటూ ఆదివారం ఉదయం మంచాలమీద నుంచి లేవకుండా గడిపే వాళ్ళం. ఆ సోమరి ఆదివారాలు నా ఢిల్లీ నివాసంలో మరుపురాని మధుర ఘడియలు.

రమేష్‌కు బలమైన అభిప్రాయాలుండేవి. సడలని పట్టుదల ఉండేది. ఇంత పట్టుదలలోనూ అవతలివాళ్ళ వాదస్తాన్ని భరించే ఓపిక ఉండేది. ఈ చివరి లక్షణం పాటించడం ఎంతకష్టమో రమేష్‌ను చూసిన తరవాతనే నాకర్థమైంది.

ఢిల్లీలో తెలుగు ప్రజలకు సాంస్కృతిక వికాసం కలిగించటం రమేష్ పెట్టుకున్న ప్రధాన కార్యక్రమం. ఆ ప్రయత్నంలోనే కన్యాశుల్కం ఎడిట్ చేసి ప్రదర్శింపజేశాడు. తెలుగు ప్రముఖులు ఢిల్లీ వస్తే వాళ్ళని కలుసుకోటానికి సమావేశాలు ఏర్పాటు చేసేవాడు. ఆంధ్రోత్సవాలు చేయించేవాడు.

ఇట్లా ఎన్నెన్నో కార్యక్రమాలు చేయించేవాడు. అందులో ఒకటి లాజపత్ నగర్ లైబ్రరీలో తెలుగు సెక్షన్ ఏర్పాటు చేయించటం. గ్రంథాలయ నిర్వాహకులను అతి కష్టంమీద ఒప్పించి అక్కడ పుస్తకాలు పెట్టించాడు. ప్రతిరోజు విధిగా అక్కడికి వెళ్ళి తనే పుస్తకాల లిస్టులు తయారు చేసేవాడు. డాక్టరుద్యోగంలో ఈ పని చెయ్యటం ఎంత కష్టమో చూసిన వాళ్ళకే తెలుస్తుంది.

నా ఉద్యోగం ఢిల్లీనుంచి హైదరాబాదుకు మారిన తరవాత కూడా (1973 అక్టోబరు నుంచి) సంవత్సరానికి ఒకటి రెండుసార్లయినా ఢిల్లీ వెళ్ళేపని తగిలేది. అప్పుడు ఎంత రాత్రి అయినా కళ్ళు పత్రికాయలు చేసుకొని నా కోసం ఎదురు చూసేవాడు. అప్పుడప్పుడు ఆంధ్రదేశంలో అచ్చయిన పుస్తకాలు ఏవన్నా పట్టుకెళ్ళే వాణ్ణి. ఇది మా లైబ్రరీ కివ్వ కూడదూ అని సంగ్రహించేవాడు. ఎక్కడన్నా మంచి పుస్తకం కనపడితే వెంటనే అన్ని సంకోచాలూ వదిలేసి మా లైబ్రరీ కివ్వగూడదూ అనేవాడు. ఆంధ్రసాహిత్య అకాడమీ, తెలుగు అకాదమీ వాళ్ళ ప్రచురణలు లైబ్రరీకి సంపాయించటానికి ఎంత తిరిగేవాడో! నాబోటి మిత్రుల ఇళ్ళల్లో కూడా పుస్తకాలు కొల్లగొట్టి ఆ లైబ్రరీలో తెలుగు సెక్షన్ నిర్మించాడు. తాను స్వయంగా అక్కడుండి తెలుగువాళ్ళకి పుస్తకాలు ఇవ్వటం చూశాను. నాబోటివాడు ఎంతో దూరం నుంచి ఢిల్లీ వెళ్ళినా తన కార్యక్రమం మార్చు కునేవాడు కాదు. తనతోపాటు ఆ లైబ్రరీకి నన్ను వెంట తీసుకెళ్ళేవాడు.

ఈ లైబ్రరీకి ఒక కమిటీ ఉంది. ఆ కమిటీవాళ్ళు (చాలా కమిటీ ల్లాగే) పనిచేసేది తక్కువ, అనవసర చర్చలు ఎక్కువ చేసేవాళ్ళు. అంత వరకయినా పర్వాలేదు. అందులో కొందరు పిచ్చి వ్యాఖ్యలుచేసి పనిచేసే వాళ్ళను నొప్పించేవాళ్ళు. వాళ్ళందరి మాటలు ఎందుకు భరించాలి అని మా డాక్టరమ్మ కరుణ విసుక్కునేది. అయినా తన కార్యదీక్ష తగ్గేది కాదు.

ఒకసారి ఎప్పుడో ఇలపావులూరి పాండురంగారావుగారిని గురించి చెపుతూ ఆయనకెంత సహనమో అన్నా. "నేనూ పాండురంగారావుని అయిపోతు న్నట్టున్నాను" అనేవాడు.

ఢిల్లీలో తెలుగువాళ్ళ కోసం తెలుగువాళ్ళు నడుపుకునే పాఠశాల లున్నాయి. వాటిల్లో అక్కడి సిలబస్సుతోపాటు తెలుగు కూడా చెప్పేవాళ్ళు. అక్కడి బోధన కూడా రొటీన్‌గా తయారవటం రమేష్ గమనించాడు. ఒక కుదుపు ఇవ్వాలనుకున్నాడు. అక్కడి టీచర్లకు ఓరియంటేషన్ క్లాసులు పెట్టించి కొత్తగాలి వీచేట్టు చేశాడు. దానికి సంబంధించి రమేష్ ఆంధ్ర జ్యోతిలో రాసిన రిపోర్టు ఈ సంచికలో అచ్చవుతున్నది.

రమేష్ చేసిన అన్ని పనుల్లోనూ శాశ్వతంగా నిల్చిపోయేది గురజాడ సంస్మరణ సంచిక. ఆ సంచికకు వ్యాసాలు తెప్పించటానికి సమాచార సేక రణకు అతను ఎంత కష్టపడ్డాడో తెలుసుకుంటే కళ్ళు తిరిగిపోతాయి. ఎక్కడ ఏ సమయంలో ఎవరి దగ్గర ఏ సమాచారం దొరుకుతుందన్నా అమాంతం పరుగెత్తుకెళ్ళేవాడు. గురజాడ అప్పారావుగారిని కొంచెం సన్ని హితంగా తెలిసినావిడ ఒకామె ఉందని తెలిసి పురిపండా అప్పలస్వామిగారి ద్వారా వెళ్ళి ఆమె చెప్పిందాన్ని రికార్డుచేశాడు. ఆయన్ని బేహద్దీ తాత గారు అని పిలిచేదట ఆమె. ఆ ఇంటర్వ్యూ అయిన తరవాత నాకు కలిసిన పుడు "గురజాడ మాంసం తినేవాడు. మద్యం పుచ్చుకొనేవాడు అని తప్ప పెద్ద విలువైన సమాచారం ఏమీ దొరకలేదు" అన్నాడు. ఇది కూడా విలువైన సమాచారమే. ఆ కాలానికే ఆయన వారసత్వంగా వచ్చిన సంకోచాలను (inhibitions) దాటగలిగాడని తెలుసుకోటం కూడా మనకు ముఖ్యమేనన్నాను.

గురజాడ మీద ఇప్పటివరకూ మనకున్న ఒకే అథారిటీ కె. వి. రమణారెడ్డిగారే కదా! ఆయన దగ్గర నుంచి వ్యాసం తెప్పించాలి అన్నాను.

ఎట్లా? ఆయన జైలులో ఉన్నాడు అన్నాను. ఆయన వ్యాసం లేకపోతే మన సంపుటి అసమగ్రంగా ఉంటుంది. జైలు నుంచి అయినాసరే తెప్పించాల్సిందే అన్నాడు. అప్పటి జైలు అధికార్లు ఇప్పటివాళ్ళ కన్నా కొంచెం మెరుగనుకొంటాను. కె.వి.ఆర్. గారు జైలు నుంచి వ్యాసం రాసి పంపారు.

గురజాడ సంస్మరణ సంచిక ప్లాన్‌చేసింది రమేషే. "ఇంత చేసి నీ పేరు ఎందుకు వేసుకోకూడదు" అని నేనంటే నా పేరు ఎందుకులెండి, పెద్దవాళ్ళ పేరుంటే బాగుంటుందన్నాడు. "ఇది నేను చేశాను, ఇది నేనే చేశాను, ఇది నేను తప్ప ఎవరూ చెయ్యలేదు, చెయ్యలేరు" అనే పద్ధతి యూనివర్సిటీ ఎకడమిక్ ప్రపంచ నివాసినయిన నాకు రమేష్ ధోరణి ఆశ్చర్యం కలిగించింది. మనిషిగా రమేష్ ఎంత నిస్వార్థుడో అర్థమయింది. ఆ సంచిక తయారీలో తనకెదురైన అనుభవాలను వివరించిన ట్రావెల్ నోట్సు చాలా అమూల్యమైన డాక్యుమెంటు. తెలుగువాళ్ళకోసం తాను ఏం చేసినా తన విధి నిర్వహణగా చేశాడేగాని "పేరు" కోసం చెయ్యలేదు. తన డబ్బు చాలా ఖర్చయినా, ఆ ఊసే ఎత్తేవాడు కాదు.

గురజాడ సంచిక తరవాత గిడుగు సంచిక వేద్దామనుకున్నాడు. రమాపతిరావు దగ్గరున్న కాంపోజిషన్ కమిటీ రిపోర్టు శకలాల ఫోటోకాపీ ప్రతులు సంపాదించాడు. అసలే శకలాలు. పైగా అప్పటి ఫోటోకాపీయింగ్‌లో అక్షరాల్లో స్పష్టత లేకుండా పోయింది. అందువల్ల అవి తరువాత కూడా ఉపయోగపడలేదు. ఢిల్లీ వెళ్ళినప్పుడు (1978-1979) దీని విషయమై గంటల తరబడి మాట్లాడేవాడు. 1979 మే నెల ఉత్తరార్థంలో ఆంధ్రదేశం వచ్చినప్పుడు మా ఇంట్లోనే కూర్చొని పెద్ద ప్రణాళిక వేసుకున్నాం. విశాఖపట్నంలో వ్యావహారిక భాషా సదస్సు ఒకటి పెద్ద ఎత్తున ఏర్పాటు చేయాలని, పురిపండా అప్పలస్వామి, ఆరుద్ర, కె. వి. ఆర్. భద్రిరాజు కృష్ణమూర్తి, తూమాటి దొణప్ప, జి. ఎన్. రెడ్డి వాళ్ళందర్నీ పిలిపించాలని ఏవేవో కలలు కనేవాడు. ఇప్పుడు నేను కలలంటున్నాను కాని

రమేషే కనుక ఇంకొన్నాళ్ళు బతికే ఉంటే నిజంగా ఇది సాధించే వాడే. మాబోటి పుటుబోతు గిత్తలను ముల్లు కర్రతో పొడిచి పరిగెత్తించే వాడే. మనకా అదృష్టం దక్కలేదు. ఆ ప్రసంగ వ్యాసాలను గిడుగు స్మారక సంచికగా వెయ్యాలని రమేష్ ప్రణాళిక. అందరం కలిసి హైదరాబాదు నుంచి కోణార్కలో మే 29న కాబోలు మండుటెండలో ప్రయాణం చేశాం. నేను ఖమ్మంలో దిగిపోయాను. మళ్ళీ జూన్ ఒకటిన కాబోలు ఖమ్మంలో కలుసుకోవాలనుకున్నాం. నేను ఖమ్మం వెళితే అక్కడి ఆంధ్రజ్యోతి విలేఖరి. కవి కౌముది చెప్పాడు– రమేష్ ఇక మనకు లేడని, మే 31న శాశ్వతంగా ఈ ప్రపంచంనుంచి సెలవు తీసికొని వెళ్ళిపోయాడని. మా కలలన్నీ పగిలిపోయినై.

అప్పటినుంచి రమేష్ స్మృత్యంకితంగా గిడుగు స్మారక సంచిక తియ్యాలని సంకల్పించాను. రమేష్‌లాంటివాడు చెయ్యాల్సిన పని నావల్ల అవుతుందా? 1986 మే 31 న ఢిల్లీలో ఉన్నా, లాజపత్‌నగర్ వైపునుంచి బస్సులో పోతుంటే రమేష్ మనసులో మెదిలాడు. కళ్ళు చెమ్మగిల్లినై. గిడుగు సంచిక తియ్యలేని అశక్తత మరీ బాధపెట్టింది. ఆ రోజు రాసిన "పూర్తికాని స్మృతిగీతం" తరువాత ఆగస్టులో ఆంధ్రజ్యోతి వీక్లీలో అచ్చయింది.

ఆ తర్వాత గిడుగు స్మారక సంచిక బుక్‌ట్రస్టు ప్రచురణగా డిసెంబరులో తీసుకొచ్చాం. సంతృప్తికరంగా చేసిమాట నిజమే. రమేష్ చెయ్యాల్సినపని నేనెక్కడ చెయ్యగలుగుతాను.

"మరోసారి గిడుగు రామమూర్తి" అనే పుస్తకావిష్కరణ సందర్భంగా మా రమేష్ పుట్టినరోజున (డిసెంబరు 27) మరోసారి అతన్ని తల్చుకున్నాం.

రమేష్ కమ్యూనిస్టు ఉద్యమాన్ని అభిమానించేవాడు. కాని క్రిటి

క్రిటికల్‌గా ఉండేవాడు. జనతా పరిపాలనలో నిర్బంధాలు లేకపోయినా అజ్ఞాత వాసంలోకి వెళ్ళిన ఒకరిద్దరు కమ్యూనిస్టులను కలుసుకోటానికి ప్రయత్నించి వీలుకాక 'ప్రజలకు కనపడకుండా వీళ్ళు ప్రజలకేం సేవ చేస్తారనే'వాడు. అన్ని కమ్యూనిస్టు పార్టీలను గురించి క్రిటికల్‌గానే ఉండేవాడు. చంద్ర రాజేశ్వరరావుగారిని, పుచ్చలపల్లి సుందరయ్యగారిని, తరిమెల నాగిరెడ్డి గారిని, కొండపల్లి సీతారామయ్యగారిని వ్యక్తులుగా నిస్వార్థ నాయకులుగా గౌరవించేవాడు.

రమేష్ నిండా నలభయ్యేళ్లుకూడా జీవించలేదు. కానీ ఎన్ని మంచి పనులు చేశాడు; అదికూడా ఏ స్వార్థమూ లేకుండా; అన్నీ తనే నిర్వహించి తన పేరు బయటపెట్టుకోలేదు.

మా రమేష్ ఇప్పటివరకూ బతికి ఉంటే ఇంకెన్ని మంచిపనులు చేసేవాడో! కాలం మా రమేష్‌ని తన పసిడి రెక్కలమీద ఎక్కించుకుని దూరంగా పారిపోయింది- కానీ రమేష్ స్మృతిని కాలంకూడా దూరం చెయ్యలేదు.

కావూరి రమేష్‌బాబు

"ఒక దశాబ్ది గడిచాక"

వ్యాస సంపుటికి పీఠిక, 1989 మే



# ఒకనాటి ప్రేమకు దర్పణం

ఒకనాటి సాహిత్యాన్ని తరవాతి కాలంలో పునర్వ్యాఖ్యానించే సంప్రదాయం ఒకటుంది. ఆ మాటకొస్తే మన ఇతిహాసాలూ, పురాణాలూ సంస్కృత మూలాలను తెలిగించిన పద్ధతి పునర్వ్యాఖ్యానమే.

ఆధునిక భావాలు వ్యాప్తి చెందుతున్న ఈ శతాబ్దపు తొలి దశకాలో ఆ భావాలకనుగుణంగా ఐతిహాసిక, పురాణ కథలకు పునర్వ్యాఖ్యాన రూపంగా తెలుగులో చాలా సాహిత్య సృష్టి జరిగింది. వ్యాసుడు కాశీని వదిలిన ఘట్టాన్ని తీసుకొని జి. వి. కృష్ణరావుగారు ఆధునికంగా ఆకలిశక్తి నిరూపించటానికి భిక్షాపాత్ర అనే నాటికను రాశారు. త్రిపురనేని రామస్వామి గారి నాటకాలూ, కావ్యాలూ తాను బోధించ దల్చుకున్న హేతువాద భావాలకు వాడుకున్నారు. విశ్వనాథ సత్యనారాయణ గారి రామాయణ కల్పవృక్షం సుందరకాండలో రాక్షసాంగనలు సీతకు స్త్రీ విముక్తి ధోరణిలో (హేళనకే అనుకోండి) హితబోధ చేస్తారు.

ఈ శతాబ్ది పూర్వార్ధ భాగంలో విరివిగా వ్యాప్తి చెందిన ఖండ కావ్య ప్రక్రియలో ఈ పునర్వ్యాఖ్యాన ధోరణే కనిపిస్తుంది. జాషువా గారి ఖండ కావ్యాల్లో రారాజు మీద, కర్ణునిమీద పద్యాలీ సంప్రదాయంలోవే. అట్లాగే ఆధునిక రాజకీయాల్లో ప్రచలితమైన అహింసా వాదానికనుకూలంగా బుద్ధుని చరిత్రను పునర్వ్యాఖ్యానిస్తూ వచ్చిన కావ్యాలూ, ఖండికలూ ఎన్నో స్వాతంత్ర్య పూర్వమూ ఆ తరువాత ఇంకా కొంతకాలమూ వచ్చాయి.

ఈ రకమైన సాహిత్యంలో ఒక ప్రధానాంశం ప్రేమ. ప్రాచీన సాహిత్యంలో స్త్రీ పురుష సంబంధాల్లో అసమానత హెచ్చు. ఒక రాజు ఒకేసారికాని, వరసగా గాని చాలామంది స్త్రీలతో సంబంధాన్ని పెట్టుకుంటాడు. స్త్రీని తన కామోపశమన వస్తువుగా గాని, తన సంతతిని వృద్ధిచేసే సజీవయంత్రంగా గాని, తన ధర్మానుష్ఠానానికి పనికొచ్చే పనిముట్టుగా గాని

ఉపయోగించుకుంటాడు. అయితే ఈ సాహిత్యంలో కొన్నిచోట్ల స్త్రీపరమైన అనుభూతులను చిత్రించిన ఘట్టాలు కనిపించకపోవు. నిజానికట్లాంటి ఘట్టాలు లేకపోయినా ఉన్నవాటిని అట్లా ఊహించుకొని చిత్రించిన పునర్వ్యాఖ్యాన సాహిత్యం మనకుంది.

ఫ్యూడల్ సమాజంలోకన్నా ఆధునిక కాలంలో స్త్రీపట్ల జాలి, కరుణ, దయ ఎక్కువ. అరుదుగానైనా గౌరవం చూపించిన ఘట్టాలున్నాయి. ఈ దృష్టిని ఒకపక్క ఖండకావ్యాలూ, మరోవైపు ప్రణయ కవిత్వం, ఇంకో వైపు కథలూ, నాటికలూ, కాల్పనిక సాహిత్య ధోరణులలో భాగంగా వచ్చాయి. చలంగారి పురూరవ, సావిత్రి నాటకాలు ఈ కోవలోవే. మను చరిత్రలో వరూధినిని ఒట్టి కాముకిగా పెద్దన చిత్రిస్తే జి. వి. కృష్ణరావు గారు ఆధునిక ప్రేయసిగా తీర్చిదిద్దారు. నిజానికీ ధోరణికూడా భారతీయ సాహిత్యంలో రవీంద్రనాథటాగూరు గారితో ప్రారంభమయి ఉండొచ్చు. ఆయన కచదేవయాని నాటికలో దేవయానిని ఆధునిక ప్రేయసిగా దర్శిం చారు. బెజవాడ గోపాలరెడ్డిగారు వచనంలోనూ, ఉత్పల సత్యనారాయ ణాచార్యులు గేయంలోనూ ఈ నాటకాన్ని అనువదించారు.

ఈ సంప్రదాయంలో భాగంగానే ఇప్పుడు ముక్తేవి భారతి, లక్ష్మణ రావుగార్లు భారతంలో ప్రేమకథలను ప్రచురించారు. వాటినే ఇప్పుడు సంకలనంగా తెస్తున్నారు.

తెలుగులో ఆధునిక కథానిక ఒక ప్రధాన సాహిత్య రూపంగా నిల దొక్కుకుంది. భారతంలో కొన్ని ప్రధాన కథలను, ఉపాఖ్యానాలను ఎన్ను కొని, వాటికి తగిన ప్రకృతి నేపథ్యాన్ని చిత్రించి, పాత్రోచిత సంభాష ణలను కూర్చి, భావవ్యక్తికోసం కొన్ని చిన్నచిన్న సంఘటనలను నిర్మిం చారు. మూల కథలోని తాత్విక ధోరణులనుగాని ఐడియాలజీని గాని వీరు

మార్చే ప్రయత్నం చెయ్యలేదు. స్త్రీ పురుష అసమానతలనుకూడా వీరు యథాతథంగానే స్వీకరించారు. అంటే వాటిని వీరెక్కడా నిరసించిన జాడ కానరాదు. వీరి లక్ష్యం అదికాదు.

భారత గాధల్లో ప్రేమకు అవకాశమున్న లేక ఆధునిక ప్రేమ వ్యాఖ్యానాన్ని సహించేవాటిని గ్రహించి ఆధునిక కథానికా రూపంలో పునా రచించటమే వీరి లక్ష్యం. ఆ విధంగా చూసినప్పుడు ఇది చాలా మంచి ప్రయత్నంగా గుర్తించగలం. ఈ రకమైన స్థానంలో కాస్తో కూస్తో స్వాతంత్ర్యం తీసుకోక తప్పదు. అట్లా తీసుకోకపోతే పద్యాల్లో కథలు వచనంలో చెప్పినట్టుంటుంది. ఇవి అనువాదం కాదు, పునస్సృష్టి. ఒకనాటి ప్రేమకు ఈనాటి దర్పణం ఈ సంపుటి.

ఈ ప్రయత్నంలో కొన్నిచోట్ల అద్భుతంగా విజృంభించారు, కొన్నిచోట్ల చాలా నేర్పుగా వ్యాఖ్యానించారు. మరికొన్నిచోట్ల - కథ అవకాశం ఇవ్వని చోట్ల వెనక్కితగ్గారు.

అట్లా విజృంభించిన ఒక గాథ కచదేవయాని కథ. కచుడు దేవకార్యార్థియై అసుర గురువైన శుక్రాచార్యుడి దగ్గరికి వస్తాడు. దేవతలు అతన్ని పంపేటప్పుడే "దుహితృస్నేహంబునం జేసి యద్దేవయాని పలుకులు శుక్రుం డతిక్రమింపడు గావున నీనేర్చు విధంబున దాని చిత్తంబు పడసి శుక్రు నారాధించిన నీకిష్టసిద్ధియగును" అని చెప్పిపంపారు. అందువల్ల అతను దేవయానిపట్ల కావాలనే లేనిపోని ఆశలు కలిగేట్టు ప్రవర్తించాడు. దాన్ని విస్తరిస్తూ కచుడు దేవయాని పట్ల చూపేశ్రద్ధకు నిదర్శనంగా దేవయాని కిష్టమని అందమైన పూలకన్నా, సువాసన ఉన్న పూలనే ఏరుకొచ్చినట్టు కల్పించారు. అట్లాగే ఏదో కొంటె ఆలోచన చేసి దేవయాని నవ్వితే పరధ్యానంగా ఉన్న కచుడు కూడా ఆమెను తృప్తి పరచటానికి నవ్వుతాడు.

భారతంలో "ఇట్లతి ప్రయత్నంబునఁ గచుండు శుక్రు వలన సంజీవని వడసి పెద్దకాలంబుండి." అని ఉన్నదాన్ని ఆధారం చేసుకొని "మనసు దేవలోకం మీద ఉన్నా విద్య నేర్చాకకూడా గురువును గురుపుత్రిని సేవిస్తూ సపర్యలు చేస్తూ కొంతకాలం గడిపాడు" అని "పెద్దకాలాన్ని" వ్యాఖ్యానిం చారు. అట్లాగే దేవయాని పై మోజు పడటం, శర్మిష్ఠ యయాతికి తన కోరిక వెల్లడించడటం వంటి చోట్ల చాలా సున్నితంగా చిత్రించారు.

శర్మిష్ఠకు స్త్రీ సహజమైన సంతానాపేక్ష కలిగిందని చెప్పటానికి కల్పిం చిన దృశ్య చిత్రణ చూడండి:

"ఒక పక్షి ముక్కున ఏదో కరుచుకొని రివ్వున వచ్చి గూడుచేరింది. తల్లిరాక గమనించి గూట్లో ఉన్న పిల్లలు కిచకిచలాడుతూ ముక్కులు ముం దుకు పెట్టి అల్లరిచేశాయి. ఆహారం పిల్లలకందించి మళ్ళీ ఆకాశంలోకి ఎగిరి పోయింది పక్షి.

ఎంత ధన్యురాలు ఈతల్లి! "మాతృత్వంలోని మాధుర్యం ఇదేగా!" అని శర్మిష్ఠకు మాతృత్వకాంక్ష కలగటానకి తగిన వాతావరణాన్ని సృజిం చారు ఈ కథకద్వయం.

ఈ కథలు ఇట్లా రాయటంవల్ల ప్రయోజనం ఏమిటి? ఏదో ఒక రాజ కీయ ధార్మిక ప్రయోజనాన్ని ఆశించి ఈ కథలు ఈ రచయితలు రాశారను కోను. ఈకథలు చదువుకోటానికి బాగుంటాయి. తెలుగుభారతంలో ఈకథలు ఎట్లా ఉంటాయో చూద్దామన్న ఉత్కంఠ కలిగిస్తాయి. సాహిత్య దృష్టితో, కథారచనా దృష్టితో చదవాల్సినవి. ఆ విధంగా చదివితే తప్పకుండా చదివి స్తాయి. ఇవి ఈనాటివి కావు. ఒకనాటివి అన్న స్పృహతో చదివితే ఇంకా ఎక్కువ బాగుంటాయి.

ఈ కథలు దంపతులిద్దరూ కీచులాడుకుంటూ రచించారు. అయితే చాలా శ్రమపడి. ఎన్నో రాత్రులు ఏకదీక్షతో తపస్సు చేసినంత దీక్షగా రాశారు. రచనా కాలంలో ఘట్టాలను నేను విన్నాను. అవి మళ్ళీ పుస్తకంగా సంకలితం కావటం చాలా సంతోషకరమైన విషయం. ప్రధాన కథకులు లక్ష్మణరావు గారైనా భారతి చెక్కిన నగిషీలు చాలా ఉన్నాయి. "వాగర్థావివ''రచించారీ పుస్తకాన్ని.

పఠితలందర్నీ అలరిస్తుందని నా ఆశే కాదు, నమ్మకం కూడా.

ముక్తేవి లక్ష్మణరావు, భారతి
"భారతంలో ప్రేమకథలు' కు
పీఠిక, యువభారతి ప్రచురణ,
1991 మే 4.



## ప్రస్తావన

భారతదేశ చరిత్రలో తెలంగాణా ప్రజల పోరాటానికి చాలాకాలంగా ప్రాధాన్యం ఉంది. మధ్యయుగాల ఫ్యూడల్ పరిపాలనలో భూస్వామ్యవ్యవస్థలో మగ్గుతున్న తెలంగాణా ప్రజలు చైతన్యవంతులై అధునికయుగంలోకి ప్రవేశించటానికి జరిపిన పోరాటం ఇది. ప్రపంచ ప్రజల విముక్తి పోరాటాల చరిత్రలో కూడా దీనికి ప్రాముఖ్యముంది. స్వాతంత్ర్య సమర గాధలను భారత ప్రజలందరు తెలుసుకోవాల్సిన అవసరం ఉన్నట్టుగా తెలంగాణ పోరాట చరిత్రను తెలుసుకోవలసిన బాధ్యత తెలుగువారందరికీ ఉంది. తెలుగు ప్రజలు పెద్ద ఎత్తున పాల్గొన్న పోరాటం ఇది.

అయితే ఈ పోరాట చరిత్రను రచించటంలో చాలా చిక్కులు ఉన్నాయి. ఈ పోరాట నిర్వహణలో ఉమ్మడి కమ్యూనిస్టు పార్టీ ప్రధాన పాత్ర వహించింది. అంతకు ముందు వివిధ ఉద్యమాలు తెలంగాణా ప్రజలను జాగృతం చేసే ప్రయత్నాలు చేశాయి. వీటినన్నింటినీ సమగ్రంగా, విశ్వాసికంగా చిత్రించిన రచనలు లేవు. ఉన్నంతలో ప్రజల పాత్రను సముచితంగా అంచనావేసిన పుస్తకం సుందరయ్యగారిదే. సుందరయ్యగారు ఈ పుస్తకాన్ని పోరాట విరమణ జరిగిన తరువాత ఇవరయ్యేళ్లకు రచించారు.

సుందరయ్యగారు రచయితగా చరిత్రకారుడు కాదు. చరిత్ర గమనంలో పాత్రధారి. కమ్యూనిస్టు ఉద్యమ నిర్మాతల్లో ఒకరు. తెలంగాణా పోరాటానికి నాయకత్వం వహించిన నాయకుల్లో ముఖ్యులు. ఆయన రచనల్లో పోరాట సన్నిహితత్వం ఉంటుంది. అది గుణమే. కాని పోరాటంలో మమైక్యం పొందినవారు నిర్మమత్వంతో చరిత్ర రచన చెయ్యటం కష్టం. అందువల్ల తాను నమ్మిన సిద్ధాంత కోణంనుంచే పోరాట చరిత్రను సమీక్షించారు. "మనం, మన పార్టీ" అని భారత కమ్యూనిస్టు పార్టీ (మార్క్సిస్టు) కార్యకర్తలను ఉద్దేశించినట్టు చాలాచోట్ల కనిపిస్తుంది. ముఖ్యంగా గుణ

పాతాల భాగం అందు కుద్దేశించిందే. దీని సంక్షిప్త ప్రతిని తయారుచేసిన వి ఆర్.బొమ్మారెడ్డి గారు కూడా ఆ పార్టీ వారే. అందువల్ల ఈ గ్రంథ రచనలో కనిపించే ఓరియంటేషన్ ఆ పార్టీ వారికి సంబంధించిందే కాని జనహిత వారిదీ, ప్రచురణకర్తలదీ కాదు. అందరికీ హితమైన పద్ధతిలో ఈ పుస్తకం తిరగ రాయటం సాధ్యం కాదు. సాధ్యమయినా అది సుందర య్యగారి రచన కాకుండా పోతుంది. అంటే ఉద్యమ సాన్నిహిత్యం పోతుంది.

చరిత్ర కథనంలో పాక్షికదృష్టి వున్నా చరిత్ర సంఘటలు, స్థానిక పోరాట గాథలు వాస్తవ చిత్రణలే. ఈ గ్రంథాన్ని చదివే పాఠకులు ఈ విషయాలను దృష్టిలో పెట్టుకొని, తెలుగువారు తెలుసుకోవలసిన చరిత్ర శకలంగా దీన్ని గ్రహించవలసి ఉంది. ప్రధాన గ్రంథంలో చేసిన కొన్ని మార్పులు ఈ పుస్తకాన్ని ఎక్కువ మందికి, పలురకాల వారికి అందుబాటు లోకి తీసుకు రావాలన్న దృష్టితో చేసినవే.

తెలుగు వారి చరిత్రలో అత్యంత ప్రాధాన్యం ఉన్న ఉద్యమ గాథ లను అధిక సంఖ్యాకులకు అందుబాటులోకి తీసుకు రావటమే ఈ పుస్తక ప్రచురణలో జనహిత వారికీ, హైదరాబాద్ బుక్ట్రస్ట్ వారికీ ఉన్న సమాన ధ్యేయం.

కా॥ పుచ్చలపల్లి సుందరయ్య

"తెలంగాణా పోరాట చరిత్ర"

పీఠిక మే 1992

# మనసారా ఆహ్వానిస్తున్నాను

తెలుగుసాహిత్యంలో స్త్రీ చైతన్యదృష్టి ఎప్పటినుంచి ప్రారంభ మయిందో తారీకులతో నిరూపించలేనుగాని 1980 దశకంలో స్పష్టమైన రీతిలో కనిపిస్తున్నదని చెప్పగలను.

ఎనభయ్యో దశకంలో స్త్రీలు ప్రపంచాన్ని, జీవితాన్ని తమదైన ప్రత్యేక దృష్టితో దర్శించి తమ రచనల్లో ప్రదర్శించారు. రేవతీదేవి, విమల, ఈశ్వరి, కొండేపూడి నిర్మల, ఘంటసాల నిర్మల, జయప్రభ వంటి కవయిత్రులు- స్త్రీల మనోభావాలను, అనుభవాలను, ఆదర్శాలను, ఆర్తినీ ఒక్కోసారి ఆక్రోశాన్ని బలంగానూ, శిల్ప సమన్వితంగానూ వ్యక్తం చేశారు. ఆ వరసలో ఈ గ్రంథ రచయిత్రి పి. లక్ష్మిని కూడా చెప్పు కోవాలి. ఈమె 'శిలాలోలిత' అనే కలం పేరుతో తన కవిత్వాన్ని ప్రచురించింది.

ఈ ఎనభయ్యో దశకంలో అసహాయశూరురాలు మల్లాది సుబ్బమ్మ గారు తన మహిళాభ్యుదయ సంస్థ తరఫున జరిపే పోరాటం అట్లా ఉంచి ఎన్నో గ్రంథాలు వెలువరించారు. "స్త్రీ స్వేచ్ఛ" అనే పత్రికను కూడా వెలువరిస్తున్నారు. ఫెమినిజం మీద పుస్తకాలు ప్రచురిస్తున్నారు. నవల్లి సరేసరి- పుంఖానుపుంఖాలు! జయప్రభ, కొండవీటి సత్యవతిగార్లు కొన్నాళ్ళు "లోహిత" అనే పత్రిక నడిపారు. ఫెమినిస్టు స్టడీసర్కిల్ అనేది ఒకటి ఏర్పడి, తుల్యాభిప్రాయాలున్న ఆడా, మగ రచయితలు ఒకేచోట చేరి చర్చించుకుంటున్నారు. స్త్రీశక్తి సంఘటనవారు "మనకు తెలియని మన చరిత్ర" పేరుతో తెలంగాణా పోరాటంలో స్త్రీ యోధుల పాత్రను వెలుగు లోకి తీసుకొచ్చారు. ఈ పుస్తకం ఇంగ్లీషు అనువాదాన్ని మీనాక్షి ముఖర్జీ వంటి పండితులు బాగా ప్రశంసించారు. స్త్రీల ఆరోగ్య సమస్యలపై స్త్రీ శక్తి- అన్వేషి సంయుక్తంగా వెలువరించిన "సవాలక్ష సందేహాలు" అనే

పుస్తకం రచన ఎనభయ్యో దశకంలోనే జరిగింది. ప్రచురణ 1992. స్త్రీ చైతన్య ప్రబోధకమైన ఈ కార్యకలాపాలన్నీ హైదరాబాదు కేంద్రంగా జరిగినా వాటికి సంబంధించిన సమాచారం ఆంధ్రరాష్ట్రం నలుమూలలా చదువుకున్న వాళ్ళందరికీ అందింది. సరిగ్గా ఈ ఎనభయ్యో దశకంలో, ఫెమినిస్టు సాహిత్య విమర్శ కూడా ప్రారంభమైంది. కొన్ని అభిప్రాయాలతో మనకు ఏకీభావం లేకపోయినా, జయప్రభగారి "భావకవిత్వంలో స్త్రీ" (1986) తొలి తెలుగు ఫెమినిస్టు సాహిత్య విమర్శాగ్రంథం. భావకవిత్వం పురుషాధిపత్యానికి మరో రూపమేనని అందులో ఆమె చేసిన ప్రతిపాదన. (పద్మావతి ప్రకటించిన 'అస్పష్ట ప్రతిబింబాలు' సాహిత్య పరిధికి మించిన పరిశీలన) పి. లక్ష్మి రచించిన 'కవయిత్రుల కవిత్వంలో స్త్రీ మనోభావాలు' అనేది స్త్రీ చైతన్యదృష్టితో రాసిన రెండో గ్రంథంగా పరిగణించవచ్చు. తెలుగు కవిత్వంలో స్త్రీల కవిత్వానికున్న నిరాదరణకు పురుష సమాజ తిరస్కార తూష్ణీంభావ దృష్టి ఎట్లా కారణమైందో ఈమె చూపించింది. మనం విస్మరించిన ఆధునిక కవయిత్రుల నెందరినో వెలికితీసి, వాళ్ళు స్త్రీ మనోభావ చిత్రణలో చూపిన నైశిత్యాన్ని ప్రదర్శించింది. స్త్రీభావ చిత్రణలో జానపద సాహిత్యం ఏ విధంగా మెరుగో సోదాహరణంగా నిరూపించింది.

లక్ష్మి తన విమర్శ రాగద్వేషరహితంగా సత్యాన్వేషణ దృష్టితో చెయ్యటం ఈ పుస్తకంలోని ప్రత్యేకత. వీరేశలింగంగారు చేసిన సేవను గుర్తిస్తూనే ఆయనకున్న పరిమితులను గురించికూడా వివరించటం విశేషం. ముద్దుపళనిని గురించి అవమానకరంగా 'అది, దాని' అని రాయటం గురించీ, బెంగుళూరి నాగరత్నమ్మగారు అందుకు నిరసనగా తానే రాధికా సాంత్వనాన్ని తగు పీఠికతో అచ్చు వెయ్యటం గురించిన సమాచారం లక్ష్మి పేర్కొన్నది. 'స్త్రీ నీతిదీపిక' పేరుతో వీరేశలింగంగారు స్త్రీలకోసం రాసిన పద్యాల పుస్తకంలో చెప్పిన నీతులు మధ్యయుగాలనాటివని రుజువు చేసింది. ఆ సందర్భంలో లక్ష్మి ఉదాహరించిన రెండు పద్యాలివి:

వ్యవస్థ ఘనమైన నాతునిపజున గలుగు.
తప్పులను దుర్గుణంబుల దవతురాదు,
మర్యాదయైనను పరులతో మాటవరుస
నవిద వాని ప్రస్తావింప తగదవల్లయు.

పురుషుడూర లేకపోయిన పూబోడి
పూలు నగలు మేన పూనరాదు
నిలువగూడ దింతి తలవాకిటను చేరి
నాతి పెద్దపెట్టు నవ్వరాదు.

వీరేశలింగంగారు ఇంత రియాక్షనరీయా అని మనకు ఆశ్చర్యం కలిగించే పద్యాలివి.

జానకమ్మ అవే ఆమె 1857 ఏప్రిల్‌లో తొలిసారిగా బాలికలకోసం పాఠశాల స్థాపించారనీ, స్త్రీ విద్య కోసం మొట్టమొదటిసారిగా ఒక స్త్రీయే పూనుకోటం విశేషమనీ లక్ష్మి భావిస్తున్నది. పురుషుల ఉద్ధరణ కోసం స్త్రీలు ఎదురుచూడకుండా స్త్రీలే తమ అభ్యుదయ కార్యాలను చేపట్టాలన్న గాఢమైన ఆకాంక్ష లక్ష్మి కొన్నిచోట్ల వ్యక్తం చేసింది.

అట్లాగే పఠాభి 'ఫిడేలు రాగాల డజన్'ను స్త్రీ దృక్పథంతో నిశితంగా విమర్శించింది. "భావకవిత్వాన్ని హేళన చెయ్యబోయి స్త్రీని నీచంగా, క్రూరంగా చిత్రించాడు" అని పేర్కొన్నది. అట్లాగే దిగంబర కవులనూ విమర్శించింది. శ్రీశ్రీని కూడా స్పేర్ చెయ్యలేదు. "స్త్రీ పట్ల స్త్రీపురుష సంబంధాలపట్ల, స్త్రీ మనసుపట్ల శ్రీశ్రీ వెలిబుచ్చిన అభిప్రాయాలన్నిటినీ క్రోడీకరిస్తే, శ్రీశ్రీ దృష్టిలో స్త్రీని కేవలం భోగవస్తువుగా, సౌందర్య చిత్రంగా భావించినట్లు స్పష్టమౌతుంది" అని నిష్కర్షగా చెప్పింది. లక్ష్మి ఆధారాలు చూపించాక ఆమె చెప్పింది ఒప్పుకోకుండా ఉండటం కష్టం.

స్త్రీ దృష్టి నుంచి తెలుగు సాహిత్యాన్ని పరిశీలించే గ్రంథాల్లో ఈ పుస్తకానికి సముచిత స్థానం ఉంది. లక్ష్మిచేసిన ఈ పరిశీలనను మనసారా ఆహ్వానిస్తున్నాను. ఈ కృషి ఇంకా సాగాలని కోరుతున్నాను.

లక్ష్మి భావాలతో నాకు సంపూర్ణాంగీకారమే కాని భాషతో నాకు పేచీలున్నాయి, మనోప్రవృత్తి లాంటి సంధులను, మానసిక ఒంటరితనం లాంటి సమాసాలను, స్వాగతించు, అనుభూతించు వంటి క్రియలను అంగీకరించలేను. అట్లాగే పత్రికా భాషా ప్రభావంతో వాడిన "పిలుపు ఇవ్వటం, ధావజాలం, తనవంతు బాధ్యత, .... ఉద్భవించటం జరిగింది" వంటి ప్రయోగాలు మరీ అధికమై, పంటి కింది రాళ్ళలా ఆమె శైలికి అడ్డు తగులుతున్నాయి. అయితే వీటిని దోషాలుగా నిరసించటం లేదు. శైలి స్థాయిని తగ్గిస్తున్నాయని మాత్రమే. అయినా ఇవి అల్పవిషయాలు. చెప్పిన విషయాలు విలువైనవి. ఇంకా విలువైన విషయాలు చెప్పగల శక్తి సామర్థ్యాలు కనిపిస్తున్నాయి. వాటికోసం ఎదురు చూస్తాను.

పి. లక్ష్మి "కవయిత్రుల కవిత్వంలో
స్త్రీ మనోభావాలు" కు పీఠిక,
1992 సెప్టెంబరు 16

# అభినందన

సంకలనం అంటే కూడిక, చేర్పు అనే అర్థాలయినా సాహిత్యంలో కొంత విశేషార్థం వచ్చింది. సామ్యమూ, వైషమ్యమూ ఉన్న ఖండికలను ఏకత్ర సమావేశపరచినదాన్ని సంకలనం అని సాహిత్యంలో వ్యవహరిస్తున్నారు.

సంకలనం కాక్‌టెయిల్ లాంటిది. భిన్నరుచులను ఏకత్రీపరుస్తుంది. ఏకకాలంలో వైవిధ్యాన్ని అందిస్తుంది. సాహిత్య సందర్భంగా ఏకకాలం అంటే వ్యవధి ఏమంత లేని నాతివిస్తృత కాల ప్రమాణంగా గ్రహించాలి.

భాషను గురించి చెప్పటానికి సృజించుకున్న భాషను అధిభాష (**Metalanguage**) అంటారు. భాస్కరరావు రాసిన ఈ గ్రంథం సంకలనాలను గురించినది. ఈ పుస్తకాన్నిబట్టిచూస్తే ప్రపంచ లిఖిత భాషలన్నిటిలోనూ సంకలనాలున్నట్టున్నాయి. మౌఖిక భాషల్లో సంకలనాలుంటాయా? ఒకే విషయాన్ని గురించి నలుగురు ఒకచోట కూర్చుని నాలుగు విషయాలు మాటాడుకుంటే ఆ వ్యవహార ఖండికను విషయ సామ్యభేదాలను బట్టి సంకలనం అనొచ్చునేమో? అయితే మాటాడేభాషకు త్వరనాశం ఒక తప్పని గుణం కాబట్టి ఆ సంకలనాలకు స్థైర్యం ఉండదు. చరిత్రీ ఉండదు.

సంకలనాల్లో మాత్రమే కనిపించే కవులున్నారు. గాథా సప్తశతిలో కవులపేర్లు తెలుస్తున్నాయి కాని వారి ఇతర రచనలూ జీవిత విశేషాలూ తెలీవు. ఈ సంకలనమే లేకపోతే ఆ గాథ లేమైపోయి ఉండేవి?

ప్రబంధ మణిభూషణ సంకలనంలో సగానికిపైగా ఆకరాలు దొరకటం లేదంటే వారి రచనలు అదృశ్యమైనా ఈ భాగాలను మిగిల్చింది ఈ సంకలనమే కదా!

గాలిలో కలిసిపోయే వాటిని ప్రభాకరశాస్త్రిగారు పుస్తకంగా కూర్చబట్టి చాటుపద్యమణిమంజరి మనకు దక్కింది. ఈ అవసరాన్ని గమనించే లక్షణగ్రంథాల్లో ఉదాహృత పద్యాలను ఏరి ఆచార్య రవ్వా శ్రీహరిగారు అలబ్ధకావ్యముక్తావళి (1983) ప్రకటించారు.

సంకలనాల సాహిత్యసేవనుగురించి తక్కువ అంచనా వెయ్యలేము. ముద్దుకృష్ణగారి 'వైతాళికులు' లేకపోతే కొందరు భావకవులు అదృశ్యమయ్యేవారు. కొడవటిగంటి వెంకటసుబ్బయ్యగారిని గురించి మనకు తెలిసేదికాదు. ఆ కాలపు కవయిత్రులు ముగ్గురైనా 'వైతాళికులు' వల్లనే మనకు దక్కారు. వైతాళికుల్లో సంకలితం అయిన పద్యాలూ గేయాలూ ఇతరత్రా దొరకని రోజు రావచ్చు. ఆ మాటకొస్తే ఇప్పటికే ఆ స్థితి ఉంది. కవికొండల వెంకటరావుగారి పుస్తకాలు ఎక్కడ దొరుకుతున్నాయి? అంతేకాక సంకలన కర్త నేర్పునుబట్టి ఒక ధోరణికి సంపూర్ణ ప్రాతినిధ్యం వహించే పుస్తకం కూరిస్తే అది ఆ ధోరణినిగురించి రిఫరెన్సు పుస్తకంగా పనికొస్తుంది. వైతాళికులకు ఆ ప్రతిపత్తి వచ్చింది.

ఆ తరవాత వచ్చిన 'మహోదయం'కు ఆ గౌరవం దక్కలేదు. పునర్ముద్రణ భాగ్యానికి నోచుకోలేమ. తెలంగాణా కవుల సంకలనం ఉదయ ఘంటలు (1953) మళ్ళీ అచ్చుకాలేదు. సుమారు ఆ ప్రాంతాల్లోనే వచ్చిన 'కల్పన' కూడా మళ్ళీ అచ్చు కాలేదు. ఇవన్నీ మళ్ళీ అచ్చుకావాల్సినవి.

ఒక్కోసారి పత్రికల్లో మాత్రమే అచ్చయి, ఆయా కవుల గ్రంథాలు రానప్పుడు ఆ ధోరణికి సంకలనాలే రిఫరెన్సు గ్రంధాలు అవుతాయి. ఇటీవలి ఒకధోరణి స్త్రీ చైతన్యకవిత. ఈ ధోరణిలో జయప్రభ, కొండేపూడి నిర్మల, ఈశ్వరి, విమలల పుస్తకాలు దొరుకుతున్నాయి. కాని సావిత్రి, ఘంటసాల నిర్మల, పాటిబండ్ల రజని, రావులపల్లి సునీత వంటి కవయిత్రుల పుస్తకాలు దొరకవు. పుస్తకాలు వేయదగినన్ని ఖండికలు

వాళ్ళు రాయలేదు. కాని త్రిపురనేని శ్రీనివాస్ వేసిన "గురిచూసి పాడే పాట" (1990) అనే సంకలనం చూసి స్త్రీవాద కవిత్వం మీద వ్యాసాలు దంచేస్తున్నారు ఇటీవలి వ్యాసకర్తలు.

ఇటువంటి సంకలనాల గురించి డాక్టర్ జి. యస్. భాస్కరరావు "తెలుగులో సంకలనాలు" అనే పుస్తకం రాయటం ఆహ్వానించదగింది విజానికాయన తెలుగుదాటి ప్రపంచ సాహిత్య సంకలనాలను గురించి కూడ చెప్పాడు. ముఖ్యంగా ప్రాచీన సంకలనాలను గురించి ఎక్కువ విషయాలు చెప్పాడు. ఈ శతాబ్దపు తొలిరోజుల్లో వచ్చిన సంకలనాలను బాగా డిస్కవర్ చేశాడు.

కాని ఈయన చేసిన పొరపాటు ఇతని కలానికి సంకెళ్ళు వేసింది అన్ని ప్రక్రియల సంకలనాలను గురించి చెప్పబోయి ఏ ప్రక్రియలో సంకలనాన్ని గురించికూడా పూర్తిగా చెప్పలేకపోయాడు. ఏదో ఒక ప్రక్రియను మాత్రమే ఎన్నుకుంటే ఒకపాటి సమగ్రత అయినా సాధ్యమయ్యేది. సంకలనాలను గురించి చెప్పవలసింది చాలా ఉందనీ, చెప్పాల్సిన అవసరం ఉందనీ మనకు తెలియచెప్పటం వరకు ఈ పుస్తకం చెయ్యగలిగింది. ఒక్కొక్క శాఖగురించి తరవాత పరిశోధకులు లోతుగా పరిశీలించవచ్చు. ఈపనే భాస్కరరావు కాలక్రమంలో చెయ్యవచ్చు. ఆ దిశకు వేలు చూపిస్తున్నందుకు భాస్కరరావును అభినందిద్దాం.

డా॥ గొల్లకోట సూర్యభాస్కరరావు
"తెలుగులో సంకలనాలు"కు పీఠిక

1992 అక్టోబరు 4

# ఆ ఊరితో నా అనుబంధం

పేరులపాడు మా చెల్లెలి మెట్టిన ఊరు. అయినప్పటికీ నాకు పుట్టిన ఊరుతో ఉన్నంత అనుబంధం ఉంది. 1952లో ఇంటర్మీడియట్ తప్పి మళ్ళీ సప్లిమెంటరీ పరీక్షతప్పి మళ్ళీ కాలేజిలో చేరటానికి మధ్యనున్న ఖాళీలో చాలా భాగం ఆ ఊళ్లో గడిపాను. ఆ ఊరి సీతారామ గ్రంథాలయం నా ప్రధానాకర్షణ.

నా సాహిత్య వ్యక్తిత్వం ఏర్పడుతున్న కాలంలో ఒక ముఖ్యభాగం ఆ ఊళ్లో గడిచింది. నా వ్యక్తిత్వ వికాసానికి ఈ గ్రామంతో సంబంధం చాలా దోహదం చేసింది. నా ఆధునిక సాహిత్యాధ్యయనం సుమారుగా 1950 నుంచి (ఇంకొంచెం ముందేనేమో!) మొదలయిందనవచ్చు. నేను తప్పిన ఇంటర్మీడియేట్ రోజుల్లో (1950-1952) తెలుగు సాహిత్యాధ్యయనమే నా ప్రధాన వ్యాపకంగా ఉండేది. ఆ తరవాత దొరికిన ఖాళీలోకూడా అదేపని. నా డిగ్రీ చదువులకు గండ్లుపడ్డాయి. కాని సాహిత్యాధ్యయనం మాత్రం అవిచ్ఛిన్నంగా సాగింది.

మా చెల్లెలి అత్తవారింటికి సీతారామ గ్రంథాలయం కొన్ని గజాల దూరమే. ఆ గ్రంథాలయంలోనే భారతి సంపుటాలు తిరగేశాను. అక్కడే త్రిపురనేని రామస్వామిగారి సూతపురాణం వేరు వేరుగా అచ్చయిన నాలుగాశ్వాసాలు చదివాను. భావకవుల్లో చాలామంది పరిచయం ఆ గ్రంథాలయంలో పుస్తకాల ద్వారా జరిగింది. సహదేవ సూర్యప్రకాశరావుగారి వకుళమాలిక అక్కడే చదివాను. ఆ గ్రంథాలయంనుంచి తెచ్చుకొనే ఎంకిపాటలు కూనిరాగాలు తీశాను. భాస్కర రామాయణంవంటి క్లాసిక్సుకూడా అక్కడే చదివినట్టు గుర్తు.

రాజమండ్రిలో డాక్టరు వృత్తిలోఉన్న సూర్యదేవర రామమోహనరావును పోలీసులు ఎత్తుకుపోయి మాయం చేశారు. వాళ్ళమ్మ మా చెల్లెలి

అడబడుచు. ఆమె చిన్నతనంలో భద్రపెట్టుకున్న మనుచరిత్ర - కొమండూరి అనంతాచార్యులుగారి వ్యాఖ్యతో ఉన్నది ఆ రోజుల్లోనే నా సొంతం చేసుకున్నాను. ఇప్పటికీ ఇది ఇంకా నాదగ్గరే భద్రంగా ఉన్నది.

నా ముత్యాలసరాల సాధన. అధ్యయనం అక్కడే మొదలయింది. ఇప్పుడు లేరుగాని చావ రామలింగయ్యగారు (1916-1986) నాకు ముత్యాలసరంలో ఒడుపులు నేర్పారు. అప్పుడప్పుడు వేళ అయితే వారింట్లోనే భోజనం చేస్తూ రామలింగయ్యగారితో జరిపిన సాహిత్యగోష్ఠుల మధురానుభూతులింకా మాసిపోలేదు. ముత్యాలసరంలో ముఖ్యంగా పాదాంతంలో విరుపులేకుండా తరువాత పాదంలోకి చొచ్చుకుపోయే రన్-ఆన్‌పద్ధతీ, బిందుపూర్వకప్రాస పాటిస్తే వచ్చే ధ్వనిమాధుర్యమూ, నాలుగోపాదంలో అర్ధపాదంమీద గురువు (గురువుగా ఉచ్చరించదగిన లఘువు) వేసి దీర్ఘంతీసి చదివే పద్ధతీ ఆయనదగ్గరే నేర్చుకున్నాను. ఆయన దగ్గర అభ్యుదయ రచయితల గురించి కూడా కొంత తెలుసుకున్నాను. వట్టికొండ రంగయ్యగారిపై, చిరుమామిళ్ల పార్థసారధి గారిపై, ముత్యాలసరాల గురించి ఆయన దగ్గరే విన్నాను.

ఆ ఊళ్లో మాచెల్లెలి అత్తగారింటికి ఎదురుగా జంగా వారి ఇల్లుండేది. అష్టావధాని జంగా హనుమయ్యగారు (1888-1947) సత్యావివాహము అనే అచ్చ తెలుగుప్రబంధమూ. ఆ ఊళ్లో ప్రదర్శనకోసం జానకీ పరిణయము అనే నాటకమూ ఆ ఇంట్లోఉండే రచించారు. వారి మనుమడు పాటిబండ్ల చంద్రశేఖరావు (కేంద్రప్రభుత్వంలో లా సెక్రటరీ. పి. సి. రావుగా ఢిల్లీలో ప్రసిద్ధుడు) ద్వారా అప్పుడా పుస్తకాలు సంపాయించి చదివాను కూడా ముందుగు. మాభూమి అనే ప్రసిద్ధ నాటకాల సహరచయిత వాసిరెడ్డి భాస్కరరావుగారు జంగా హనుమయ్యగారిదగ్గరే సంస్కృతాంధ్రాలు చదువుకొన్నారు.

ఆ ఊరు రామస్వామి చౌదరిగారి (1887-1943) అత్తగారి ఊరు. హనుమయ్యగారు ఆయన సమకాలికులు, దాదాపు సమవయస్కులు. రామ

స్వామిగారి అభిప్రాయాల ప్రభావం హనుమయ్యగారిమీద ఉన్నట్టు తెలు స్తుంది. అసలా ఊరిమీదే ఆయన ప్రభావం ఉన్నదనుకొంటాను. ఆయన రచించిన వివాహ విధి పద్ధతిలో దండమార్పిడి పెళ్ళిళ్ల అర్ధశతాబ్దం కిందటే ఆ ఊళ్లో జరిగాయని తెలుస్తున్నది.

ఎంతో గొప్పరచయిత్రి కావల్సిన వాసిరెడ్డి కాశీరత్నం గారిది ఆ ఊరే. తెలంగాణ సాయుధపోరాటంలోకి దూకిన ప్రియుణ్ణి తల్చుకుని విషాద వీరభావాల సమ్మిశ్రణంతో ప్రియురాలి భావనలను లిరికల్‌గా పోయెటిక్‌గా కాశీరత్నంగారు రచించిన కథ ఒకటి అక్కడి రాతపత్రికలో చదివాను. ఆ తరువాతే ఆమె పరిచయం. ఛందస్సుతో పరిచయం లేకుండా కవితావేశంతో రచించిన ఆ కథలో పాటల చరణాల్ని వేరుచేసి 1958 లో అభ్యుదయ పత్రికలో ప్రకటించాను. ఇప్పటికీ ఆ సంపుటం హైదరాబాదు సిటీ సెంట్రల్ లైబ్రరీలో ఉంది. ఆ తరువాత ఆమె చాలా మంచి కథలు రాశారు. వాటిలో కొన్నిటిని కాపీచేసి నేనే పత్రికలకుపంపేవాణ్ణి. అవి కొన్ని స్వతంత్ర వార పత్రికలో అచ్చయ్యాయి. ఆమె వచనం కవితాత్మకంగా. భావశబలంగా ఉం డేది. ఆమె ఉత్తరాల్లో కొన్ని కవితాత్మక వాక్యాలకు, ఛందస్సు దుస్తులు వేసి స్వతంత్రలో "గుచ్చని పూలు" అనే గేయంగానూ. "ఏనాడో" అనే పేరుతో ముత్యాలసరాల కావ్యఖండికగానూ స్వతంత్రలో (1958 ఫిబ్రవరి 1. 1957 నవంబరు 30) ప్రకటించాను.

ఆమె పేరు అప్పుడు ఆ ఊళ్లోనే కాక చుట్టుప్రక్కల ఊళ్లలో ము ఖ్యంగా మా బంధువర్గంలో బాగా వినిపించేది. ఆమె సభల్లో పాటలుపాడారు. వేషాలుకట్టారు. కమ్యూనిష్టు ఉద్యమంలో జైలుకి వెళ్లారు. ఆ తరువాత గొప్ప రచయిత్రి కాబోయి మానేశారు. ఆమె మంచి భావుకురాలు. అట్లా మిగిలిపోయినా బాగుండేది. కొన్నాళ్ళు జనతాపార్టీ. ఆ తరువాత తెలుగు దేశం పార్టీ రాజకీయాల్లో మునిగిపోయారు.

కాశీరత్నంగారి భర్త వాసిరెడ్డి నారాయణరావుగారు చాలాకాలం డైరీ ఫారాల డైరెక్టరుగా చాలా ఊళ్లలో పనిచేశారు. ఆయన్ని ముద్దుగా గొడ్ల నారాయణరావుగారనే వాళ్లం. హైదరాబాదు ఫిషరీస్‌లో పనిచేసిన చేపల నారాయణరావుగారినుంచి వేరుచెయ్యటానికిల్లా అనేవాళ్లం. గొడ్ల నారాయణ రావుగారు పశువులను ఎంత ప్రేమిస్తారో! ఆయన మరోచోటికి బదిలీఅయితే వెనక పనిచేసిన ఊరికి వెళ్లి అక్కడి పశువులను పేరుపేరునా పరామర్శించి వచ్చేవారు.

ఆ ఊరినుంచి వచ్చి హైదరాబాదులో నివాసం ఏర్పరచుకున్న స్వాతంత్ర్య యోధురాలు సూర్యదేవర రాజ్యలక్ష్మిగారు (1914). తెలుగుదేశం అనే పత్రిక 1948 ప్రాంతంలో నడిపారు. ఆ పత్రికలో కవి అజంతా పని చేశారు. నా తొలినాళ్ల పద్యాలు కొన్ని ఆ పత్రికలో అచ్చయ్యాయి.

భావ అభ్యుదయ కవిత్వాలకు వారధిగా నేను వర్ణించిన వట్టికొండ రంగయ్య (1913-)గారిది ఆ ఊరే. రచయిత్రి వట్టికొండ విశాలాక్షి (1920 గారు రంగయ్యగారి భార్య. భారతనారి పేరుతో భారతిలో ప్రకటించిన ఆమె పెద్దకథ ఆమెకు మంచి పేరు తెచ్చింది. ఆమె అభ్యుదయ గీతాలను నలభయ్యో దశాబ్దంలో సభల్లో పాడుకునేవారు.

'రచన' 1992 ఏప్రిల్ సంచికలో హైమా భార్గవ్ వర్ణించిన నిజాయితీపరుడైన ఫారెస్టు ఆఫీసరు సూర్యదేవర సూర్యనారాయణ (1938-) ఆ ఊరివాడే. చంద్రాపూర్ నాగపూర్ ప్రాంతాల్లో పనిచేస్తూ అనేక కష్టనష్టాలకు గురయినా అవినీతి అక్రమాలపై యుద్ధం మానని నిజాయితీపరుడు ఆ ఊరి వాడు కావటం వీరులపాడు వారికి గర్వకారణం.

నర్తకిగా ప్రసిద్ధురాలు వాసిరెడ్డి కనకదుర్గ ఆ ఊరికోడలు. తమ గ్రామం వీరులపాడు అని సగౌరవంగా సగర్వంగా చెప్పుకుంటారామె. సాంప్రదాయిక నృత్యాలేకాక శ్రీశ్రీవంటి ఆధునిక కవుల విప్లవగేయాలనుకూడా

అభినయానికి మలచుకున్న సృజనాత్మక నర్తకి కనకదుర్గ. ప్రస్తుతం విజయవాడ నివాసి. ఆ ఊళ్లో పుట్టినవారూ, పెరిగినవారూ, కోడళ్లూ అల్లుళ్లూ ఎందరు ప్రసిద్ధులయ్యారో! జాతీయోద్యమంలో సంస్కరణోద్యమాల్లో కమ్యూనిస్టు ఉద్యమంలో కాకలు దీరిన యోధుల్ని కవులనూ, రచయితలనూ ఎందర్ని కన్నదో! ఎందర్ని కడుపులో పెట్టుకొని పోషించిందో!

ఒకప్పుడు వీరులపాడు గురించి చుట్టుప్రక్కల ఊళ్లలో బోలెడంత ఫోక్‌లోర్ ప్రచారంలో ఉండేది. పొలం దున్ని అరకతోలుకొని ఇంటికొచ్చే రైతును ఎక్కడినుంచి వస్తున్నారని ఎవరన్నా ఎదురై పరామర్శిస్తే "పొలం దున్నించి వస్తున్నా" అంటాడట! ఆ ఊరి మధ్యతరగతి ఆడవాళ్ల అనుభవించిన స్వేచ్ఛను మిగతా ఊళ్లవాళ్లు కథలు కథలుగా అసూయతో చెప్పుకునేవారు. ఆ ఊరి పొలాలు ఎక్కువ ధరలు పలికేవి. సపోటాలు, నారింజకాయలు, మామిడిపళ్ళు ఆ ఊరితోటలనుంచే కావిళ్లగా తట్టలుగా వెళ్లేవి. అక్కడి పంటలు చేతికి రాకముందే అమ్ముడుపోయేవి. ఆ ఊరినుంచే ఫ్యాషన్లు చుట్టుపక్కల ఊళ్ళకు అందేవి. అశ్లీలపదాలు లేకుండా అక్కడి నాగరకులు మాట్లాడేభాష చుట్టుపక్కల గ్రామాలవారికి ప్రామాణికభాషగా చెలామణీ అయ్యేది. ఒక రకమైన సాంస్కృతిక కేంద్రంగా చాలా కాలం ఉండేది.

కమ్యూనిస్టు ఉద్యమమూ, ఆ ఊరి ప్రాభవమూ సమాంతరంగా క్షీణించ సాగాయి. ఉద్యమాల్లేవు. ఉపన్యాసాల్లేవు. ధరలమాటేమోగాని పంటలు పండటం మానేశాయి. ఆ ఊరిలో ఒక తరంలో బహుశా 1955 ప్రాంతం నుంచి అనుకుంటాను పెద్దఎత్తున ప్రజలు ఇతరప్రాంతాలకు వలసపోయారు. హైదరాబాదు నగరంలోనే కొన్నివందలమంది ఉండొచ్చు.

ఆ ఊరివారిని ఒక నిస్సత్తువ ఆవరించింది. నిస్తేజం గూడు కట్టుకుంది. వైభవం కదిలిపోయింది. ఉత్సాహం కరిగిపోయింది. కళాకాంతులు మాసిపోయిన మామూలు ఊరు అయింది.

మెట్ట కృష్ణామండలంలో ఒకప్పుడు నాగరికతకు కేంద్రమైన వీరుల

పాడు గత వైభవాన్నీ వర్తమాన దైన్యాన్నీ ఎన్నెన్నో వివరాలనూ కళ్లకు కట్టినట్టు చిత్రించారు పాటిబండ్ల వెంకటపతి రాయలుగారు 2087 పేజీల గ్రంథంలో. ఇదే చరిత్రగతిలో చైతన్యవాహిని. రెండు శతాబ్దాల వీరులపాటి చరిత్ర.

వెంకటపతి రాయలుగారు, (1914-) ఆ ఊళ్లో ఉపాధ్యాయులుగా పనిచేశారు. ఏడు పదుల పైబడ్డ ఆయన జీవితం ఈ శతాబ్దపు ఊరిచరిత్రకు ప్రత్యక్ష సాక్ష్యం. తాను తనపెద్దలనుంచి పూర్వులనుంచి పరంపరగా విన్నదీ, తాను స్వయంగా కన్నదీ, తాను సేకరించినదీ అంతా కలిపి ఈ గ్రంథాన్ని తయారు చేశారు. స్థానికుడురాసిన స్థానికచరిత్ర ఇది. ఊరి పరిసర ప్రకృతి జనాభా వివరాలు, పట్టభద్రుల వివరాలు, ఆచార వ్యవహారాలు, వేషభూషా భాషలు, చదువు సంధ్యలు పాడి పంటలు, వివిధోద్యమ వికాసాలు, ప్రముఖుల జీవిత విశేషాలూ. ఒకటేమిటి అన్నీ గుది గుచ్చి వీరులపాడు గ్రామ విజ్ఞాన సర్వస్వాన్ని కూర్చారు, ఆ ఊరికి పేరు తెచ్చిన పెద్దల, పిన్నల జీవితవిశేషాలు ఫోటోలతో సహా సేకరించగలిగారు.

ఇంతవరకు తెలుగులో ఇటువంటి గ్రంథం ఇంకొకటి నేను చూడలేదు. ఉజ్జ్వల చరిత్ర ఉన్న ఊరిచరిత్ర ఇది. తెలుగులో సమగ్రరాజకీయ, సాంస్కృతిక, సాంఘిక చరిత్ర నిర్మాణానికి అత్యవసరమైన గ్రంథం. ఇట్లాంటి అనేకగ్రంథాలకు ఇది ఒరవడి అవుతుందని నా నమ్మకం. ఇట్లాంటి పుస్తకాలు ఇంగ్లీషులో కూడా వస్తే నిజమైన భారత చరిత్ర నిర్మాణానికి బాటలు ఏర్పడతాయి.

ఈ పుస్తకం భారతప్రజల చరిత్రలో ఒక క్రాస్ సెక్షన్. తెలుగు సాంస్కృతిక చరిత్రలో ఒక కేస్ స్టడీ.

పాటిబండ్ల వెంకటపతి రాయలు "చరిత్రగతిలో చైతన్యవాహిని వీరులపాడు" పీఠిక. 1992 నవంబరు 11

# సంపాదకీయం

"దేశంలో భారతీయ సంస్కార ప్రవాహాలు ఇంకిపోయినవి. విద్యాపీఠాలు అస్తమించినవి. గురుకులాలు రూపు మాసినవి. భారతీయ సంస్కారం లేని కేవల పాశ్చాత్యసంస్కారం బలప్రదం కాక ఆత్మవిముఖత్వాన్ని పరసంస్కార దాస్యాన్ని మనకు ఆపాదించినది."

ఈ పుస్తకం చివర రాసిన పైమాటల్లో అక్కిరాజు ఉమాకాంతం (1889-1942) గారి సర్వసాహిత్య కృషి నేపథ్య సారాంశం తెలుస్తుంది. ఆయన జీవించింది 53 సంవత్సరాలే అయినా అమోఘమైన పాండిత్యంతో, అసమాన వాదపటిమతో అవిచ్ఛిన్న సారస్వత వ్యాసంగంతో తెలుగు సాహిత్య లోకంలో చిరకాలంగా పాతుకుపోయిన విశ్వాసాలను కుదిపివేసిన సాంస్కృతిక విప్లవకారుడు అక్కిరాజు ఉమాకాంతంగారు. ఆయన వ్యక్తిగత జీవితం గురించి తెలుసుకోటానికి ఆయన జీవిత చరిత్ర ఎవరూ రాయలేదు. తెలుగు విజ్ఞాన సర్వస్వము మూడవ సంపుటంగా వచ్చిన 'తెలుగు సంస్కృతి' వాల్యూము (1959)లో అబ్బూరి రామకృష్ణారావుగారి ఒక పేజీకి మించని చిన్న నోటూ, వావిళ్ళ వేంకటేశ్వర శాస్త్రులు గారి శత జయంతి సంపుటం (1986)లో "త్రిలిఙ్గ తొలినాళ్ళ సంపాదకులు ఉమాకాంత విద్యా శేఖరులు" అనే పేరుతో అక్కిరాజు రమాపతిరావుగారి అయిదు పేజీల చిరువ్యాసమూ మాత్రమే ప్రధానప్రయత్నాలుగా కనిపిస్తున్నాయి.

అక్కిరాజు ఉమాకాంతంగారు గుంటూరు జిల్లా పల్నాడు తాలుకా గుత్తికొండ అనే చిన్నగ్రామంలో లక్ష్మమ్మ, లక్ష్మీనారాయణ దంపతులకు జన్మించారు. గుత్తికొండకు సుమారు ఏడెనిమిది మైళ్ళ దూరంలో ఉన్న జానపాడు అనే ఊళ్ళో సంస్కృత భాషాభ్యాసం చేశారు. శిష్టా సీతాకాంత శాస్త్రి గారు వీరి గురువుగారు. ప్రస్తుత గ్రంథంలో మొదటి శ్లోకంలో వారి ప్రస్తావన ఉంది. పది హేను పదహారేళ్ళ వయసులో గుంటూరు లూథరన్

క్రిస్టియన్-పార్టీ హైస్కూలులో ఇంగ్లీషు చదువులు చదివారు. మెట్రిక్యులేషన్ చదివే రోజుల్లో ఈయన శతావధానం చేశారు. బెజవాడలో, కన్యకా పరమేశ్వరి హిందూ పాఠశాలలో కొన్నాళ్ళు తెలుగు పండితులుగా ఉద్యోగం చేశారు. 1912లో తెరచిన ఆంధ్రసాహిత్య పరిషత్తు మద్రాసు కార్యాలయంలో జయంతి రామయ్యగారి ఆహ్వానంపై కొన్నాళ్ళు మేనేజరుగా పనిచేశారు. వేషధారణపై వచ్చిన పేచీ వల్ల ఉమాకాంతంగారు ఉద్యోగం మానేసినట్లు రఘుపతిరావుగారు పైన పేర్కొన్న వ్యాసంలో రాశారు. ఈయన బెంగాల్‌లో నవద్వీప సంప్రదాయాన్ననుసరించి భాష్యాంతముగా సంస్కృత వ్యాకరణమూ, తర్కశాస్త్రమూ, అభ్యసించి 'విద్యాశేఖరు'లైనారని అబ్బూరి రామకృష్ణారావుగారు రాశారు. "తమ తర్క వ్యాకరణ విద్యా వ్యాసంగాన్ని వంగ దేశంలో జరుపుతూ వచ్చారు. వంగ సాహిత్య వేత్తలతో సాహచర్యంవల్లా, లోకజ్ఞానంవల్లా స్వానుభవంవల్లా వంగ సాహిత్యాభ్యుదయానికి గల కారణాలను వివేకంతో సూక్ష్మంగా పరిశీలించడంవల్లా తమకు కలిగిన జ్ఞానాన్ని ఆధారంగా తీసికొని తమ మాతృభాష అయిన తెనుగును పరామర్శించడం ఆరంభించారు." అని అన్నారాయన. ఆయన వావిలికొలను సుబ్బారావుగారి తరవాత (1929లో) మద్రాసు ప్రెసిడెన్సీ కళాశాలలో అధ్యాపకులుగాపనిచేశారు. 1913-1914 మధ్యకాలంలో త్రిలిఙ్గ పత్రిక సంపాదకులుగా పనిచేశారు. 'త్రిలిఙ్గ' అనే పేరు ఆయన పెట్టిందేనని త్రిలిఙ్గ రజతోత్సవ సంచిక (1944)కు పంపిన సందేశంలో పేర్కొన్నారు. ఆ సందేశంలో ఇంగ్లీషులో కామెంటు (comment) అనే మాటకు పర్యాయంగా వ్యాఖ్యా శబ్దాన్ని పరీక్ష పత్రాల్లో తానే మొదట వాడినట్టు పేర్కొన్నారు.

1913-1914 సంవత్సరాల మధ్యలో ఆయన త్రిలిఙ్గ పత్రికలో కథలు రాశారు. 1918 లో ఇవి త్రిలిఙ్గ ఛిన్నకథలు పేరుతో సంకలితం అయ్యాయి. ఉమాకాంతంగారు తమ కథల పీఠికలో 'ఇట్టి కథల వాఙ్మయము తెలుగువకు క్రొత్తది' అని గుర్తించారు. అప్పటి కాయన రచనా

శైలి ప్రాచీన భాషకు సన్నిహితం. సంధి నియమాలను సడలించి "ఆధునిక రచనాభాషను ఏర్పరచటానికి ఉమాకాంతం గారు కూడా కృషి [illegible] ఈ సంపుటం ద్వారా తెలుసుకోవచ్చు. ఈయన కథల్లో కూడా తొలినాటి ఇతరుల కథల్లో లాగే లక్ష్యం-సాంఘిక సంస్కరణే, మూఢ విశ్వాసాల నిర్మూలనే. బ్రాహ్మణ సమాజంలో పాదుకొన్న మూఢ విశ్వాసాల వల్ల స్త్రీల బతుకుల్లో ఉన్న బాధల్ని వివిధ రీతుల్లో ఈ కథల్లో వర్ణిస్తారు.

ఈ కథల్లో 'ఎదుగని బిడ్డ' ఆంధ్ర సాహిత్యాన్ని కన్న తెలుగుతల్లి ఉత్తమ పురుషలో చెప్పిన కథ. చివరివరకు ఎలిగొరీ అనే కథా-శిల్పాన్ని పాటించిన ఈ కథలో 'ఆంధ్ర సాహిత్యం ఎప్పుడూ ఎదుగని బిడ్డయే' అని తమ నిశ్చితాభిప్రాయాన్ని వెల్లడించారు. సుమారు పాతికేళ్ళ ప్రాయం నుంచి ఆయనకు తెలుగు సాహిత్యంపై సదభిప్రాయం లేనట్టు ఈ కథను బట్టి మనం తెలుసుకోవచ్చు. అదల్లా ఉంచి ఎలిగొరీ పద్ధతిలో ఉత్తమ పురుష కథనంలో రాసిన మొదటి తెలుగు కథ ఇదే కావచ్చు.

తెలుగు సాహిత్యంలో అభివృద్ధి కాని నూతన ప్రక్రియలను అభివృద్ధి చెయ్యాలనే ఆకాంక్ష ఆయనకు గాఢంగా ఉన్నట్టు తెలుస్తున్నది. ఆ కోరికే ఆయన చేత చిన్ని కథలను రాయించింది. ఫిలిప్ మెడోస్ టైలరు (Philip Meadoues Tailor, 1808-1876) అనే ఆంగ్ల నవలాకారుడు రచించిన సుల్తాన్ నవలను ఆంధ్రీకరించి 1912 నవంబరులో ప్రకటించారు. ఈ నవల పీఠికలో కూడా ఆంధ్ర సాహిత్య స్థితిని గూర్చిన చర్చ ఉంది. టైలరు హైందవ సంప్రదాయాభిమాని కావటం వల్ల అతని రచనను తెలిగించానని ఉమాకాంతం గారు పీఠికలో చెప్పుకున్నారు.

'ఉమాకాంతం గారు 1921 లో తెలుగుదేశ వాఙ్మయ పత్రికను స్థాపించి సంస్కృత వ్యాకరణ ప్రదీపం, పాణినీయ ఆంధ్ర వివరణము తనుమధ్యమాంతి, నైషధ జిజ్ఞాస వంటి ప్రశస్త రచనలు వెలువరించారు' అని అక్కిరాజు రమాపతి రావుగారు రాశారు.

"లౌకిక దృష్టితో చెప్పుకోదగిన సంఘటన లేవీ ఆయన జీవితంలో లేవు. సౌందర్యానికి తగిన శరీర దార్ఢ్యం ఆయన కెన్నడూ లేకపోయింది" అని అబ్బూరి రామకృష్ణారావు తెలుగు విజ్ఞాన సర్వస్వంలో అన్నారు.

ఉమాకాంతంగారి రచనలపై సమగ్ర సమీక్ష జరగలేదు. సంపూర్ణ మైన అంచనా రాలేదు. ఆయన రచనలు దొరికినంత వరకూ (అన్నీ దొర కవు) పరిశీలిస్తే ఆయనకు తెలుగు సాహిత్యంపై నిర్దిష్టమైన అభిప్రాయాలు విలక్షణమైన ఆలోచనలు ఉన్నట్టు తెలుస్తున్నది. ఆయన రచనలన్నింటా తెలుగు సాహిత్య స్థితిని గూర్చి ఆవేదన కనిపిస్తుంది. ప్రచురణ వివరాలు దొరకలేదు గాని రమాపతి రావుగారి సౌజన్యం వల్ల ఆయన చిన్న చిన్న వ్యాసాలు కొన్ని దొరికాయి.

సాంఘికంగా ఆయనకు అభివృద్ధికర భావాలే ఉన్నట్టు సాంఘిక సంస్కరణలకు ఆయన అనుకూలుడే అయినట్టూ ఆయన కథలను బట్టేకాక ఆయన విడివిడి వ్యాసాలనుబట్టి కూడా చెప్పవచ్చు. "తెలుగు దేశము నందలి చండాలురు" అనే వ్యాసంలో 'చండాలురని చెప్పుటకు ఏ ప్రమా ణము లేని మాదుగులను ఆంధ్రదేశము నందలి మొదటి తెగలగు చెంచులు బలిజెలు మొదలైన వారివంటి మాదుగులను అస్పృశ్యులుగా బాధించు చున్నాము. ఊళ్ళనుంచి బయటికివెళ్ళగొట్టినాము. బావుల వద్దకు రానీయము. దేవాలయములలో ప్రవేశించనీయము. ఇంతకంటె తెలుగుదేశము ఆచరించు చున్న అధర్మము మఱియొకటి లేదు. ఈ మరాచారము అప్రామాణికమైనది. అనర్థహేతువైనది అని చెప్పుచున్నాను- అని నిర్ద్వంద్వంగా ప్రకటించారు.

విదేశయానం చేసినందుకు వేదింపల్లి నరసింహారావుగారిపై తెచ్చిన అభియోగానికి ఉమాకాంతంగారు కోర్టులో సాక్ష్యం ఇచ్చారు. దాన్ని ఒక విపులమైన వ్యాసంగా రాస్తూ సముద్రయానం చెయ్యటం వల్ల పతితులవటా నికి శాస్త్ర ప్రమాణం లేదని విశదీకరించారు.

ఉమాకాంతం గారు సాహిత్యాంశాలపై తమ అభిప్రాయాలను నిర్భయంగా వెల్లడించారు. ఎంతటి గొప్పవారి అభిప్రాయాలను ఖండించటానికైనా వెనుదీసేవారు కాదు. మద్రాసు విశ్వవిద్యాలయంలో 1923 సంవత్సరానికి పెట్టిన పురాణపండ మల్లయ్యశాస్త్రిగారి శుక్రనీతిని విమర్శిస్తూ 'బ్రదిమి, ఏనిక, దిగ్గియ, ఒండె ఉబుపా, ఎకిమీడు' వంటి పాతపడ్డ మాటలను వాడటాన్ని నిరసించారు. ఆ పుస్తకానికి యోగ్యతాపత్రిమిచ్చిన జయంతి రామయ్యగారి స్వవచో వ్యాఘాతాలను ప్రదర్శించారు.

ఇంగ్లీషు పాఠ్య నిర్ణాయక సంఘంలో ప్రెసిడెన్సీ కాలేజీలో ఇంగ్లీషు బోధించేవారిని వేసి, తెలుగు పాఠ్య నిర్ణాయక సంఘంలో తెలుగు బోధకులను వేయక పోవటాన్ని నిరసించారు.

విజ్ఞ చింతామణి ద్వితీయ వ్యాఖ్యాన సభలో వేదం వెంకటరాయశాస్త్రిగారు కట్టమంచి రామలింగారెడ్డిగారు వెలిబుచ్చిన అభిప్రాయాలతో తీవ్రంగా విభేదిస్తూ వాఙ్మయపత్రికలో వ్యాసాలు రాశారు. ఆముక్త మాల్యదలో చాలా గొట్టుమాటలున్నాయి కాబట్టి అది గొప్ప కావ్యం అయినట్టు వేదం వెంకటరాయశాస్త్రి గారన్నారని చెపుతూ ఆ మాటలందు నాకు ప్రమాణ బుద్ధి కలగలేదు అన్నారు. మనుచరిత్రలో రసాభాస ఉన్నది కాబట్టి దాన్ని మంచి కావ్యం కాదన గూడదన్నారు (అంతమాత్రం చేత మనుచరిత్ర ఉత్తమ కావ్యమనికాదు. ఇతర కారణాలు చూపించాలని ఆయన అభిప్రాయం.) రసాభాస నిషిద్ధం కాదని అంగంగా ఉండవచ్చునని సిద్ధాంతం చేశారు. ఇంతకీ మనుచరిత్రలో ఉన్నది రసాభాస కాదని వరూధిని కది వాస్తవమేనని వాదించారు. ఆ సందర్భంలోనే మనుచరిత్రను పెద్దన రచించ లేదనీ, కృష్ణరాయలు రచించాడనీ కట్టమంచి రామలింగారెడ్డిగారు చేసిన అభాషణాన్ని విమర్శిస్తూ "కృష్ణరాయలు రచించినా కృష్ణశ్రేష్ఠి రచించినా, కృష్ణమాత్యుడు రచించినా, కృష్ణభట్టు రచించినా పుస్తకములోవి మంచి చెడ్డలు మారవు

గనుక ఆ వివారణ నేనిక్కడ పెట్టుకోలేదు" అని వస్తుగత విమర్శ ప్రాముఖ్యాన్ని నొక్కి చెప్పారు.

కట్టమంచి రామలింగారెడ్డిగారు మద్రాసు గోక్లేహాల్లో ఇచ్చిన ఉపన్యాసాన్ని పత్రికల్లో చదివి వాఙ్మయ పత్రికలో విమర్శించారు. రామాయణం కంటే భారతం ప్రాచీనం అని రెడ్డిగారు ఉపన్యాసంలో చెప్పారు. భారతం కావ్యం కాదు సంహిత అని రెడ్డిగారన్నారు. భారతం కావ్యమేనని, భారతం కంటే రామాయణం పూర్వమని ఉపపత్తులను ప్రదర్శిస్తూ ఉమాకాంతంగారు వాదించారు. ఆ సందర్భంగా "వాస్తవముగా సంఘమును సంస్కరింపవచ్చును. సర్వసమత్వము ప్రతిష్ఠించ యత్నించవచ్చును. వీటికన్నిటికి రామలింగారెడ్డిగారు మరికొన్ని మార్గములు అవలంబించ వలసియున్నదిగాని భారత వర్షేతిహాసములను గురించి భారతీయుల ప్రాచీన వాఙ్మయము గురించి తెలిసీ తెలియని మాటలు మాట్లాడుట మాత్రము అనుచితమైన కార్యము" అని స్పష్టంగా నిశ్చయంగా ప్రకటించారు.

"నైషధ తత్త్వ జిజ్ఞాస" అనేది సంస్కృత నైషధ కావ్యంపై విమర్శ. శ్రీహర్షుని మేధాశక్తిని పాండిత్యాన్ని ప్రశంసిస్తూనే నైషధము ఉత్తమకావ్యం కాదని తేల్చారు. శ్రీహర్షుని కాలానికి భారతదేశంలో శాస్త్ర పరిశ్రమ హెచ్చినదని కావ్యగుణం తగ్గిందని వివరించారు. "అది గొప్ప విమర్శనము బయలుదేరిన సమయము. గొప్ప కవిత్వము కుంటువడిన సమయము" అని అభిప్రాయ పడ్డారు. అందుకు కారణాలను అన్వేషిస్తూ "ఏనాడు అర్థము యవన హస్తగతమైనదో ఆనాడే భారతీయుడు పరాధీనతను ప్రాపించెను.... ఆర్య సంప్రదాయములు క్రమక్రమముగా విచ్ఛిన్నము లాయెను. మహమ్మదీయుల విషయ లోలత్వము దేశమున వ్యాపింప జొచ్చెను." అని దేశపరిస్థితులను వివరించారు. భారతదేశ సాంస్కృతిక పతనానికి మహమ్మదీయులు కారణంగా భావించే ఒక అలోచనాధోరణి మన దేశంలో చాలా కాలంగా ఉన్నది.

అక్కిరాజు ఉమాకాంతం గారి సంస్కృతభాషాపాండిత్యం, ప్రాచీన భారత సంస్కృతిపై ఆయనకున్న అభిమానం, ఎరిగిన వారికి ఆయన ఈ ఆలోచనారీతి ఆశ్చర్యకరం కాదు. హిందువులలో సంస్కరణ లాయన కిష్టమే. మహమ్మదీయుల విషయములో ఆయనపై ఆర్య సమాజపు ఆలోచనా ధోరణి ప్రభావం ఉండి ఉండవచ్చును.

గుంటూరు జిల్లా కారెంపూడిలో 1928 జూన్ 9 న జరిగిన సభలో చేసిన ఉపన్యాసం "ఆంధ్ర భాషోపన్యాసం"గా అచ్చయింది. అందులో 'నాకు దేశ భాషోద్యమములో విశ్వాసముగలదు. విజ్ఞాన వ్యాప్తి దేశ భాష యందు వలె అన్య భాషయందు జరుగ నేరదు" అన్నారు. తదనుగుణంగా సంస్కృత గ్రంథాలను తెలిగించారు. సంస్కృత చంద్రా లోకాన్ని తెలుగు వచనంలో అనువదించారు. పాణినీయాన్ని తెలుగు చేసినట్టు తెలుస్తున్నది. 'పాణినీయము సాంధ్ర వివరణము" పేరుతో 9 సంచికల సంపుటంతో గట్టి బైండుతో వచ్చినట్టు ప్రకటన ఉంది. సంస్కృతవ్యాకరణప్రదీపము కారకం వరకు రచించినట్టు కూడా అదే ప్రకటనలో ఉంది. ఉమాకాంతంగారికి ఎక్కువ పేరు తెచ్చి పెట్టినవి ఆయన పరిష్కరించి ముద్రించిన పల్నాటి వీరచరిత్ర (1911-1938) నేటి కాలపు కవిత్వం (1928)

పల్నాటి వీర చరిత్ర మొదటి ముద్రణకు రచించిన పీఠికలో అమూల్యమైన చారిత్రికాంశలను పొందు పరిచారు. ఇతిహాసాలను గురించి పల్నాడు గురించి శ్రీనాథుని గురించి ఎనభై రెండు పేజీల విపుల చారిత్రిక భూమిక ఇది. దాని సారాంశాన్ని ఇంగ్లీషులో ఏడు పేజీల్లో చెప్పారు. దెబ్బైమూడు పేజీల ద్వితీయ భూమిక (1938)లో తెలుగు సాహిత్యంపై తమకున్న అభిప్రాయాల్ని వివరించారు. రెండో పీఠికకు ముందే నేటి కాలపు కవిత్వం వచ్చింది. ఈ రెంటిలోనూ పూర్తిగా తర్కపద్ధతి అవలంబించారు. ఏ విషయాన్నెత్తుకున్నా సమగ్రంగా చర్చించటం ఆయనకు అలవాటు. అందువల్ల ఆయన పీఠికల్లోనూ వ్యాసాల్లోనూ విషయాన్ని విస్తరించి

ఏవేవో మాట్లాడుతున్నట్టనిపించినా అవన్నీ విజ్ఞాన వికాస హేతువులు కావ టం విశేషం. ఈ రెండో పీఠికలో "పల్నాటి వీర చరిత్రను విచారించడానికి పూర్వం తెలుగు వాఙ్మయాన్ని గురించి క్లుప్తంగా తెలుపుతాను" అని ప్రారం భించి తెలుగు సాహిత్యంపై తమ విలక్షణాభిప్రాయాలను వ్యక్తపరిచారు.

"మూలం యొక్క స్వరూపం అవికలంగా భాషాంతరంలో తెలప డమే అనువాదానికి పరమ ప్రయోజనం. నన్నయాదులవి అనుచితాను వాదాలు" అని ఆంధ్ర భారతాది గ్రంథాలను విమర్శించారు. తెలుగు ఎప్పుడూ ఉత్తమ విద్యాద్వారంగా ఉండలేదు కాబట్టి తెలుగు అభివృద్ధి కాలే దన్నారు. తెలుగు కావ్యాలు అధమాధికారులకే అని ఉమాకాంతంగారి అభి ప్రాయం. ఆ స్థితి మద్రాసు విశ్వవిద్యాలయం వచ్చిన తరవాత కూడ మారలేదని ఆనాటి తెలుగు పాఠ్యాదీతర గ్రంథాలనుంచి అధికంగా ఉదా హరించారు. శబ్దరత్నాకరంలో 'సఖుడు' అకారాంతపుంలింగం అనటాన్ని విమర్శిస్తూ అది ఇకారాంత పుంలింగం అనే విషయంగూడా ఈ పీఠికలో ప్రస్తావించారు. సంస్కృతం సరిగ్గా రాని రచయితలను ఆక్షేపిస్తూ వారిని దూడ పేడ సంస్కృతం వారని ఆక్షేపించారు. పంచాగ్నుల ఆదినారాయణ శాస్త్రి, చిలుకూరి నారాయణరావు వంటి పండితుల రచనల్లోని దోషాలను కూడా చూపించారు.

ఉత్తమ సంస్కృత కావ్యాలను తెలుగులో తీసుకురావాలన్న ప్రయ త్నంలో ఆయన రఘువంశానువాదం తల పెట్టినట్టు కనిపిస్తుంది. ఆయన రఘువంశ పీఠికలో....

అక్షరమ్ముల ఆట కవితగ - పెంటకుప్పల జేసి కృతులను
చింతు దొక్కెడి వారి గంతులు - చిన్న పిల్లల వేడుక

---

** (సహ శేష వర్తతే అనే వ్యుత్పత్తితో సఖః అదంతపుంలింగం అంది అహోబల పండితీయం - సం॥)

అన్నారు. ఉమాకాంతంగారి అభిప్రాయాలను ఆయన సహచరులు "దశోపదేశిగా" సంగ్రహించారు. వాటిని ఇక్కడ తిరగరాస్తున్నాను.

1. గద్యంలో లేని విశేషం పద్యానికి ఛందస్సు సమకూర్చగలిగినది గతి మనోజ్ఞత.
2. అది గణాల ఆరోహణావరోహణల వల్లనే సిద్ధిస్తున్నది.
3. అక్షర వినోదం (పళిప్రాసలు) శబ్దాలంకారాల్లో చేరినది.
4. శబ్దాలంకారాలు అలంకారశాస్త్రంలోనివి.
5. శబ్దాలంకారాలు స్వయంగా ఆపతితమైతేనే తప్ప అవశ్యకంగా స్వీకార్యం కావని, వీటిని స్వీకరిస్తే కావ్యం అధమమవుతుందని సాహిత్యవేత్తల మతం.
6. ఇద్దరన్, మానుగ, అనఘ, అమల, ఓగి, ఒలి, పరగు, చెన్నుగ యిట్లాటి దండుగ చెత్తకు లేదా యతి భంగానికి హేతువై అనర్థప్రదం కావటం వల్ల అక్షరాల ఆట (వళి ప్రాసలు) ఆవశ్యకంగా ఉపాదేయం కాదు.
7. యతి అంటే విచ్ఛేదం. వాగింద్రియ విశ్రాంతిని, శ్రావ్యతను, పద్యం యొక్క సుపఠత్వ, రమ్యత్వాలను సిద్ధింప చేస్తుంది గనుక దీర్ఘపాదాల్లో మధ్య యతీ, సర్వత్ర పాదాంత యతీ నియతం.
8. పద్యం గానీ, పద్యాలు గానీ, శీఘ్రంగా గాని, విలంబంగా గానీ, అల్లిన మాత్రాన పద్యకర్త అవుతాడు. కవి కానేరడు. విజ్ఞానశాలి కానేరడు. విద్వద్గోష్ఠుల్లో శాస్త్రాభ్యాసజన్యం విజ్ఞానం.
9. జన్మాంతర సంస్కారరూపమైన ప్రతిభ విద్వద్గోష్ఠుల్లో ఉత్తమ లబ్ధి. చరాచరలోక ప్రభావ పరిశీలనం, కావ్యజ్ఞ శిక్ష కావ్యత్వహేతువని మమ్మటుడు.
10. పద్యరూపాన గాని గద్యరూపాన గాని అనువాదం చేస్తే అనువాది

కాగలడు గావి కవి కాజాల్లడు. రసభావ నిష్పాదక మైన సృష్టికి సంబంధించినది కవిత. కొంత తీసివేసి కొంతచేర్చి అనువాదం చేస్తే అప్రశస్తానువాది. అనూదిత కావ్యంలో సృష్టి విశేషాదులు అనువాదివి కాజాలవని స్పష్టం.

వీటి ఆధారంగా ఆయన అనుయాయులు కొందరు అనువాదాలు సాగించి ఆయన సిద్ధాంతాలు ప్రచారం చేసినట్టు కొమరవోలు చంద్రశేఖర మంత్రిగారు ప్రకటించిన లక్ష్యఖండం (1937) వల్ల తెలుస్తుంది. ఉమాకాంతంగారి లక్షణాలకు వీరు రచించినవి లక్ష్యాలని వీరుద్దేశించినట్టు "లక్ష్యఖండం" అనే పేరు పెట్టడంలోనే తెలుస్తున్నది. ఉమాకాంతంగారు రఘువంశ పీఠికలో ....

మూలమున లేనట్టిదానిని
వ్రాయననపేక్షితము చెప్పను
అన్న నాథుల మాట దలచగ
అర్హుడనా కానో!

అన్నారు. 'మూలంలో లేనిది చెప్పను. మూలంలో ఉద్దేశించనిది కూడా చెప్పను' అన్న మల్లినాథసూరి మాట తల్చుకున్నారు. ఆయన్ననుసరించి అలంపూరు కృష్ణస్వామిగారు....

'వదలి మూలస్థమ్ము లేనిది
కుక్కి అనువాదమ్ము చేసెడి
అజ్ఞ మార్గము తొలిగిపోవుత
నాకు గురువుల కరుణచే'.. అన్నారు

ఇక్కడ 'గురువులు' అనే మాటలో ఉమాకాంతం గారిని ఉద్దేశించినట్టు భావించవచ్చు.

ఈ మార్గంలోనే కన్నెకంటి ప్రభులింగాచార్యులు గారు కాళిదాసు కుమార సంభవాన్ని అనువదిస్తూ

ఆర్ష భూయస్త్వోత్తమములగు
కాళిదాస కవిత్వనిధులను
మా కొసంగిన మల్లినాథా!
నిన్ను వినుతింతు

అని మల్లినాథుని ప్రశంసించి....

విడువగా రాదున్నదానిని
లేనిదానిని కుక్కగూడదు
ఇదియె అనువాదాల తెరువను
ప్రవచనమ్ము తలంచెదన్

అని అనువాద విధానంలో ఉమాకాంతంగారి మార్గాన్ని పునరుద్ఘాటించారు.

ఉమాకాంతంగారు వారి అనుయాయులు ఈ అభిప్రాయాలను ప్రచారం చేశారు. సంస్కృత వృత్తాలతో పాటు తెలుగు పద్యాలను కూడా వర్ణమైత్రి లేకుండా ప్రయోగించారు. గీతాది లఘు పద్యాలకు పాదాంత విరతిని మాత్రమే నియమంగా పాటించారు,

వీరంతా ముత్యాల సరాన్ని ఆదరించడం చారిత్రకంగా గుర్తించదగిన ఒక విశేషం. అయితే వీరి రచనల్లో ఎక్కడా గురజాడ అప్పారావుగారిని విరివిగా స్మరించినట్టు గాని ముత్యాలసరం పేరును ప్రస్తావించినట్టుగాని కన పడదు. (ఈ పుస్తకంలో ఒక్కచోట ఉప్ప) అయినా ముత్యాలసరాలను ధారాళంగా వాడారు. అదీ గురజాడ పద్ధతిలోనే. యతి ప్రాసలు నియమాలుగా కాక అలంకారాలుగా మాత్రమే పరిగణించిన అప్పారావుగారి మార్గం ఉమాకాంతంగారికి నచ్చినట్టు భావించవచ్చు. భావకవులకూ, ఉమాకాంతం గారికీ ముత్యాలసరం విషయంలో మాత్రం ఏకీభావం కనిపిస్తుంది. భావ

కవుల్లో రాయప్రోలు సుబ్బారావుగారు తల్లావఝ్ఝల శివశంకరశాస్త్రిగారి వంటి వారు వర్ణమైత్రీయుత వళినిగాని ప్రాసనుగాని ముత్యాలసరాల్లో కూడా పాటించారు. కృష్ణశాస్త్రిగారి ముత్యాలసరాల్లో వర్ణమైత్రి లేనివి కనిపిస్తాయి.

ఉమాకాంతం గారు ఆంధ్ర వాఙ్మయాన్ని అంతటినీ సూత్రపద్ధతిలో చెప్పదల్చుకున్నారు. ఆసూత్రాలకు మళ్ళీ తానే భాష్యం చెప్పదల్చుకున్నారు. అయితే చెయ్యదల్చుకున్నవన్నీ చెయ్యటానికి జీవితం చాలింది కాదు. వాఙ్మయదర్శనము పేరుతో 'ప్రాచీన ఖండా'న్ని తొమ్మిది భాగాలు (ఆలోకములు) గా సూత్ర పద్ధతిలో రచించారు. ఈ సూత్రాలు గ్రాంథిక భాష (కావ్య భాష)లో ఉన్నాయి. ఈ సూత్రాలు చూస్తే చాలా విస్తృత ప్రణాళికనే వేసుకున్నట్టు తెలుస్తుంది. భాష్యం లేకపోయినా ఉమాకాంతంగారి వాఙ్మయ దృష్టిని అర్థం చేసుకోటానికి ఈ వాఙ్మయ దర్శన సూత్రాలు ఉపయోగపడతాయి. ద్వితీయాలోకంలో-

1. అభారతీయము గనుక 2. సంప్రదాయ విచ్ఛేదము గనుక 3. త్యాజ్యము క్రీస్తు శకము 4. ఆత్మీయము గనుక 5. అఖండ కాలదర్శన సాధనము గనుక 6. శ్రుతి. స్మృతి పురాణేతిహాస దేశీయ కథాదులనుండి అవిచ్ఛిన్నత్వము ప్రతిపాదించును గనుక 7. సంప్రదాయ సిద్ధము గనుక 8. గ్రాహ్యము కలిశకము 9. అవిశేషము వల్ల కలిశకము కృష్ణ శకమని 10. అంతర్భూతము గనుక శాలివాహనము పాక్షికముపథ ....

ఉమాకాంతంగారు క్రీస్తు శకాన్ని కూడా గుర్తించని సంప్రదాయ ప్రియుడు. ఆయన తన పీఠికల కిందా, ముద్రించిన రచనల పైనా శాలివాహనశకాన్నే వేసేవారు.

ఉమాకాంతంగారు వాఙ్మయ దర్శనంలో భారతీయ సంస్కారాదుల గురించి ఎక్కువగా ప్రస్తావించారు. ఇది కాక వేరే ఇంకా ప్రాచీనాంధ్ర వాఙ్మయ సూత్రాల గురించి ఏమైనా రాశారేమో తెలీదు. 'నేటి కాలపు

కవిత్వం' అని నామాంతరం ఉన్న ఈ వాఙ్మయ సూత్ర పరిశిష్ట భాష్యంలో మూడు అధ్యాయాలతో అధునికాంధ్ర వాఙ్మయాన్ని సూత్రీకరించారు. అందులో మొదటి అధ్యాయం నేటి కాలపు కవిత్వం. దాన్ని మాత్రమే విపులీకరించారు. నేటికాలపు కృతిరచన. నేటికాలపు విద్య అనే అధ్యాయాలు సూత్ర రూపంలోనే ఉన్నాయి. భాష్యం రాయలేదు. ఈ పరిశిష్టాన్ని ఆలోకనాలు అనకుండా అధ్యాయాలుగా విభజించటం వల్ల వాఙ్మయ దర్శనం కన్నా భిన్నమైన వాఙ్మయ సూత్రాలు అనే గ్రంథాన్ని రాసినట్టుగానో కనీసం రాయ తలపెట్టినట్టుగానో ఊహించాలి, అయితే మనకు పూర్తిగా భాష్య రూపంలో దొరుకుతున్నది ఈ పరిశిష్ట సూత్ర భాష్య రూపమే (అదీ మొదటి అధ్యాయమే) మొదటిసారి వావిళ్ళ ప్రచురణగా 1928 లో వెలువడింది.

ఉమాకాంతంగారు ఈ పుస్తకంలో ప్రధానంగా భావకవిత్వం పేరుతో ప్రచారమైన కవిత్వాన్ని తీవ్ర పదజాలంతో విమర్శించారు. తెలుగు సాహిత్యంలో తీవ్ర సంచలనాన్ని రేపిన గ్రంథం ఇది. "కానీ వారు చేసి ముఖ్యమైన ఆక్షేపణలకు తగిన సమాధానం ఇంతవరకూ రానే లేదనే అనుకోవలసి వస్తోంది" అని అబ్బూరి రామకృష్ణారావు గారన్నారు. "మహాపండితులైన ఉమాకాంతం విమర్శలకు ఆనాడెవరూ జవాబు చెప్పలేక పోయారు" అని శ్రీశ్రీగారు 1960లో విశాలాంధ్రవారి ఆంధ్ర దర్శినిలో రాశారు. భావకవిత్వాన్ని సమర్థిస్తూ ప్రశంసిస్తూ విశ్లేషిస్తూ వ్యాసాలూ, పుస్తకాలూ చాలా వచ్చాయి. కాని ప్రత్యేకంగా ఉమాకాంతంగారి ఆక్షేపణలకు సమాధానంగా ఇంతవరకూ పుస్తకరూపంలో ఏమీ రాలేదన్న మాట నిజమే. అట్లాగే ఉమాకాంతంగారు తిట్టినా అదో గొప్పగా ఆనాటి కవులు చెప్పుకునే వారని అ. రా. కృ గారు అంటుండేవారు. అంతటి మహాపండితుడి దృష్టిలో పడటమే గొప్పగా ఆనాటి కవులు భావించేవారన్నమాట. ఆనాటి భావకవుల్లో బహుశా ఎవరినీ ఆయన క్షమించలేదు. విస్తర

దోషాన్ని గురించి వి స్తరణాధికరణంలో చెబుతూ చెప్పవలసినదానికంటే ఎక్కువగా చెప్పటం వి స్తర దోషమని నిర్వచించి, ఈ కాలపు కృతుల్లో ఇది విస్తారంగా ఉందని ప్రస్తావించి "యెంకి పాటల వంటి వాటిలో కొన్ని టిలో తప్ప తక్కిన యీ కాలపు కృతుల్లో అనేకాల్లో యీ దోషం కనబడు తున్నది" అని యెంకి పాటలకు మినహాయింపు ఇచ్చారు. ఆ మాత్రం మినహాయింపు ఇయ్యటం కూడా విశేషమే ననుకుంటాను.

ఆధునిక కవిత్వం ప్రాచీన ధోరణుల నుంచి విడివడి కొత్తదారులు వెతుక్కుంటున్న సమయంలో అక్కిరాజు ఉమాకాంతంగారు సాహిత్య విమర్శలో ప్రవేశించారు. సంప్రదాయ పండితులు చాలామంది భావ కవిత్వాన్ని ఎదుర్కొన్నారు. అయితే ఉమాకాంతంగారి మార్గం భిన్నమైనది. ఆయనకు తెలుగులోనే కవిత్వం కనపడలేదు. ఆయన ప్రమాణాలు ప్రాచీన సంస్కృతాలంకారికులవి. వాద పద్ధతి సంస్కృతంలో తర్కపద్ధతి. ఈ పద్ధతిలో సిద్ధాంతం - పూర్వపక్షం, ఆక్షేపణ - సమాధానం అనే విభజన లుండటంవల్ల దీనికి ప్రామాణికతే గాక హేతుబద్ధత కూడా వచ్చింది. ఈయనకు పాశ్చాత్య తర్కపద్ధతితో కూడా పరిచయమున్నట్టు ఈ గ్రంథం లోనే అనౌచిత్యాధికరణంలో **Fallacy of undue Assumption** అనే పద్ధతి ప్రస్తావన వల్ల తెలుసుకోవచ్చు.

ఉమాకాంతంగారి తర్కపద్ధతికి, ఆధునికశాస్త్ర ప్రతిపాదనల పద్ధతికి కొన్ని పోలికలున్నాయి. ఆధునికశాస్త్ర పద్ధతిలో ఒక ప్రతిపాదన చేసినపుడు ఆ ప్రతిపాదనకు ప్రతికూలమైన అంశాలను కూడా ప్రస్తావించి వాటిని తన ప్రతిపాదన ఎట్లా పరిష్కరిస్తుందో చెప్పాలి. అప్పుడే ఆ ప్రతిపాదన సిద్ధాంత మవుతుంది. ఉమాకాంతంగారి వాదపద్ధతి ఎంత ప్రాచీనమో అంత ఆధునికం కూడా. ఒక విషయాన్ని అన్ని వైపులనుంచి పరిశీలించటానికి ఉమాకాంతంగారి తర్కపద్ధతి పనికొచ్చింది.

ఇదికాక ఉమాకాంతంగారి శైలి- సూటిదనం సారళ్యం అనే రెండు లక్షణాల వల్ల ఆకర్షణీయంగా ఉంటుంది. "ఆపతితం. ద్రష్టవ్యం, వక్ష్యమాణ' వంటి మాటలు ఆయన పాండిత్యం వల్ల అరుదుగా దొర్లినా సాంకేతికత లేని సాధారణ పదాలు వాడటం ఆయన అలవాటు. ఊగుడు మాటలు. పులుముడు, వికారాలు, దూడపేడ సంస్కృతం దండగ్గణం వంటి అతి సామాన్య పదజాలంతో తన భావాలను చెప్పగలిగారు. సిద్ధాంత పూర్వపక్షాలు ఆక్షేప-సమాధానాలు అనే పద్ధతి వాద ప్రతివాదాల సంభాషణ (dialogue) పద్ధతి ఈ నిర్మాణం (structure) వల్ల శైలి సంభాషణశైలికి సన్నిహితమై మరింత ఆకర్షకమైంది. భాష విషయంలో ఆయన మారినదృష్టి కూడా ఇందుకు తోడ్పడింది. దానికితోడు ఉమాకాంతంగారికి విషయవివరణ కుపయోగించే దృష్టాంతాలను పిట్ట కథలను ఎన్నుకొని విషయ వివరణచెయ్యటంలో అద్భుతమైన నేర్పుంది. సంస్కృతాంగ్లాలలో విశేషమైన పాండిత్యం ఉన్న ఆయన తన రచనలలో ఉదాహరించిన సంస్కృతాంగ్ల వాక్యాలకు తరచుగా ఆంధ్రానువాదాలను కూడా ఇస్తుంటారు. ఆయన చెప్పిన విషయాల్లో భేదించినా ఆయన వాద పద్ధతి నుంచి ఈ నాటి విమర్శకులు నేర్చుకోవాల్సింది చాలా ఉంది. ఉపపత్తులు చూపకుండా ఆయన సిద్ధాంతాలు చెయ్యలేదు. ఆక్షేపణలకు సమాధానాలు చెప్పకుండా సిద్ధాంతాలను ఊరికే వదలలేదు. ఏ విషయాన్నీ మరుగుగానూ అస్పష్టంగానూ చెప్పలేదు. ఇన్ని సుగుణాలున్న ఈ పుస్తకం సాహిత్యాభిమానులందరికీ అవశ్య పఠనీయం.

ఈ పుస్తకానికి చారిత్రక ప్రాముఖ్యం కూడా ఉంది. ఒక విద్యావేత్త ప్రాచీనమైన తన జాతి పతనమైపోతున్నదని విలువలు క్షీణిస్తున్నాయని ప్రమాణాలు పడిపోతున్నాయని ఎంత ఆవేదన చెందాడో తెలుసుకోడానికి కూడా ఈ పుస్తకం చదవటం అవసరం. దాదాపు అర్ధాయుష్కుడైన ఒక సాహిత్య కృషీవలుడు ఉన్న కొద్ది జీవితకాలంలోనే ఎన్ని విద్యలు నేర్వవచ్చునో, తాను లోకకళ్యాణమని ఎంచిన దాన్ని ఆచరించటానికి ఎంత కృషి చేశాడో తెలుసుకోటానికి ఆయన జీవితాన్ని గురించి కూడా తెలుసుకోవాలి.

అయితే ఉమాకాంతంగారు భావకవిత్వం గురించి చేసిన నిర్ణయాలు కాలంలో నిలవలేవు. మారుతున్న అభిరుచుల కనుగుణంగా భావకవిత్వం చరిత్రలో నిలిచింది. స్థిరదోషాలుగా ఉమాకాంతంగారు గుర్తించినవి అస్థిరమైనవిగా మారినాయి. వాటిని దోషాలుగా పాఠకులు గుర్తించలేరు. అమోమయత్వం పులుముడు నివర్ణన పరంపరలు భాషా వ్యతిక్రమం అనిపేర్లు పెట్టి ఆయన నిరసించిన వాటిని తరువాత పాఠకులు గుణాలుగా మెచ్చుకొని ఆస్వాదిస్తున్నారు. ప్రాచీన సంస్కృత సాహిత్య శాస్త్ర మర్యాదలు సర్వకాల సర్వదేశ సాహిత్యాలకీ సంపూర్ణ ప్రమాణాలుగా నిలుస్తాయని ఉమాకాంతంగారు నిజాయితీగానే నమ్మారు. ఆయన ఆనాటి కవులను కఠినంగా విమర్శించారు. చరిత్ర ఇంకా కఠినమైనది. ఉమాకాంతంగారి ఆక్షేపణలను తోసిపుచ్చింది. కాలం మరీ క్రూరమైనది. ఉమాకాంతంగారినే మరుగున పడేట్టు చేసింది. నిర్భీకత, కాలానికీ ఎదురీదే లక్షణం. పాండిత్యం, కృషి చెప్పేవిషయంలో నిజాయితీ. స్పష్టత. సూటిదనం. సహేతుక వాదపటిమ ఆయన నిర్ణయాలను మించి విలువైనవి. అవే ఆయన తన తరువాత తరానికి అందించిన విలువలు.

సారాంశం చెపితే అక్కిరాజు ఉమాకాతంగారి నిర్ణయాలు ముఖ్యం కాదు, ఆయన ఆవేదన నిజమైనది. అంతర్యం గొప్పది. సాహిత్యదీక్ష సహేతుక వాద పద్ధతి ఈ జాతికి శాశ్వతంగా ఇచ్చిన ఆయన ఆదర్శాలు.

ఈ ముద్రణలో సంపాదకుడుగా నేను చేసిన మార్పులకూ చెయ్యని మార్పులకూ కొంత సంజాయిషీ ఇచ్చుకోటం భావ్యం అనుకుంటాను.

ఈ గ్రంథం తొలి ముద్రణలోనే కొన్ని పొరపాట్లు దొర్లినాయి. వాటిని అన్నిచోట్లా సవరించటం సాధ్యం కాలేదు. సంస్కృతంలో అచ్చు తప్పులను ఆచార్య శ్రీవ్వా శ్రీహరిగారు సవరించారు. తెలుగు పద్యాల్లో స్పష్టముగా దోషాలుగా కనిపించే వాటిని సవరించాను.కాని కొన్నిటిని వదిలేశాను. ఉదాహరణకు ఏకాంత సేవ అనే పుస్తకాన్ని "యేకాంత సేవ" అని రాయ

టమే కాక పుటల సూచిక (ఇండెక్స్)లో కూడా అట్లాగే ఇచ్చారు. అట్లాగే ఆ కావ్యంనుంచి ఉదాహరించిన పద్యభాగంలో" మధుర మోహన కళామహితమై వుండ (పేజీ71. 88. 94) అనే పాదంలో ఉండ అనే క్రియాపదాన్ని 'వుండ"అనిరాశారు. యకార. వకారాగమాలు కవ్యుద్దిష్టాలు కావనుకుంటాను. అయినా ఉమాకాంతంగారు కావాలనే అట్లా రాశారని అభిప్రాయపడి వాటిని మార్చలేదు. అట్లాగే ఉమాకాంతంగారు ఉదాహరించిన పద్యపాదాలు ఇప్పుడు దొరికే ప్రతుల్లో వేరుగా కనిపిస్తున్నా, ఆయన చూసిన ప్రతుల్లో అట్లా ఉండి ఉండవచ్చునని మార్చలేదు. స్పష్టంగా ఛందోదోషాలున్నచోట మాత్రం ముద్రిత ప్రతుల ననుసరించి సవరించాను. అట్లాంటి మార్పులు తెలుగు భారతంనుంచి, ఆముక్తమాల్యద నుంచి ఉదాహరించిన చోట్ల అవసరమయ్యాయి. ఎన్‌సైక్లోపీడియా బ్రిటానికా నుంచి ఉదాహరించిన భాగం (పేజి. 136)లో ఇంగ్లీషులో Jonffroy అనీ తెలుగులో "జాన్ ఫ్రాయి" అని స్పష్టంగా ఇచ్చారు. ఈ పేరులో ఏదో పొరపాటున్నట్టు కనిపిస్తున్నది గాని సవరించటం సాధ్యం కాలేదు. ఆ పేరు తెలిసిన ఇంగ్లీషు సాహిత్య పండితులు అందుబాటులో లేకపోవటంవల్ల అట్లాగే ఉంచాను. ఉదాహృత పద్యపాదాలను సాధ్యమైనంతవరకు ఈ కూర్పులో పాద విభజన చేసి చూపించాను. కొన్ని సంస్కృత శబ్దాల వర్ణక్రమాన్ని ఉమాకాంతంగారు నియతంగా పాటించినట్టు కనిపించదు. వాటిని అట్లానేఉంచాను.

ఈ పీఠికారచనకు ప్రేరేపించిన మిత్రులు ఆచార్య పేర్వారం జగన్నాథం గారికీ సమాచార సామగ్రిని సాదరంగా అందించిన అక్కిరాజు రమాపతిరావుగారికీ, చలసాని (విరసం) ప్రసాదుకూ కృతజ్ఞతలు.

అక్కిరాజు ఉమాకాంతంగారి "నేటికాలపు కవిత్వం" తె.వి.వి. హైదరాబాద్. రెండోముద్రణ సందర్భంగా రాసిన పీఠిక. 1994 జనవరి 26.

— 0 —

# OPENING THE DOORS TO MODERN TELUGU POETRY

Telugu literature, since its inception, has always been ackonwledged as being rich in poetry. Inspite of the emergence of new genres like the short story and others poetry has not lost its charm in modern times It can even be said that it has acquired a new charm in contrast with other genres. Often, literary criticism or history of literature means, in the Telugu context, much to the chagrin of the other writers, only the treatment and the history of poetry.

Modernism, whatever it may mean,-surely, it means different things to different people depending upon their orientation or theoretical commitments, can be traced back to the later half of the 19th century. though the exact delimitation is not only not possible, but even a futile exercise. The English educated Indians, have tried to reform the feudal institutions of India, through literature, armed with the ideas they learned from their English masters Though the change is due to innumerable writers, and forces in Telugu, three major figures are remembered -Kandukuri Veeresalingam (1848-1919) Gidugu Venkata Ramamurti (1863-1940) and Gurajada Apparao (1862-1915). All new trends and ideas that appeared in later Telugu poetry can be traced back to Gurajada Apparao.

The classical and the medieval Telugu poetry were either aimed at religious preaching or engaged in eleborate description. They are, always based on some story, however thin it may be, often drawing its sources from Sanskrit Itihasa, Puranas and Upanishads. The only exception in the tradition are Satakas which usually number one hundred and eight verses consisting of original ideas, views or expressions of the poet with no story element. Gradual thinning of the story and descripiion, to the extent of its extinction is certainly a feature of modern phenomenon in Telugu poetry. Moral preaching gave way to social reformist massage. Short story poems or poems with no story but with a social message can be clearly seen in Gurajada Apparao's poetry. This trend resulted in the later trend called Khanda Kavya a short

poem where the idea dominated the story and the description. Once poetry is liberated from the constraints of story and description it has become a convenient vehicle for direct importation of the poet's ideologies to the readers and thus paved the way to subjectivity. The concept of 'poem' in contrast with verse has set in Telugu literature during early decades of the twentieth century, though a term has not been invented. Now a days Padyam (formerly it meant only verse) Khandika (apiecce), Kavita (Poetry, a mass noun earlier but has become a count noun now) are used for a poem. Now, story-poems are rare species, and even if they are written they are considered to be anachronistic.

The reformist patriotic, romantic and progressive poetry which dominated Telugu modern poetry of the first half of this century in spite of their reformist origin and revolutionary zeal have used traditional metres. though folk metres have made their inroads into the main path. Almost from the beginning of modern poetry. the traditional syllabic metres coexisted with folk-derived-new-entrant-moraic metres. They have settled in modern metres and were popularized by the All India Radio for their rhythm and music. The Progressive poets preferred them because they can get their massage across more directly.

It may be useful to have some idea about the periodization of modern Telugu poetry. In Telugu literature periodization has never been sharp. And a trend never disappears from the scene, it may be pushed to the back ground. The periodization only displays a trend's dominant presence and notrend erases an earlier trend completely. With this catuion in mind we can have the following approximate periodization.

| | |
|---|---|
| Reformist-Romantic Period | 1905-1942 |
| Progressive Period | 1935-1950 |
| Mixed period | 1950-1964 |
| Digambara (Naked poetry) period | 1964-1970 |
| Revolutionary period | 1970-1980 |
| Post Modern Period | 1980—— |

We have touched upon some charactelistics of the first two trends above. Though, we can differantiate between the Reform-

ist and the Romantic trends, they overlap for a long time. We can only say that the reformist trends have started earlier than the Romantic trend, the latter is at its peak between 1925-35. There is no dividing line between the Romantic Period and the Progres sive period. The Mixed period was the time no specific trend dominated the scene, but several trends coexisted and plenty of experimentation took place. This was the period when Kundurti Anjaneyulu (1922-1982), himself well versed in classical metres, advocated in free verse (verse libre). There were expriments even earlier through the Romantic and Progressive periods but they were only attempts towards liberation from traditional metres. Verse libre is the result of creative experimentation with no reference to regulated mettres. Verse libere still employed either rhythm or approximate length of lines, though they are not metrically even. Verse libre is completely or almost completely free of phonological devices and depends on syntactic and semantic devises for its form.

These experiments have been intensified in the Digambara period. which advocated a radical departure from the tradition. The revolu ionary poets have Maoism as their theoretical backgrcund and derived their inspiration from non parliamentary communist (Naxalite) parties. Conditioned by their goala. the revolutio nary poets favcured a simple lexicon, a lucid syntax and clear images Folk tunes suited their purpose. Some of the poets who were committed to free verse (verse libre) retained their identity and continued with their experimentation.

Though the priod from 1980 is designated post modern. It cannot be equated with the usage in the western literature. This is probably a second mixed period where several trends, old and new. coexisted. The main characteristic of this poetry is a sincere effort for aesthetic excellence without sacrificing their ideological tones or positions. The major revolutionary writers coutinue to write with a lith a a concern for poeticity. Many new poets. along with some of the senior poets with no obvious political co nnexions have been penetrating into the myriads of life in search of human values.A dominant trend in the later part of the eighties and through the nineties is the Feminist poetry. The Telugu fe-

minists have native footing and react to their own specific proble ms and the problems of the Indian society. One happily notes that their voices are not echoes of the western counter parts. Many of the feminist in Telugu use Indian symbols and idiomatic expressions in their poetry.

Dalit poetry (poetry of the most oppressed classes) is a new trend that has emerged in the late eighties and continues to gain the appreciation of the critics.

The present period is more pluralistic than the earlier periods and represents many simultaneous trends political as well as apoli tical ideological as well as non-ideological. There are indviduals who do not belong to any specific ideology but represent a broad perspective of secular and progressive ideas.The main characteris tics of the present time can be briefly summarized as the following,

1. More commitment to life than to a particular philosophy,
2 Care for the expression along with content.
3. Overall acceptance of secular and democratic values and
4. Acceptance of free verse as a modern medium without totally rejecting the liberalized metrical forms of rhythm (moraic me tres).

The present volume is a fair representation of all the availa ble trends in present day Telug poetry. This collection has the poems of the poets who consistently have been writing for the past thirty and odd years but the poems have been selected from their most recent contributions. Along with the seniors, the new poets who have carved their niches within the past half a decade are also included.

Any collection of this sort cannot be free from subjective judgements, for esthetic appreciation is usually, shaped by personal experience and training. No talented poet has been wilfully excluded from the collection. Of course; there are always some practical problems, which come in the way of completeness of the volume. And anthology of this sort has to suffer this lacuna.

The editors have taken special care to select the best or one of the best representatives of the poet but they have to concede in one or two instances because some of the best poems are tough to translate due to their heavy boundedness to cultural contexts. Transiatabilty is not the best of criterions for the assessment of poetry.

This is the first attempt to compile a representative volume of the past twenty five years of Telugu poetry and as such is a welcome contribution to Telugu poetry in English.

శీలా వీర్రాజు, కుందుర్తి సత్యమూర్తిగార్ల "డౌన్ టు ద ఎర్త్'
తెలుగు కవితల ఆంగ్లానువాద సంకలనానికి పీఠిక, 1994



# పదునెక్కిన ప్రజాకవి

చెరబండరాజు తన "జన్మహక్కు" కు నన్ను ముందుమాట రాయమన్నప్పుడు కొంత ఆశ్చర్యపోయాను. విమర్శకుడిగానో పరిశోధకుడిగానో నేనున్న చోటునుంచి తలపైకెత్తి చూస్తేగాని కనపడడు చెరబండరాజు. ముందుమాట రాయమని అతడు బతిమిలాడలేదు. బలవంతం పెట్టలేదు. తన హక్కుగానే అడిగాడు. తన కవిత్వాన్ని పొగడమని అడగలేదు. సరిగదా కనీసం అంచనా కట్టమనికూడా అడగలేదు. విప్లవ కవితా ప్రస్థానంలో అతనిది వజ్రసంకల్పం. అందులో సహస్రాంశమైనా లేని నాకు అతని కవిత్వాన్ని విమర్శించే అర్హతఉందా అని ప్రశ్నించుకుంటే ఉన్నట్టేతోచింది.

"అంతర్జాతీయ విపణిలో అంగాంగం తాకట్టుపెట్టిన అందం నీది. వందే మాతరం!" అన్నప్పుడు అతని ఊహాబలానికి దిమ్మరపోయాను."ఈ అస్తవ్యస్తపు మస్తిష్కపు మహాత్ముడికి ఆరాధనేమిటి? ఆర్భాటాలేమిటి" అని ప్రశ్నించినప్పుడు బిత్తరపోయాను. ''మాలోని మనిషివే మా మనిషివే నీవు. పొట్టకూటికి నీవు పోలీసువైనావు" అని శత్రువర్గానికి కొమ్ముకాస్తున్న తన వర్గపు మనిషిని ఆహ్వానించే నేర్పుకు ఆశ్చర్యపడ్డాను. "విప్లవాల యుగం మనది. విప్లవిస్తే జయం మనది" అని సికింద్రాబాదు సెషన్సు కోర్టులో నినాద కవిత్వాన్ని కవితా నినాదంగా మార్చిన ప్రతిభకు స్పందించాను. "కొండలు పగలేసినం, బండలనూ పిండినం, మానెత్తురు కంకరగా ప్రాజెక్టులు గట్టినం, శ్రమ ఎవడిదిరో సిరి ఎవడిదిరో'' అన్న పాటలో శిల్పానికి తన్మయుణ్ణి అయ్యాను.దాని కూర్పుని రిసెర్చిక్లాసులో చర్చించాను. ఉత్తమ కవిత్వానికి ఇంతగా స్పందించటంకన్న ఇంకేం అర్హత కావాలి.

విరసం ఏర్పడకముందు చెరబండరాజు బలమైన వచన కవిత్వం రాశాడు. కాని "నరుడో భాస్కరుడా!" పాట (శివుడు) విప్లవకవుల కళ్ళు తెరిపించినప్పుడు వచన కవిత్వపు మార్గానికి "గుడ్ బై' కొట్టి తను ఉద్దేశిం

చిన శ్రోతల కర్థమయ్యే తేలికైన భాషలో సరళమైన ఊహాలతో మనసుకు పట్టే కవితా పరిమళంతో నమ్మిన సిద్ధాంతానికి కట్టుబడి జాతిని కదిలించే గీతాలు రాస్తున్నాడిప్పుడు. పాణిగ్రాహి పాటలు అంతకుముందే ఉన్నా అడవులు దాటి అచ్చుయంత్రాల్లోకి అప్పటికింకా అన్నీ అడుగు పెట్టలేదు. "ధాన్కారుడా!" పాట విప్లవ కవుల్ని తట్టి లేపి ప్రజాకవులు కమ్మని పరోక్షంగా ఆదేశించింది. ఆ పిలుపును గుర్తించి కాలానికి, అవసరానికి తగినట్లు తన్ను తాను మల్చుకున్నాడు చెరబండరాజు. వి. బి. గద్దర్. వంగపండు ప్రసాదరావుల సంగతి వేరు. వాళ్ళు ఈ సంప్రదాయంలోనే కవులుగా పుట్టి పెరిగారు. అయితే ఈ పద్ధతి కొత్తేమికాదు. పాటలు బుర్ర కథలు వంటి ప్రజాకళారూపాల ద్వారా ఉద్యమప్రచారం సుంకర, వాసిరెడ్డి వంటి కవులు లా తరంలో చేశారు. తెలంగాణా పోరాటం పాటలు సంపుటాలుగా అచ్చయి మన కళ్ళముందు కనిపిస్తూనే ఉన్నై. అయితే ఉద్యమం నీరు కారినప్పుడు మధ్యకాలంలో కవిత్వం ప్రజల్నుంచి దూరమయి అస్పష్టవాక్య విన్యాస వైచిత్రీ మూలకమైన వచన కవిత్వంగా వారపత్రికల్లో ప్రభుత్వ రేడియో కవి సమ్మేళనాల్లో పెడదారి పట్టినప్పుడు అది పెడదారి అని గుర్తించక విప్లవ కవులుకూడా వచన కవులుగా చెలామణి అవుతున్నప్పుడు వాళ్ళను సరియైన దారికి తిప్పటమే "నమదో ధాన్కారుడా" అనే పాట నిర్వహించిన చారిత్రకకర్తవ్యం. అదే కవి "తోటరాముడు" వంటి ఇంతకన్నా గొప్పపాటలు రాసినా "ధాన్కారుడా" పాట తెచ్చిన మలుపు విలువైనది.

ఈ సందర్భంలో శ్రీశ్రీ పాటల ప్రస్తావన రావటం సహజం. శ్రీశ్రీది బహుముఖ వ్యక్తిత్వం. ఒకే ఒక్క పద్ధతికి కట్టుబడటం శ్రీశ్రీ స్వభావానికే విరుద్ధం. ఆయన పాటలు ఈ కెలన్నమాట నిజమే. అయినా సామాన్య ప్రజల్లోకి చొచ్చుకుపోగలిగిన భావసారళ్యం లేదు. హైస్కూలు కాలేజీల్లో చదువుకున్న వాళ్ళను ఊగించటం వేరు. చదవటం రాయటం చేతగానివాళ్ళని కదిలించటం వేరు. ఈ రెండో మార్గంలో ప్రయాణం చేస్తున్న ఒక కవి సైని

కుకు చెరబండరాజు. ప్రజలకు చేరువగా వెళ్లాలంటే కవిత్వం ప్రజల భాష లోనే వుండాలని అందరూ అంగీకరిస్తారు. ప్రజల భాషలో రాయటమంటే కేవలం తేలికమాటలతో రాయటంమాత్రమేకాదు. సామాన్య ప్రజల బ్రతు కుసూ ఆలోచనా సరళిని, భావనారీతిని ఎంతో జాగ్రత్తగా అధ్యయనం చేసి నప్పుడే అది సాధ్యమవుతుంది. ఉదాహరణకు 'సిరిమల్లె చెట్టుకింద' అనే గద్దర్ పాటలో 'శివరాత్రి వచ్చింది ఉపవాస ముండాలె. బతుకంత శివరాత్రి లచ్చుమమ్మో లచ్చుమమ్మో.నీ బతుకంత అమవాస్య లచ్చుమమ్మో లచ్చు మమ్మో' అన్న చరణాలు ప్రజల గుండెలకు హత్తుకోటానికి కారణం తేలిక మాటలు వాడటమేకాదు ప్రజలకు పరిచితమైన భావచిత్రాలను (Images) వాడటం. ఈ రహస్యం ఎరిగినవాళ్ళు వి.వి. గద్దర్, వంగపండు ప్రసాద రావు శివసాగర్ చెరబండరాజు. 'ఓరయో వారయో అనే పాటలో చెరబండ రాజు 'పేదోల్లకు పేపర్లలో, పనికొచ్చేదుంటదంట, సైకిలు తొవ్వే పల్లెకు సాపు లేదు పేపరేడ?' అని రాయటం ఈ రహస్యం గుర్తించే. 'పేదోల్లు.' 'తొవ్వ', 'సాపు' అనే మాటలు వాడటమే కాక పల్లె ప్రజలు భావించే పద్ధతిలో వాక్యనిర్మాణం వుండటంవల్ల ఇది ప్రజలకు సన్నిహితమయింది. ప్రజల భాషలోవుండే - పదాలు, నుడికారాలు వాళ్లకి పరిచితమైన (Images) వాడినప్పుడే అది ప్రజాకవిత్వం అవుతుంది. అయితే చెరబండ రాజు ఈ మార్గంలో ఇంకా ఎక్కువ కృషి చెయ్యాలి.

వస్తు వైవిధ్యంలేదని పూర్వం అభ్యుదయకవిత్వం మీద ఒక విమర్శ వస్తుండేది. అదే ఈనాడు విప్లవకవిత్వంమీదకూడా వినవస్తు న్నది. ఇట్లాంటి విమర్శ చేసేవాళ్ళు ఈ కవిత్వాలను సరిగ్గా పరిశీలించి నట్టు లేదు. చెరబండరాజు కవిత్వాన్ని చదివితే ఈ ఆరోపణ నిరాధార మైనదని వెంటనే గ్రహించొచ్చు. పరిశీలించటం చేతైన కవికి జీవితం చిత్ర విచిత్రమైన రంగులతో అనంత కవితా రూపాలతో సాక్షాత్కరిస్తుంది. వైవిధ్యం సంగతి వచ్చినప్పుడు చెప్పుకోవలసింది చెరబండరాజు వాళ్ళ

పాప పుట్టినరోజుకు రాసిన గీతం. ఎద కదిలించగల సుకుమారమైన భావన. 'లిరికల్ క్వాలిటీ' ఉన్న ప్రశస్తమైన గీతం ఇది. దాన్ని ఈ సంపుటంలో చేర్చటం నాకు చాలా నచ్చింది. ఇది చదివిన తరవాత 'చెరబండరాజు సహజ కవి' అని మా హరి అన్నమాటలో అర్థం బోధపడింది.

చెప్పదల్చుకున్న వస్తువులలోనేకాక చెప్పే రీతిలో కూడా వైవిధ్యం సాధించటం చెరబండరాజు కవితలో విశేషం. కొత్తకొత్త బాణీలు కట్టుకొని రాయటం ద్వారా ఇది సాధ్యమయింది. 'కొండలు పగలేసినం' అనేది ఒక బాణీ అయితే 'సారూ మనమూ పొలాల కెళ్దాం' అనేది ఇంకో బాణీ. 'రాజుల సంస్కృతి' అనే గీతంలో మనకు బాగా పరిచితమైన చతురశ్రగతే అయినా అందులో కొత్తబాణీ సృష్టించుకొని పల్లవిలో వైవిధ్యం చూపాడు.

ప్రజాకవిత్వం రాసే కవి ప్రజలకు సన్నిహితమైన ప్రకృతిని తమ వస్తువుకు అనుకూలంగా వాడుకుంటాడు. ఈ పద్ధతి ఒకేసారి కవిత్వపు స్థాయిని పెంచుతుంది ప్రజలకు సన్నిహితమూ అవుతుంది. శివసాగర్ వ్రాసిన 'ఓ విలుకాడ' పాటలో ఈ టెక్నిక్ వుంది. "తోటరాముని తొడకు తూటా తగిలిందాని, చిలుక చీటి తెచ్చెరా, ఓ విలుకాడా మైనా మతలబు చేసెరా!" అని మొదలైన ఈపాటలో అడవిలో జంతువులూ, చెట్లూ మనుషులూ- అంటే అన్ని జీవులూ విప్లవకారుడికి దెబ్బతగిలిందని వగచి, సపర్యలు చేసినట్టు వర్ణిస్తాడు శివసాగర్. అంకుశాపురం (కవి సొంత ఊరు) లో విరిసిన చైతన్యాన్ని వర్ణిస్తూ చెరబండరాజు కూడా ఈ టెక్నిక్‌ను వాడుకున్నాడు. "చెట్టు చేమలు పిలిచి పండ్లు పంచాయంట, మేకపిల్లలు మంచి పాలు తాపాయంట" అంటూ పోరాటాన్ని చుట్టూ ప్రకృతిపై ఆరోపించి ప్రకృతి ద్వారా ధ్వనింపజేశాడు. శివసాగర్ రాసిన "విలుకాడ" పాటతో సరిసమానంగా నిలబడగల పాట ఇది. సహజకవి కావటంవల్లనే నేమో చెరబండరాజు తను రాసినదాన్ని ఎక్కువగా "ఎడిట్" చేసుకున్నట్టు కనిపించదు. ఉదాహరణకు : కొండలు పగలేసినం అన్న మొదటిపాటలో

"గింజెవడిదిరో, గంజెవడిదిరో" అని అనగలిగిన కవి "మేదెవరిదిరో, గుడిసెవడిదిరో" అన్నచోట "గూడెవడిదిరో" అని మారిస్తే లయ సమతూకంగా (Rhythmic balance) ఉండేది. అట్లాగే "చావు మీదిరో గెలుపు మాదిరో" అన్నచోట "రేపు మాదిరో" అనొచ్చు. దానివల్ల అర్థభంగం కూడా కలగదు. చెరబండరాజు కవిత్వంలో వచ్చే కూర్పు పొందిక సహజంగా వచ్చిందే కాని ప్రయత్నంవల్ల వచ్చిందికాదు. అందుకే చెరబండరాజును సహజ కవిగా హరితోపాటు నేనూ గుర్తిస్తున్నాను.

ప్రజాకవిత్వ రచనా శిల్పం ఎరిగిన కవే అయినా ఎడిట్ చేసుకోకపోవటంవల్ల కొన్నిచోట్ల ప్రజాకవిత్వం అనటానికి వీల్లేని చరణాలు కనిపిస్తున్నాయి. మొదటిపాటలోనే "ఉత్పత్తులు పెంచినం" "విప్లవాలు నడిపెదం" అన్న వాక్యాలు ప్రజల భాషలోకి తర్జుమా కాలేదు.

చెరబండరాజుకీ సందర్భంలో ఇయ్యాల్సిన సలహా ఒకటుంది. ప్రజల భాషలో రాసేటప్పుడు వర్గపోరు, వర్గకసి వంటి సామాన్యులకు అర్థస్ఫూర్తి కల్గించని మాటలను రానియ్యకుండా జాగ్రత్తపడాలి. ఆ మాటలు వాడకుండా ఆ స్ఫూర్తి సాధించడం కవికి కష్టం కాదు. ఆ మాటలు పార్టీ డాక్యుమెంట్లలో బాగుంటై. కాని కవిత్వంలో ఇముడుతయ్యని నాకు నమ్మకం లేదు. సిద్ధాంత సంబంధమైన మాటలు ప్రజల భాషలోకి అనువదించకుండా ప్రజాకవిత్వంలో వాడితే కవితా రచనలో కవిత్వపు స్థాయి తగ్గుతుంది. కవిత్వానికి సిద్ధాంత నేపథ్యం అవసరమే. అయితే కవిత్వాన్ని మింగేసి తానే ముందుకు రాకూడదు.

ఇంకో విషయం. ఈనాటి విప్లవకవులంతా ఎరుపు అనే సింబల్‌ను ఎక్కువగా వాడుతున్నారు. గంగినేని వెంకటేశ్వరరావు కాబోలు ఈ "ఎరుపు"ను కవిత్వంలో అదుపులేకుండా ప్రవేశపెట్టాడు. 'చెల్లి బొట్టు ఎరుపు, తల్లి పాలం ఎరుపు" అంటూ అన్నిట్లోనూ ఎరుపే చూస్తాడు. ఒకే

సింబల్‌ని అరగదీసి, తీసి వాడుకోటంవల్ల అనుకున్నంత కవితాస్ఫూర్తి కలక్క విసుగు పుట్టిస్తుంది.

ఇవన్నీ చెరబండరాజులో లోపాలెన్నటానికి చూపించటం లేదు. పనికొచ్చే మంచి కవిత్వం రాస్తున్నాడు గనుకనే ఇంకా మంచి కవిత్వం రాసి బాగా పనికొచ్చేట్టు తయారు చెయ్యమంటున్నాను. చెయ్యగల సామర్థ్యం వుంది గనకనే చెయ్యమంటున్నాను.

దిగంబర శకంలోనుంచి విప్లవ కవితాయుగంలోకి ప్రవేశించిన వాళ్ళలో కొద్దికాలంలోనే ఇంత ఎత్తు ఎదిగిన కవి లేదని ధైర్యంగా చెప్పగలను. అయితే జనానికందరికి కనిపించేంత ఎత్తు ఎదగమంటున్నాను. జనానికందరికీ అందేంత దూరం విస్తరించమంటున్నాను. జన హృదయాలను తాకే లాలిత్యాన్ని పెంచుకోమంటున్నాను. దిక్సూచి, ముట్టడి, గమ్యం, కాంతియుద్ధం, గౌరమ్మ కలలు, జన్మహక్కు - అనే కవితా సంపుటాలు పరిశీలిస్తే చెరబండరాజు కవిత్వంలో క్రమవికాసాన్ని స్పష్టంగా గుర్తించొచ్చు. మార్పును కోరే కవి, తాను మారటానికిష్టపడే కవి చెరబండరాజు. చరిత్ర తనమీద పెట్టిన బాధ్యతను తప్పకుండా నెరవేరుస్తాడన్న ఆశ, నమ్మకం నాకున్నాయి.

చెరబండరాజు

"జన్మహక్కు"కు పీఠిక

1978 ఏప్రిల్ 23

# కొయ్యగుర్రం ఆధునిక మహాకావ్యం

సుమారుగా 1950-60 మధ్యకాలంలో తెలుగుదేశంలో ఆధునిక భావ చైతన్యాన్ని ప్రతిబింబించిన ఒకే ఒక్క వారపత్రిక "తెలుగు స్వతంత్ర"- 1954కు పూర్వం మద్రాసునుంచి ఆ తరువాత హైద్రాబాదు నుంచి వచ్చేది. ఆ పత్రికకు ఒక అలవాటుండేది. వచ్చిన కవితల్లో ఒక పేజీలో సరిపోయే వాటిల్లో మంచిది ఎన్నుకుని విషయసూచిక పక్క పేజీలో అచ్చేసేవారు. ఆ పత్రికలో పడ్డ కవితకి, మరీముఖ్యంగా, ఆ పేజీలో పడ్డదానికి తెలుగు పాఠక లోకంలో మంచి గుర్తింపు వుండేది. నిజాం కాలేజీలో బి.ఏ. చదువుతుండే కొంతమంది మిత్రులం 1956-58 మధ్యకాలం స్వతంత్రలో కవిత్వం చదువుతూ వాటి మంచి చెడ్డల గురించి హాస్టళ్ళలో, వీధుల్లో,పార్కుల్లో, ఇరానీ హోటళ్ళలో టీ తాగుతూ చర్చించుకుంటుండే వాళ్ళం. ఆత్మ విమర్శలు, పర విమర్శలు. కావ్యవిమర్శల్తో గంటల తరబడి పగళ్ళు, రాత్రుళ్ళు గడుస్తుండేవి. అట్లాంటి గంటల్లో ఒకచోట- బహుశా 1957లోనో 1958లోనో అనుకుంటా- ఒకవారం "స్వతంత్ర"లో విషయసూచిక పక్క పేజీలో అచ్చయిన "సౌందర్యపు స్వగతం" అనే ఖండికను గురించి చర్చించుకుంటున్నాం. కవి పేరు "సుధ" అని కొటేషనులో వుంది. ఆ రోజుల్లో నేను "స్వతంత్ర"లో రాస్తున్న నియో భావ గీతాలను అంతగా మెచ్చుకోని మా "బక్కోడు" జె. లక్ష్మినారాయణ అనే స్నేహితుడు, 'సౌందర్యపు స్వగతా"నికి ఇంప్రెస్ అయ్యాడు. "సుధ" గొంతులో విశిష్టతను గుర్తుపట్టాం. తర్వాత ఎక్కడో కలిశాడీ కవి. అతనిపేరు కేశవరావు అని తెలిసింది. 'ఫరవాలేదు పైకొస్తావు' అని భుజం తట్టినట్టు కూడా గుర్తు. కేశవరావు మరో అయిదుగుర్తో కలిసి దిగంబర కవితోద్యమం ప్రారంభించినప్పుడు 'నగ్నముని'గా మారాడు.

దిగంబరోద్యమం ఒక చారిత్రక అవసరంగా వొ...ంది. ఒక ఉద్య

మంగా అది నిర్వహించవలసిన కర్తవ్యం నిర్వహించింది. ఆంధ్ర కవిత్వ చరిత్రలో అతి కొద్దికాలంలో (సుమారు ఆరుదేళ్ళు) సాహిత్యం మీద అంత గాఢముద్ర వేసిన కవితోద్యమం యింకొకటి కనబడదు. కాలెండరు కవిత్వాలూ, ప్రాజెక్టుల కవిత్వాలూ రాసుకునే కవులనూ, రాజకీయోద్యమం బలంగా లేకపోవటం వల్ల నిద్రపోతున్న "అభ్యుదయ" కవులనూ, వాక్య చమత్కారాలతో వచన గీతాలతో ప్రభుత్వ కవి సమ్మేళనాల్లో, ఆలిండియా రేడియోలో చెవుల హోరెత్తించే కవులనూ, కొంత శృంగారం, మరికొంత అభ్యుదయం కలిపి కాసేపు గేయాలు కాసేపు వచన కవిత్వం రాసి పత్రికల్లో పుంఖానుపుంఖంగా అచ్చేసే కవులనూ, ఏం చెబుతున్నారో తమకే తెలియని అయోమయ కవులనూ కొరడా దెబ్బలవంటి తమ "దిక్కా"లతో కొట్టి కాలాన్ని కదిలించింది దిగంబర కవిత్వం. మరుగున పడ్డ సాంఘిక ప్రయోజనం అనే లక్ష్యాన్ని మళ్ళీ ముందుకు తెచ్చింది. ఇది తేలికైన పని కాదు. చెప్పే దాంట్లో ఉన్న శక్తి వల్లనే ఇది సాధ్యమైంది. వ్యక్తీకరణలో స్వేచ్ఛా ప్రవృత్తికి కూడా ఇది దోహదం చేసింది. ఈ దిగంబర కవితోద్యమంలో అత్యంత ప్రధానపాత్ర వహించాడు నగ్నముని.

దిగంబర కవిత్వం మీద, అందులో భాగమైన నగ్నముని కవిత్వం మీద నాకు కొన్ని రిజర్వేషన్లు లేకపోలేదు. ప్రత్యేకించి నగ్నముని వ్యక్తీకరణ మార్గం మీద నాకు కొన్ని అభ్యంతరాలున్నాయ్. అతని కథల మీద మరీ ముఖ్యంగా 'విలోమకథల' మీద నగ్నముని ఒప్పుకోలేని అభిప్రాయాలున్నయ్. అయితే, దిగంబర కవిత్వం సాధించిందాన్ని గురించి ఒప్పుకోటానికీ, నగ్నముని కవితాశక్తిని గుర్తించటానికీ ఈ రిజర్వేషన్లు నాకడ్డం రాలేదు.

"సౌందర్యపు స్వగతం" నుంచి 'కొయ్యగుర్రం' వరకు ఎదిగిన కవి సామాన్యుడు కాదని అప్పుడు అనుకున్నాను. ఇప్పుడూ అనుకుంటున్నాను. ఇరవయ్యేళ్ళ కిందటనే కొందరం గుర్తించి ఊహించినట్టుగానే శేషగిరావు

దశలవారీగా గొప్పకవిగా ఎదిగాడు. ఇతని అసామాన్యత్వం అతని ప్రయోగాలన్నిటిలో కొట్టవచ్చినట్టు కనిపిస్తుంది. ఈ అసామాన్యత్వానికి పరిణత రూపంగా 'కొయ్యగుర్రాన్ని' గుర్తిస్తున్నాను.

'కొయ్యగుర్రం" 1-1-1978 తారీకుగల "ప్రజాతంత్ర" వారపత్రికలో మొదట అచ్చయింది. కానీ ఆ సం॥ 1977 డిసెంబరులోనే మార్కెట్లోకి వచ్చింది. అంతకు ముందటి సంచికలో 'తుఫాను వ్యవస్థ మీద తెలుగు కవి కన్నెర్ర"- అని వచ్చే సంచికలో రాబోయే కావ్యాన్ని గురించి ప్రకటించారు. ఈ కావ్యాన్ని నగ్నముని ఒకటి రెండు చిన్న సమావేశాల్లో చదివి వినిపించాడని తెలిసింది. కాని నాకు ఆ సభలకు వెళ్ళే అవకాశం కలగలేదు. విన్న వాళ్ళు చెప్పారు. చాలా బాగుందని గొప్పగా వుందని, నగ్నముని గొంతులో ఒక గాంభీర్యం, ప్రౌఢమాధుర్యం ఉన్నై. అందువల్ల అతను చదువుతుంటే విన్న వాళ్ళు ఇంప్రెస్ కావటంలో ఆశ్చర్యం లేదు. మధునాపంతుల సత్యనారాయణ శాస్త్రిగారి లాంటి వాళ్ళు పద్యం చదువుతుంటే శ్రోతలు ముగ్ధులయినట్టు, నగ్నముని కవిత్వం చదివే పద్ధతికి సహజంగా ఆకర్షితులవుతారు. కాని నాకా అవకాశం దొరకలేదు. అందుకు విచారించటం లేదు. కారణం- 'ప్రజాతంత్ర" సరాసరి పోస్టులో మా ఇంటికి వచ్చింది. ఏకబిగిని పెద్దగా చదివాను. ఇంట్లో అందరికీ చదివి వినిపించాను. మహాకావ్యం చదివిన అనుభూతి కలిగింది. అందుకే "కొయ్యగుర్రం" మహాకావ్యం- ఆధునిక మహాకావ్యం. తెలుగు సాహిత్యంలో అభినివేశమూ అభిరుచీ వున్న రష్యన్ మిత్రుడు నికీతా గూరోవ్, నేనూ ఒకరోజు యూనివర్శిటీ గెస్ట్‌హౌస్‌లో కలిసి చదువుకున్నాం. అదే అనుభూతిని ఇద్దరమూ పొందాం. నా "ప్రజాతంత్ర" కాపీ కావాలని గూరోవ్ తనతోపాటు రష్యా తీసుకెళ్ళాడు. రష్యన్‌భాషలోకి అనువదించాలనే కోరిక ప్రకటించాడు. ఇదంతా జరిగిన చాలా రోజుల తరువాత, బహుశా కొన్ని నెలల తరువాత నగ్నముని కనిపించాడు. మనసారా అభినందించాను.

ప్రాచీన మహా కావ్యాలకు కొన్ని లక్షణాలున్నై. రస పోషణాదులు కాక అవసరమైన ఇతి వృత్తం, వర్ణనలు, అలంకారాలు, సర్గబంధం ఇత్యాదులు చాలా ఉన్నై వీటన్నిటికీ ప్రయోజనంలో మూలతత్వం ఒకటే. కొద్దిపాటి చమత్కారాలతో గిలిగింతలు పెట్టి అల్పానుభూతి కలిగించటం కాక సీరియస్ భావాలతో మహానుభూతి కలిగించటం మహాకావ్యం ప్రయోజనం. ప్రాచీన కవులు ఇందుకు ఇతివృత్తాన్ని ఆలంబనంగా ఎన్నుకున్నారు. కథాగమనంలో వైవిధ్యం ద్వారా కావ్యానుభవాన్ని కలిగించాలి కాబట్టి సహజంగా కావ్య విస్తీర్ణత పెరుగుతుంది. మహాకావ్యం సహజంగా సైజులో పెద్దదికూడా అవుతుంది.

ఈ శతాబ్దపు కవిత్వంలో ఖండకావ్యాలూ, లఘు కావ్యాలూ, మొదలైనవి చాలా వచ్చినై. ఈ కాలంలో వున్నారు కాబట్టి ఈ కాలపు ఇతివృత్తం తీసుకున్నారు. వ్యక్తీకరణలో, పోలికల్లో కొంత భేదంకూడా ఉంటే ఉండొచ్చు. ప్రాచీన కవిత్వంలో ఒక శాఖగానే ఇవి నిలుస్తాయ్. అందువల్ల ఇవి "ఈనాటి కావ్యాల"వుతాయే కాని ఆధునిక కావ్యాలు మాత్రం కావు.

ఆధునిక కవిత్వంలో వచ్చిన ఒక ప్రధానమైన మార్పు కథను వదిలెయ్యటం. కథా కావ్యాల్లో ఒక చిక్కుంది, కథా నిర్మాణం కోసం కవిత్వం కాని విషయాలున్న పద్యాలు రాయాల్సి ఉంటుంది. ఎప్పుడో కలగబోయే కావ్యానుభూతి కోసం కొంత చెత్తను కూడా భరించాల్సి వస్తుంది. అది చెత్త అనిపించకుండా ఉండటం కోసం కవి చమత్కారాన్ని కలిగించే వర్ణనలు చేస్తారు. కథను వదిలివేస్తే ఈ కసరత్తులు చెయ్యక్కరలేదు. చక్కని చిక్కని భావాల ద్వారా కవిత్వాన్ని సృష్టించొచ్చు. ఈ ప్రయోజనం దృష్టితోనే ఇంగ్లీషులో 'Poem' అనే దానికి సమానంగా తెలుగు కవిత్వంలో 'కవితా ఖండిక' ప్రవేశించింది. కిందటితరం భావగీతాలు, తరువాత తరం

అభ్యుదయ గీతాలు. ఆ తరువాత వాళ్ళ వచన గేయాలు మొదలయినవి ఇట్లాంటివే. వీటిల్లో కథ ఉండదు. భావప్రధానంగా ఉంటై. ఇందుకు పత్రికా ప్రచురణకూడా కొంత కారణం. పత్రికల్లో వెరైటీ అవసరం కాబట్టి ఒక్కో రచన-మరీ ముఖ్యంగా కవిత్వమైతే ఒకటి రెండు పేజీలకన్నా ఎక్కువ కేటాయించలేరు. కాకపోతే ఇంకో రెండు పేజీలు. అందువల్ల ఒకే భావాన్ని వ్యక్తం చేసే కథారహిత కావ్య ఖండికలు ఇటీవల ఎక్కువగా వస్తున్నాయ్. చోటును ఇంకా పొదుపు చేస్తూ, ఖండికను ఇంకా కుదిస్తూ ఇటీవల మినీ కవితలు కూడా వస్తున్నాయ్. ఒకే భావాన్ని అత్యంత క్లుప్తంగా కుదించి చెప్పి కవితానుభూతి కవసరమైన వాతావరణాన్ని నిర్మించుకునే పనిని పాఠకుడికే వదిలేస్తాయి ఈ మినీ కవితలు.

వ్యక్తీకరణలో ఆధునికత కోసం ఇంగ్లీషు 'ఫ్రీవర్స్' అనే వచన కవితా రూపం తెలుగులో బాగా ప్రచారమయింది.

కొద్దో గొప్పో మాత్రాగేయాలు వస్తున్నా, ఎక్కువగా అచ్చులో వచన కవిత్వమే కనిపిస్తున్నది. కవిత్వంలో "అర్బేనిటీ" (Urbanity) ని సాధించడానికి వచనకవిత్వం కవితా వాహకంగా బాగా పనికొచ్చింది. అయితే ఇందులోనూ కొన్ని కథాకావ్యాలు వచ్చినా వాటిలో ఆధునికత లోపించిందనే చెప్పాలి. సాంప్రదాయికమైన అలంకారాలు, వర్ణనలు, కథ మొదలైనవన్నీ అట్లాగే ఉంచి పద్యం బదులు వచనం వాడితే చాలు ఆధునిక కవిత్వం అవుతుంది అని అనుకునేవాళ్ళున్నారు. "ఆధునికత" అనేది ఎన్నుకున్న వస్తువులోనో, ఛందస్సులోనో ఉంటుందనుకోవటం వల్ల ఈ అపోహ కలుగుతుంది. ఆధునికతకి ఈ రెండూ అవసరమే. కాని అంతమాత్రమే చాలదు. వీటితోపాటు వేదనతో కూడిన ఒక తాత్విక చింతన కావాలి. వ్యక్తీకరణలో చమత్కారాలకి బదులు సీరియస్‌నెస్ కావాలి. వీటన్నిటి కలయికనే 'అర్బేనిటీ' అంటున్నాను. అది ఉంటేనే ఆధునిక కవిత్వం అవుతుంది.

ఛందస్సు లేకుండా రాసిన విచిత్ర వాక్యసముదాయం ఆధునికత కాదు. ఈ దృష్టితో చూస్తే పత్రికల్లో అచ్చయే వచన కవితా ఖండికలన్నీ 'నేటి కవితలు' అవుతాయిగాని 'ఆధునిక కవితలు' కావు.

కావ్య ఖండికల్లో ఒకే వస్తువు (అంటే కథ కాదు) ఒకే భావం ఉంటుంది. ఒక ఖండికలో భిన్న భావాలను కలిగించటం కష్టం. దానికి కొంత విస్తృతత కావాలి. మనం రోజూ చూసే ఖండికలకన్నా పెద్దవిగా ఉంటే తప్ప భిన్న భావాలను చెప్పటం కుదరదు. అంటే మహాకావ్యం కావాలి. మహాకావ్యానికి విస్తీర్ణతే ప్రధానం కాదుగాని అవసరమైన ఒక లక్షణం. పెద్ద పాయింటులో అచ్చెయ్యటం వల్లనో, పాదాలుగా విరవటం వల్లనో కవిత్వం కానట్టే, విస్తీర్ణత వల్లే ఏదీ మహాకావ్యం కాలేదు. ఒక ప్రధాన వస్తువుతో ఒక తాత్విక చింతనతో, సందేశంతో, అనేక భావాలతో, Moodsతో కథ లేకుండా, "అర్బనిటీ" అనే లక్షణం కలిగి వుండి, తగినంత విస్తారంతో ఉన్న దీర్ఘ కవితను ఆధునిక మహాకావ్యం అంటున్నాము. ఈ నిర్వచనంతో కొలిచి చూస్తే "కొయ్యగుర్రమే" మొదటి ఆధునిక మహాకావ్యంగా కనిపిస్తున్నది. కావ్య ఖండికల సంపుటులు చాలానే వచ్చినై. భావ, అభ్యుదయ విప్లవ కవుల ఖండికల సంపుటులు మహాకావ్యాలుగా భ్రమపడకూడదు. వాటిలో ఏ ఒక్క సంపుటి తీసుకున్నా ఫిలాసఫీ ఒకటే కావచ్చు. భాషా వైవిధ్యమూ ఉండొచ్చు. కాని భిన్నభావాలను కలిపే నిర్మాణబంధం (Structural tie) లేక పోవటం వల్ల అవి ఖండికల సంపుటులే అవుతాయి కాని మహాకావ్యాలు కావు. ఆ ఖండికలను మొత్తంనుంచి విడదీసి చదివితే [illegible] మిగిలినవాటికిగాని నిర్మాణరీత్యా లోపం ఉండదు. అదే ఖండకావ్యానికి గుర్తు. మహాకావ్యం భావరీత్యా ముక్కలుగా కనిపించినా నిర్మాణరీత్యా అఖండం.

ఆధునిక [illegible] : ఆధునిక [illegible] — [illegible] వచన కవి

తలో- అందమైన కావ్యాలు కొన్ని వచ్చినై. వాటిల్లో వివిధ భావసమ్మేళనం కూడా ఉంది. వాటిని మహా కావ్యాలు అన్నా అభ్యంతరం చెప్పను. కాని అవి ఆధునిక కావ్యాలు కావు.

నగ్నముని తన కవిత్వమంతా ఫ్రీవర్స్‌లోనే రాస్తాడు. ఫ్రీవర్స్‌లో స్వేచ్ఛ ఎక్కువ. అదే దాని బలం. అయితే ఈ స్వేచ్ఛవల్ల కవికి బాధ్యత కూడా పెరుగుతుంది. ఛందస్సులో రాసే వాళ్ళకి పదాల ఎన్నికలో స్వేచ్ఛ ఉన్నా కవితా రూపంలో స్వేచ్ఛలేదు. అది సిద్ధంగా ఉంటుంది. ప్రసిద్ధంగా ఉన్న రకరకాల పద్యగేయ భేదాల్లో కవి కొన్నిటిని ఎన్నుకుంటాడు. ఫ్రీవర్స్‌లో కవితారూపం సిద్ధంగా ఉండదు కవే తయారుచేసుకోవాలి. ముందుగా తయారు చేసుకోటమంటూ ఉండదు. కవితా రచన, రూపరచన ఏకకాలంలో జరుగుతై. అందువల్ల కవికి శ్రమ, బాధ్యత ఎక్కువ.

సిద్ధాంతరీత్యా ఛందస్సుల్లో అనంత రీతులు సాధ్యమయినా మౌలికమయిన ఛందోరీతులూ, కవుల వాడుకలో ఉన్న పద్యగేయ భేదాలూ పరిమితమైనవే. వాటిలో ఏవో కొన్నిటిని ఎన్నుకుని రాసే కవికి దారితప్పే ప్రమాదం ఉండదు. ఫ్రీవర్స్‌లో మాత్రం కవితారూపాల సంఖ్యకు పరిమితిలేదు. ఎప్పటికప్పుడు కవితారచన, రూపరచన జమిలిగా చేసుకుంటూ పోవాలి.

ఛందస్సులో కొన్ని రకాల పద్యాల్ని మార్చి వాడుకుంటూపోతే రూపవైవిధ్యాన్ని సాధించొచ్చు. అంటే రూపవైవిధ్యం కొన్ని నిర్ణీత పద్ధతుల్లోనే ఉంటుంది. ఫ్రీవర్సులో వైవిధ్యంకూడా కవి స్వయంగా కవితా రచనతోపాటే ఆలోచించుకోవాలి. మహాకావ్యం రచనలో అది యింకా అవసరం. వైవిధ్యం లేకపోతే ఫ్రీవర్సు మరీ విసుగెత్తిస్తుంది. కేవలం వాక్య భేదాలతో వైవిధ్యం సాధించాలనుకుంటే చిత్రవాక్య రచనతో "సీరియస్‌నెస్"ని పోగొట్టుకునే ప్రమాదముంది. మహాకావ్య రచనకిది

మరీ ప్రమాదం. ఛందస్సుల్లో వాక్య నిర్మాణాన్ని గురించి కవి ఎక్కువ శ్రమ పడక్కర్లేదు. సాధారణ వాక్యాల్నే వాక్య నిర్మాణం అనుమతించే పదక్రమ భేదాలతో పద్యగేయ చట్రాలలో ఇమిడించవచ్చు. కాని ఫ్రీవర్స్‌లో వాక్యరచన సాధారణ వచనంలో వాక్యరచనకన్నా భిన్నంగా ఉంటూ పద్యత్వాన్ని రానీయకుండా ఉండాలి. వచనంగా ఉంటూ, పేలవంగా ఉండకూడదు. వాక్యాల మధ్య అంతస్సంబంధాల్ని కల్పించుకుంటూ కవితా రూపాన్ని అల్లుకోవాలి.

ఫ్రీవర్సులో మంచికవిత్వం రాయాలంటే ఈ చిక్కులన్నీ ఉన్నై. అందుకనే ఈ బాధలన్నీ పడలేని వాళ్ళు కొన్ని అడ్డదార్లు తొక్కుతుంటారు. తెలుగులో వాక్యం చివరవుండే క్రియను ముందు పెట్టుకోవటం; చేతికి వచ్చినట్టు ముక్కలుగా విరవటం; తమ్ముడు, నేస్తం వంటి పిచ్చి సంబోధనలు మధ్య మధ్యలో అతకటం; కొన్ని ప్రశ్నార్థక వాక్యాల్ని పదే పదే రిపీట్ చెయ్యటం; పల్లియలు-మల్లియలు అనే విధంగా అంత్యప్రాసలు కలుపుకోటం; గారడీ వాక్యాలు, హాస్యోక్తులు, మధ్యలో తిట్లూ కూర్చటం, సింబాలిజం పేరిట అయోమయపు సంకేతాలు గుప్పించటం-ఇవి ఇటీవల ఫ్రీవర్సు రాస్తున్న వాళ్ళు చేస్తున్న ట్రిక్కులు. వీటివల్ల కొంత అర్థం కాని అయోమయ కవిత్వం, మరింత సభా రంజనకు పనికొచ్చే విదూషక కవిత్వం మాత్రమే వస్తున్నది. వచన కవిత్వం ఇంతటి అధోగతిలో ఉన్న సమయంలో ఉదాత్తమైన వస్తువుతో, సీరియస్ నెస్ ఎక్కడా చెడకుండా "ఫ్రీవర్సు"నే కవితా వాహకంగా గ్రహించి ఆధునిక మహాకావ్యాన్ని సృష్టించి ఒకేసారి - తెలుగు కవిత్వాన్ని - వచన కవిత్వాన్ని - ఆధునిక కవిత్వాన్ని మళ్ళీ పైకెత్తిన నగ్నమునిని మెచ్చుకోకుండా ఉండలేము.

ఇంక-దిగంబర కవుల్లో నలుగురు అప్పటి విప్లవ రచయితల సంఘంలో చేరారు. విరసంలో పాణిగ్రాహి, శివసాగర్ల పాటల బాణీ

లకు చారిత్రకావసరం దృష్ట్యా ఎక్కువ గౌరవం, ఆదరణ వచ్చినై. ఈ ప్రభావం వల్ల చెరబండరాజు వచన కవిత్వపు కుబుసం వదిలేసి పాటల కవిగా బయటికొచ్చాడు. గద్దర్ పాడే బతుకుపాటలు సామాన్య ప్రజల్లో చైతన్యం కలిగించటమేగాక నాటి ఉద్యమ కవితకు నమూనాలుగా నిల్చి ఉత్తమ కవితాభిమానుల్ని ఆకర్షించి కొత్తకవుల్ని పాటలవైపు లాగేసినై. పాటలు పాటలేకాని "కవిత" కాదనే అభ్యుదయ కవిత్వపు నాటి దశ దాటి పాటల్లోకూడా మంచి కవిత్వం ఉండవచ్చనే మధ్యదశనుకూడా దాటి అసలు పాటల్లో రాస్తేనే ఉత్తమ కవిత్వం అవుతుందనే దశవచ్చింది. ఇప్పుడు చెరబండరాజులాగా మారలేని ఉద్యమకవులు గద్దర్ తదితర ప్రజాకవుల పాటలశక్తికి తట్టుకోలేక వాటి ఆధిక్యాన్ని ఒప్పేసుకున్నారు. రాయటం కూడా తగ్గించుకున్నారు. ఆదే ఉద్యమంలో భాగమయిన నగ్నముని పాటల ఆధిక్యాన్ని ఎక్కడా ఒప్పుకున్నట్టు లేదు. ఫ్రీవర్సు వదిలినట్టులేదు. పట్టు విడువని విక్రమార్కుడిలా తన భావాలను ఫ్రీవర్స్‌లోనే రాస్తూ ఉన్నాడు. పాటల ప్రవాహానికి ఎదురీది సామాజిక చైతన్యాన్ని కలిగించే కవిత్వం ఇవాళ తెలుగులో రాయటం సాహసంగా కనిపిస్తుంది. ఆ సాహసం చేస్తున్నందుకు నగ్నమునిని అభినందిస్తున్నాను. ఒట్టి సాహసమే అయితే చాలా మంది చేస్తున్నారు. ఫ్రీవర్స్‌నుకూడా ఉద్యమోన్ముఖంగా సమర్థంగా వాడుకోవచ్చని 'కొయ్యగుర్రం' లాంటి మహాకావ్యం ద్వారా అత్యంతశక్తిమంతంగా రుజువు చేసినందుకు నగ్నమునిని మరోసారి అభినందిస్తున్నాను.

దుర్దినాలు గుర్తుండ కూడదని కోరుకుంటాం. 1977 నవంబరు 19 తెలుగుజాతి తరతరాలుగా గుర్తుంచుకోవలసిన దుర్దినం.

ఇనప నాదాల్తో
చెక్క హృదయంతో
ధన మదంతో
అలగా జనం భుజాల మీద

ప్యారీ చేసే కొయ్యగుర్రా

## ఉన్నంతకాలం గుర్తుంచుకోవాల్సిన దుర్దినం

మనిషి బతికుండగా
దాహం తీర్చలేని ఉప్పునీటి సముద్రం
నదుల మంచి నీళ్ళని కౌగిళ్ళలోకి లాక్కుని
తనివి తీరా తాగి తాగి
తెగబలిసిన కొండ చిలువలా
మెలికలు తిరిగి
కాలంపై
భూ గోళంపై
అలగా జనం ముఖాలపై
వృక్షాలపై పక్షులపై
సమస్త జంతుజాలంపై
చీకటి ముసుగు హఠాత్తుగా కప్పి
నీటితో పేనిన తాళ్ళతో గొంతులు బిగించి
కెరటాల్తో కాటేసి వికటాట్టహాసంతో
బుసలు కొడుతూ పరవళ్ళు తొక్కిన రోజు
1977 నవంబరు 19
కొయ్యగుర్రమెక్కి
కొయ్యకత్తితో పూరేగే ప్రభుత్వానికి
తీరమంతటా గుడిసె వుందని తెలుసు
గుడిసె ముందు పుట్టలున్నాయని తెలుసు
పుట్టలో కోడె నాగులున్నాయని తెలుసు
పడగలో విషముందని తెలుసు

అయినా ప్రకృతి విలయ తాండవానికి ప్రజల్ని వదిలేసిన పరిపాల కులే హంతకులన్న విషయం ఈ కావ్యం చదివితే మనం గ్రహించగలం. కొయ్యగుర్రాన్ని తగలబెట్టగల కొత్త ఇంధనాన్ని కనిపెట్టటమే కర్తవ్యం అని కూడా మనకు ఈ కావ్యం గుర్తు చేస్తుంది.

పాలకుల పుట్టినరోజు పండగలకు. మంత్రుల సన్మాన సంచికలకు చెక్క భజనచేసే కవులను వదిలేస్తే (వాళ్ళు ఉప్పెన కవిత్వం రాయటమే కాక కొయ్యగుర్రం తరపున దివి తాలూకా వెళ్ళి అక్కడ కవి సమ్మేళనాలు జరుపుకున్నారు!) ఆనాటి దారుణానికి ఇంత గాఢమైన ఆక్రోశం వెల్లడించే కవిత్వాన్ని నేను చూడ లేదు. ఇంకో చెప్పుకోదగిన కవిత గద్దర్ రాసిన "వరద పాట". గద్దర్ పాటలో ఆవేదన కనిపించినంతగా ఆక్రోశం కని పించదు.

"తల్లులు చూడంగా బాబు
పిల్లలు మునిగారు బాబు
పిల్లలు ఏడ్వంగ బాబు
తల్లులు మునిగారు బాబు" అని

ప్రజల భాషలో. పలుకుబడిలో హృదయ విదారకంగా గద్దర్ వర్ణించాడు. అయితే. కరిగిన గుండెల్ని కర్తవ్య దీక్షతో గట్టి పరిచే ప్రయత్నం గద్దర్ చెయ్యలేదు. హంతకుల్ని సరిగ్గా నిరూపించ లేదు.

'దివిసీమ అంతనూ బాబూ
ఎర్ర పీమైతేను బాబూ
ఏటి వావలు తోపు బాబూ
కోటి వాదలు తీయ బాబూ' అని

ఒక సందేశంతో పాట ముగుస్తుంది. ఈ ముగింపుకు అవసరమైన వాతా

1977 నవంబరు 19 నాటి ఉప్పెనవల్ల జరిగిన దారుణాల కారణాల లోతుల్లోకి వెళ్ళి ఆక్రోశాన్ని వెల్లడించి, తుఫాను వ్యవస్థ మీద మనకు ఆగ్రహాన్ని కలిగించటం "కొయ్యగుర్రం" అనే ఈ కావ్యలక్ష్యం. ప్రకృతి చేసిన విలయ తాండవాన్ని ఇంత సమర్థంగా వర్ణించిన ఇంకో కావ్యం నా దృష్టికి రాలేదు. ఈ సందర్భంలో అవినీతిపరుల అసమర్థ పరిపాలకులను హంతకులుగా నిరూపించిన ఇంకో కావ్యం కూడా నా దృష్టికి రాలేదు. ఇది శ్రీవర్మకే సంబంధించింది కాదు. తెలుగు కవిత్వానికి సంబంధించింది. 1977 నవంబరు తుఫాను మొదటిదీ కాదు. చివరిదీ కాదు. 1969 మే తుఫానులో కొన్ని ఊళ్ళే కొట్టుకుపోయిన జ్ఞాపకాలు ఇంకా మాసి పోలేదు. 1978 గుజరాత్ వరదల నష్టం విన్న మొన్నటిదే. ఏటేటా దేశంలో తుఫానులు, వరదలు వస్తూనే ఉంటై. పేదప్రజలు చలికో, వరదకో, తుఫానుకో బలి అవుతూనే ఉంటారు. కొయ్యగుర్రంమీద ఊరేగే ప్రభుత్వాలకు ఇవి పట్టవు. వాళ్ళకు కావలసిన కాంట్రాక్టర్లున్నారు. కానుకలిస్తారు. ఎన్నికల తంతు యథావిధిగా జరుగుతుంది. చెక్కహృదయపు కొయ్యగుర్రం సిగ్గు విడిచి ఊరేగుతూనే ఉంటుంది. దాన్ని తగల బెట్టడం ఒకటే పరిష్కారమార్గం. అదే ఈ మహాకావ్యం ఇచ్చే సందేశం. 1977 నాటి సంఘటన ఈ కావ్యానికి ప్రత్యక్ష ప్రేరణ మాత్రమే. అసలు సమస్య ఒక సంఘటనకు పరిమిత మయినది కాదు. అట్లాగే ఈ కావ్యం కూడా.

ఇంతకాలంగా ఈ కావ్యం 'ప్రజాతంత్ర' పుటల్లోనే వుండిపోయిం దనే సంగతి తెలుగులో మంచి కవిత్వం కోసం రకరకాల పత్రికల్ని గాలించే పాఠకులకు తెలుసు కాని, అధిక ప్రచారంలేని, అన్నిచోట్ల దొరకని, ఒక మారు మూల పత్రికలో అచ్చుకావటం వల్ల ఈ కావ్యాన్ని ఎరగనివాళ్ళు ఇంకా ఉండొచ్చు. ఇంత గొప్ప కావ్యం ఇన్నాళ్ళు (ఆధునిక కాలమానంలో రెండేళ్ళు సుదీర్ఘమైనకాలం) 'ప్రజాతంత్ర' పుటల్లోనే ఉండిపోవటం మన దురదృష్టం. దీని స్థానం మనందరి హృదయాల్లో మన ఆలోచనల్లో మన

కార్యాచరణలో కర్తవ్య దీక్షలో.

నేను ఇంతగా మెచ్చుకునే ఈ కావ్యంలో గొప్పదనం ఏమిటి? అనే ప్రశ్న ఈ కావ్యపాఠకుల్లో కొందరికైనా రావచ్చు. (నిజానికి కావ్యం చదివేవాళ్ళకి ఇట్లాంటి ప్రశ్నలు రాకూడదు) కవి ఆవేదనకు, ఆక్రోశానికి, ఆగ్రహానికి ఫలితం ఈ కావ్యం, ఇంతవరకూ చెప్పినవి కాక చెప్పగలిగిన కారణాలు మరికొన్ని చెబుతాను.

అతి దారుణమైన, అత్యంత అనూహ్యమైన సంఘటన జరిగినప్పుడు స్పందించే కవి హృదయంలో ఎట్లాంటి భావ సంఘర్షణ జరుగుతుందో అదంతా ఈ కావ్యంలో కనిపిస్తుంది. బాధ నిర్వేదం కోపం వైరాగ్యం-ఇవన్నీ ఒక్కోసారి వేరువేరుగానూ, ఇంకోసారి కలిసిపోయీ ఈ కావ్యంలో కనిపిస్తయ్. మనలోనూ సహానుభూతిని కలిగిస్తయ్.

సాంఘిక ప్రయోజనపు దృష్టితో రాసిన రచనలను విమర్శించేటప్పుడు మన విమర్శకులకు యాంత్రిక పద్ధతి ఒకటి అలవాటయిపోయింది. ఆ దృష్టితో "చదివితే" —

నాకు చంద్రమండలం వొద్దు
విమాన యానాలు వొద్దు
కాలాన్నీ జీవితాన్నీ కలుషితంచేసే
రాజకీయ కార్యకలాపాలొద్దు
రైళ్ళొద్దు బస్సులొద్దు
ఈ నాగరికత రద్దీ వొద్దు
పాతరాతియుగం పనిముట్లు పట్టుకుని
చరిత్ర చీకటి కోణాల గుహల్లోకి

వంటి వాక్యాలు చదివినప్పుడు కవి నాగరికతను వద్దని రాబిన్ హుడ్‌లాగా

ఎక్కడికోవెళ్ళి కొత్త జీవితం. ఊహాకల్పితమైన జీవితాన్ని గడుపుదామను కుంటున్నాడని యాంత్రికంగా విమర్శించటానికి వీలుంది.

కానీ, మానవజాతి కంతటికీ తనను సంకేతంగా చేసుకొని తాను ఏమీ చెయ్యలేనితనానికి సిగ్గుపడి కొత్త జీవితాన్ని ప్రారంభిస్తున్నానని చెప్పటం ఇక్కడ ఆయన ఉద్దేశం. జరిగింది చరిత్రలో కనీవినీ ఎరుగని దారుణ వైపరీత్యం. దారుణ సంఘటనలు జరిగినప్పుడు హేతువాద దృష్టితో ఆలో చించటం అన్ని వేళలా సాధ్యం కాదు. స్పందించే కవికి అది మరీ కష్టం. అందువల్ల అసలు ఈ ప్రపంచం మీద ఈ నాగరికత మీద అవహ్యం అసహజం కాదు. దీన్ని నిరాశావాదమనీ, కాల్పనిక వాదమనీ, ఇంకా ఇట్లాంటి అరిగిపోయిన మాటలతో పేర్లు పెట్టటం తేలికే. ఎప్పుడో సరిగ్గా గుర్తులేదుగాని ఇరవయ్యేళ్ళకు పూర్వమే ఒకానొక విమర్శకుడు శ్రీశ్రీ "దేశ చరిత్రలు" అనే గేయంలో—

ఏ దేశ చరిత్ర చూసినా
ఏమున్నది గర్వకారణం
నరజాతి చరిత్ర సమస్తం

పరపీడన పరాయణత్వం" అన్న పాదాలనుదాహరించి శ్రీశ్రీని నిరాశావాదిగా చిత్రించాడు. అతను నా జ్ఞాపకాన్ని బట్టి కమ్యూనిస్టు విమర్శకుడు. అప్పుడు చంద్ర రాజేశ్వరరావుగారు జోక్యం చేసుకుని ఆ విమర్శకుణ్ణి ఖండించారు. ఆ విమర్శకుడు పొరపాటును ఒప్పుకున్నట్లు ఇక్కడ చెప్పటం న్యాయం. ఆ రకమైన యాంత్రిక విమర్శలకు ఎప్పుడూ అవకాశం ఉంటూనే ఉంటుంది గనకే ఈ విషయాన్ని గురించి ఇంతగా చెప్పాను. నగ్నముని మీద ఇట్లాంటి ఆరోపణలు చెయ్యటానికి అవకాశాలు ఎక్కువే. అట్లాగే-

ఇప్పటికీ ఎవరయినా ఎవర్నయినా కొత్తగా చంపేదేమిటీ
ఏ క్షణంలో దేవుడు పుట్టాడో

ఏ క్షణంలో విధి రాత నుదిటిపై
లిఖించబడిందన్నారో
ఆ క్షణమే మనిషి చచ్చాడు
కర్తవ్యం చచ్చింది
ఇప్పుడు కొత్తగా ఎవరయినా ఎవర్నయినా చంపేదేమిటి?
ఇప్పుడు కొత్తగా సముద్రం చంపేదేమిటి?
ఇప్పుడు కొత్తగా కొయ్యగుర్రం చంపేదేమిటి?

అన్నప్పుడు నిరాశా వాదమో, నిసిసిజమో కనిపించవచ్చు. కాని మనిషికి జరిగే అన్యాయానికి విధి కారణమనుకునే అజ్ఞానాన్ని విమర్శించటమే ఇక్కడ నగ్నముని చేసింది. ఆ రకమైన భ్రమల నుంచి వాస్తవ దృక్పథం వైపు చూపు మళ్ళించటమే కవి లక్ష్యం. దేవుడు, విధి అనే భావాలు కర్తవ్యదీక్షను ఎట్లా చంపేస్తయ్యో సూచించటమే కవి ఇక్కడ ఉద్దేశించింది.

ఐక్కఎద్దులు వెంటరాగా నాగలి బుజాన వేసుకుని
పొలం వెళ్ళే ప్రతిరైతూ నాకు శిలువ మోస్తున్న
జీసస్‌లా కనిపిస్తాడు — అన్నప్పుడూ
మానవుడి మనసులో మాత్రం మహాబోధి
ఎప్పుడో కూలిపోయింది — అన్నప్పుడూ

నగ్నముని మత సంబంధమైన ప్రతీకలను వాడాడని విమర్శించే అవకాశం ఉంది. ఇక్కడ "జీసస్"నీ "మహాబోధి"నీ వాడింది మత సంకేతాలుగా కాదు. కావ్యంలోనే ఇంకోచోట చెప్పినట్టు "చివరికి తన నెవరు మోసం చేస్తారో జీసస్‌కి తెలుసు". నాగలి మోస్తున్న రైతును జీసస్‌తో పోల్చటం వల్ల హంతకులెవరో తెలుసుకోమన్న హెచ్చరిక ఉంది. అట్లాగే 'మహాబోధి' జ్ఞానానికి సంకేతం. మానవుడి జ్ఞానం అసమర్థమైపోయిందన్న

బాధ ఇక్కడుంది. ఇంకోచోట సూచించినట్టుగా 'జీవితం సాంకేతికమై జ్ఞాన నేత్రం తెరుస్తుందనడం అబద్ధం. పెరిగిన సాంకేతిక విజ్ఞానం మనిషిలో జ్ఞాన నేత్రాన్ని తెరవకపోవటం వల్ల ఆ విజ్ఞానం అనవసరమైన చోట అవసరమైన వారికి ఉపయోగపడకుండా పోయింది.

నిజానికి ఈ కావ్యానికి వ్యాఖ్యానాలు, వివరణలు అవసరమని నేననుకోవటం లేదు. నగ్నముని ఇతర కవితలతో పోలిస్తే ఇంత స్పష్టత ఉన్న కవిత ఇంకొకటి దొరకదు.

"కొయ్యగుర్రం
స్తబ్ధతకీ, మూర్ఖతకీ, అజ్ఞానానికీ, అహంకారానికీ
అసమర్థ పరిపాలనకీ ప్రతీక".

అని తను ఏ ప్రతీకను ఎందుకు వాడాడో కూడా చెపుతున్నాడు. నగ్నముని కవిత్వంలో ప్రతీకల గందరగోళం ఎక్కువనీ, ఆయన వాక్యాల్లో "సింటాక్సు" (Syntax) సరిగ్గా ఉండదనీ ఒకప్పుడు గోల పెట్టినవాణ్ణే. కానీ సంకేతాల్ని మరీ ఇంత స్పష్టంగా వివరించాలని కూడా నేను ఆశించ లేదు.

సామాజిక ప్రయోజనం దృష్ట్యా రాసే కవిత్వం ఈనాడు ఎక్కువగా వస్తున్నది. అందులో కొంత ఉద్యమాల్లో మమైక్యం చెందిన వాళ్ళ నుంచి, మరి కొంత ఉద్యమ సానుభూతి పరుల నుంచి రెండు రకాలుగా మంచి కవిత్వమే వస్తున్నది. మార్గాల్లో భిన్నత్వం కవిత్వానికి గుణాన్ని కూర్చి పెడుతున్నది. అయితే కవిత్వాన్ని విశ్లేషించి వ్యాఖ్యానించే విమర్శ సాహిత్యం అవసరమయినంతగా వస్తున్నట్టు లేదు. వచ్చిన కొద్ది విమర్శల్లో కూడా యాంత్రిక ధోరణులు తరచుగా వస్తున్నాయి. నగ్నముని కవిత్వం మీద ఇట్లాంటి విమర్శలు వచ్చే అవకాశం ఇంకా ఎక్కువవుతుంది గనుక ఈ ఒకటి రెండు వివరణలు ఇచ్చాను.

ఈ "కొయ్యగుర్రం" మహాకావ్యం అంటున్నాను. ఒక కవిత మహాకావ్యం కావటానికి చాలా విషయాలు కారణమవుతై. కావ్యవస్తువు, కవితా పద్ధతి, రచనా వైవిధ్యం, సందేశం- ఇట్లాంటి విషయాలన్నిట్లోనూ కవి ప్రతిభవల్ల ఒక కావ్యం మహాకావ్యం అవుతుంది. ఈ కావ్యంలో వస్తువు ఉదాత్తమని చెప్పక్కర్లేదు. కొయ్యగుర్రాన్నెక్కి ఊరేగే అసమర్థ ప్రభుత్వాల్ని హంతకుల్నిగా నిరూపించి కొయ్యగుర్రాన్ని తగలబెట్టే ఇంధనాన్ని సమకూర్చుకోమనే సందేశం ఈ కావ్యంలో ఉంది. రచనా పద్ధతిలో నగ్నముని సాధించిన విశేషాలు అతని ప్రత్యేకతను నిలబెడుతున్నయ్.

కవిత్వంలో ప్రతిపాదించే విషయానికి బలం చేకూర్చే గొప్ప వాక్యాలు ఈ కావ్యంలో వాలంటీర్లలా కవిత్వానికి దారి చూపుతై.

'హంతకులెవరో నాకు తెలుసు
నెపం కానేపు సముద్రం మీదకి తోస్తాను'
'అయినా మరేం ఫర్వాలేదు
కంకాళం నంజాయిషీ కోరదు'
"మరేం ఫర్వాలేదు
అనాధ ప్రేతం నంజాయిషీ కోరదు
'జెండా కన్నీరు కార్చదు'

పూర్వం 1966లో కాబోలు అజంతా 'జెండాలకు కన్నీళ్ళు లేవు' అనే శీర్షికతో ఒక కవిత రాశాడు. అయితే ఇక్కడ నగ్నముని వాడిన తీరు వేరు. అజంతా జెండాని సామ్రాజ్యవాదానికి సంకేతంగా వాడుకున్నాడు. నగ్నముని కొయ్యగుర్రపు చెక్క హృదయానికి సంకేతంగా వాడాడు.

ప్రీవర్సులో ఒకే శైలిని సాగదీస్తూ విసుగెత్తించటం తేలిక. ప్రతిభావంతుడైన కవి భావాలతో పాటు రచనలో కూడా వెరైటీ చూపిస్తాడు.

ఈ విషయంలో నగ్నముని పడ్డ జాగ్రత్త మనం స్పష్టంగా గుర్తించొచ్చు. అందాన్ని గుర్తు చేసుకునే చోట కృష్ణశాస్త్రిగారితో పోటీ పడుతూ-

"ఒకప్పుడు ఇక్కడో వూరు వుండేది
పక్షుల బారులు కొంటెగా పళ్ళ కొరికి
గుసగుసలు పోయేవి
ఒకప్పుడు ఇక్కడ బంగారం బరువుకి ఒరిగి
పొలాలు హొయలు హొయలుగా నృత్యం చేసేవి

ఈ పై వాక్యాల్లో కింద గీతలు పెట్టిన పదాల ఎన్నిక. మొత్తంలో పదాల పొందిక చెప్పదల్చుకున్న అందమైన భావనకు తగిన శైలీ లాలిత్యాన్ని సమకూర్చినై.

అవసరానికి పనికిరాని మన సాంకేతిక విజ్ఞానాన్ని ఆవహేళించేచోట—

'రోడ్లపక్క ప్లాస్టిక్ చెట్లు నాటుదాం
ప్లాస్టిక్ కొమ్మలపై ప్లాస్టిక్ పక్షుల్ని కూచోబెడదాం
ప్లాస్టిక్ కంకులు నాటి
పొలాలు బంగారం పండినట్లు చూపుదాం
జనం ఆనందంగా ఆడుకుంటూ పాడుకుంటూ కనిపిస్తున్నట్లు
మరబొమ్మలు చేయించి కీ యిచ్చి ఇసుక పర్రల్లో వొదులుదాం
ప్లాస్టిక్ ఆవుల ప్లాస్టిక్ గేదెల ప్లాస్టిక్ పొదుగుల పితుక్కుని
ప్లాస్టిక్ పాలు తాగుదాం
కొయ్య గుర్రాన్ని ఓహో ఓహో అంటూ
జీవితాంతం మోద్దాం"

ప్లాస్టిక్ ఇమేజరి ప్రాముఖ్యమైన వాటి స్థానంలో అప్రాముఖ్యమైన వాటి ని పొదిగించి సాధించదల్చిన శైలీ అవహేళనాన్ని సరిగ్గా వ్యక్తం చేస్తున్నది.

ఈ అవశేషాన్ని ప్లాస్టిక్‌తో అంతం చెయ్యకుండా పల్లకీలాగా కొయ్య గుర్రాన్ని మోయటం సూచించటం వల్ల అవసరమైన పొడిగింపు (monotony) పోయి వెరైటీ వచ్చింది. ఒకే భావాన్ని శైలీభేదాలతో వ్యక్తీకరించటం వల్ల భావానికి బలం కలుగుతుంది.

కొంత విస్తారమైన కావ్యంలో భావాల్లోనూ, భావవ్యక్తీకరణలోనూ శైలిలోనూ వెరైటీ సాధించటం అవసరం. అత్యంత విరుద్ధమైన భావాల్లో ఒక దాన్నుంచి ఇంకోదానికి దూకిస్తాడు నగ్నముని, వెరైటీ సాధించటానికి ఇతను పాటించే పద్ధతుల్లో ఇదొకటి. చాలా తాత్వికంగా—

''జీవితాన్ని మించిన విశ్శబ్దం
వెలుతుర్ని మించిన విశ్శబ్దం
శబ్దాన్ని మించిన విశ్శబ్దం
వేగాన్ని మించిన విశ్శబ్దం
విశ్వాన్ని అతిక్రమించి
శవం కన్నులో విలిచిపోయిన
విశ్శబ్దం

అని వర్ణించిన 'మహా విశ్శబ్దం' తరవాత కవి వెంటనే చిన్న పిల్లాడయిపోయి—

"సముద్రం" గుర్తుందా నీకు
తెల్లటి నురగల్తో బొచ్చు కుక్క పిల్లిలా
నువ్వు నా కాళ్ళ చుట్టూ చుట్టేసుకుంటూ తిరిగినప్పుడు
అలల నాలికల్తో నా పాదాల్ని నాకినప్పుడు
నిన్ను అమాయకపు ప్రాణివనుకున్నాను
నిన్ను పెంచుకుందామనుకున్నాను
నీ శోష మాన్పి లాలిద్దామనుకున్నాను.

అని సముద్రాన్ని బుజ్జగిస్తున్నారు. పూర్వ ఖండిక (9) 'నిశ్శబ్దం'తో ముగుస్తుంది. తరవాత ఖండిక (10) లో 'ఘోష' వినిపిస్తుంది. పూర్వ ఖండికలో తాత్విక గాంభీర్యం వ్యక్తమయితే తరవాత ఖండిక ప్రారంభంలో చిన్న పిల్లల అమాయకత మెత్తని చేత్తో తాకుతుంది. పూర్వ ఖండికలో రంగం ఆకాశంలో నక్షత్రాల కవతల ఉంది. తరవాత ఖండంలో రంగం కళ్ళకెదురుగా ఈ నేల మీదే ఉంది.

భావాల్లో వైరుధ్యాన్ని (పోలారిటీని) ఇన్ని రకాలుగా సూచించటం వల్ల పాఠకుడి మనసులో భావ సంఘర్షణ, సమ్మేళనాలను కలిగించి కవితామయం చేస్తుంది. మహాకావ్య రచన చేస్తున్న కవిమాత్రమే చెయ్యగలిగిన పనులివి.

ప్రజలను ముంచెత్తిన ప్రళయాన్ని వస్తువుగా తీసుకొని మహాకావ్యం రానేటప్పుడు ఫార్ములా పద్ధతి కవిత్వంరాయటం కుదరదు. అందుకే ఈ కావ్యంలో ప్రజల బాధలను వర్ణించేసి ఒక సందేశంతో పూర్తిచెయ్యలేదు. ఉప్పెన కలిగించిన నష్టమూ ఉంది. కారణాల లోతుల్లోకి పోయాడు. సందేశమూ ఉంది. వీటన్నిటినీ మామూలు కవిలా కాక తాత్వికుడుగా మానవ నాగరికత, జీవిత ధ్యేయం మొదలైన వాటిని గురించి చేసిన ఆలోచన పడిన తపన ఇందులో కనిపిస్తయ్. అందుకే—

ఆలోచనకీ మనిషికీ వున్న సంబంధం ఏమిటి?
భాషకీ భావానికీ వున్న సంబంధం ఏమిటి?
వేదనకీ శరీరానికీ వున్న సంబంధం ఏమిటి?
నేలకీ నీటికీ వున్న సంబంధం ఏమిటి?

అనే మూలభూతమైన ప్రశ్నలు వేసుకుంటారు. ఈ రకపు తాత్వికమైన ఆలోచనా పద్ధతి (Philosophical tone) కావ్యమంతటా కనిపిస్తుంది. దాన్ని గుర్తించి చదివినప్పుడే ఈ కావ్యం మనకు పూర్తిగా అర్థమవుతుంది

కవి ఒక్కోసారి పోట్లాడి కొట్లాడి చింపిన విస్తరివంటి ఆకాశంలో, చిందర వందరైన మెతుకుల్లాంటి నక్షత్రాల కవతలికి పోయి చూస్తాడు. అక్కడ నుంచి పదాసరి నేలమీదికివచ్చి సముద్రఘోషవింటాడు. చరిత్రలోనే వెనక్కి వెళ్ళి జీసస్‌ను స్మరిస్తాడు. బుద్ధుడిని వదిలి అశ్రునయనాల్తో తిరిగివచ్చిన గుర్రాన్ని గుర్తుచేసుకుంటాడు. మళ్ళీ ఇప్పటి కొయ్యగుర్రాన్ని గురించి చెపుతాడు. సమస్త విశ్వాన్నీ సమస్తకాలాన్నీ రంగం చేసుకున్నట్టుగా కని పిస్తుంది. ఆలోచనలకు అవధుల్లేకపోవటంవల్ల అవి తాత్విక స్థాయికి చేరినై. కావ్యం-మహాకావ్య స్థాయికి ఎదిగింది.

ఇంతటి గొప్ప కావ్యం పత్రికల పుటల్లోంచి రెండేళ్ళ తరవాత యినా బయటికొస్తున్నందుకు నాతో పాటు కవితాభిమానులంతా సంతోషి స్తారనుకుంటాను. అంతేకాక ఈ కావ్యం ఒక్కటే ఒక ప్రత్యేక పుస్తకంగా తీసుకురావటంలో కనిపించే అభిరుచిని మెచ్చుకుంటున్నాను.

ఈ ఆధునిక మహాకావ్యంలో నేను గుర్తించిన విశేషాలను ఈ పుస్తకంతో పాటే చెప్పుకునే అవకాశం కలిగినందుకు సంతోషిస్తున్నాను.

నగ్నముని 'కొయ్య గుర్రం'కు పీఠిక, 1979 డిసెంబరు.



# రెండు పదుల వెనుక

చాలాకాలం నుంచి ఇతరుల కవిత్వం గురించే మాట్లాట్టం, రాయటం, వ్యాఖ్యానించటం అలవాటయ్యింది. నా కవిత్వాన్ని గురించి రాసుకోవాల్సిన అవసరం వస్తుందని అనుకోలేదు.

ఈ పుస్తకం చేరా కవితల సర్వస్వం కాదు. మరీ తొలి రోజుల్లో రాసినవి ఇందులో లేవు. ఒకటి అరా తప్ప నా దగ్గరకూడా లేవు. ఆ తరవాత రాసిన వాటిల్లో కొన్ని దొరికినట్టు లేదు. అయితే దొరక్కుండా పోయినవి ఎక్కువుండవు.

తారీకుల్ని బట్టి చూస్తే ఎక్కువ భాగం 1958లో "స్వతంత్ర"లో అచ్చయినవి. రచనా కాలంకూడా అదే. కొన్ని 1957వి కూడా ఉన్నై. ఆ రోజుల్లో నిజాం కాలేజీలో బి.ఏ. చదువుతున్నా. 1959లో ఆంధ్రా యూనివర్సిటీలో తెలుగులో బి.ఏ. ఆనర్సు (ఎం.ఏ. అప్పుడులేదు) చదవటానికి వెళ్ళాను. అప్పటి నుంచీ ఏమీ రాయనట్టే. కృష్ణా పత్రికలో వచ్చిందొకటి తప్ప. వీటిలో ఎక్కువ భాగం సికింద్రాబాదు నుంచి ప్రకటితమయిన స్వతంత్రలో అచ్చయినై. కొన్ని అభ్యుదయ, స్రవంతి, తెలుగుదేశం, తెలుగు విద్యార్థి, కృష్ణా పత్రికల్లో వచ్చినై. ఈ సంపుటిలో చేర్చినవన్నీ ఎక్కడో చోట పూర్వం అచ్చయినవే.

ఆ రోజుల్లో "స్వతంత్ర" గోరాశాస్త్రి, శ్రీదేవిగార్ల సంపాదకత్వాన వచ్చేది. వారితో పరిచయం ఏర్పడకముందే వారు ఈ పద్యాల్లో కొన్నిటిని అచ్చేసి నేనొక కవినేమో నన్న భ్రమ నాకూ, లోకానికీ కలిగించారు. అయితే ఆ భ్రమలో నేనెక్కువకాలం ఉండలేదు. ఆ విషయంలో నేను లోకం కంటే ముందే ఉన్నాను.

ఈ సందర్భంలో పి. శ్రీదేవి గారిని స్మరించకుండా ఉండలేను. ఈనాటి సాహిత్య పాఠకులు శ్రీదేవి గారిని గురించి మాట్లాట్టంలేదు. అర్థోక్తమైన

కవిత్వం. అత్యంత శక్తిమంతమైన పాత్రలతో "కాలతీత వ్యక్తులు" అనే నవల. ఎవరూ స్పృశించని వస్తువుతో కథలూ అప్పటికే రాసి తెలుగు దేశానికి ఎంతో ఆశ కల్పించిన శ్రీదేవిగారు 1961 ఆగస్టులో చనిపోయారు. శస్త్ర చికిత్స పూర్తి అయిన తరవాత కోలుకుంటూనే హఠాత్తుగా మరణిం చారు. డాక్టరుగా ఆమె ఎంతో మందిని కాపాడారు. (నాయని కృష్ణకుమారి గారి ఎలిజీ చూడండి) డాక్టర్లు ఆమెను కాపాడలేకపోయారు. ఏన్నో గొప్ప రచనలు చెయ్యాల్సిన గొప్ప రచయిత్రి తెలుగుదేశానికి లేకుండా పోయారు.

ఈ సంపుటిలో చేర్చిన చాలా పద్యాలనూ, గేయాలనూ ఆమె మెచ్చుకొనే వారు. తను రాయాలనుకొంటున్న సమయంలో అట్లాంటి భావంతో ఉన్న గేయం నా దగ్గరనుంచి పోస్టులో వచ్చేదని. తను రాయటం మానేసి ఆ గేయం అచ్చేసేవారని ఆమె చెప్పేవారు. వ్యక్తిగా ఆమె అంత ఉన్నతు రాలు. ఈ సంపుటిలో కొన్నిటి పేర్లు ఆమె పెట్టినవే.

ఇటీవలి కాలంలో తెలుగులో రాసిన నా భాషా వ్యాసాలను గురించి తెలుగు పాఠకులకు (వాటిని పూర్తిగా చదివినా. చదవకపోయినా) తెలుసు. అడపా దడపా తెలుగు సాహిత్యం గురించి రాస్తున్న వ్యాసాలుకూడా కొందరికి తెలుసు. వాటిని చదివిన వాళ్ళు ఈ పద్యాలు గేయాలు చూసి ఆశ్చర్య పడతారనుకొంటా. అందులో కొందరికి వెంటనే రెండు సందేహాలు రావొచ్చు: చేరా ఈ రకమైన కవిత్వం రాశారా? రాస్తే రాశాడు, ఇన్నాళ్ళ తరవాత వీటిని ఎందుకచ్చేస్తున్నాడు? అని. ఈ సందేహాలు తీర్చటం నా కర్తవ్యం అనుకుంటున్నా.

నేను కాలేజిలో చదువుకొనే రోజుల్లో రాసిన పద్యాలూ, గేయాలూ ఇవి. వీటిల్లో ఎక్కువ భాగం 1958లో రాసినా అంతకుముందు కొంతకాలం నుంచి రాయటం ప్రారంభించాను. ఈ సంపుటిలో చేర్చలేదుగాని కొంత ప్రేమ కవిత్వంకూడా రాయకపోలేదు. దేశంలో అప్పటికి అభ్యుదయ కవిత్వం

ఆగిపోయింది. అభ్యుదయ రచయితల సంఘం కార్యకలాపాలు కూడా అంతంత మాత్రమే. అభ్యుదయ కవుల్లో కె.వి. రమణారెడ్డి గారొక్కరే అస హాయ శూరుడిలాగా ప్రజా పోరాటాల గురించి కవిత్వమూ, అభ్యుదయ సాహిత్యాన్ని సమర్థిస్తూ వ్యాసాలూ రాస్తూ వచ్చారు. 1955లో జరిగిన ఆంధ్ర ఉప ఎన్నికల్లో అభ్యుదయ శక్తులకు ఊహించని విధంగా ఓటమి ఎదురయింది. అభ్యుదయ రచయితల సంఘాన్ని పునరుద్ధరించే ప్రయ త్నాలు జరిగినై కాని ఆ ప్రయత్నాలు ఏమంత ఫలవంతమయినట్టు తోచదు. తుమ్మల వెంకట రామయ్యగారు, కె.వి. రమణారెడ్డిగారు కొంతకాలం ప్రయత్నించి అభ్యుదయ పత్రికను నడిపారు. ఈ ప్రయత్నాలన్నీ అభ్యు దయ సాహిత్యాన్ని సృష్టించలేక పోయినై. కొత్త అభ్యుదయ కవులను తయారు చెయ్యలేక పోయినై.

దాశరధి కృష్ణమాచార్యులు, సి. నారాయణరెడ్డిగార్లు తెలంగాణా రచయితల సంఘం ద్వారా కవిసమ్మేళనాల ద్వారా, తెలంగాణా జిల్లాల్లో సాహిత్యంలో ఒక కొత్త చైతన్యాన్ని (సుమారు 1952 నుంచి) కలిగించారు. వీరిచేత ప్రభావితులైన కొత్తతరం కవులు ముఖ్యంగా తెలంగాణా నుంచి బయలు దేరారు. వీళ్ళ కవిత్వంమీద అభ్యుదయ కవుల ప్రభావం తక్కువ. కొంత క్లాసిసిజం, మరికొంత లిరిసిజం ప్రధానంతో దాశరథి, నారాయణరెడ్డిగార్లు వేసిన దారి ఈ కొత్త కవులకు మార్గదర్శకమయింది. ఈ మార్గంలో కొంత అభ్యుదయ కవితా ఛాయలు ఉన్నా, అది అభ్యుదయ కవితా మార్గానికి చెందింది కాదు. కావాలంటే దీన్ని రొమాంటిక్ అభ్యుదయవాద మనొచ్చు. అభ్యుదయ కవులు ఖాళీ చేసిన సాహిత్య రంగాన్ని ఈ ధోరణి కొన్నాళ్ళు ఆక్రమించింది.

1956లో హైదరాబాద్ ముఖ్యపట్టణంగా ఆంధ్రప్రదేశ్ ఏర్పడింది. ఉద్యోగ రీత్యా కుందుర్తి ఆంజనేయులుగారు హైదరాబాదులో స్థిరపడ్డారు.

తెలంగాణ భూస్వామ్య వ్యతిరేక పోరాటాన్ని సమగ్రంగా చిత్రించిన కుందుర్తిగారి 'తెలంగాణ' 1956 లోనే అచ్చయింది. కవిత్వంలో తనది అభ్యుదయ మార్గమని కుందుర్తి పదే పదే ప్రకటించిన మాట నిజమే. కాని ఆయన వచన కవితా రూపానికి ఇచ్చిన ప్రాధాన్యం కవితా ప్రయోజనానికి ఇయ్యలేదు. కనీసం ఆయన వచన కవితా మార్గాన్ని అనుసరించిన వాళ్ళు అట్లా అనుకున్నారు. వచన కవిత్వం రాసిన వాళ్ళందరిన్నీ ఆయన ప్రోత్స హించారు. లేక అట్లా రాస్తున్న వాళ్ళంతా కుందుర్తిని ఆసరాగా వాడు కున్నారు. అభ్యుదయ కవితా సంప్రదాయానికి కుందుర్తి మార్గంకూడా దోహదం చెయ్యలేదనేది చారిత్రక సత్యం. దిగంబరకవిత్వం వచ్చేవరకు తెలుగుకవిత్వంలో వచనకవిత్వం పేరిట రూపవాదంకూడా ప్రచారంలోఉంది.

ఈ రెండు మార్గాల్లోనుంచి చిత్ర చిత్రమైన కవులూ కవిత్వాలూ మొదలయినాయి. రేడియో కవులు, పండగ కవులు, ప్రభుత్వ కవులు, అయోమయ కవులూ మొదలైన వాళ్ళు తయారయ్యారు. ఈ కాలంలో సాహిత్యాన్ని బలంగా ప్రభావితం చెయ్యగలిగిన రాజకీయోద్యమం లేక పోవటం గుర్తించదగిన చారిత్రక విశేషం.

నేను కవిత్వం రాసేనాటి రాజకీయ సాహిత్య స్థితి ఇది. అయితే నా రచనల మీద ఈ రెండు రకాల మార్గాల ప్రత్యక్ష ప్రభావం ఉందనుకోను. 1952 ప్రాంతంలో భావకవుల కావ్యాలూ, పాత పత్రికల్లో వాళ్ళ ఖండికలూ విప రీతంగా చదివాను. సౌభద్రుని ప్రణయయాత్ర, మాతృగీతాలు, కృష్ణశాస్త్రి కృతులు, ఎంకి పాటలు, వైతాళికులూ నిత్యపారాయణ గ్రంథాలు. అదే సమయంలో బహుశా ఇంకా రెండేళ్ళ ముందునుంచేనేమో - అభ్యుదయ కవుల రచనలూ చదివాను. మహాప్రస్థానేతర శ్రీశ్రీ రచనలు పత్రికలనుంచి ఎత్తి రాసుకునేవాణ్ణి. భావకవుల రచనాశిల్పం నన్నెక్కువ ఆకర్షించింది. అభ్యుదయ కవుల ఫిలాసఫి నచ్చినంతగా వాళ్ళ రచనా మార్గం (శ్రీశ్రీని

మినహాయిస్తే) నన్ను ఆకట్టుకోలేదు. రాజకీయంగా నాది అభ్యుదయ కవుల పక్షం. రచనా పద్ధతిలో భావకవిత్వం మీద ప్రీతి. ఈ రకమైన ద్వంద్వ ప్రకృతి నాలో ఉండి ఉండాలి. అందుకే ఈ సంపుటిలో స్వతంత్ర రచనల్లో సమాజం, చట్టుబండలూ ఏమీ లేవు. అంతా సొంత గొడవే. అనువాదాలు మాత్రం ఎక్కువగా అభ్యుదయ కవులవి. అనువాదాల్లోకూడా భావకవుల డిక్షన్ వదల్లేదనుకుంటా, కనీసం అది అభ్యుదయ కవుల డిక్షన్ కాదు. అంతరికమైన అనుభూతి భావకవులది. బౌద్ధికమైన చైతన్యం అభ్యుదయ కవులది. అందుకే పద్యంరాస్తే భావకవుల పోకడలే ప్రత్యక్షమవుతై. ముఖ్యంగా నాయని సుబ్బారావుగారి పలుకుబడి ఎక్కువుందనుకుంటాను.

మాత్రాచ్ఛందస్సుల్లో రాయటానికి అభ్యుదయ కవుల ప్రభావం కొంత కారణమయినా ప్రేరణ భావ కవులనుంచే కావచ్చు. మాత్రాచ్ఛందస్సుల్లో కొన్ని ప్రయోగాలు చెయ్యాలని సరదా ఉండేది. వేదుల్తుక్కుల అనువాదాల్లో విద్వాన్ విశ్వం ప్రయోగాలు వివిధ నాయికల గురించి పఠాభి చేసిన మాత్రాచ్ఛందస్సుల గమ్మత్తులూ, భావకవుల ముత్యాల సరాలు నన్ను ఆకర్షించినై. నా ముత్యాల సరాలమీద గురజాడ ప్రభావం లేదు. ఇతర మాత్రా పద్యాలమీద నారాయణరెడ్డి ప్రభావమూ లేదు. మాత్రాచ్ఛందస్సుల్లోనే సొంత గొంతుక కొంత వినిపిస్తుందనుకుంటా. మాత్రాచ్ఛందస్సులో కవిత్వం రాస్తున్న రోజుల్లోనే మాత్రాచ్ఛందో రీతులమీద అభ్యుదయలో వ్యాసం రాశాను. ఇది స్థూలంగా నేను కవిత్వం రాసిన నాటి సాహిత్య స్థితి. ఇవీ నా రచనల్లో నేను గుర్తించిన ప్రభావాలు.

ఈ సంపుటిలోని 'ధర్మసంస్థాపనార్థాయ' అనే ఖండిక ఎక్కువమందిని ఆకర్షించింది. శ్రీశ్రీ గురించి వ్రాసిన ఈ గేయం నాకు శ్రీశ్రీ అభిమానులతో సాన్నిహిత్యాన్ని సమకూర్చింది. శ్రీశ్రీ అభిమానులు చాలామంది (మకుంటున్న విషయాలకే ఈ గేయం అభివ్యక్తి ఇయ్యటం కారణం

కావచ్చు. ఈ గేయానికి ప్రేరకమైన సంఘటన ఇంకా గుర్తే. మా క్లాసు మేటు జె. లక్ష్మీనారాయణతో కలిసి నిజాం కాలేజినుంచి ఆబిద్ రోడ్డువైపు పోతుంటే "మహాదేవి" అనే డబ్బింగు సినిమా పోస్టర్ కనబడింది. ఆ సిని మాకి మాటలు పాటలు శ్రీశ్రీ అనికూడా ఆ పోస్టర్‌లో ఉంది. అంతేకాదు బ్రాకెట్లో "రామభక్త హనుమాన్ ఫేమ్" అనికూడా రాశారు. ఇది ఇంకో డబ్బింగు సినిమా. అప్పుడే "మరో ప్రపంచ మహాకవి రామభక్త హను మాను ఫేమా?" అనే లైను అప్రయత్నంగా అన్నాను. అదే తరవాత ఈ గేయంగా రూపొందింది.

కారణం ఏదన్నా కానీ కవిత్వపు మత్తులోనుంచి త్వరగానే బయటపడ్డాను. కవిత్వం రాయటం కంటిన్యూ చేస్తే ఎట్లా ఉండేదనే ప్రశ్నకు సమాధానం చెప్పటం కష్టం. ఒక మైనర్ కవిగా కొన్ని పుస్తకాలు అచ్చేసే వాణ్ణేమో. ప్రజాకవిని కాలేకపోయినా నా సమకాలికులు కొందరిలాగా ప్రభుత్వ కవిని అయ్యేవాణ్ణి కాదనుకుంటా. కవిత్వం రాయటం కన్నా మంచి పనులు చేస్తున్నానన్న సంతృప్తి ఉంది ఇప్పుడు.

అయితే ఈ పాత పద్యాలూ, గేయాలూ, మళ్ళీ పుస్తకంగా కూర్చటం ఎందుకు? ఎవరికి పనికొస్తాయి?

నేను కవిత్వం రాశాని చెప్పుకోవాలనే ఉబలాటం ఏ మూలన్నా కాస్త ఉంటే ఉందేమో! కాదనలేను. గొప్ప కవిత్వం రాశానన్న భ్రమ మాత్రం లేదు.

పరిశోధకుడిగా స్థిరపడిన వాడి కవితాంతస్సు తెలుసుకోటానికి ఈ పుస్తకం పనికిరావచ్చు. కవితావేశమూ, సాహిత్య వివేచనా ఒకే మనిషిలో ఉండటా నికి ఎట్లా వీలుంటో ఈ కవితల ద్వారా తెలుసుకోవచ్చు. తెలుగు సాహి త్యంలో తాత్కాలికంగా ఒక శూన్యత (వాక్యూం) ఎర్పడ్డ సంధికాలంలో కలం పట్టిన వాళ్ళలో ఒకడు ఏ రకమైన కవి అవుతాడో గుర్తించొచ్చు.

భావకవుల రచనా శిల్పం తమ కాళ్ళాన్ని దాటి ఎంతదూరం ప్రసారం చూపు తున్నదో గ్రహించొచ్చు మాత్రావృందన్నుల్లో ముఖ్యంగా ముత్యాల సరాల్లో ఏ రకమైన హొయలు చూపించటానికి వీలుందో కొంత గమనించొచ్చు. ఈ ప్రయోజనాలు చాలవా ఈ గేయాలు పుస్తకంగా సంపుటీకరించటానికి?

పుస్తకాలకు ఎవరో ఒకరిచేత పీఠిక రాయించటం దాదాపు పుస్తక ప్రచురణతో పాటే ప్రారంభమయి ఉంటుంది. పీఠికల తీరుతెన్నులు ప్రత్యేకంగా పరిశోధించాల్సిన అంశం. అతిశయోక్తులతో ఆకాశానికెత్తేవి, ఉదాహరణలతో ఉబుసుపోక కబుర్లు చెప్పేవి, అసలు పుస్తకాన్ని వదిలేసి భూప్రదక్షిణం చేసి వచ్చేవి, యోగ్యతాపత్రాలిచ్చేవి, విశ్లేషణలతో వివరించేవి— ఇట్లా పీఠికలు చాలా రకాలున్నై. ఈ రకమైనవేవీ ఈ పుస్తకానికి అవసరం అనుకోను. విశ్లేషణ చెయ్యాల్సినంత గహనమైన కవిత్వం ఇందులో లేదు. యోగ్యతాపత్రాలు ఈ కవిత్వాన్ని నిలబెట్టాల్సిన అవసరం లేదు. ఈ పద్యాలు గేయాలు రాసిన మనిషిని పరిచయం చేసేదే దీనికి అవసరమయిన పీఠిక. కోటీశ్వరి సరిగ్గా అదే చేసింది. ఆ పరిచయమే లేకపోతే ఈ పుస్తకానికి చాలా వెలితి అయ్యేది అని అనిపించేంత బాగా ఆ పని చేసింది.

'రెండు పదులపైన' పద్య గేయ సంపుటికి స్వపీఠిక.

1980 నవంబరు 6.

తన కవిత్వాన్ని గురించికాక వచనకవిత్వాన్ని గురించి రాయమని నన్ను కోరినందుకు రామకృష్ణగారి ఔదార్యాన్ని మెచ్చుకోకుండా ఉండలేను. (వచన కవితాప్రయోగంలో తన స్థానాన్నిగురించిన ఆత్మవిశ్వాసంకూడా అందుకు కారణమేమో!) ఆయన ఔదార్యాన్ని ఆసరాగా తీసుకుని వచన కవిత్వాన్నిగురించి నా అభిప్రాయాలను ఇక్కడ పుఉమటం నా వుద్దేశం కాదు. వచన కవిత్వంలో రామకృష్ణగారి మార్గాన్ని గురించి సందర్భం చూసుకుని ప్రస్తావిస్తాను. ప్రధానంగా వచనకవిత్వపు లక్షణాలకే పరిమిత మవుతాను.

వచనకవిత అనే పేరుతో ప్రచారంలోఉన్న ఈ కవితారూపం ఆధునిక ఆలోచనా ఫలితం అని చాలామందితో పాటు నేనూ భావిస్తున్నాను.

ఈ కవితారూపానికి లక్షణనిర్వచనం చెయ్యటానికి ప్రాచ్యపాశ్చాత్య దేశాల్లో ప్రయత్నం జరిగింది. అశాస్త్రీయ, అస్పష్టధోరణులు అన్ని ప్రాంతాల్లోనూ ఉన్నాయి. ఆ పద్ధతిలో వచన కవిత్వానికి అంతర్లయ, భావలయవంటి సిద్ధాంతాలను వాళ్ళు ప్రతిపాదించారు. ఊపు, తూగు, విసురు, భావగణాలు, పదగణాలవంటి లక్షణాలు సుమారు పాతికేళ్ళనుంచీ వినవస్తూనే ఉన్నాయి.

లిపి ఉన్న భాషల్లోనూ లిపి లేని భాషల్లోనూ పద్యరచన ఉంటుంది. (ఇంగ్లీషులో వెర్సు (verse) అనే దానికి తెలుగులో 'పద్యం" సమానార్థకంగా వాడుతున్నాము.) అక్షర (syllables) క్రమ, సంఖ్యాభేదాల ఆధారంగా అన్ని భాషల్లోనూ పద్యరచన ఉంటుంది. కోయభాషలో 'రేలపాట' లయినా సంస్కృతంలో 'మందాక్రాంత వృత్త' మయినా తెలుగులో "ముత్యాలసరా'లయినా ఈ లక్షణాల కిందికే వస్తాయి.అక్షరాలు(syllables)

ధ్వని సంయోజనంవల్ల ఏర్పడతాయి. ధ్వని ప్రాధాన్యం ఉన్న పద్యాలకు మౌఖిక ప్రసారం సహజస్థితి.

లిఖితస్థితిలో మౌనపఠనంద్వారా ధ్వనిమూలకమైన అక్షర ప్రాధాన్యం తగ్గిపోతుంది.

ప్రాచీనకాలంలో ఒకరు చదవగా పదుగురు వినే స్థితి కవిత్వానికి ఉంది. ఆధునికకాలంలో ఎవరికివారే చదువుకునే స్థితి అచ్చుపత్రికలద్వారా పుస్తకాలద్వారా ఏర్పడింది. అందువల్ల ధ్వనిప్రాధాన్యంలేని కవిత్వం అవతరించింది. ఇదే వచనకవిత్వం.

లిఖితస్థితి లేని భాషల్లో 'వచన కవిత్వం' ఉండదు. అంతేకాదు ముద్రణా సౌకర్యం లేని భాషాసమాజాల్లోకూడా వచనకవిత్వం ఉండదు. అందువల్లనే వచన కవిత్వం ఆధునిక నాగరికతా మూలకం అవటం.

వచన కవిత్వానికి ధ్వనుల ప్రమేయం అసలు లేదా ? అనొచ్చు. వచన కవిత్వంలో పాదాదిఅక్షరాల్లో పాదాంతాక్షరాల్లో సమత్వం పాటించే కవులు లేకపోలేదు. సి. నారాయణరెడ్డిగారి వచన పద్యాల్లో చాలాచోట్ల పాదాద్యక్షర సమత్వం కనిపిస్తుంది. రామకృష్ణగారి కవిత్వంలో రెండూ కనిపిస్తాయి.

ఉషస్సు నాకు పరిచారిక
అహస్సు నాకు అభిసారిక (151 పే)
వయసు పోస్టాఫీసు మూసేశారు
వలపు మెయిలు దాటిపోయింది
అయినా ఏం మించిపోయింది?
ఆకల్ని బాలభురాళ్ల కందించాను (172 పే)

ఇదిగాక వచన కవిత్వాన్ని చదివే పద్ధతిలో మామూలు వచనాని కన్నా భిన్నమైన పద్ధతి కనిపిస్తుంది. ఈ పద్ధతి కవిసమ్మేళనాల్లో సభల్లో

రేడియోలో చదివే అవసరాలవల్ల వచ్చింది. వీటిని వదిలేస్తే వచన కవిత్వానికి ధ్వనిసంబంధం ప్రత్యక్షంగా లేదు.

ధ్వనీతరమార్గాల్లో వచనాన్ని పద్యం చెయ్యాలి. అందుకు- వాక్యాలు వాక్యంలో పదాలూ వాటిక్రమం వాటి మధ్య యోగ్యతా సంబంధాలు- ఇవి వచనపద్యనిర్మాతకు అందుబాటులో ఉన్న భాషాంశాలు ధ్వనుల ద్వారా పద్యంలో సాధించే సమనిర్మాణం (Pattern) వాక్య, వాక్యాంశాల ద్వారా వచనపద్యంలో సాధించాలి. ఈ విషయాలు అంతగా స్పష్టపడని కాలంలో ఊపు, విసురు, వేగం, భావలయ, అంతర్లయ, భావగణాలు- మొదలైన అభాసలక్షణ ప్రతిపాదన జరిగింది. భాషల గురించి, తెలుగుభాషను గురించి, భాషాసాహిత్యాల పరస్పర సంబంధాలగురించి భాషాశాస్త్ర పరిశోధనలవల్ల ఎన్నో కొత్తవిషయాలు మనకు తెలిసినాయి. ఈ కాలంలో అట్లాంటి అస్పష్ట ప్రతిపాదనతో సరిపుచ్చుకోవాల్సిన అవసరంలేదు. లక్షణపరిశీలన స్పష్టాంశాల సాయంతోనే చెయ్యొచ్చు.

వచనంలోఉండే భాషానియమాల సాయంతో వచనభిన్నమైన సాహిత్యరూపం తయారయితే, దాన్ని "వచనకవిత్వం" అంటాం. భాషాంతర్గత భాషానియమాల "పేర్పు" ద్వారా 'వచన కవిత్వం' తయారవుతుంది. ఆ "పేర్పు" ఒక్కో పద్యానికి (కవితా ఖండికకు) ఒక్కోరకంగా ఉంటుంది. కాబట్టి ప్రాచీనఛ్ఛందశ్శాస్త్రంలోలాగా పరిమితమైన పద్యభేదాలుగా ప్రస్తరించి చూపటం కుదరదు. ఇందుకు ఏ భావగణాలూ సహాయపడవు. అసలా గణభావనే ఇక్కడ సరిపడదు.

ఈ పుస్తకంలో కొన్ని మరీ స్పష్టంగా కొన్నిచోట్ల కొంచెం అస్పష్టంగా రకరకాల వాక్యనిర్మాణపద్ధతుల సప్రయోగించుకొని, వచనపద్యనిర్మాణం జరిగింది. ఉదాహరణకి "సంశోధం" (149 పే.) అనే ఖండికలో ప్రశ్నల-సమాధానాల పేర్పుద్వారా "పద్యత్వం' సాధించబడింది.

పాదవిభజన అచ్చులో ఆర్బిట్రరీ (arbitrary)గా, అంటే ఏ రక మైన నియమం లేకుండా చేసిన ఖండికలు కొన్ని ఉన్నాయి. ఉదాహరణకి మానవుడు-దానవుడు (128-129 పే) అట్లాంటివి. అయితే, ఇందులోకూడా కొన్ని ప్రశ్నలు వరుసగా పేర్చి, తరువాత సమాధానాలు వరుసగా ఇయ్య టంవల్ల వచనానికి అసాధారణత ఏర్పడి, "పద్యత్వం" సిద్ధించింది.

మరికొన్నిచోట్ల కేవల రూపకాలంకారం వాడి పద్యత్వాన్ని సాధి స్తారు. "ఉద్యోగ విప్లవం" (164 పే.) అనే ఖండిక అట్లాంటిది.

తిమిరాల కారంమిల్లులో ఎంత పనిచేసినా డొక్కనిండదు.
వెలుగుల కర్మాగారంలో ఉద్యోగం ఇవ్వకపోతే-
విద్యుత్తు డొక్కలో పొడిచి విప్లవం కక్కించు.

రామకృష్ణగారి ఈ కవితాసంపుటిని పూర్తిగా విశ్లేషిస్తే వచనకవితలో వివిధ మార్గాలు కనిపెట్టొచ్చు.

తెలుగు వచనకవులలో ఒక్కొక్కరికి ఒక్కొక్క మార్గం ఉన్నమాట నిజమే అయినా మొత్తం వచనకవిత్వాన్ని రెండు పాయలుగా విభజిం చొచ్చు. అవి (1) దేశీయం (2) అంతర్జాతీయం.

కుందుర్తి, తిలక్, నారాయణరెడ్డి, మిరియాల రామకృష్ణ వంటి కవులు దేశీయకవులుగా కనిపిస్తారు. అజంతా, వేగుంట, నగ్నముని వంటి కవులు అంతర్జాతీయ మార్గానికి చెందినవారుగా కనిపిస్తారు. ఈ విభాగంలో ఆరు ద్రని ఎక్కడ చేర్చాలో ప్రస్తుతానికి చెప్పలేను.

అంతర్జాతీయ మార్గకవులమీద పాశ్చాత్యదేశాల కవుల ప్రభావం ఉంది. వాళ్ళ కవిత్వంమీద పాండిత్యభారం ఉండదు. వాళ్ళ వాక్య నిర్మా ణం సరళంగా ఉండకపోవచ్చు. బాగా అలవాటుపడితే తప్ప వెంటనే అర్థం కావటం కష్టం. సాంప్రదాయిక రూపకాలు, అలంకారాలు, సమాసాలు,

భావాలు వీళ్ళ కవిత్వంలో తక్కువ వీళ్ళ కవిత్వాన్ని స్వసంస్కృతి విముక్తమయిన (culture free) కవిత్వంగా వర్ణించొచ్చు. వీళ్ళకవిత్వాన్ని ఇంగ్లీషువంటి భాషల్లోకి అనువదించటం అంత కష్టంకాదు. వీళ్ళు పద్యంలో నుంచి వచనంలోకి వచ్చినవారు కారు. వచన కవులుగానే పుట్టినవాళ్ళు.

దేశీయకవుల వచనకవిత్వంలో దేశీయమైన అలంకారాలు, ఉపమానాలు, పోకడలు ఎక్కువగా కనిపిస్తాయి. వాక్యాల్లో సమత్వం, అక్కడక్కడ యతి, ప్రాస, అనుప్రాసాదుల ప్రయోగం, కొన్నిచోట్ల అస్పష్టమైన లయ కలిగిఉండటం, వీళ్ళ కవిత్వలక్షణంగా కనిపిస్తుంది. ఈ దేశీయ కవులు మొదట ఛందస్సుల్లో పద్యాలు గేయాలు పుంఖానుపుంఖంగా రాసి యుగధర్మంవల్ల వచనకవులుగా మారినవాళ్ళు. వీళ్ళ పలుకుబడిలో అస్పష్టత ఉండదు. ఖండికలు చప్పున అర్థమవుతాయి. తెలుగు పలుకుబడి, సంస్కృత శబ్దాల సమాసాలు. ప్రౌఢశబ్దప్రయోగాలు కనిపిస్తాయి. పాండిత్యపు బరువు కూడా కనిపిస్తుంది. వీళ్ళ కవిత్వాన్ని ఇంగ్లీషులోకి అనువదించటం చాలా ప్రయాసతో కూడిన పని. స్వసంస్కృతిబద్ధమైన (culture bound) కవిత్వంగా వీళ్ళ కవిత్వాన్ని వర్ణించొచ్చు. రామకృష్ణగారు ఈ దేశీయకవుల్లో మరెంత దేశీయంగా కనిపిస్తారు.

మిరియాల రామకృష్ణ 'విద్యుద్వీణలూ వెన్నెలతీగలూ" వచన కవితా సంపుటికి పీఠిక, 1981 సెప్టెంబరు 7



# కల్లోల దశాబ్దపు కవితా తరంగాలు

వివిధ కవుల కవిత్వాల్ని సంకలనం చేసే సంప్రదాయం అతి ప్రాచీన కాలంనుంచీ ఉంది. హాలుడి గాథాసప్తశతి మనకు దొరుకుతున్న అతిప్రాచీన మైన కవితాసంకలనం. తెలుగులోకూడా ఇట్లాంటి కవితా సంకలనాలు ప్రాచీన కాలంలో ఉన్నట్లు సకలనీతి సమ్మతము, ప్రబంధరత్నాకరము, ప్రబంధ మణిభూషణము అనే పుస్తకాలవల్ల తెలుస్తుంది. ఇవికాక ఆధునికకాలంలో ప్రభాకరశాస్త్రి వంటివారు కూర్చిన "చాటుపద్య మణిమంజీరము" వంటి గ్రంథాలున్నాయి. వివిధకవుల పద్యాలు ఒకచోట కూర్చడంవల్ల అనేక రచనామార్గాలు ఒకేసారి పాఠకులకి పరిచయమయ్యే అవకాశముంది. అయితే ఈ పైన పేర్కొన్న సంపుటాలు ఒక నిర్దిష్టమైన కాలాన్ని, దృక్పథాన్ని ఉద్దేశించి చేసినవి కావు.

ఆధునిక చైతన్యాన్ని ప్రతిబింబించే కవితా సంకలనాల్లో మొట్ట మొదట చెప్పుకోవాల్సింది ముద్దు కృష్ణగారి వైతాళికులు (1935). దీనికి వచ్చినంత పేరు తెలుగులో ఏ కవితా సంకలానికీ రాలేదనుకుంటాను. ఇది సుమారు పదిసార్లచ్చయింది. ఆ తరువాత శివశంకర శాస్త్రిగారి "మహో దయం" (1946) అనిసెట్టి సుబ్బారావు మొదలైనవారు ప్రచురించిన "కల్పన' (1953), తెలంగాణా రచయితల సంఘంవారు ప్రచురించిన "ఉదయ ఘంటలు (1954), కవితా సంకలనాల చరిత్రలో మైలురాళ్ళుగా నిలిచి పోయినాయి. మరీ ఇటీవలికాలంలో అనిసెట్టి మొదలైనవారి "శ్రీశ్రీ యుగం" (1964), కె. వి. రమణారెడ్డిగారి "అరుగుజాడలు" (1962), నండూరి రామమోహనరావు, ఇంద్రగంటి శ్రీకాంతశర్మల 'మహాసంకల్పం' (1975), కుందుర్తి సంపాదకత్వాన వచ్చిన "తరం తరం" (1976) వంటి మంచి కవితా సంపుటాలు వెలువడినై. ఇవికాక అకాదమీలు మొదలైన ఇతర సంస్థలు అచ్చువేసిన "నవీన కావ్యమంజరి" తెలుగు కవితా సంపుటి

వంటి సంకలనాలు చాలా ఉన్నాయి. ఆధునికకాలంలో ఎన్ని కవితా సంకలనాలు వచ్చినాయో పరిశోధకులు మాత్రమే తేల్చవలసిన విషయం.

ఈ కవితా సంకలనాలన్నిటికీ లక్ష్యం ఒకటి కాదు. కొన్ని ఒకరకం కవితా పద్ధతికే పరిమితమైతే మరికొన్ని రకరకాల మార్గాలను సంపుటీకరించినాయి. కొన్ని ఐదు, పది సంవత్సరాల కాలపరిధిని తీసుకుంటే మరికొన్ని అర్ధశతాబ్దాన్ని మించిన కాలాన్ని తీసుకున్నాయి. కొన్ని నిర్దిష్ట దృక్పథాన్ని ప్రదర్శిస్తే (విరసం వారి "ఝంఝ" వంటివి) మరికొన్ని దృష్టి వైవిధ్యాన్ని చూపించినాయి. ఉన్న సంకలనాలకు ఇంకొకటి చేరుద్దామనే సరదా కోసంకాక ఒక నిర్దిష్ట లక్ష్యంతో ఈ సంపుటి బయటికొస్తున్నది. ఈ పుస్తకం పేరే సూచిస్తున్నట్లుగా ఒక పదేళ్ళకాలం దీని పరిమితి, సమరశీల సందేశం దీని కవితావస్తువు.అయితే ఈ పదేళ్ళకాలం ఏదో రకపు కాల విభజనకోసం చేసుకొన్నది కాదు. ఈ పదేళ్ళకాలం తెలుగు సాహిత్య చరిత్రలో ముఖ్యంగా కవిత్వ పరిణామ చరిత్రలో, అంతకు ముందటి చరిత్రకన్న భిన్నమైంది. ఈ దశాబ్దాన్ని కల్లోల దశాబ్దమని, విరసం దశాబ్దమని ఇంకా రకరకాల పేర్లతో పిలుస్తున్నారు. ఈ దశాబ్ది సాహిత్యాన్ని వేరుగా గుర్తించాల్సిన అవసరం ఎందుకొచ్చింది? ఆధునిక కవితా పరిణామ చరిత్ర చూస్తే మనకందుకు సమాధానం దొరుకుతుంది. సాహిత్యానికి ప్రేరకమైన సామాజిక పరిణామాల్ని చూస్తే తెలుస్తుంది.

చారిత్రాత్మకమైన తెలంగాణా రైతు పోరాటం, అతిదారుణంగా అణిచివేయబడ్డ తర్వాత పోరాటానికి ముందుండి నడిపించిన రాజకీయ పక్షం 1950–51 ప్రాంతంలో ప్రజల్ని వదిలేసి పార్లమెంటుకు ప్రవాసంపోయింది. అలనాటి అభ్యుదయ కవులుకొందరు సినిమాలకు ప్రవాసం పోయారు. మరికొందరు పాతికేళ్ళు వెనక్కిపోయారు. ఇంకా కొందరు అస్త్రసన్యాసం చేసి అజ్ఞాతంలోకి పోయారు. అభ్యుదయ రచయితల సంఘాన్ని పునఃప్రతిష్ఠించటానికి 1955లో ఒక మహాప్రయత్నం జరిగినా అదేమంత బలం పుంజు

కొన్ని దాఖలాలు లేవు. ప్రజోద్యమం బలహీనంగా ఉన్నందువల్ల ప్రజా సాహిత్యంలో స్తబ్దత కూడా ఏర్పడింది. నవచైతన్యంతో తెలంగాణాలో అభ్యుదయ కవులుగా ముందుకు వచ్చినవారు ఉద్యమ బలహీనత నాసరా చేసుకొని కొత్తరకం భావకవులుగా వేషం మార్చారు. అసలు భావకవులకీ వీళ్ళకీ ముఖ్యంగా భేదం ఒక్కటే. వాళ్ళకు లక్ష్యశుద్ధి ఉంది.వీళ్ళకదిలేదు.ఇదేకాలంలో హైదరాబాదులో వచన కవిత్వంలో ప్రయోగాలు జరిగినాయి. కుందుర్తి స్వయంగా అభ్యుదయ కవి అయిఉండి తెలంగాణా పోరాటాన్ని గొప్ప ఉద్యమ కావ్యంగా మలిచి చివరకు వచనకవితోద్యమం మొదలుపెట్టాడు. ఇందులో తప్పులేదుగాని అభ్యుదయ విరోధక భావాలకుకూడా వచన కవిత్వాన్ని వాడుకున్నవారు కుందుర్తి వెనకాల చేరారు. తెలిసో తెలియకో కుందుర్తి వాళ్ళని ప్రోత్సాహించారు. దిగంబర కవులు వచ్చేవరకు సుమారు 20 ఏళ్ళు తెలుగు సాహిత్యంలో స్తబ్దయుగమనో ప్రయోగయుగమనో లేక రూపవాద యుగమనో చెప్పుకోవాల్సి ఉంటుంది.

ఇదే సమయంలో ప్రతిపక్షాల బలహీనతనాసరా చేసుకొని దేశంలో అధికారపక్షం రాజకీయ సాంస్కృతిక అవినీతిని విచ్చలవిడిగా వెదజల్లింది. ఆర్థిక దోపిడీ వర్గం దానిమీద ఆధారపడ్డ రాజకీయ అవినీతి వర్గం ప్రజా జీవితాన్ని యథేచ్ఛగా అదుపు ఆజ్ఞ లేకుండా నంజుకుతిన్నాయి. ఈ సమయంలో సాహిత్య ప్రయోజనాన్ని గుర్తుచేస్తూ దిగంబర కవులు కొత్త పద జాలంతో విలక్షణమైన మార్గంలో కొద్దిగా వెర్రివేషాలతో సాహిత్యరంగంలో ప్రవేశించారు. స్తబ్దమైన సాహిత్య ప్రపంచంలో కల్లోల తరంగాల్ని సృష్టించారు. అయితే అపుడు బలమైన రాజకీయోద్యమం లేదు. వీళ్ళకి స్పష్టమైన సామాజిక అవగాహన లేదు. ఉన్నవ్యవస్థమీద తీవ్రమైన కసి మాత్రముంది. సాహిత్య లక్ష్యాన్ని పునరాలోచించుకోడానికి దిగంబరకవుల రాతలు దోహదం చేసినాయి.

1960వ దశాబ్దపు చివరి సంవత్సరాల్లో రాజకీయోద్యమం కొత్త

మలుపు తిరిగింది. పార్లమెంటు ఉపన్యాసాలద్వారా, మహజర్లద్వారా అప్పీళ్ల ద్వారా దోపిడీవర్గం తన దోపిడిని మానుకోదని గుర్తించిన చైతన్యవంతమైన పీడిత వర్గంలో ఒక భాగం బెంగాల్, ఆంధ్ర ప్రాంతాల్లో ప్రతిఘటనకు పూనుకున్నాయి. వాళ్ళకు ఆసరాగా కొందరు విప్లవసైనికులు ఏర్పడ్డారు. ఏకీకృత విప్లవరాజకీయపక్షంగా ఏర్పడకపోయినా విప్లవమార్గాన్నే ఎన్నుకున్న కొన్ని రాజకీయ గ్రూపులేర్పడ్డాయి. ఈ చైతన్యాన్ని ప్రతిబింబిస్తూ 1969లో 'తిరగబడు' 1970లో 'మార్చ్' అనే రెండు కవితాసంపుటాలు వచ్చినాయి. విశాఖలో 1970 ఫిబ్రవరిలో జరిగిన శ్రీశ్రీ సన్మాన వేదిక మీద కొత్తకవులు పాతకవులతో మోహరించారు. 'రచయితలారా మీరెటు వైపు' అని నిర్మొహమాటంగా నిగ్గదీశారు. అదే సంవత్సరం జూలై మొదట్లో పాత అభ్యుదయ రచయితల సంఘాన్ని పునర్నిర్మించే ప్రయత్నం జరిగినపుడు దేశంలో విప్లవపరిస్థితులున్నాయని అంగీకరించిన పాత అభ్యుదయ కవులు, మరికొందరు కొత్తకవులు కలిసి విప్లవరచయితల సంఘంగా ఏర్పాడ్డారు.

1970–80 మధ్యకాలంలో సాహిత్యం విప్లవ కవితాయుగంగా స్థిరపడ్డట్టు మనం గుర్తించవచ్చు. దేశంలో ఉన్న రాజకీయ పోరాటాన్ని సమర్థిస్తూ ప్రజలను సమరశీలురుగా చేయడమే ఈ విప్లవకవితాలక్ష్యం. ఈ పోరాట చైతన్యంలోనే శివసాగర్, గద్దర్‌వంటి కవులు జన్మించారు. చెరబండరాజు ఈ విప్లవ చైతన్యంలో పునర్జన్మ పొందారు. ఇంకా అనేకమంది ఈ చైతన్యాన్ని ఊపిరిగా మలుచుకొని తెలుగు కవిత్వానికి తిరిగి ప్రాణం పోశారు. ఆ చైతన్యాన్ని రూపించటమే ఈ సంకలనం ధ్యేయం.

విరసం వారే అంగీకరించినట్టుగా విప్లవకవిత్వం సంఘపు సభ్యత్వంతో ముడిపడింది కాదు. ఈ సంపుటిలోని కవుల్లో కొందరు విరసం సభ్యులు. మరికొందరు కారు. కానీ అందరూ విప్లవ చైతన్యాన్ని ప్రతిబింబించినవారే. అందుకే ఇది సభ్యత్వపు సమస్య కాదనటం.

తెలుగులో వచ్చిన విప్లవ కవిత్వమంతా ఈ సంపుటిలో లేదు. ఈ సంపుటిలో ఉన్న కవితాఖండిక లన్నిటినీ విప్లవ కవిత్వంగా అందరూ అంగీకరించక పోవచ్చు. కొన్ని కవితల్లో కనిపించే రాజకీయధోరణికి, ఇప్పటి దృష్టితో చూస్తే చారిత్రాత్మకమైన ప్రాముఖ్యంమాత్రమే ఉంది. అంటే ఆ రకపు రాజకీయ అవగాహనకు ప్రస్తుత పరిస్థితులలో కార్యాచరణ ప్రాముఖ్యం లేదు. ఈ పదేళ్ళకాలంలో వచ్చిన జాతీయ అంతర్జాతీయ సంఘటనలకు తెలుగు కవితా స్పందన లివి. రాజకీయ అవగాహనలో స్వల్ప మైన భేదాలున్నా సాహిత్య దృక్పథంలో ఈ కవితల మధ్యన స్థూలమైన సామ్యముంది.

ఈ పదేళ్ళకాలం కవిత్వం దృష్ట్యా ఇంతప్రాముఖ్యం వహించడానికి కారణం రాజకీయంగా దానికున్న ప్రాముఖ్యమే. ఈ కాలంలో ఎన్నో ముఖ్యమైన సంఘటనలు జరిగినై. ఈ దశాబ్ది ప్రారంభంలో 'నక్సల్ బరీ మొక్క' ఏపుగా పెరిగి నిప్పులపూలు పూసింది. భూస్వాముల తలలు నర కటం ఆనాటి రాజకీయ నినాదం. తుపాకిగొట్టం ద్వారానే రాజ్యాధికారం వస్తుందనేది నాటి విప్లవోద్యమాలు ఆదర్శంగా పెట్టుకున్న సూత్రం. అందుకే "శాంటియాగో"లో ఎన్నికల ద్వారా వచ్చిన సోషలిస్టు ప్రభుత్వం విలువలేదని నాటి రాజకీయ అవగాహన. అందుకే విప్లవకవి 'అలెండిజం ఆత్మహత్య చేసుకుందం'టాడు. దేశంలో బడుగువర్గాలు దుర్భరమైన దారి ద్ర్యంలో మగ్గుతూ ఉంటే లక్షల ఖర్చుతో ఆంధ్రరాష్ట్ర ప్రభుత్వం ప్రపంచ తెలుగు మహాసభలు నిర్వహించి తెలుగుజాతిని పరిహసించింది. "ఆంధ్ర సంస్కృతి మహోజ్వల మైనదని" అప్పుడే మొదట గుర్తించినట్టు 1976లో బాకాపట్టుకొని ప్రచారం చేసింది. ఈ కాలంలోనే- "బతికే అర్హతలేని పందుల్ని పందుల్ని" చంపినందుకు 'భూమ్యాకాశా'ల్లాంటి ఇద్దరు వీరుల (భూమయ్య, కిష్టాగౌడుల)ను దబ్బం హత్య చేసింది.

తుఫాన్లు రావడానికి మనిషి బాధ్యత లేకపోయినా అందులో గూడు లేని పేదలే ఆహుతి కావడానికి బాధ్యత ఈ వ్యవస్థదే. దానికి ప్రాతినిధ్యం వహిస్తున్న ప్రభుత్వానిదే. ఆనాటి "కౌయ్యగురర్ిం" లాంటి ఆంధ్ర ప్రభుత్వం 1977 తుఫానులో చనిపోయిన వారు చనిపోగా మిగిలిన వాళ్ళను దోచుకోడానికి కాంట్రాక్టర్లను దేశసేవ చేయమని వదిలింది. ఈ పదేళ్ళ కాలంలోనే విప్లవోద్యమం అడవులను దాటి ఎల్లెల్లోకి ప్రవేశించింది. జగిత్యాలా సిరిసిల్లా మొదలైన ప్రాంతాల్లో పీడితులు దోపిడీకి వ్యతిరేకంగా పిడికిళ్ళెత్తి ప్రతిఘటించారు. మామూలు దృష్టితో ఇవి ఓడిపోయిన ఉద్యమాలైనా అంతిమ విజయానికి చైతన్య సోపానాలు. ఈ పదేళ్ళకాలంలోనే ఎన్‌కౌంటర్ హత్యలు ఎక్కువగా జరిగినై. అందులో పెద్దిశంకరొకడు. వీళ్ళే చరిత్ర నిర్మాతలు. "తొలిపొద్దు కిరణాలు". "వెలుతురు పిట్టలు". ఈ దశాబ్దంలో ఆ నిజాలు ప్రజల కళ్ళు తెరిపించినై ఇవి జరగటం పాశవికం అనేది ఒక ఎత్తైతే సిగ్గులేని ప్రభుత్వం ఇట్లాంటివేవీ జరగలేదని బుకాయించడం అంతకు మించిన క్రౌర్యం.

ఈ విధంగా చూస్తే జాతీయంగా అంతర్జాతీయంగా ఈ దశాబ్దం సంచలనాత్మకమైనది. ఈ సంచలనాలకు తెలుగు కవులు స్పందించిన తీర్లు మన కీ సంకలనంలో దొరకుతై.

ఈ సంకలనంలో పాటలు లేవు. వచన కవిత్వానికే పరిమితమయింది. 1970–80 మధ్యకాలాన్ని కొందరు పాటల యుగంగా వర్ణించారు. ప్రవాహానికి పాట ప్రబలమైన ఆయుధ మనడానికి సందేహం లేదు. అయితే విప్లవ కవిత్వం పాటలకు మాత్రమే పరిమితమనుకోడం హ్రస్వదృష్టి. ఉత్తమ కవిత్వం ఏ రూపంలో ఉన్నా గుర్తింపు పొందుతుంది. వినే జనాన్ని పాటలు చైతన్యవంతం చేస్తే, చదివే జనంలో వచన కవిత్వం చొచ్చుకు పోతుంది. ఆధునిక కవితా రూపంగా వచనకవిత స్థిరపడిందనేది

తిరుగులేని సత్యం. దీన్ని బూర్జువా కవితా రూపంగా చిత్రించడం సాహిత్య పరంగా సంకుచితత్వం. రాజకీయ పరంగా అవివేకం. ఏ సమాజం సృష్టించినా పనికొచ్చే వస్తువని పారేసుకోం. పాటకున్న ప్రయోజనాల్తో పాటు పాటకు కొన్ని పరిమితులున్నాయి. ఉదాహరణకి ఈ సంపుటిలోని 'శాంటియాగో'ని గానీ 'కొయ్యగుర్రాన్ని' గానీ నేను పాటలో ఊహించలేను. రూపపరంగా వచన కవిత్వం సాధించిన అభివృద్ధిని విప్లవకవులు సొంతం చేసుకోడం ఈ దశాబ్దపు కవితా లక్షణాల్లో ఒకటిగా గుర్తించాలి. విప్లవభావాలు వచన కవిత్వాన్ని యెంత శక్తివంతమైన రూపాలుగా మలవగలవో ఈ సంపుటి రుజువు చేస్తుంది. అంటే వచనకవితా రూపం విప్లవకవితా వస్తువులో సాఫల్యం పొందింది. అంతేగాక పాటలన్నీ ఒకేరకం ఎట్లాకావో వచన కవిత్వమంతా ఒకే మూస కాదనడానికి ఈ సంపుటి ఒక మంచి ఉదాహరణ. ఉదాహరణకి కవితావ్యాసంలాంటి సిద్ధాంతపరమైన 'శాంటియాగో' మామూలు సంభాషణతో కవిత్వపు రూపాన్ని తయారుచేసిన "అపస్వరాలు" రకరకాల భావాలను ఒకే వస్తువులో చూపించిన 'కొయ్యగుర్రం". పాదవిభజన లేని వచనపు పేరాలు పేర్చిన 'ఇది ఎలిజీకాదు' వచన కవిత్వంలో ఎంతటి వైవిధ్యం సాధించవచ్చో చెప్పటానికి కొన్ని ఉదాహరణలు మాత్రమే.

ఒకే లక్ష్యంతో వస్తువైవిధ్యంతో భిన్న రూపప్రయోగంలో పదేళ్ళలో వచ్చిన కవిత్వాన్ని ఒకచోట పేర్చిన ఈ సంకలనం ఇంతకు ముందు సంకలనాలకన్నా విశిష్టమైనదని గుర్తించడం కష్టం కాదు. పాత సంకలనాలకన్న ఇందులో దృష్టినైశిత్యముంది. వస్తు విస్తృతి ఉంది. బలమైన ఆధునిక వ్యక్తీకరణ ఉంది. ఇది ఉత్తమకవిత్వం సాధించే సామాజిక ప్రయోజనాన్ని సాధిస్తుందని గట్టిగా విశ్వసిస్తున్నాను.

ఆధునిక కవిత్వం ఈనాటి సంఘటనల ఆధారంగా చెప్పింది కాబట్టి సంఘటనల వివరాలు అందులో ఉండవు. కవిత్వం తొలిసారి అచ్చైనపుడు

లేక బయట కొచ్చినపుడు సందర్భం వేడిగానే ఉంటుంది కనుక అది అందరికీ తెలుస్తుంది. కాని కాలం గడిచినకొద్దీ ఆ సంఘటనల వివరాలు మరుగున పడిపోతాయి. ఆధునిక కవిత్వం అర్థంచేసుకోవడానికి కవితా సందర్భం చాలా అవసరం. సందర్భవివరణలేని ఆధునిక కవిత్వం పాఠకుడికి అందకుండా ఎగిరే గాలిపటం లాంటిది. ఈ సంకలన కర్తలు ఆధునిక కవిత్వానికీ సందర్భానికీ ఉన్న అవినాభావసంబంధాన్ని సరిగ్గా గుర్తించక పోవటం పెద్దలోపం. ఒకవేళ గుర్తించి ఉంటే ఆ వివరాలు కూర్చక పోవటం పాఠకుల పట్ల సంకలన కర్తలు చేసిన నేరం.

ఉస్మానియా రైటర్స్ సర్కిల్ వారు ప్రచురించిన
"ఈ తరం యుద్ధ కవిత 1971-1980"
కవితా సంకలనానికి పీఠిక, 1982 నవంబరు 29



# చిరుగాలి సితారా సంగీతం

సుమారు పాతికేళ్ళ కిందట ఇంగ్లీషులో ఒక పద్యం చదివాను. విప్లవ మహాప్రస్థానం మధ్యలో ఒకచోట విశ్రాంతి కోసం మజిలీ చేసిన విప్లవకారుడు అడవి కాచిన వెన్నెలను సంబోధిస్తూ అంటాడు "నిన్ను గురించి నేను కవిత్వం రాయలేను. నాకు చాలా పనులున్నై. కవిత్వం కన్నా నా ప్రజల విముక్తి నాకు ముఖ్యం" అని. అచ్చంగా ఇట్లాగే కాదు కాని దాని భావం ఇది. అది వియత్నాం ప్రజల ప్రియతమ నాయకుడు హో-చి-మిన్ పద్యానికి ఇంగ్లీషు అనువాదం. అవి నేను కవిత్వం రాసే రోజులు గనుక దానివల్ల ప్రభావితుణ్ణయి "మూగ వెన్నెల" అనే గేయం ఒకటి రాసి 'స్వతంత్ర'లో ప్రకటించాను. ఆ హో-చి-మిన్ పద్యం మళ్ళీ ఏ సంపుటంలోనూ కనపడలేదు.

శివసాగర్‌ను గురించి ఆలోచించినప్పుడల్లా నాకు హో-చి-మిన్ గుర్తొస్తాడు. శివసాగర్ రాసిన కొన్ని గేయాలు చదువుతుంటే పాతికేళ్ళ కిందట చదివిన ఆ పద్యం గుర్తొస్తుంది. హో-చి-మిన్, శివసాగర్‌లకు రాజకీయమైన పోలికలు ఎంత బలంగా ఉన్నయ్యో చెప్పలేను. వియత్నాం ప్రజలు హో-చి-మిన్ నాయకత్వాన సమైక్య స్వతంత్ర ప్రజాతంత్ర వియత్నాంను సాధించుకున్నారు. భారత విప్లవం ఇంకా ఉద్యమం నెలబాలుడే.

విప్లవ కార్యాచరణలో నిర్విరామకృషి చేసిన కార్యకర్తలు అన్నంత వరకు గుర్తిస్తే వీళ్ళిద్దర్నీ పోల్చటంలో సామంజస్యం అర్థమవుతుంది.

**Prison Dairy** పేరుతో 1972లో అచ్చయిన హో-చి-మిన్ పద్యాలు చదివితే వీళ్ళిద్దరి మధ్య పోలికలు స్పష్టంగానే కనిపిస్తాయి. ఈ పోలికలు గుర్తించిన వాళ్ళు ఇంకా ఉన్నారనుకుంటాను. ప్రిజన్ డైరీ 34-35 పేజీల మధ్య ఉన్న జైలు బొమ్మ 1974లో మొదటిసారి ప్రచురిం

చిన 'ఖైదీ గీతం' ముఖచిత్రంగా వేసి మళ్ళీ ఈ పుస్తకంలో యథాతథంగా వేసారు. ఇది యాదృచ్ఛికమైన సంఘటన అనుకోను.

వీళ్ళిద్దరూ విప్లవకారులన్నది "దాచేస్తే దాగని సత్యం". పోరాటానికి ముందు వీళ్ళు కవులవునో కాదో తెలీదు. కాని పోరాటంనుంచి విడదీయటానికి వీల్లేనిది వీళ్ళ కవిత్వం. విప్లవకారుని అంతరంగం వీళ్ళ కవిత్వంలో కనిపించినంతగా ఇతరుల కవిత్వంలో కనిపించదు.

పదును దేరిన విప్లవదీక్ష కాఠిన్యం, మనుషుల మనసుల అంతరాంతరాలను స్పర్శించే ఊహల మార్దవం ఒకేచోట కలిసి ఉండటం అరుదైన సన్నివేశం. ఇల్లాంటి కలయికలు చరిత్ర అపురూపంగా ప్రసాదించే వరాలు.

హో-చి-మిన్ కవిత్వంలో నన్నాకర్షించింది కాల్పనికత. ఈ కాల్పనికతను నిర్వచించటం కష్టం. ఊహల్లో కలలుగనే శక్తినే కాల్పనికతగా భావిస్తాను. ఇది పుష్కలంగా ఉన్నవాడే మంచి కవి అవుతాడు. ఆ శక్తి హో-చి-మిన్‌కు ఉంది. శివసాగర్‌కు ఉంది. విప్లవకవికి ఈ శక్తి తప్పని సరిగా ఉండాలని వీళ్ళిద్దరూ రుజువు చేశారని అనుకుంటాను. విప్లవకవులు తమ ప్రజల భవిష్యత్తును కలలుకంటారు. అట్లా కలలు కనగల కవులే గొప్ప కవిత్వం రాశారు. ఆ కలలు నిజం చెయ్యటం కోసమే పోరాటాలూ విప్లవాలూ త్యాగాలూ.

జైలుగదిలో మధ్యాహ్నం కునుకు తీస్తూ డ్రాగన్ మీద ఎక్కి స్వర్గానికి ఎగిరిపోయినట్టు కలలు కంటాడు హో-చి-మిన్. తోటి ఖైదీల విషాద గాథలకు స్పందిస్తాడు. కటకటాల్లోంచి వెన్నెల సౌందర్యాన్ని దర్శిస్తాడు. కన్నీళ్ళ సిరాలో ముంచిన కలంతో నిర్బంధం మీద కవిత్వం రాస్తాడు. కటకటాల్లో భర్తను చూట్టానికి వచ్చిన భార్య బయట; వీళ్ళిద్దరికి మధ్యదూరం కొన్ని అంగుళాలే; కాని భూమ్యాకాశాల మధ్య ఉన్నంతదూరం ఉంది. వాళ్ళ కన్నీళ్ళ భాషను విన్నాడు హో-చి-మిన్.

విప్లవకారుడు నిర్బంధాన్ని సహించడు. స్వేచ్ఛ కోరుకుంటాడు. అయితే జైలులో కష్ట జీవితాన్ని భరించలేక కాదు. త్యాగాలు చెయ్యటానికి భయపడి కాదు. ఇంకా ఎక్కువ త్యాగాలు చెయ్యటానికి అవకాశం కోసం అతనికి స్వేచ్ఛ కావాలి. అమూల్యమైన కాలం నిర్బంధంలో వ్యర్థం కావటం బాధాకరం. అందుకే హో-చి-మిన్

"బానిసతనం కన్నా చావు మేలు
నా దేశంలో ప్రతిచోటా
తిరుగుబాటు జెండాలు ఎగురుతున్నాయి.
ఈ సమయంలో బందీగా ఉండటం
అబ్బా! ఎంత విచారకరం
యుద్ధరంగంలోకి ఉరకటానికి
నాకు కావాలి స్వేచ్ఛ"

అని బాధపడతాడు.

ఉద్యమాన్ని నెలబాలుడుగా ఊహించటంలోనే శివసాగర్ కాల్పనిక ధోరణి వ్యక్తమవుతున్నది. అలలపై కలలు కంటాడు. అలలపై నుంచి వచ్చే చిరుగాలి సితారా ధ్వనులకు పరవశిస్తాడు. మిత్రద్రోహంచేత శత్రువు చేజిక్కి — తన ప్రజలకు చందమామచేత సందేశం పంపిస్తాడు. ఏమని? "జీవితాంతం వరకు ప్రజలకు సేవలు చేయ విఫలమైనందుకు తన్ను క్షమించమ"ని శత్రు శిబిరములోనైన ఉగ్రనరసింహుణ్ణనని పైప్లవ్యగీతాన్నేనని సందేశం పంపుతాడు.

ఎన్నో రకాలుగా శివసాగర్ విప్లవ కవులకు మార్గదర్శకుడు. పోరాట బాటలో ప్రయాణం సంగతి సరేసరి. కవితా పద్ధతిలో మార్గదర్శకత సంగతి నేను ప్రధానంగా చెప్పదల్చుకున్నది. విప్లవకవి అయినవాడు అన్ని రకాల స్థాయిలో ఉన్న పాఠకులతోనూ కమ్యూనికేట్ చేయగలగాలి. విజ్ఞానవంతు

లైన చదువుకున్నవాళ్ళతో పాటు చదువురాని సామాన్య శ్రోతలవరకు సందేశం వెళ్ళాలి. ఆ అవసరాన్ని శివసాగర్ గుర్తించాడు. గుర్తించడమే కాదు- అన్ని మార్గాల్లోనూ ఉత్తమ కవిత్వాన్ని అందించాడు. "వివా! లా శాంటియాగో!" వంటి అత్యాధునిక ధోరణి కవితలు నాగరిక పాఠకులను ఆకట్టుకొంటాయి. చిలీదేశంలో అలెండీ పతనాన్ని గురించి రాజకీయంగా సైద్ధాంతికంగా పాఠకుడికి ఒక దృక్పథాన్ని ఇస్తుంది ఈ కవితా ఖండిక. చెల్లి చెంద్రమ్మ. నరుడో భాస్కరుడా, విలుకాడ వంటి పాటలు సామాన్య ప్రజల బాణీల్లో, వాళ్ళ పలుకుబడితో సాగి వాళ్ళకు పరిచయమైన భాషలో సందేశాన్నందిస్తాయి. రెండు ధోరణుల్లోనూ కవితాశక్తి కుంటుపడకపోవటం విశేషం. ఒకే కవి వచన పద్యంలోనూ, జానపద శైలి పాటలోనూ మాత్రా పద్యంలోనూ, సెటైర్‌లోనూ పరిణతి సాధించి సమాన ప్రతిభతో ఉత్తమ కవిత్వాన్నందించడం అరుదు. "కనిష్ఠికాధిష్ఠిత కాళిదాసా" అన్నట్టు నాకు రెండో ఉదాహరణ దొరకటం లేదు. బహుశా చెరబండ రాజు ఈ మార్గంలో కొంతవరకు ప్రయాణించాడనుకుంటాను. తనకన్నా ముందటి కవుల ధోరణు లను తన సొంతం చేసుకున్నాడు శివసాగర్. 'ఇందిరిస్టు గారడీ' వంటి గేయాల్లో శ్రీశ్రీ గారి వెక్కిరింత ధోరణి. "నేను గిరిజనుడు సారించిన విల్లును, నేను రైతు కసితో విసిరిన గండ్ర గొడ్డలిని" అన్నప్పుడు తిలక్ వచనకవితావేగం కనిపిస్తాయి. వీటిని అనుకరణలని అనటం హ్రస్వదృష్టి అవుతుంది. ఉత్తమ కవి గాలిలోనుంచి ఊడిపడడు. తనకు పూర్వం ఉన్న గొప్ప కవులకు తగిన వారసుడిగా రంగం మీదికి వస్తాడు.

తెలుగు సాహిత్యంలో మొహమాటంలేని కటువైన బలమైన వ్యక్తీకరణను దిగంబర కవులు ప్రవేశపెట్టారు. అయితే ఈ కటుత్వం 'అతి' అయితే మొరటు అయి జుగుప్సాకరం కావచ్చు. శివసాగర్‌లో అట్లాంటివి చాలా కొద్దిగా చోటుచేసుకున్నాయి. 'మైక్రోస్కోపిక్' (పేజీ 21)లో అట్లాంటివి ఒకటి రెండు కనిపిస్తాయి.

శివసాగర్ జానపద బాణీల పాటల్లో ఒక విశిష్టత ఉంది. ఏకకాలంలో పండిత పామరులను మెప్పించగల శక్తి వీటికి ఉంది. జానపద గేయాల్లో కనిపించే భాషా సారళ్యంతోపాటు ఇతర సాహిత్యాల్లో కనిపించే భావ పరిణతి ఉంది. "విలుకాడా" పాటలో విప్లవవీరుని ప్రకృతి అంతా ఎట్లా కాపాడుకున్నదో వర్ణించిన తీరు జానపదరీతిని మించిన పద్ధతి.

తెలుగు పాఠకుల్లో చాలామంది శివసాగర్ పాటల విశిష్టతను గుర్తించారు. విరసానికి ఒక డైరెక్షన్ ఇచ్చిన పాటగా "నరుడో భాస్కరుడా!" అనే పాటకు గుర్తింపు ఉంది. ఈ పాటను శ్రీశ్రీ కూడా చాలా మెచ్చుకున్నాడు. అట్లాగే "ఋతు సంగీతం," "విలుకాడ," "ఏటికి ఎదురీదు వాళ్ళమురా!" "గంగ దాటెళ్ళకే చెల్లెమ్మా" అనే పాటలు కవి స్వయంగా గాని, ఇతరులుగాని పాడటం ద్వారా చాలా ప్రజాదరణ పొందినై. వాటి కవితాశక్తికి ప్రచారం సహకరించింది. అయితే అంతగా ఎక్కువమంది గుర్తించంది శివసాగర్ వచన కవితాబలం. ఇంతకు పూర్వం వచన కవిత్వం అంత్య ప్రాసలవల్లా, వాక్యంలో పదక్రమ వ్యత్యయం వల్లా, చమత్కార సంబోధనలవల్లా, అవహేళన వాక్యాలవల్లా బతికింది, లేక బతకాలని చూసింది. శివసాగర్ పూర్వ కవులంతా అట్లా రాశారని కాదు. అధిక ప్రచారంలో ఉన్న వచన కవిత్వం అట్లా ఉండేది. నిజానికి శివసాగర్ కవిత్వంలో కూడా అట్లాంటి ఖండికలు కొన్ని లేకపోలేదు. "రెడ్ సిగ్నల్," "లెనిన్" లాంటి వాటిల్లో ఈ ధోరణి తొంగి చూస్తుంది. చెప్పే విషయంలో బలంవల్లా చెప్పే పద్ధతిలో నిజాయితీవల్లా శక్తిమంతమైన వ్యక్తీకరణ వల్లా సూటిగా చెప్పి కవిత్వంగా ఒప్పించటం శివసాగర్ వచన కవిత్వంలో సాధించిన గొప్పతనంగా భావిస్తున్నాను. వినాదస్థాయికి ఎదిగిన గొప్ప వాక్యాలు శివసాగర్ కవిత్వంలో చాలా ఉన్నై. (గొప్ప కవిత్వమే వినాద స్థాయికి చేరగలుగుతుంది.

ప్రజలను సాయుధం చేస్తున్న రివల్యూషనరీ నేడు కవి. సూర్యోదయం కుట్రకాదు, సూర్యుడు కుట్రదారుడు కాదు. శ్రీకాకుళ సూర్యోదయం కుట్రకాదు, గెరిల్లా సూర్యుడు కుట్రదారుడు కాదు వంటి వాక్యాలిట్లాంటివి. కవి శక్తిమంతుడైతే సూటిగా రాసిన వాక్యాలు కవిత్వమవుతాయనటానికి "వివా: లా శాంటియాగో" ఒక స్పష్టమైన ఉదాహరణ. ("వెన్నెలా, పూలూ, మంచు, మలయ మారుతం, కొండలూ, సెలయేళ్ళూ -ఇట్లా ప్రకృతి సౌందర్యాన్ని గానం చెయ్యటం మన పూర్వపు వాళ్ళకిష్టం. మనకాలంలో కవిత్వం ఉక్కు పద్యాల్లా ఉండాలి. కవులు శత్రువుమీద దెబ్బ తీసే దళాలుగా ఏర్పడాలి" అంటాడు హో-చి-మిన్.)

శివసాగర్ కవితలో కనిపించే ఇంకో లక్షణం సింబాలిజం. కొన్ని కొన్ని సంకేతాల ద్వారా వస్తువును ధ్వనింప చెయ్యటమే ఈ సింబాలిజం. 'విలుకాడ' పాటలో విలుకాడు విప్లవ వీరుడికి సంకేతం,' "రుతుసంగీతం" అనే గేయం మొత్తం సంకేతాలమయం. "రుతుగీతి" అనేది ఈనాటి విప్లవ వాతావరణానికి గుర్తు. ఓల్గా సోవియట్ యూనియన్‌కు, యాంగ్సీనది చైనాకు, గంగ భారతదేశానికి సంకేతాలు. సోషలిజం సాధనలో రష్యన్ మార్గం గడ్డకట్టుకుపోయిందనీ, చైనా మార్గం చైతన్యవంతంగా ఉందనీ, భారత విప్లవానికి అదే ఆదర్శమనీ రుతుగీతిలో శివసాగర్ సంకేతాలతో చెప్పారు. శివసాగర్ వాడిన సంకేతాలు కొత్తవే అయినా వాటిని అర్థంచేసుకోటానికి తల బద్దలు కొట్టుకో అక్కర్లేదు.

పుస్తకాల్లో రాసినట్టు, నాయకులు చెప్పినట్టు, మూసలో పోసినట్టు విప్లవాలు సాగవు. అటు పోట్లూ గెలుపు ఓటములూ ఉంటాయి. అంతేకాక ఉద్యమ కార్యకర్తల్లో కార్యాచరణపట్ల విభేదాలూ, అవి ముదిరితే వైరుధ్యాలూ ఏర్పడొచ్చు. అవేవీ లేవనుకోవటం కళ్ళుమూసుకొని పాలు తాగటం. విప్లవకారుడు కవి కూడా అయితే వీటికి స్పందించకుండా ఉండ

లేదు. తన వసులోని భావాల పొరలను విప్పకుండా ఉండలేదు. ఇట్లాంటి పట్టం "ఏటికి ఎదిరీను వాళ్ళమురా!" అనే పాటలో సింబాలిక్‌గా ఉంది. విప్లవోద్యమాన్ని పడవ ప్రయాణంగా పోల్చి అందులో తాత్కాలికంగా కలిగిన నష్టాల్ని "మొనగాడు తమ్ముణ్ణి మొసలి మింగేసింది. ఎదిగిన తమ్ముణ్ణి ఏరు కాటేసింది" అని సూచించి తన సీనియర్ కామ్రేడ్‌కి "నీతి తప్పని వాళ్ళమురా నీతోనే వుంటామురా" అని చిక్కుల్లోపడ్డ ఉద్యమంలో సహచరుడికి హామీ ఇచ్చే ఇట్లాంటి పాట తెలుగు సాహిత్యంలో నా కింకొకటి కనపళ్ళేదు. నేనెరిగినంతవరకు ఇతర సాహిత్యాల్లోనూ నా దృష్టికి రాలేదు. ఉద్యమంలో అంతర్భాగమైన కవి మాత్రమే రాయగలిగిందీ పాట.

శివసాగర్ అనువాదాలు కొన్ని ఈ సంపుటంలో ఉన్నాయి. అందులో నాకు బాగా నచ్చింది ''అమరులు'' అనే పేరుతో మావో కవితకు చేసిన అనువాదం. దీని ఇంగ్లీషు మూలం నేను చూళ్ళేదు. చైనీస్ పురాగాథల ప్రస్తావన వుంది కాబట్టి ఇది అనువాదమని తెలుస్తుంది. లేకపోతే "నా మల్లియ రాలెను! నీ మొగిలి కూడ రాలెను. నా మల్లియ, నీ మొగిలి ఆకాశం చేరెను!'' అనే పాదాలు చూస్తే దీన్ని అనువాదం అనుకోటం కష్టం. దీని సందర్భం తెలిస్తే ఈ పాట విశేషం ఇంకా అర్థమవుతుంది. చైనా విప్లవ పోరాటంలో భర్తను పోగొట్టుకున్న మహిళను ఓదారుస్తూ విప్లవ నాయకుడు రాసిన ఉత్తరం ఈ పాట. అప్పుడే మావో తన భార్యను కూడా పోగొట్టుకున్నాడట. తన కన్నీళ్ళతో ఆమె కన్నీళ్ళను తుడవటానికి ప్రయత్నించాడు ఆ మహానాయకుడు. విరామ మెరుగని విప్లవ కార్యాచరణలో—భర్తను పోగొట్టుకున్న ఒక భార్యను ఓదార్చటానికి మావోకు వ్యవధి దొరకటం ఒక్కటే విశేషం కాదు. ఆమె కష్టానికి ఎంతగా చలించాడో ఆ స్పందనంతా తెలుగు గీతంలో కనిపిస్తుంది. చైనా సంస్కృతిలో

భాగమైన ఊహాకల్పిత గాథలు ఈ పాటలో మావో భావ తీవ్రతకు ఒదిగి పోయినయ్. అవి తెలుగు సంస్కృతికేమంత భిన్నంగా కనిపించటం లేదు, పేర్లు తప్ప.

ఈ సంపుటిలో కవితా ఖండికలన్నిటికి వ్యాఖ్యానం అవసరమను కోను. అయితే కొన్నిటికి సందర్భం, మరికొన్నిటికి వివరణలలాంటి నోట్సు ఉంటే ఈ పుస్తకం పాఠకులకు చాలా ప్రయోజనకారిగా ఉండేది. ఆధునిక కవిత్వావగాహనకి సందర్భ వివరణలు ఎంతో అవసరం.

ఒరిజినాలిటీ ఉన్న కవి భాషని యథాతథంగా వాడుకోడు. తాను చెప్పదల్చుకొన్న భావాని కనుగుణంగా మలచుకొంటాడు. దాన్ని సాహిత్య విమర్శకులు డిక్షన్ అన్నారు. పాత మాటల్ని కొత్త అర్థాల్లో వాడుకోటం, ఉన్న మాటల్ని కొత్త కూర్పుతో వాడుకోటం ఈ డిక్షన్ లక్షణం. ఉదాహరణకి "మహాప్రస్థానం'' అంటే స్వర్గానికి చేసే మహా ప్రయాణం. కానీ శ్రీశ్రీ దానర్థం మార్చేశాడు. అట్లాగే పరమేష్ఠి జూకాలు. లోహశ్యేనం, శ్రమైక జీవన సౌందర్యం మొదలైన పదాల కూర్పు శ్రీశ్రీకి ముందులేదు. శివసాగర్ కూడా అట్లా తన డిక్షన్‌ను తయారు చేసుకొన్నాడు. అలహాబాదు మహారాణి, అలహాబాదు షోకు పిల్లి, సత్యం చావదు, అలలు కనే కలలు, చిరుగాలి సితారా సంగీతం, ఉద్యమం నెలబాలుడు, లోకసభ తోలు బొమ్మలాట, బంజరు పెంజేరు పోరాటం, మాదా కబళం మహాసంగ్రామాలు, రక్కసి సర్పం (డ్రాగన్), బిగియించిన పిడికిట్లో సూర్యుడు ఉదయించెను, శ్రీకాకుళ సూర్యోదయం వంటి పదాల కూర్పు, అర్థాల సమ్మేళనం శివసాగర్ తొలిసారిగా చేసినవి. ఆయన కవిత్వాన్ని గుర్తించటానికి ఒక్కొక్కప్పుడు కొంద గుర్తులుగా కూడా ఉపయోగపడతై.

సుమారు 1970 ప్రాంతంనుండి తెలుగు సాహిత్యంలో విప్లవ కవితా యుగంగా వర్ణిస్తారు. ఈ పది పన్నెండేళ్ళ కాలంలో విప్లవ కవిత్వం ఒక

ప్రధాన ధోరణిగా (major trend) తెలుగు సాహిత్య రంగాన్ని ఆక్రమించిందని దాని అర్థం. (ఇది సంఘంలో సభ్యత్వానికి సంబంధించింది కాదని వేరే చెప్పక్కర్లేదనుకుంటాను.) విప్లవ చైతన్యంలోనుంచి మాత్రమే కాక పోరాటంలో భాగంగా వచ్చిన కవి శివసాగర్. విప్లవ సాహిత్యంలోనే కాదు మొత్తం తెలుగు సాహిత్యంలో కూడా శ్రీశ్రీ తరవాత గుర్తించదగిన బహుముఖ ప్రతిభావంతుడు శివసాగర్.

ఇక చిరుగాలి సితారా సంగీతం వినండి. పరవశించి నిద్రించటానిక్కాదు. ప్రజల గుండెల కొండల్లో మాటుకాసి ట్రిగ్గర్ నొక్కటానికి.

శివసాగర్ "ఉద్యమం నెలబాలుడు" కవితా సంపుటి పీఠిక

1982 అక్టోబరు 12

# కవిభాస్కరోదయం

ఒకప్పుడు కథా సంకలనాలు విరివిగా వచ్చేవి. ఇప్పుడు ఆస్థానంలో కవితాసంకలనాలు వస్తున్నై. వచన కవిత్వం ఆధునిక కవిత్వానికి ప్రధానవాహకంగా తయారయిన తరువాత కవితా సంకలనాల సంఖ్య పెరిగింది. పెద్ద తరంవాళ్ళు నడిమి తరంవాళ్ళు తప్ప ఎవరూ పద్యాలూ గేయాలూ చదవటం లేదు. ఈనాటి యువకులు వచనకవిత్వమైతేనే చదువుతారు.

వస్తువులోకూడా గణనీయమైన మార్పు వచ్చింది. భావగీతాలకూ ప్రకృతి చిత్రణకూ- ఇంకా ఇట్లాంటి చాలా వాటికి కాలం చెల్లిపోయింది. ప్రస్తుతం సమాజంలో మనిషి జీవితం ప్రధానవస్తువు. ఇటీవలి ఉద్యమాల ప్రభావంవల్ల తిరుగుబాటును, వర్గపోరాటాన్ని ప్రేరేపించే ధోరణే ఎక్కువ కనిపిస్తుంది.

వ్యక్తీకరణలో కూడా ఇప్పటి కవిత్వానికి, ఇరవయ్యేళ్ళ కిందటి కవిత్వానికి గుర్తించదగిన భేదం ఉంది. భావకవిత్వం తరువాత వచ్చిన అభ్యుదయ కవిత్వంలో కూడా సౌకుమార్యంమీద చూపుండేది. ఇటీవలి కవితా ధోరణికీ, వస్తువుకూ ఇవి సరిపడలేదు. అయితే ఇవి సాహిత్యాభివృద్ధికి చిహ్నాలా? కావా? అనేది ఇప్పుడు తేల్చగలిగిన విషయం కాదు. కాలం తేల్చాల్సింది. తరం మారినప్పుడు, పరిస్థితులు మారతై. దాన్ని అనుసరించి అభివ్యక్తి మారుతుంది. ఇది నిత్యసత్యమైనా కొత్త పద్ధతులకు అలవాటు పడటానికి కొంతమందికి ఎక్కువకాలం పడుతుంది.

అది అట్లా ఉండనీయండి-

ఈ సంకలనం చూడగానే వెంటనే మనని ఆకట్టుకునేవి కవి ఎన్నుకున్న వస్తువులూ, శీర్షికలూ. ఇటీవలి కవితా సంకలనాలు చాలా వాటిల్లో మూసపోసినట్టున్న కవితావస్తువులు చదివి చదివి విసుగెత్తిన వాళ్ళకు ఈ వస్తుగతమైన కొత్తదనం గొప్ప రిలీఫ్ ఇస్తుంది. ఇట్లాంటి వైవిధ్యం కొత్త

దనం ఉండటంవల్లనే శివసాగర్, గద్దర్, వంగపండు, నగ్నముని, చెరబం
వంటివాళ్ళు ఈనాటి కవుల్లో విశిష్టంగా కనిపిస్తున్నారు. భాస్కర్‌లో కొట్టొ
చ్చినట్టు కనబడేది ఈ కొత్తదనమే.

గోడలమీద రాతలు అందరమూ చూస్తున్నాం. ఆ రాతల్లో కవిత
మయ నినాదాల్ని, ఇతర వాక్యాల్ని నా తోటివాళ్ళు గమనిస్తూనే ఉన్నారు.
కాని ఆ విషయాన్ని ఒక కవితాఖండికగా మలచిన గౌరవం మా భాస్కర్‌దే.
గోడలకు చెవులున్నాయ్ అనే సామెతను ట్విస్టుచేసి గోడలకు నోళ్ళున్నయ్
అని కొత్తనుడికారం సృష్టించిన ప్రతిభ మెచ్చుకోదగింది. ఉన్న నుడికా
రాల్ని, అలవాటుగా వస్తున్న సంప్రదాయ విశేషాలను ట్విస్టుచేసి కొత్త
వాటిని సృష్టించటం ఈ కవికి సరదా. చెడు మాటలు వినకు. చెడు పనులు
చూడకు, చెడ్డమాటలు అడకు అని మూడు కోతుల బొమ్మలు అందరమూ
చూస్తూనే ఉన్నాం. కాని భాస్కర్ ఆ కథనే ట్విస్టుచేసి, ఆ బొమ్మలను
జాతికి సంకేతాలుగా గ్రహించాడు. (పే. 29)

ఎన్ని ఘోరాలు జరుగుతున్నా కదలని జాతిని మూగజాతి, బధిర
జాతి, అంధజాతి అని కసురుకొంటున్నాడు.

యూనివర్శిటీల్లో పనిచేసే "మేధావుల'కు సెమినార్ల తతంగం బాగా
తెలిసిన భాగోతమే. కాని దాన్ని "సెమినార్కీ" అని ట్విస్టుచేసి కవితల్లిన
ఘనత భాస్కర్‌దే. మోనార్కీ డయార్కీ ఆలిగార్కీ అనే మాటల మోడల్
లో సెమినార్కీ అనే మాటను సృష్టించాడు భాస్కర్.

"ప్రతి సెమినారు పేపరు మీనారు గోపురం-తీరిన తీపరం.
అణగిన సలపరం. పెరిగిన మూపరం" (పే. 23)

అని సెమినార్ పేపర్లను సున్నితంగా హేళన చేశాడు కవి.

"సెమినార్లు కొన్ని చార్‌మినార్లు-మరికొన్ని కుతుబ్ మినార్లు
యింకొన్ని దో, తిన్ మినార్లు"

జనటంలో సెమినార్లు కొద్దిమంది వ్యక్తుల ప్రభావానికే ఉపయోగపడుతున్నా యన్న సత్యాన్ని వ్యంగ్యంగా వ్యక్తీకరించాడు.

**I M F**ను **International monetary fund** గా కాక **Mortgage Federation** గా ట్విస్టుచేసి దాన్ని అంతర్జాతీయ తాకట్టు సమాఖ్య అని తెలుగులో నామకరణం చేశాడు కవి. (పే. 25)

తాకట్టు జీవితాన్ని ఈసడించుకున్నాడు భాస్కర్. అదే కవితలో సత్యహరిశ్చంద్రుణ్ణి తెలుగువాళ్ళ ఉచ్చారణ ననుసరించి "సచ్చె అరిచ్చం ద్రుడు' అని ట్విస్టుచెయ్యటంలో కవి చాతుర్యాన్ని గుర్తించగలం. ఏమాత్రం ఛాన్సుదొరికినా ట్విస్టుచేయకుండా వదలడు. నిజానికి భాస్కర్ తన కవి త్వంలో బాగా వాడుకునే టెక్నిక్ ఇది.

భాస్కర్ కొత్త వస్తువులను తీసుకొని కవితామయం చెయ్యటానికి ప్రేరణ శ్రీశ్రీ నుంచి పొందినట్టు కనిపిస్తుంది. [పే. 11]

శ్రీశ్రీ కాదేదీ కవిత కనర్హం అనే గేయానికి విస్తరణ (ఎక్స్టెన్షన్] లాంటి కవిత 'కవితార్హం' అనే శీర్షికతో రాశాడు. ఈ ప్రేరణతోనే భాస్కర్ కొత్తవస్తువులను ఎన్నుకొని కవితామయం చేశాడు.

అయితే తగిన జాగ్రత్త పడకపోవడంవల్ల అన్ని చోట్ల ఆ పని చెయ్యలేకపోయాడు. ఉదాహరణకు "ఓపెన్ విశ్వవిద్యాలయం" అనే ఖండిక మిగతా ఖండికలంత బాగా లేదని గుర్తించటం కష్టంకాదు.

ఈ కవి శిల్పంకోసం అక్కడక్కడ తపన పడ్డాడు. ఉదాహరణకు మధ్యతరగతి అనే ఖండికలో "చాలీ చాలని జీతం, వుండీ లేని జీవితం

తీరీ తీరని ఆకలి చూచీ చూడని కళ్ళు" [పే. 15] అంటూ ఒకే రకపు వ్యాకరణ నిర్మాణం ఉన్న క్రియా పదాలను పాదాల మొదట పేర్చుకుంటూ పోయాడు.

కవిగా ఉదయిస్తున్న భాస్కర్‌కి అప్రియమైనా కొన్ని నిజాలు చెప్పక తప్పదు. ఆశయంలో స్పష్టత, ఆలోచనల్లో తీక్షత ఏర్పరచుకోవలసిన అవసరం చాలా ఉంది. ఉదాహరణకు 'ఆహ్వానిస్తా' అనే ఖండికలో "కమ్యూనిజాన్ని ఆహ్వానిస్తా'' అనటం బాగానే ఉంది కాని ఇదేమిటి?

"భూస్వామ్యాన్ని ఎదిరిస్తా, ధన స్వామ్యాన్ని వారిస్తా. నిరంకుశత్వాన్ని నివారిస్తా. సామ్రాజ్యవాదాన్ని విచ్ఛేదిస్తా ఫాసిజాన్ని వదిలిస్తా" ఇవన్నీ ఒక కవి శాపం పెడితే పోయేవి కావని భాస్కర్ గుర్తించటం మంచిది.

ఈ ఖండికలన్నీ భాస్కర్ సుమారు రెండేళ్ళ కాలంలో రాశాడు. రెండేళ్ళలోనే ఇంత కవితాశక్తి చూపించిన కవి ఇంకా ఎదుగుతాడనే నా నమ్మకం. ఎదక్కపోతే ఇప్పుడు అభ్యుదయ కవులనుకుంటున్న కొందరి స్థాయిలో ఉండిపోతాడు. దిగజారితే పాలకవర్గాల అభ్యుదయ కవి కావచ్చు. ఈ హెచ్చరికను గమనించి కవిగా ఉదయించిన భాస్కర్ తీక్షతను సమకూర్చుకొని ప్రచండ తేజస్సుతో వెలుగొందాలని ఆకాంక్షిస్తున్నాను.

వాసిరెడ్డి భాస్కరరావు 'గోడలకు నోళ్ళున్నాయ్' వచన కవితా సంపుటికి పీఠిక. 1983 అక్టోబరు 21



# ఆప్తవాక్యం

కొండలరావుగారు పరిపాలనాదక్షుడుగా, స్నేహశీలిగా, మనస్విగా చాలా మందికి తెలుసు. కాని అందర్నీ ఆ శ్చర్యంలో ముంచెత్తేట్టుగా ఇటీవల కవిగా బయటికొచ్చారు.

యువకులుగా కాలేజీలో చదువుకునే రోజుల్లో కవిత్వం రాసి జీవితంలో ఏదో ఒక మార్గంలో సెటిల్ అయి కవిత్వం మానేసిన వాళ్ళను మనం ఎరుగుదుం. (అందుకు ఈ "చేరా" కూడా ఒక ఉదాహరణ). జీవితంలో స్థిరపడ్డాక కవిత్వం ప్రారంభించిన ఉదాహరణలు తక్కువ. (వార్ధక్యంలో కవిత్వం ప్రారంభించిన వారి సంగతి వదిలేద్దాం). కాలేజీలో చదువుకునే రోజుల్లో కొండలరావుగారు కవిత్వం రాశారో లేదో తెలీదు. (కాద్దోగొప్పో రాసి ఉంటారు). కానీ ఒక్కుమ్మడిగా అరడజను కవితా సంపుటులతో సాహిత్య ప్రపంచంలోకి ప్రవేశిస్తున్న కొండలరావుగారిని విమర్శకులు, సమీక్షకులు, సాహితీ పరిశీలకులు గుర్తించకుండా ఉండలేరు.

కవిత్వాన్ని కొలిచే ప్రమాణాలు ఏర్పరచుకోటానికి మానవజాతి సుమారు రెండువేల సంవత్సరాలనుంచీ ప్రయత్నిస్తున్నది. కనీ ఇంత వరకూ అన్ని భాషలకూ, సంస్కృతులకూ వర్తించే సూత్రాలు సాధ్యం కాలేదు.

ఇక్కడ నా మట్టుకు నేను ఒక పరిమితిని ఏర్పరచుకో దల్చుకున్నాను. కొండలరావుగారి కవిత్వాన్ని కొలవటానికి ప్రయత్నించను. కావ్యం మంచి చెడ్డలు కాలమే నిర్ణయిస్తుంది. కాలం ఒక్కోసారి నిర్దయగా ప్రవర్తించినా మనం చెయ్యగలిగింది లేదు.

కొండలరావుగారు పద్యాలూ, గేయాలూ రాయగలరు. అయినా కలం పట్టిన కాలం ప్రభావంవల్ల ఈయన వచనకవిత్వం రాశారు.కానీ ఈయనలో

సహజంగానే లయాత్మకత ఉంది. 'కావ్యం', 'ఎర్రగన్నేర్లు' అనే కవితా సంపుటులలోనుంచి తీసిన కొన్ని భాగాలు ఉదాహరిస్తాను చూడండి. 'కావ్యం' అంకితం భాగంలో "ఎవ్వానిచే నాకు ఈ విద్య వచ్చెనో అతని చలువకై నేనిదిత్తు" అని రాసినది చాలావరకు సీసపద్యమై కూచుంది-కవికి తెలియకుండానే. ఆ పుస్తకంలోనే

"కలయందురు కలకానిది
కలలెపుడూ కల్ల కావు, కారణముందున్
నిజమే కలయై వచ్చును
కలయే నిజమగుచువచ్చు కలయగ చూడన్".

అని రాసిందాంట్లో కందపద్యాన్ని గుర్తించవచ్చు.

గీతం అయితే ఈ కవికి పూర్తిగా సొంతం అయినట్టు కనిపిస్తుంది. భావకవుల కాలంలో పుడితే మంచి గీతపద్యాలు రాసి ఉండేవాడు.

"ఎర్రగన్నేర్లు" అనే సంపుటిలో "ఎర్రగన్నేర్లు" అనే ఖండికలోంచి తీసిన ఈ భాగాలు చూడండి గీతపద్యం నడకలు ఎంతగా కలిసిపోయినయ్యో!

"పొంచియుండెను జామపండొకటి....' (ఒక సూర్యగణం తక్కువ)
'కోయుమన్నయా: కోయుము అమ్మవచ్చు'
'అయ్యవారమ్మ నిద్రించు ఃరవలేదు'
'పోదమా అన్నయా ఈత కాయకోయ'
"చూచి వత్తమా మన కందికాయ వచ్చు"
"అక్కడక్కడ కుందేళ్లు యుండెనంద్రు"
"చూచి తా వంక వ్రాలిన నెమలివంక
ఎంత బాగుండునన్నయా నెమలి పక్షి"

ఇట్లా ఎన్నైనా చూపించవచ్చు. ఈయన గీతం నడక చూస్తుంటే నాళం కృష్ణారావుగారి గీతాల ఆలవోకతనం కనిపిస్తుంది.

అట్లాగే మాత్రా ఛందస్సుల లయకూడా చాలాచోట్ల కనపడుతుంది. కొంచెం జాగ్రత్తపడితే అనంతర భావ కవులలాగానో, లేక మలినాటి అభ్యుదయ కవుల లాగానో మంచి గేయాలు రాయగల సూచనలు ఈయన గేయ రచనలలో కనిపిస్తాయి. "ఒక పువ్వు పూచింది"లో ఖండగతి, 'చినుకులు'లో చతురశ్రగతి, "చక్రభ్రమణం"లో మిశ్రగతి కనిపిస్తాయి.

ఇంతగా లయాత్మకమైన ప్రయోగం తెలిసిన మనిషి ఎందుకో ఒక్కోసారి వచనంలోకి జారుకుంటాడు. ఇది చూడండి-

'ఉన్నాయి పక్షిలెన్నో అందమైనవి
వనం గాలిస్తే, కళ్ళు ప్రసరిస్తే,
ఉన్నవి మరి, ఊహిస్తే మరిమరీ ఉన్నవి,
కాని, లేవు ఎచ్చటా నీలాంటి పింఛముగల పక్షులు
రవ్వల, రతనాల రంగు రంగుల గవ్వల పక్షులు'.

మామూలు భాషను కవిత్వంగా మలచే కొన్ని పద్ధతులు ఈయనలో కనిపిస్తాయి. ఎర్రగన్నేర్లు సంపుటంలో

"అమ్మా !
విజంగా నీదే సోషలిజం
కష్టించనిదే తినవుగదా నాలుగు మెతుకులు
నీ అన్నం" —"అమ్మ"

అనే వాక్యంలో ఉక్తివైచిత్రి
"లేదు నీకు ఎన్నడూ లేదన్న విచారం
నీకున్నంతలో చాలా ఉన్నట్టుగా ఉంటావు" —"అమ్మ"

అన్నచోట శబ్ద చమత్కారం పాఠకులు గమనించగలరు. అయితే ఈ సాధారణ చిట్కాలను, చమత్కారాలను అతిగమించే ఘట్టాలకోసం రసజ్ఞులైన పాఠకులు వెతుక్కుంటారు. అట్లాంటి వాళ్ళనుకూడా ఈ కవి సంతృప్తి పరుస్తాడు. చూడండి కవిత్వపు చిక్కదనం కనిపించే ఈ ఊహల సౌందర్యం —

"ఒక పువ్వు పూచింది
కలవరపు కలయట్లు"
"వన్నెవతు పూచింది
కన్నెవతు పూచింది

కలలు పూరేకులై కళలౌతు పూచింది"—ఒక పువ్వు పూచింది"లో.

"కావ్యం" అనే సంపుటంలో "అతడు" అనే ఖండికలో ఈ భాగం చూడండి.

"అతడు మాట్లాడిన, అనుభవమే మాట్లాడినట్టుగా యుండెడిది.
ప్రతిమాటా సూదయి, దారాన్ని జీవితంపై
దార్నింగ్ (Darning) చేయుచున్నట్లుగా యుండెడిది.
చిరిగిపోయిన చిల్లులు పడిన జీవితంపై."

భాషాప్రయోగంలో ఈయనకు స్వతంత్ర దృష్టి ఉంది. అవసరమైన ఇంగ్లీషు మాటలు యథేచ్ఛగా వాడతారు. ఆ పని చాలామంది చేస్తున్నారు. ఉర్దూ మాటలను తెలుగు కవిత్వంలో ఇంత విరివిగా వాడిన ఇంకొక కవిని నేనెరగను. అయితే వాటిని అవసరమైన చోట మాత్రమే వాడుకున్నారు. ఈయన కొన్ని కొత్తమాటలు సృష్టించారు.

మల్లియలలో, లిల్లియలలో, వెల్లియలలో"
—'ఒక పువ్వు పూచింది"లో

లిల్లీలు లిల్లియలయింది. (వెల్లియలంటే వెలుతురర్థంలో వ్రాసినావన్నారు.)

అట్లాగే 'విశ్వాత్మ' అనే కావ్య సంపుటిలో "గాంధినెరుగని గాంధికేయుడు" అని ప్రయోగించి రాజకీయుల్ని సూచించారు. "తెల్పదామె" 'విశ్వాత్మ' లోనూ, 'ఎఱ్ఱగన్నేరు"లోనూ ప్రయోగించారు. అక్కడక్కడ తెలంగాణ మాండలికంకూడా ఔచిత్యవంతంగా ప్రయోగించారు. ఇకపోతే కొన్ని సూచనలు.

కొండలరావుగారు కవితాధార ఎలావస్తే అలా రాస్తారనుకుంటాను. అందువల్ల కొన్ని చిక్కగా ఉండాల్సిన చక్కని ఖండికలు ఎక్కువ విస్తృతిని పొందినాయి. ఎడిట్‌చేసి Economy of words పాటించిన బాగుండును.

అక్కడక్కడ గ్రాంథికభాష, ఆధునికభాషామిశ్రణం జరిగినందువల్ల మిశ్రమశైలి ఏర్పడింది. అయితే ఇది కొంచెం ఓపిక చేసుకుంటే తొలగించుకోవటం ఏమంత కష్టంకాదు.

పైన పేర్కొన్న కవితా లక్షణాలు "నా దేశం" అనే ఈ సంపుటంలో ఉన్నవి. అయితే వచనకవితాగతి ఎక్కువగా ఉంది. "ఒక కుక్క మొరిగింది" అనే ఖండికలో మాత్రమే ఖండగతి కనిపిస్తుంది. శబ్ద చమత్కారం ఈ పుస్తకంలోనూ ఉంది. Hullo, Hallow శబ్దాలమీద వేసిన చమత్కారం 32వ పేజీలోనూ, మనకా మనుషులు- మనక-మనుషులు అని 11వ పేజీలోనూ కనిపిస్తాయి. ఇంగ్లీషు ఉర్దూల వాడకం ఇక్కడా మమ్మర‌ంగానే ఉంది.

ఈ సంపుటంలో ఖండికలు సామాజికమైనవి. మన విమర్శకులు 'సామాజిక స్పృహ' అంటారే అట్లాంటిది ఈ ఖండికల్లో కనిపిస్తుంది.

"ఒక మనిషి పది పదవులు అలంకరించుటకు స్వాతంత్ర్యం
ఒకే మనిషి పదేపదే పదవులనలంకరించుటకు స్వాతంత్ర్యం"

"స్వాతంత్ర్యం, వచ్చింది మనకు స్వాతంత్ర్యం,
కరప్షనే కరెక్టుగా స్వాతంత్ర్యం"

అని ఈ స్వతంత్ర భారతంలో స్వాతంత్ర్యం ఎవరిదో స్పష్టం చేశారు. హైదరాబాదులో 'బంద్'ల గురించి అందరికీ తెలుసు. వీటితో ప్రజలు పడుతున్న బాధను

"రాబందుల రాజ్యంలో-లేదు ఇక బంద్‌కు బంద్-అని రెండులైన్లలో ముక్తసరిగా చెప్పారు.

ఈ దేశంలో, పైరవీ వ్యవస్థ చాలా ఎక్కువగా ఉంది. "పైరవీకార్" అంటే తెలంగాణాలో తెలియనివారు లేరు. పట్నంలో గవర్నమెంటులో పలుకుబడి సంపాయించి అమాయకపు పల్లె ప్రజల దగ్గర డబ్బు గుంజి పనులు చేసిపెట్టే వాణ్ణి "పైరవీకార్" అంటారు. పనిచేసి పెట్టినా పెట్టకపోయినా ఒకసారి అతని పాలిట పడితే చమురు వదలటం ఖాయం. దీనిమీద ప్రొఫెసర్ జి. రాంరెడ్డి, ప్రొఫెసర్ జి. హరగోపాల్ గార్లు ఒక "పరిశోధన పత్రం" రాశారు. దాని ప్రేరణతో కొండలరావుగారు "పైరవీ" అనే ఖండిక రాశారు. మిత్రుడు వాసిరెడ్డి భాస్కరరావుకూడా "గోడలకు నోళ్లున్నాయి" అనే సంకలనంలో ఒక గేయం రాశారు. దానికీ ఈ వ్యాసమే ప్రేరణ. ఒక వ్యాసం ఇద్దరిచేత కవిత్వం రాయించింది.

మొత్తం కవితలన్నీ చదివితే కొండలరావుగారు స్వేచ్ఛా భావుకుడిగా, భాష శైలి ప్రక్రియలలో సృజనాత్మకమయిన స్వేచ్ఛగల రచయితగా అర్థమవుతారు.

వెలిచాల కొండలరావు
"నాదేశం" కవితా సంపుటికి పీఠిక,
1984 సెప్టెంబరు 22

# ఈ కవిత్వానికి పీఠిక అక్కర్లేదు

చాలామంది కవులు తమ కవిత్వాలకు పీఠికలు ఎందుకు కావాలను కొంటారో తెలీదు. సాధారణ పాఠకులకు అందకుండా నిగూఢంగా వ్రాసే కవిత్వాలకు పీఠికలు అవసరం. అంత నిగూఢంగా ఎందుకు వ్రాయాలి? అని మనం అడగొచ్చు! స్పష్టంగా ఎందుకు వ్రాయాలి? అని వాళ్ళు అడగ వచ్చు! రెండూ రెండు మార్గాలు. దేని గొప్ప దానిదే! ఈ... "కవితాగ్ని సమరం'' రెండో మార్గానికి చెందినది. అంటే స్పష్టతా మార్గం. ఇతని మార్గమూ....లక్ష్యమూకూడా స్పష్టంగానే ఉన్నై- కానీ. ఇతను నిప్పులతో చెలగాట మాడుతుంటాడు ''కవితాగ్ని సమరం" చెస్తాడు. (ఇంతకుముందు "మహిళాగ్ని సమరం" చేశాడు).

గునపాలెత్తిన కూలీలల్లో పుట్టే కవిత్వాన్ని పట్టుకొన్నాడు. కవయిత్రులు ఎత్తిన కలాల్లో మంటలు పుట్టిస్తున్నాడు. విటులకు శరీరాల్ని అర్పించే దొమ్మరి గుడిసెల్లో.... చిల్లులుపడ్డ మురికి చాపలపై రగిలే చైతన్యాన్నీ గుర్తించాడు! అందుకే తన భావాలల్లో నిప్పులు కురిపిస్తూ—కవితాగ్ని సమరానికి కలం ఎత్తాను అంటున్నాడు.

ఇతని లక్ష్యశుద్ధి అపారం! గమ్యం అత్యంత స్పష్టం! పీడకమృగాల కోరలు తీసే వీరుడు- అన్యాయం ఎదురించే వీరుడు—ఊరికి ఒక్కడు కావాలని కోరుకొంటున్నాడు. గొంతెత్తి అరుస్తున్నాడు.

కవిత్వం పట్టనంత వేగమూ ఆవేశమూ ఈ కవికి ఉన్నాయి! ఈ పుస్తకంలో పేజిపేజికి విప్లవం ఉంది! ఈ కవి వెంట నడిచే చేవ ఉంటేనే ఈ పుస్తకం తెరవండి!

గ్రంధే జగన్మోహన్ ''కవితాగ్ని సమరం'' పీఠిక, 1988 డిసెంబరు

# మానస లీలా ప్రవేశిక

నాయని కృష్ణకుమారి గారి వచన కవితా సంపుటులు అగ్నిపుత్రి ఏం చెప్పను నేస్తం ఇంతకు పూర్వం వెలువడి రసజ్ఞుల మెప్పును పొందాయి. అయితే వీరు ఇంకా పూర్వం నుంచే సంప్రదాయచ్ఛందస్సులలో ప్రౌఢ కవిత్వం రచిస్తున్న విషయం చాలామంది ఎరగరు. ఈ "మానస లీల" కృష్ణకుమారిగారు సుమారు నాలుగు దశాబ్దాల వ్యవధిలో అప్పుడప్పుడు రచిస్తూ వచ్చిన పద్య కావ్య ఖండికల సంపుటి.

వీరి కవిత్వంలో తిక్కన్నగారి తెలుగు పలుకుబళ్ళ ఒడుపూ నాయని సుబ్బారావు గారి సమాస రచనా చాతుర్యము, పద్యరచనా శిల్పమూ వారసత్వంగా కనిపిస్తాయి. జీవుని వేదన, పాద్మనాభము వంటి ఖండికలలో తత్వ గాంభీర్యమూ, శకటాసుర లీల, రక్తాక్షి ప్రవేశ వేళ వంటి ఖండిక లలో హాస్యోక్తి విలసనమూ, వర్షావేళ వంటి ఖండికలలో వర్ణన వైభ వమూ అన్నింటా కవిత్వపు చిక్కదనమూ కనిపిస్తాయి.

ప్రాచీనాధునిక కవితా రీతులతో ప్రగాఢ పరిచయమున్న విద్వ త్కవయిత్రి కృష్ణకుమారిగారు. పద్య రచనలో ప్రాచీన కవుల భాషాపాట వాన్ని, ఆధునిక కవుల రచనా ప్రసన్నతను సమతూకంగా ఈ కవితా ఖండి కలలో ప్రదర్శించారు. వీరి ఇతర పద్య గద్య కావ్యాలన్నిటిలాగే ఈ పద్య సంపుటి కూడా ఆంధ్ర సాహిత్య ప్రియులను అలరిస్తుందని మాకు నమ్మ కమే. ఈ పద్యాలను సంపుటీకరించే అవకాశం మాకిచ్చినందుకు కృష్ణ కుమారిగారికి కృతజ్ఞులం. తగిన ముఖపత్రాన్ని రచించిన కవి చిత్రకారుడు మిత్రుడు శీలా వీర్రాజుకు శుభాశంసలు.

నాయని కృష్ణకుమారిగారి మానసలీల పద్య సంపుటికి పీఠిక,

1990 నవంబరు. (జన్మభూమి సంఘం తరపున)

# వ్యవస్థా వంచితులకు ప్రాణవాయువు "ఆక్సిజన్"

మహా పురుషుల చరిత్ర ఒకజాతి చరిత్ర కానట్టుగానే మహాకవుల చరిత్ర సాహిత్య చరిత్ర కాదు. ఇట్లా అనటంవల్ల మహాపురుషులను కించ పరచటం గాని, మహాకవుల పాత్రను తక్కువ జేయటంగాని నా ఉద్దేశం కాదు. నామట్టుకు నాకు మహాపురుషుల సంగతేమోగాని మహాకవులు ఇష్టమే. వాళ్ళ కవిత్వమూ ఇష్టమే. కాని ఒకజాతి చరిత్రలో మహాకవుల చరిత్ర మాత్రమే ఉంటే అది మహాకవుల చరిత్ర అవుతుంది కాని సాహిత్యచరిత్ర కాదు. సాహిత్య చరిత్ర అంటే మహాకవులూ, ఒక మాదిరి కవులూ, అల్ప కవులూ వారి కవిత్వానికి స్పందించే పాఠక శ్రోతలూ కలిసి నిర్మించేది. ఇది ప్రయత్న పూర్వకం కావచ్చు కాకపోవచ్చు.

కవిత్వంలో తరతమ భేదాలెంచటానికిగాని, కవిత్వాన్ని అకవిత్వం నుంచి వేరుచేయటానికిగాని తగిన సాధనాలు లేవని ప్రత్యేకంగా చెప్పనక్కర లేదనుకుంటాను. కవిత్వాన్ని తూచేరాళ్ళు తన దగ్గర లేవన్నాడు చలం. శ్రీశ్రీ గారికి యోగ్యతాపత్రం ఇస్తూ నిజానికి ఎవరిదగ్గరా లేవు. ఉన్నాయని ఎవరన్నా అంటే అది ఒట్టి బుకాయింపు మాత్రమే.

కాని యుగయుగాలనుంచి కవిత్వాన్ని అంచనా కడుతూనే వున్నారు. ఫలానివాణ్ణి మహాకవి అని, మరో ఫలానివాణ్ణి ఒక మాదిరి కవి అని, మరో ఫలానివాణ్ణి అకవి అని అంటూనే వున్నారు. ఇది ఎట్లా జరుగుతున్నది?

ఒక కాలపు సమాజంలో అభిరుచుల సామ్యం ఉంటుంది. కళల విషయంలో కొంతవరకు "కన్సెన్సస్" సాధ్యమవుతుంది. నన్నయనీ, తిక్కనని, పోతననీ, కృష్ణశాస్త్రినీ, శ్రీశ్రీని కవులు కాదని ఎవరూ అనలేదు.

పేర్లు చెప్పలేం కాని ఈనాడు కవులుగా పేరుతెచ్చుకున్న కొందరిని కవులుగా సాహిత్యకులు చాలామంది ఒప్పుకోరు. అట్లాంటివారు ప్రభుత్వం వారి చిట్టాలలోను, రేడియో, దూరదర్శన్ వారి లిస్టుల్లోనూ దొరుకుతారు.

కవులకూ, అకవులకూ మధ్య భేదం అంచుల్లా కనబడదు. అంటే కవిత్వాన్ని అకవిత్వంనుంచి వేరుచెయ్యలేమని.

ఏ కాలంలో అయినా సాహిత్య వాతావరణం అని ఒకటి ఉంటుంది. అందులో మహాకవులనుంచి అల్పకవుల వరకూ భాగస్వాములవుతారు. అందులో విమర్శకులకూ, పాఠకులకూ తప్పనిసరి పాత్ర ఉంటుంది. ఆ సాహిత్య వాతావరణానికి దోహదకారులయిన వారందరినీ కొంతకాలమయినా గుర్తించకుండా ఉండలేం.

సాహిత్యచరిత్రలో ఇంకోతమాషా ఏమిటంటే సమకాలికులు మెచ్చిన ఒక కవి తరువాత సోదిలో లేకుండా పోవచ్చు. సమకాలంలో గణనకెక్కని వారు పరిస్థితు లనుకూలిస్తే మహాకవులు కావచ్చు. సాహిత్యచరిత్రలో (సమాజ చరిత్రలోలాగానే) అన్నీ సాధ్యమే.

ఈ నేపథ్యంలో నాగినేని భాస్కరరావు "ఆక్రీజివ్"ని పరిశీలిద్దాం. భాస్కరరావు యుగకర్త కాడు. మహాకవి కాడు. ఒక శకాన్నో, మార్గాన్నో, పలుకుబడినో స్థాపించినవాడు కాదు. కాని కవి, సమకాలపు సమాజంలో వివిధ విషయాలకు స్పందించి పాఠకులకు ఏదో సందేశాన్ని అందించాలని తపన పడే కవి.

సుమారు ఒక అయిదేళ్ళనుంచీ తెలుగు కవిత్వం యమ పరుగులు తీస్తున్నది. ఒకనాటి పెద్ద కవులనుకూడా వెనక్కునెట్టేసి ముందుకు పోతు న్నది. వస్తు విస్తృతిలోనూ, భావగాఢత్వంలోనూ చాలా ఎత్తుకు ఎదిగింది తెలుగు కవిత్వం. చాలా సాంద్రతనుకూడా సంతరించుకున్నది. ఒక పాతి కేళ్ళ కిందటి మహాకవి ఇప్పటి కవిత్వం ముందు పాలిపోయినట్టు కనిపిస్తు

న్నాడు. భాస్కరరావు కాస్త ఆలస్యంగా పుట్టి ఉంటే ఇప్పటి సాంద్రకవుల సరసన చేరగలిగి ఉండే వాడేమో!

భాస్కరరావు ఏమన్నా అనుకోనీ ఒకటి చెప్పక తప్పదు. అతని దురదృష్టం అతని కాలం (His Time) అనుకుంటాను. అతడు యువ భారతీయకవిగా అవతరించాడు. సరిగ్గా తారీకులు తెలీవుకాని యువభారతి సంస్థ 1965-80 మధ్యకాలంలో బాగా ప్రసిద్ధిలో ఉంది. తెలుగు ప్రజల్లో సాహిత్య చైతన్యం కలిగించటానికి ప్రయత్నించింది. ముఖ్యంగా ప్రాచీన సాహిత్యాన్ని ప్రజల దగ్గరకు తీసుకెళ్ళే ప్రయత్నంలో విజయం సాధించింది. అయితే ఆ సంస్థ కొందరు కవులనుకూడా ప్రోత్సహించింది. కాని కవులకు అవసరమైన inspiration యివ్వలేకపోయింది. సరిగ్గా ఆ సమయంలోనే కొంతముందుగా దిగంబరకవిత్వం తెలుగుకవిత్వాన్ని ఒక కుదుపు కుదిపింది. ఆ తరువాత వచ్చిన విప్లవ కవిత్వం తెలుగు కవిత్వానికి పథ నిర్దేశం చేసింది. ఆ సమయంలో యువభారతి కమిట్మెంటుతో సంబంధం లేని అస్పష్ట అభ్యుదయాభాస కవితాధోరణులను ఆదరించి ప్రోత్సహించింది. నాగినేని భాస్కరరావు ఆ వరసలోనే కవిగా అవతరించాడు. అందువల్ల యువభారతివారి కవులు యువభారతీయులుగానే మిగిలిపోయారు. యువభారతినుంచి బయటపడ్డ ఏ జయప్రభలాంటి వాళ్ళో చీల్చుకుని కవులుగా పునర్జన్మించారు. మిగతావాళ్ళు అక్కడే ఆగిపోయారు. నాగినేని భాస్కరరావు నాకు యువభారతికి ఒక సమగ్ర ప్రాతినిధ్యం వహించగల కవిగా కనిపిస్తాడు. ఇది ప్రశంసా కాదు; అభిశంసా కాదు. వాస్తవ పరిస్థితిని ప్రదర్శించటానికి చేసిన చిన్న ప్రయత్నం.

భాస్కరరావు వృత్తిరీత్యా డాక్టరు. అందులోను ప్రాక్టీసు బాగా ఉన్న డాక్టరు అల్పమైన వినోదాలకే వ్యవధి చిక్కదు. అటువంటిది కవిత్వం చదవడానికి, సాహితీ మిత్రులతో గోష్ఠులకూ కాలం సరిపోదు. మధిరలో ఏమంత సాహిత్య వాతావరణం లేదు కూడా. అయినా కవితారచన పై

మక్కువ వదలని భాస్కరరావు ఉన్న వ్యవధిలోనే అవకాశాన్ని చిక్కించు కొని కవితా రచన చెయ్యటం మెచ్చుకోదగిన గుణం. ఈయన రచనలు ఎక్కువగా ప్రజాశక్తి ఆదివారం అనుబంధంలో ప్రచురితమయ్యాయి. మరి కొన్ని అధ్యయన వేదిక ప్రత్యేక సంచికలోను, ఒకటీ అరా భారతిలోను అచ్చయ్యాయి.

ఈ వ్యవస్థలో వున్న లోపాలను బహిర్గతంచేసి ప్రజలకు కను విప్పు కలిగించటమే ఈ కవి కవితాలక్ష్యం. శ్రామికులపై ప్రేమ ఉంది. స్త్రీ సమస్యలపై సమ్యగవగాహన ఉంది. ఈ వ్యవస్థ ఇంత అన్యాయంగా ఉండటానికి పాలకుల పాత్రే ప్రధాన కారణమని గుర్తించాడు. తిరుగు బాటును, విప్లవాన్ని ప్రేరేపించే ధోరణి ఏదీలేదు. కాని ఎర్ర జెండాపై సామ్యవాదంపై ప్రేమ ప్రకటిస్తాడు. వీరపూజ కూడా కనిపిస్తుంది. "వీర తెలంగాణా పోరాటం నడిపి, నైజాం నడుము విరిచి రైతులకు భూముల నందించినవాడా!" అని సుందరయ్యగారిని కీర్తించాడు.

భాస్కరరావు కవిత్వం పారదర్శకమైనది. ఆయన చెప్పేది అర్థం చేసుకోటానికి మనకు అడ్డంవచ్చే సామగ్రి ఆయన కవిత్వంలో ఉండదు. ఆక్సిజన్‌లా కంటికి కనిపించకుండా ఆరోగ్యాన్ని అందించగల లక్షణం ఈ కవిత్వానికి ఉంది.

భాష విషయంలో ఈయన నాకంటే స్వతంత్రుడులాగున్నాడు. ఏ సంకోచం లేకుండా హలరేడు, గెలుపుకారుడు, జనచీమలు, జలసంపిణీ, నవీన దొంగలు వంటి సమాసాలను సృజించి ధైర్యంగా వాడతాడు. "మత మోదిత" అనే సమాసంలో మోదు అనే తెలుగు ధాతువును సంస్కృత 'మేట్' ధాతువుతో సమంచేసి సంస్కృత "త" ప్రత్యయాన్ని చేర్చటానికి చాలా సృజనశక్తి, ధైర్యమూ కావాలి.

ప్రస్తుత వ్యవస్థలో లోపాల్ని పాఠకులకు వివరించటంలో భాస్కర రావు తన పాత్రను సమర్థంగా నిర్వహించగలడనే నమ్ముతాను.

వాగినేని భాస్కరరావు 'ఆక్సిజన్' కవితా సంకలనానికి పీఠిక, 1991

# విస్తృత ఖండకావ్యాలకు ఒరవడి
# క్రొత్త గోదావరి

ఏనాడు నన్నయ్యగారు గురుపద్యవిద్యకు ఒరవడి పెట్టారో ఆనాటి నుంచి తెలుగు పద్యం వింత పోకళ్ళు పోయింది. చిత్ర విచిత్ర రీతులలో కవుల నాలుకపై నర్తించింది. తెలుగు చదువరుల హృదయాలను పరవశింపజేసింది.

నన్నయ్యగారి రమ్యాక్షర సమాసోద్ధతి, తిక్కన్నగారి తెలుగు పలుకుబళ్ళ మందగమనాలూ, పెద్దన్నగారి జిగిబిగి అల్లిక, తిమ్మనగారి ముద్దు ముద్దు నడకలు, శ్రీనాథుని సీసాల తూగులు, పోతనగారి అనుప్రాసాలంకృత భక్త్యావేశం, భట్టుమూర్తి ప్రౌఢశ్లేషలు, కళాపూర్ణోదయ కర్త శబ్దార్థాల పోహళింపు: ఇట్లా చెప్పుకుంటూ పోతే తెలుగు పద్యాన్ని గురించి ఎంతైనా చెప్పొచ్చు. ఆధునిక కవుల్లో తిరుపతి వేంకట కవులు, జాషువా ఏటుకూరి వెంకటనరసయ్యగారి లాంటివారు తెలుగు పద్యాన్ని తెలుగువారి సంభాషణలో కనిపించే వాగ్వ్యైఖరికీ, ప్రజాజీవిత శైలికీ సన్నిహితం చేశారు. భావ కవులు పద్యాన్ని సాంద్రతరం చేశారు. ఖండకావ్య రచయిత లనేకులు పద్యాన్ని వదల్లేదు. పద్యాల్లో ప్రగతి భావాలుకూడా ఇముడుతాయని రుజువు చేశారు. (అనుద్ర, సుంకర-వాసిరెడ్డి, ప్రయాగ కోదండరామశాస్త్రి వగైరా). సుమారు వెయ్యేళ్ళ కాలగతిని తట్టుకొని పద్యం నిల్చింది. వచన కవులు యుద్ధంచేసినా చావలేదు. అక్కిరాజు ఉమాకాంతం గారు విసుక్కున్నా నియత యతిప్రాసాలంకృతులు వీడిపోలేదు.

కొంతమంది ఒప్పుకోరుగానీ పద్యంలో స్వేచ్ఛ ఎక్కువ. (స్వేచ్ఛ అంటే ఇక్కడ Choice అనే అర్థంలో వాడుతున్నాను.) ముఖ్యంగా వృత్తాల్లో-పాదంలో గురులఘు క్రమం నియతమైనా లయ నియమితం కాదు. సమాసోద్ధతి చూపించవచ్చు. పాదాంత, పాదమధ్య విరామాలు వదిలే

యటంవల్ల కూడా స్వేచ్ఛ పెరిగింది. భావానుగుణంగా మన ఇష్టం వచ్చిన చోట వాక్యాన్ని విరుచుకోవచ్చు. ముగించుకోవచ్చు. భావానుగుణమైన లయను (దీన్నే iconicity అన్నాను) వాడుకోవచ్చు. ఒకే పద్యంలో భిన్నలయలు చూపించవచ్చు. ఒకే ఛందస్సులో పదాల విరుపుల మార్పుల వల్ల భిన్నలయలు సాధించవచ్చు.

పద్యాల్లో ఛందోనియమాల వల్ల వ్యర్థపదాల వాడకం ఎక్కువవుతుందని ఒకవాదం ఉంది. నిజానికి ఏ రకపు కవితారూపానికైనా ఈ ప్రమాదం తప్పదు. పద్య కవిత్వంలో ఎక్కడో ఒకటి రెండుచోట్ల వ్యర్థపదాలు పడొచ్చు. అయితే ఆ వ్యర్థపదాలుకూడా అర్థక్లేశాన్ని కలిగించవు. వీటిని ఏరి ఒక పరిమితమైన గణంగా వేర్పరించవచ్చు. పద్యలక్షణాలలాగే ఇవి కూడా వ్యవస్థీకృతమైనాయి. పద్యావగాహన, వ్యాఖ్యాన క్రమంలో వీటిని వదిలేయటం సంప్రదాయం. ఛందస్సుపై ఆధిపత్యం, భాషపై అధికారం పెరిగిన కొద్దీ కవి వీటిని అతిగమించగలడు. ఆ మాట కొస్తే ఈ నాటి వచన కవిత్వంలో వ్యర్థ పదాలుండక పోవచ్చేమో కాని నిరర్థక వాక్యాలు, పునరుక్తులు కొల్లలుగా కనిపిస్తున్న విషయం మన అనుభవంలోనిదే.

ఒక కాలంలో వచ్చింది కాబట్టి పద్యచ్ఛందస్సును ఫ్యూడలిజంతో ముడిపెట్టక్కర్లేదనుకుంటాను. గురులఘుక్రమబద్ధ పద్యరూపానికీ ఫ్యూడల్ పునాదికీ ప్రత్యక్ష సంబంధం ఉందని నాకనిపించదు. ఒక ఉత్పత్తి విధానం ప్రచురంగా ఉన్నప్పుడు వచ్చిన కళారూపాలన్నిటికీ ఆ ఆర్థిక విధానాన్నే పోల్చుగా చూపించాల్సిన అవసరం లేదనుకుంటాను. పరిణామ క్రమంలో ఏర్పడిన ఒక కవితారూపం పద్యం. ఏ సమాజం అందించినా దాన్ని అవసరమైనంతవరకు వాడుకోటానికి ఎవరికీ అభ్యంతరం ఉండక్కర్లేదు.

పద్యంలో ఛందస్సువల్ల కవిత్వం మరుగున పడిపోతుందన్న వాదం ఒకటుంది. ఇట్లాంటి వాదం కుందుర్తి ఆంజనేయులు గారు చేసేవారు. పద్యం

పాడి కవిత్వంగా భ్రమింపజేయవచ్చునని కుందుర్తిగారి భావం. ఇది కావ్య గానానికి సంబంధించిన విషయం, ఇది కూడా అన్ని కవితా రూపాలకీ వర్తిస్తుంది. గేయాన్నికూడా పాడి మెప్పించవచ్చు. ఇప్పుడు వచన కవిత్వం చదివేవారుకూడా ఒక ఒడుపు నేర్చుకున్నారు. సభలో మంచి కంఠం ఉన్న కవి చదివిన వచనకవిత్వం తక్కువ కవితాస్థాయిలో ఉన్నా గొప్ప కవిత్వంగా భ్రమింపజేయవచ్చు. వచన కవిత్వాన్ని ఒడుపుగా చదివి సభల్లో దబాయించే కవులను మనం ఇటీవలి కాలంలో చాలామందినే చూస్తున్నాం.

మౌఖికంగా చదివే కవిత్వంలో ధ్వనులపాత్ర, స్వరం పాత్ర ఏదో రూపంలో ఉంటాయి. భాషాప్రయోగాన్ని కవిత్వం చేయడానికి ఉపయోగించే వ్యూహాల్లో ఇదొకటి. దీన్ని Phonological Strategy అని అంటున్నాను. కవిత్వానికి సభాముఖంగా కాని, లేక మరో శ్రోత సమక్షంలో కాని పెద్దగాచదివే ఏ కవితా రూపానికైనా ఈ లక్షణం ఉంటుంది. మౌఖిక ప్రసార దశలో ఉన్న ఏ కవితా రూపంలో అయినా ధ్వనుల పాత్ర తప్పనిసరిగా ఉంటుంది. కాకపోతే గేయచ్ఛందస్సులకు ధ్వనినిర్మాణం నిర్వచనంలో భాగం. వచనకవిత్వానికి కాదు. వచనకవిత్వానికి నిర్వచనమే సాధ్యం కావటం లేదు.

ఇటీవలి కాలంలో, మరీ ముఖ్యంగా ఒక దశాబ్దం నుంచీ వచన కవిత్వం ప్రాచుర్యం బాగా పెరిగింది. సమాజ గమనంలో ఇది సహజ పరిణామమే. అయితే పద్య, గేయ రూపాలకన్నా వచన కవితారూపం గొప్పదనీ, విలువైనదనీ, అభిలషణీయమనీ-పద్యంలో రాయటం ఫ్యూడల్ విలువల పునరుద్ధరణమనీ, పెరిగిన అభివృద్ధిని కాదని చేసిన తిరోగమనమనీ ఒక అభిప్రాయం తెలుగు సాహిత్య ప్రియుల్లో ఏర్పడుతున్నట్లు కనిపిస్తున్నది. పరిణామ క్రమంలో వచ్చిన ప్రతీదీ పాతదానికన్నా అభ్యుదయ కరమైంది కానక్కర్లేదు. గతశతాబ్దపు జీవపరిణామవాదం (theory of biological

evolution) కొన్ని సాంఘిక శాస్త్రాలనే గాక మానవుల సమస్తమేధా వ్యాపారాలనూ ప్రభావితం చెయ్యటంవల్ల కలిగిన ఆలోచనల ఫలితం ఇది. సాంస్కృతిక రంగంలో జరిగిన చాలా మార్పులు భిన్నతకు విశేషసూచకాలే కానీ ఖచ్చితంగా అభివృద్ధిదిశానిర్దేశకాలు కాదని నా అభిప్రాయం. వృత్తాలు గేయాలు వచన కవిత్వం అనే విధంగా ఉత్తరోత్తరం ఉత్తమం అనే ఆలోచనకు కొందరు అలవాటు పడ్డారు. లిఖిత సాహిత్యంలో వీటికి కాలానుక్రమం ఉంది. అంతమాత్రంచేత అదే విలువలను నిర్ణయించదు. అయితే కాలక్రమంలో ఒక్కో దాని ప్రాచుర్యం తగ్గిపోవచ్చు. కవిత్వానికి మౌఖికస్థితి ఉన్నంతవరకు వచన కవిత్వంతో పాటు శ్రవ్యప్రధాన కవితా రూపాలుకూడా ప్రయోగంలో ఉంటాయనే అనుకుంటున్నాను.

బేతవోలు రామబ్రహ్మంగారి పద్యకవితావిష్కరణ సందర్భంగా ఈ పై విషయాలు చెప్పటానికి కారణం ఉంది. ఈనాడు కవిత్వం రాసేవాళ్ళతో కాసేపు మాట్లాడి చూడండి. వచవ కవిత్వమే కవిత్వం, మిగతాది కవిత్వం కాదన్నట్లు మాట్లాడుతారు. పద్యరచనా శిల్పరహస్యాలనూ, గేయరచనా ఫణితుల్నీ గ్రహించే శక్తి క్రమక్రమంగా సన్నగిల్లుతోందని అనుమానం కలుగుతున్నది. అది ఏమంత అభిలషణీయమైన పరిణామం కాదు.

రామబ్రహ్మంగారు సంస్కృతాంధ్ర కవితా సంప్రదాయాలను జీర్ణించుకున్న వారు. ఆధునికతను అర్థం చేసుకున్నవారు. రెంటినీ ఇట్లా సమన్వయం చేసుకున్న స్కాలర్సు ఈనాడు చాలా అరుదు.

"గొప్ప సాహిత్యం అంతా ప్రాచీనకాలంలోనే ఉంది. ఇప్పుడు అన్నీ భ్రష్టమైపోయినవి'' అనే వాదస్తపు పండితులు ఒకవైపు. ''ఉన్నదంతా వచన కవిత్వంలోనే ఉంది'' అని కనీసం పాతికేళ్ళు వెనక్కి చూడలేని హ్రస్వదృక్కులు మరోవైపు చారులుతీరి ఉన్నారు తెలుగు సాహిత్యంలో. ఈ సమయంలో ప్రాచీన ఆధునిక రీతుల సమ్యగ్గ్రాహణం సమ

చితం అని సాధికారంగా చెప్పగలిగిన పండితులు, భావుకులు, కవులు, బోధకులు అవసరం. సరిగ్గా రామబ్రహ్మంగారు అటువంటివారు. ఆయన ప్రాచీనతను ప్రేమిస్తారు. ఆధునికతను ఆదరిస్తారు. ఆయన సాహచర్యం చేసిన వారికి, తగిన పరిచయం ఉన్నవారికి ఈ విషయాలు తెలుసు.

ఇప్పుడీ విషయాన్ని ఆయన కవిత్వం ద్వారా కూడా కొంతలో కొంత తెలుసుకోగలం.

ఈయన పద్యకృతి కొత్తగోదావరిలో కొన్ని పద్యాలను గోదావరీ పావనోదారవాఃపూరం పైనుంచి వచ్చే చిరుగాలి కెరటాల స్పర్శల పులకరింపుల్లో ఆయన ఆర్ద్రంగా గానం చేస్తుండగా విన్నాను. ఆ మధురానుభవం మనసులోనుంచి తొలగిపోలేదు. మళ్ళీ అవే పద్యాలు మరికొన్ని పద్యాలతో పాటు రాతలో చూసి వరదగోదావరిలా ఉప్పొంగిపోయాను. కొత్త గోదావరిలో 97 పద్యాలున్నాయి. నూరు పద్యాలు లేకపోయినా దీనికి శతకలక్షణాలున్నాయి. శతకం అంటే నూరు పద్యాలని మాత్రమే కాదు. మకుటం అనే అభిజ్ఞ (డయోగ్నొస్టిక్ ఫీచర్) ఉన్నందువల్లనే ఒక పద్యసంపుటి శతకం కాదు. ఈ 'కొత్తగోదావరి'లో చాలా పద్యాలకు గోదావరీ అనే మకుటం ఉంది. శతకం అనే స్పృహ ఈయన మనసులో మెదలకపోవటం వల్ల ఆయన నూరు పద్యాల సంఖ్యను గానీ, మకుటాన్నిగానీ సీరియస్‌గా పట్టించుకోలేదు. మకుటం పద్యభేదాల ఎన్నికను పరిమితం చేస్తుంది. అందువల్ల మకుటం వదిలేస్తే వైవిధ్యం చూపటానికి వీలవుతుంది. ఈ సంపుటిలో ఈ వైవిధ్యం ప్రసిద్ధవృత్తాలకే పరిమితమైందనుకోండి.

శతకంలో పాఠకుణ్ణో, శ్రోతనో, భగవంతుణ్ణో ఉద్దేశించి చేసే సంబోధన ఉంటుంది. ఈ కొత్తగోదావరి 97 పద్యాలూ గోదావరిని సంబోధిస్తూ రచించినవే. గోదావరికి పురాణ గాథలతో సంబంధం ఉంది. ఆంధ్ర దేశ చరిత్రతో సంబంధం ఉంది. ఇవన్నీ స్మృతిపథంలో మెదలగా కవితా

వేశంతో రామబ్రహ్మంగారు గోదావరిని ఉద్దేశించి తన మనస్సులో భావాలు ఆమెకు చెప్పినట్టుగా మనకు చెప్పారు.

సంబోధన అనేది భాషకు ఆత్మీయతా గుణాన్ని అందిస్తుంది. వక్త శ్రోతల సాన్నిహిత్యం సంభాషణ శైలిలో సువ్యక్తమవుతుంది. మాట్లాడే భాషలో సంభాషణ శైలి అత్యంతాత్మీయమైనది. భాషకు ప్రాథమికమైనది. అందువల్ల పద్యం మాట్లాడినట్లుంటుంది. కవి వ్యక్తికి ఏమంత అవకాశం లేని కథా కావ్య సందోహంలో శతక వాఙ్మయం ఒక రిలీఫ్ వంటిది. కవి ఆత్మనివేదనకు ఇక్కడ ఎక్కువ అవకాశం ఉంది. (నీతి శతకాలట్లా ఉంచండి) శ్రీ కాళహస్తీశ్వర శతకం, దాశరథి శతకం ఈ కోవలోనివి. వీటిల్లో భక్త్యావేశమే కాదు స్వచ్ఛంగా, నిర్భీకంగా తన ఆలోచనలను సంఘ, కావ్య, శాస్త్ర నియమాలనే కట్టుబాట్లనుకూడా ఛేదించుకొని విముక్త విహంగంలా విహరించే స్వేచ్ఛాప్రియత్వంకూడా కనిపిస్తుంది. అందుకే ప్రబంధాల్లో కనిపించే వ్యాకరణ సూత్ర బద్ధ ప్రవర్తన శతకాల్లో కనిపించదు. వ్యాకరణ నియమాలపై తూష్ణీంభావం కనిపిస్తుంది.

ప్రాచీన శతకాల్లో కనిపించే ఈ స్వేచ్ఛ ఆధునిక కాలంలో ఖండ కావ్య ప్రక్రియలో కనిపిస్తుంది. ఏ విషయంపైనయినా కవి తనకు కలిగిన అభిప్రాయాలను వ్యక్తం చేసే సాధనం ఈ ఖండకావ్యం. శతకానికీ ఖండ కావ్యానికీ ఆత్మాశ్రయత్వం (అంటే ఆత్మాభివ్యక్తికి అవకాశం) సామాన్య లక్షణం.

రామబ్రహ్మంగారి కొత్తగోదావరి ఖండకావ్య లక్షణాలూ శతక లక్షణాలూ రెండూ వర్తించే కావ్యప్రక్రియ. దీనికి వేరే ఇంకేమైనా పేరు ఉందేమో తెలీదు.

ఖండకావ్యంలో సాధారణంగా ఒకే వస్తువు లేక విస్తృతినొందిన ఒకే భావం ఉంటాయి. శతకంలో బహువిషయ పరంపర ఉంటుంది.

అందులో ఏ పద్యాని కా పద్యం ముక్తకమూ కావచ్చు. కొన్ని పద్యాలకు విస్తరించిన కొన్ని భావాల క్రమ సంయోజనా కావచ్చు.

ఈ దృష్ట్యా చూస్తే రామబ్రహ్మంగారు ఈ కొత్తగోదావరిని శతకలక్షణాలు సంతరించుకున్న విస్తృతఖండకావ్యంగా రూపొందించినట్లు కనిపిస్తుంది. ఇదంతా ఆయన సచేతనంగా చేశారా? అచేతనంగా చేశారా? అనేదానితో నాకంత ప్రమేయం లేదు. కనిపిస్తున్న లక్షణాలను ప్రదర్శించ టమే నా కర్తవ్యం.

"క్రొత్త గోదావరి"లో పద్యాలను గురించి, గాధలను గురించి, శైలిని గురించి, శయ్యను గురించి విపులంగా చెప్పే ప్రణాళిక పెట్టుకోవటం కష్టం. అయినా నా మనసుకు బాగా నచ్చిన కొన్ని పద్యాలయినా ప్రస్తా వించకుండా ఉండలేను.

భద్రాచలం దగ్గర గోదావరి-కొండను చుట్టుకొని వుంటుంది. బిడ్డను పొత్తి ళ్ళలో పొదువుకున్న తల్లిలా కనిపిస్తుంది నాకు. అదే భద్రగిరి దగ్గర గోదా వరిని రామబ్రహ్మంగారు ఉత్ప్రేక్షించిన తీరు చూడండి.

> "ఇట వీక్షింతువు కానిపింప. దటు వైపే తెంచి యీక్షింతు వ
> చ్చటనుంగన్పడ. దేగి తూర్పున దిదృక్షామూర్తివై నిల్తు "వె
> ప్పటి కిప్పింతువు స్వామి దర్శనము నో భద్రాచలా?" యందు వు
> త్కటసంవేదన- నీ నిరీక్షణకు నంతం బెప్డు గోదావరీ!

ఎటునుంచి వెళితే స్వామి దర్శనం కలుగుతుందా? అని భద్రాచలాన్ని చుట్టు కొన్నట్టుగా చేసిన ఈ ఊహ రమణీయంగా వుంది.

గోదావరీనది వివిధ కాలాల్లో భిన్న ప్రాంతాలలో ఒక్కొ-రీతిగా కని పిస్తుంది. ఈ స్థితులు మానవుల మనస్ స్థితులను ప్రతిఫలిస్తున్నట్టు ఊహి స్తాడు కవి.

ఒకమారేవు దురంతదుఃఖముగ, నింకొక్కప్పు దత్యుగ్రస
ర్ప కళత్రంబుగ, నొక్కతూరి జవనాశ్వారూఢవీరాధినా
యిక వోలెన్, మరియొక్కవేళ ఘనయోగీంద్రాంతరంగమ్ము వో
లిక గన్పింతువు-నిత్యనూతనలసల్లీలాకృతీ! గౌతమీ!!

ప్రకృతి చిత్రణం, ప్రాచీన గాథా సంబంధ నిరూపణం, తాత్విక చింతనం వంటివే కాక ఆధునిక భావచింతన కూడా ఈ పద్య సంపుటిలో విశేషంగా కనిపిస్తుంది.

ఒక కామాంధుడు బాధ్యతాయుతమహోద్యోగమ్ము సాగించు ర
క్షకు డారణ్యకముగ్ధకాంతపయి దౌర్జన్యంబు గావింప చ
ణ్డికయై యార్చి ఖరాంగుళీనఖరవ జ్కాం జీల్చిచెండాడ నో
డికలై పర్వివ రక్త మీవగుట లెస్సే తల్లి! గోదావరీ!

గోదావరి కానీ, మరే రమ్య ప్రదేశమైనా గానీ, అక్కడ మానవ నాగరకత సృజించిన అపసవ్యదృశ్యాలు కూడా కనిపించటం సహజం. ఎంత సౌందర్యోపాసకుడైన కవి అయినా ఈ దృశ్యాలనుంచి తప్పించుకోలేదు. ఆర్ద్రత ఉన్న కవి స్పందించకా మానడు. అట్లాంటివి ఈ ఖండకావ్యంలో అక్కడక్కడా కనిపిస్తూనే ఉంటాయి. అట్లాంటి చిత్రణ ఒకటి చూడండి—

ఏదో పండుగో పబ్బమో యగుటచే నీ బాలు రుత్సాహన
మ్మోద్రాంఖోధులు నిన్నుజేరి జలకంబుల్ గోలగా నాడ-వి
షాదస్పర్శము దల్లి ప్రేమమును నొక్కింతేని జూపించి-మ
ర్యాదన్నిల్పుము పూతవార్ల హరికాహస్తాబ్జ! గోదావరీ!

అట్లాగే పురుషాహంకారవిరతన కూడా ఒక పద్యంలో కనిపిస్తుంది.

పురుషాహంకృతి కాలసర్పమయి విప్పుల్ గ్రక్క నేకాంతదు
ర్భరదుఃఖంబున జీవితంబు నరకప్రాయంబుగా రోపి-వి
ష్ణదురంతాగ్నిన శోధక్షీణులౌ ద్రోహోక్తివికారిలవి
ష్టరముల్ కామునిమ్మ మాదృశులకున్-శోకింపకో గౌతమీ!

శతక లక్షణాలలో ఒకటి భగవంతుడి ముందు తన నేరాల్ని, లోపాల్ని, బలహీనతల్ని చెప్పుకోవటం. దీన్నే ఇంగ్లీషులో కాన్ఫెషన్స్ అంటాం. ఈ ధోరణి పద్యాలు పూర్వ శతకాల్లో కనిపిస్తాయి. రామబ్రహ్మం గారు రాసిన అట్లాంటి పద్యం ఒకటి చూడండి. ఇట్లాంటిచోట్లు కవి నిజాయి తీని పట్టి ఇస్తాయి.

ఈవు క్షమింతువేని వచియింతును తల్లి! మరిన్ని క్రొత్త గో
దావరి పేర పద్యసముదాయములన్ విరచించి-వేసి. రా
బోవు మహోత్సవంబులను బుష్కరతీర్థములందు అమ్ముకో
జోవుట కెంచితిన్-చిలిపి పోడిమి యీ యుగరీతి గౌతమీ!

సాధారణంగా భక్తి శతకాలు నిర్వేదం, శాంతం, మొదలైన భావాలతో సీరియస్గా ఉంటాయి. అందులో హాస్యానికి ఎక్కువ వీలుండదు. అయినా ఈ ఖండకావ్యంలో ఒక చిరుత హాస్యం (మేలమాడటం అంటామే అట్లాంటిది) ఒకచోట కనిపిస్తుంది.

విన్నటిదాక నీ విమలనీరములందున తారకప్రభా
భ్యున్నతి తొంగిచూచినదివో, యిపుడేల నవారుణత్వ సం
పన్నము విప్లవోగ్రగతిమంతమునయ్యెను నీ ప్రవృత్తి? మా
యన్నల సాహితీస్ఫురణమంటెనొ నీకును తల్లి! గౌతమీ!

ఉగ్ర గోదావరి ఎర్రదనానికి విప్లవ సాహిత్యస్ఫూర్తిని కారణంగా ప్రతిపాదించటంలో ఔచిత్యం-హ్యూమర్-"అన్న"లు కూడా ఆనందించదగిన స్థాయిలో ఉంది.

నా ప్రలోభంకొద్దీ ఏవో కొన్ని పద్యాలు ఏరి చూపించాను కాని, ఈ క్రొత్త గోదావరిలో ప్రతి పద్యమూ రసోచితంగా, పఠన రమ్యంగా ఉన్నాయి. ఒక వాన కురిసి వెలసిన సాయంకాలం ఒంటరిగా బిగ్గరగా మెల్లగా చదివి సంభావించుకోదగిన పద్యసంభార మిది. గోదావరీ నదీతీర

పులిన తలాలలోనో వా_స్తరంగాలపై ఉయ్యాలలూగే పడవ ప్రయాణంలోనో భావుకులు చదివి భావనాలోకంలో విహరించదగిన పద్యసంపుటి ఇది.

ఈ సంపుటిలో కరుణరస స్ఫోరకమైన ఖండ కావ్యం "యశోధర". భిక్షకోసం వచ్చిన గౌతముని గూర్చి యశోధర అంతశ్శోక వార్ధి తరంగాలు ఈ పద్యాలు. ఇవి మొత్తం 29 పద్యాలు. ప్రతి పద్యం గుండెలు పిండి వేసేదే. అయినా ఈ పద్యం చూడండి....

నీ మలి రూపమై నెనరునింపెడు నీ పసికూన గాథని
ద్రామధుడోల నూగుచు నదాటుగ నవ్వ నొకొక్కసారి-తం
డ్రీ! మహనీయమూ_ర్తి కనిపించెనటే యని-పిచ్చిదాన నే
దో మురిపాన కౌగిటికి నొ_త్తి లయించితి దీర్ఘరాత్రముల్.

ఇంకా ఈ సంపుటిలో అదిగో శీతాద్రి, పరదేశి మొదలైన ఖండికలు రసజ్ఞులకు సంతృ_ప్తి నిచ్చేవి ఉన్నప్పటికీ వాటినన్నిటినీ ఇప్పటికే దీర్ఘమైన ఈ పీఠికను పెంచి పరామర్శించదలచుకోలేదు. ప్రాచీన కావ్యస్ఫూ_ర్తి కలిగించే ప్రౌఢ ప్రయోగాలను గురించి కూడా ఏమీ చెప్పలేదు. అవన్నీ రసజ్ఞ పాఠకులే గు_ర్తించగలరు. రామబ్రహ్మంగారి ఈ కావ్యాన్ని సమగ్రంగా పరామర్శ చెయ్యగల అవకాశం లేదిప్పుడు. అంత శాస్త్ర పాండిత్యమూ లేదు. తెలుగు కవితా పాఠకుడిగా నా అనుభవాన్ని నలుగురితో పంచుకోవటమే ఈ పీఠికలో నేను చేసిన పని. చెయ్యగలిగింది కూడా అంతే. నన్ను మన్నన చేసి నాకు ఈ అవకాశం ఇచ్చిన రామబ్రహ్మంగారి స్నేహార్ద్రతకు నా అభివాదాలు.

బేతవోలు రామబ్రహ్మం "క్రొ_త్త గోదావరి"
పద్య సంపుటి : పీఠిక. 1991 జూలై 20

# కందపద్యాలతో అవీరు రాసిన గరీబు గీతాలు

ఆధునిక కవులలో పరమ సీరియస్ కవిత్వాన్నీ హాస్యం, హేళన, అధిక్షేపం, వగైరాలను మిళితం చేసి సరదా కవిత్వాన్నీ రాసినవాళ్ళు కొద్ది మంది. విశ్వనాథ సత్యనారాయణ, దేవులపల్లి కృష్ణశాస్త్రి, శ్రీశ్రీ గార్లు అట్లాంటి కొద్దిమందిలో మరీ కొద్దిమంది. ఈ కొద్దిమంది మార్గంలో పయనిస్తున్నాడు దేవిప్రియ.

దేవిప్రియను ఆఫీసులో చూస్తే సెన్స్ ఆఫ్ హ్యూమర్ బొత్తిగా లేని ఒట్టి సీరియస్ మనిషిలాగా కనిపిస్తాడు. ఓ గుడిసెకథ, హిట్లర్ నవ్వు వంటి జనాన్ని పట్టేసిన సీరియస్ కవితలు రాశాడు. 'అమ్మచెట్టు" 'నీటిపుట్ట" సంపుటాలు అతనికి ఆధునిక కవిత్వంలో స్థిరస్థానం సాధించిపెట్టాయి. కాని మరోవైపు సెన్సాఫ్ హ్యూమర్ ఉన్న అధిక్షేపకవిగా 'సమాజానంద స్వామి' గీతాలు, చాలా సంవత్సరాలు రెగ్యులర్‌గా రాసిన "రన్నింగ్ కామెంటరీ' ఇదిగో ఇప్పటి గరీబు శతకం ఇతని కవిత్వానికీ మరో దర్శనీయ కోణం ప్రదర్శిస్తాయి. రెండూ సమస్థాయిల్లో నడపగలగటానికి కవికి చాలా ప్రతిభ కావాలి, అభ్యాసం కావాలి, అనుభవం కావాలి. పరమ బద్ధకస్తుడిలాగ (నేనే చాటుగా బద్ధకం వచ్చినోడు అని తిడుతుంటాను) కనిపించే దేవిప్రియలో ఇవన్నీ ఉండటం అహ్లాదకరమైన సన్నివేశం.

దేవిప్రియ చిన్నప్పుడు వినుకొండ భ్రమరాంబిక గుడి అరుగుల మీద చదువుకున్న సుమతి శతకం నెమలీక అయి కదలాడింది. (బాల్య జ్ఞాపకాలకు నెమలీక సంకేతం). ఓనమాలు దిద్దకముందే వాళ్లనాయన నోటినుంచి విన్న శ్రీనాథుని చాటువులు ఎక్కడో స్ఫురణలో ఉన్నాయి. శ్రీశ్రీ గారి సిరిసిరిమువ్వ శతకం పద్యాలు తరచు నోట్లో ఆడుతూనే ఉండాలి. వీటి అన్నిటి ప్రేరణ ఫలితంగా దేవిప్రియ "మధుర గరీబు" పద్యాలు మనకు అందాయి.

తెలుగు సాహిత్యంలో శతక ప్రక్రియ చాలా విశేషమైనది. దీని ప్రయోజనాలు (functions) బహుముఖంగా ఉన్నాయి. ప్రాచీన సాహిత్యం ప్రాయికంగా కథాశరీరకం. స్వీయభావవ్యక్తికి అవకాశం తక్కువ కావ్యకథా పంజరంనుంచి కాసేపు బయటపడి భావస్వేచ్ఛవైపు పరుగులు తీయటానికి శతక సాహిత్యం ఒక రిలీఫ్ (relief)గా పఠితలకూ కవులకూ పనికొచ్చిందనుకుంటా, ఈ స్వేచ్ఛాభివ్యక్తి, భాషానియమోల్లంఘనములోనూ కనిపిస్తుంది. కథా శరీరంనుంచీ కావ్య భాషనుంచీ కాసేపు బయటపడాలన్న అజ్ఞాత కాంక్ష శతక రచనలో కనిపిస్తుందనుకుంటాను. శ్రీకాళహస్తీశ్వర శతకం, దాశరథి శతకం, దేవకీనందన శతకం వంటి శతకాల్లో ఈ నియమోల్లంఘన స్పష్టంగా కనిపిస్తుంది. భావస్వేచ్ఛకు (అమాట కొస్తే నిచ్చలవిడితనానికి) కవిచౌడప్ప శతకం పరాకాష్ఠ. ఇక బ్రహ్మానంద శతకంవంటి బూతుశతకాల సంగతి చెప్పనక్కరలేదనుకోండి.

శతకప్రక్రియలో ప్రపంచగతిని వర్ణించటం హితాన్ని బోధించటం వంటి సెక్యులర్ ప్రయోజనాలను సాధించినవాళ్ళున్నారు. వేమన వంటి కవుల ప్రధాన ప్రయోగమే అది. శతకానికి శతసంఖ్య, మకుటనియమమూ పైపై లక్షణాలే. అసలు లక్షణం ఆత్మాభివ్యక్తి. శతసంఖ్య అధికార్థ సూచకం అనుకుంటాను. అంటే ఆ మాత్రం చెప్పదగినవన్ని విషయాలుండాలి అనే భావమనుకుంటాను. మూరుపద్యాలు దాటినా శతకమే అన్నారు. తక్కువుంటే శతకచ్ఛాయలున్న పద్యాలంటాం. కాని వేమన పద్యాలు వంద సంఖ్య దాటినా శతకమే అంటున్నాం.

ప్రతి పద్యానికి ఒక శ్రోతను గుర్తుచెయ్యటానికి మకుటం పనికొస్తుంది. ఆ శ్రోత తానే కావచ్చు. శ్రోత ఎవరైనా భాషాశైలి, కథాశైలికన్నా భిన్నమైన సంభాషణ శైలి అవుతుంది. అంటే మనిషి [లేక దైవం] ఎదురుగా ఉన్నట్టు అతనితో మాట్లాడినట్లు ఉంటుంది. భాషా వ్యక్తికీ, పాఠకుడికీ మధ్య సాన్నిహిత్యాన్ని సమకూరుస్తుంది. పాఠకుడు సునాయాసంగా

కవి మనఃప్రవేశం చెయ్యగలుగుతాడు. కవిదృష్టినుంచే కాక పాఠకుడి కావ్యానుభవ దృష్ట్యాకూడా శతకం ఇతరకావ్యభేదాలకన్నా భిన్నమైనది.

శతకంలో సాధారణంగా ముక్తకాలుంటాయనుకుంటాం. కాని అందులోనూ విషయ విభాగం చేసిన వారున్నారు. శీర్షికలుంచినా ఉంచకపోయినా సరూప భావాలు వరుసగా కొన్ని పద్యాలవరకూ విస్తరించిన ఘట్టాలున్నాయి. ఈ ధోరణి అన్ని శతకాల్లోనూ కనిపిస్తుంది. మకుటం లేని శతకాలూ ఉండవచ్చు. సంస్కృతంలో మకుట నియమం లేదు. నాయని సుబ్బారావుగారి 'వేదనావాసుదేవము" మకుటం లేని తెలుగు శతకం. అందువల్ల దానికి ఛందోవైవిధ్యం వచ్చింది. మకుటం ఛందస్సు ఎన్నికను నియతం చేస్తుంది. "వేదనావాసుదేవము'లో 12 సమవిభాగాలున్నాయి.

శతక ప్రక్రియను ఆధునికులు రకరకాలుగా వాడుకున్నారు. భక్తి శతకాలు ఉన్నాయి. సెక్యులర్ శతకాలు ఉన్నాయి. అత్యాధునికులు శ్రీశ్రీగారి లాంటి వారు కొంతహాస్యం అధిక్షేపం కలిపి లోకవృత్తాన్ని ప్రదర్శించడానికి శతకాన్ని వాడుకున్నారు. శ్రీశ్రీగారి సిరిసిరిమువ్వ శతకం అట్లాంటిది. ఈ మార్గంలో న.చ.రామానుజాచార్యులుగారు మూర్ఖ శతకం రాశారు. దేవిప్రియ రచించిన గరీబు శతకం ఈ మార్గంలోదే. 1986_89 ప్రాంతంలో "ఆంధ్రజ్యోతి'లో ప్రకటించాడు. ఈ పద్యాలు అప్పటి పాఠకులు సరదాపడి చదివారు. శ్రీశ్రీ గారి సిరిసిరి మువ్వ శతకం కొంత 1946 ఆంధ్రజ్యోతిలోనూ మరికొంత 1947 'ఆనందవాణి" లోనూ అచ్చయింది.

సిరిసిరిమువ్వ శతకంలాగే ఇదీ కందపద్యాల్లో ఉంది. కందపద్యానికి గణపద్ధతిలో లక్షణనిర్దేశం చేసినా అది మాత్రాపద్యం.బేసి పాదాల్లో చతుర్మాత్రా గణాలు మూడేసి సరిపాదాల్లో ఐదేసి ఉంటాయి. అన్ని పాదాలకూ కలిపి ప్రాసనియమం, సరిపాదాలకు నాలుగో గణాదిన యతినియమం ఉన్నాయి. మొత్తం పద్యంలో బేసి గణాలలో జగణం ఉండకూడదు. సరిపాదాల్లో

మూడోగణం జగణం కావి, నలఘ కావి అయిఉండాలి. ప్రాసకు ముందున్న అక్షరం నాలుగుపాదాల్లోనూ గురువైనా లఘువైనా ఏదో ఒకటే కావాలి. ఇన్ని కఠిన నియమాలుండటంవల్ల కందం రాసినవాడే కవి అనే నానుడి వచ్చింది. అయితే ఈ కందాలను అందంగా రసనిష్యందంగా సునాయాసంగా చెప్పిన వాళ్ళున్నారు. అందులో శ్రీశ్రీగారు ఘటికుడు. నిస్సందేహంగా దేవిప్రియకు కందం బాగా లొంగింది.

కందాన్ని లొంగదీసుకోటానికి కొన్ని గ్రహణవ్యూహాలు (Cognitive strategies) ఉన్నాయనుకుంటాను. నాలుగు మాత్రల గణాలు మూడేసి ఉన్నచోట రెండు ఆరు మాత్రల గణాలుగా కూడా విరిచి త్రిశ్రగతి లయ సాధించవచ్చు. దేవిప్రియ కందాల్లో చాలాచోట్ల బేసిపాదాల్లో చతురశ్ర గతి, సరిపాదాల్లో త్రిశ్రగతి లయస్ఫూర్తి కనిపిస్తుంది. త్రిశ్రగతి లయ పాటించినప్పుడు యతికి ముందు మూడు మాత్రల గణాలలో గలం, వగణం వచ్చేట్టు చూసుకుంటే, నలం జగణం రావాలనే నియమపాలన ఆటోమేటిగ్గా జరిగిపోతుంది. ప్రాసకు ముందున్న అక్షరం గురువో లఘువో ఏదో ఒకటి కావాలన్న నియమం ఉంది. ప్రాసాక్షరానికి అట్లాంటి నియమం లేదు. అయితే మిగతా పద్యాలన్నిటిలోనూ సహజంగా గణనిర్దేశాన్ని బట్టి ప్రాసాక్షరం గురువో లఘువో అవుతుంది. కందపద్యంలో అది వ్యత్యయం (గారు మారు) కావటానికి వీలుంటుంది. ఉదాహరణకు ఆ వీలును శ్రీశ్రీగారెట్లా ఉపయోగించుకున్నారో చూడండి.

జగణంతో జగడం కో
రగా వగదు కావి దావి తప్పాగొయ్యా
వగలాగ వెలుగుమ గదా
విప్పితే వాణిగ్నంట సిరిసిరిమువ్వా

అపురా, శ్రీరంగం శ్రీ
నివాసరావూ బలే మనిషివే, ఇకనీ
కవితావాద్యం చాలిం
చి వెళ్ళిపొమ్మనకు నన్ను సిరిసికెముట్రా!

దేవిప్రియ కూడా ఇట్లాంటి అవకాశాన్ని అరుదుగా నైనా అక్కడక్కడా ఉపయోగించుకున్నాడు.

తూనీగ తోక చివరన
పూవికతో దారమొకటి ముడివేస్తావోయ్
ప్రాణం గల గాలిపటము
కానుకగా దొరికిన దని కదర గరీబూ!

యతిస్థానం తరువాత రెండు చతుర్మాత్రాగణాలుంటాయి. అయితే చివరి మకుటం గరీబూ అని వచ్చినప్పుడు యతిస్థానం తరవాత మూడు మాత్రలే ఉంటాయి. అవి గలం కాని నగణం కాని కావాలి. ఆ మూడు మాత్రలను చాలా చోట్ల 'గరీబూ' అనే మాటకు ఉచిత విశేషణం ఉంచటానికి వాడు కున్నాడు. మూఢ గరీబూ. దేశి గరీబూ. పూర్తి గరీబూ. వెర్రి గరీబూ, అమరు గరీబూ, కొదమ గరీబూ, బుల్లి గరీబూ వంటివి. ఇట్లాంటి సంబో ధనల్లో ఔచిత్యం పాటించటం దేవిప్రియ చూపిన నేర్పు. ఈ రెండు ఉదా హరణలు చూడండి.

ఎగిరే గాలిపటాలను
తెగవేసే ప్రజ్ఞ నీకు తెగవుండేదోయ్
తగువులు పడితే మాత్రం
అగపడ వా చుట్టుపట్ల అదురు గరీబూ!

వచవ కవిత్వంతో నీ
రచనాలోకాన్ని నింపి రాత్రీ పగలూ

పిచికారిలాగ యిపుడీ
రుచి కందం పట్టనేల రోషగరీబూ!

పై పద్యంలో 'రోషగరీబూ' అన్నచోట వేసిన విశిష్ట విశేషణం లోనే పద్యంలో ప్రశ్నకు సమాధానం ఉంది. ఇక దబలు గరీబూ, మిడిలు గరీబూ. నగటు గరీబూ అని ఎన్నిరకాల విశేషణాలు ఉచితంగా వాడాడో ఆ పద్యాలు చూసి గ్రహించుకోవచ్చు. ఒకటి రెండు చోట్ల "ఎవరు" గరీబూ అని వాడాడు. అది తెలుగు ప్రశ్నార్థకం కాదు. ఇంగ్లీషు(పదార్థకం). ఇదే సందర్భంలో ఇంగ్లీషు, సంస్కృతం మాటలను గరీబుతో కలుపుతూ తీసుకున్న లైసెన్సు గుర్తించదగింది.

ఈ గరీబు శతకంలో కనిపించే ఒక ప్రత్యేక విశేషం బాల్య స్మృతులు. తూంగి పురుగు ఐంటను గారంగా అగ్గిపెట్టె ఖైదులో పెట్టడం. తూనీగతోక చివరన పూచికతో దారమొకటి ముడివెయ్యటం కనిపిస్తాయి.

"పచ్చటి పొగాకు తోటలు, వెచ్చటి కోనేటినీళ్లు, వెన్నల గాలుల్ మచ్చల తువాయి పూతిని మెచ్చిన పసితనము" తనదని చెప్పుకున్నాడు కూడా. ఇక పల్లె జ్ఞాపకాలు ఈ శతకంలో మరీ విశేషంగా కనిపిస్తాయి.

వరిచేల కడ్డుగా పడి పరిగెత్తే పైర గాలిని మనకు పరిచయం చేస్తారు. మట్టికి పరిమళముంటుంది వాసన చూడమంటాడు. కొండ శిరముపై యేవో కుండలుపడి పగిలినట్లు కురిసేవర్ష ధారలను మన గుండెలపై 'వందరు' గా పారాడిస్తారు. ఊరి చెరువులో తెప్పలను తారలవలె మెరిపిస్తారు. బడి ఎగ్గొట్టి చెరువులో చేపలు పట్టడానికి వెళ్ళి దెబ్బలు తిన్న సంగతి చెపుతారు. కల్లంకాడికి పోయి దోసిళ్ళు పట్టి కొవ్వులు అడుక్కుని పప్పు బెల్లాలు కొనుక్కు తినటం, సీతాఫల తోటలలో కొమ్మలూ, చెట్లను కోతుల వలె విరిచి బూరులు తినటం, గారడి వాడివెంట ఊరు తిరగటం ఇట్లాంటి అను భవాలను, దృశ్యాలను మనోహరంగా చిత్రించిన మొదటి శతకం ఇదేనేమో!

సమకాలిక రాజకీయ సాంఘిక పరిస్థితుల ప్రభావం ఈ సంపుటిలో పుష్కలంగా కనిపించటం ఆశ్చర్యకరం కాదు. సమకాలిక సంఘటనను చిత్రించేటప్పుడు హ్యూమర్ ప్రయోగంలో దేవిప్రియ చూపించిన నేర్పు అద్వితీయం. ఇట్లాంటి ఇతర సమకాలిక రచనలకన్నా దేవిప్రియ రచనలలో విశిష్టత వాటి సునిశితమైన హాస్యం. ఒకటి రెండు ఉదాహరణలు చూడండి.

మనకిక హం నేచు సాగదు
మనకికి సాక్షులు దొరకని ప్రాబ్లమ్‌లేదోయ్
ఎవలేవి తెలుగు వెలుగుల
ఘన విగ్రహ బృందముంది కదర గరీబూ!

మతి తప్పిన పభువులతో
సతమతమయిపోయి జనులు ఛస్తావుంటే
గతి తప్పి వచ్చి ఋతువులు
వెతపెడితే యెటుల మనవి 'వెదరు' గరీబూ!

పద్యరచనంటే అదేదో తిరోగమనంగా భావించే ఈరోజుల్లో వచన కవిత్వంతోపాటు సమంగా పద్యాన్నికూడా తన భావవ్యక్తీకరణకు సమర్థంగా వాడుకున్న దేవిప్రియను అభినందించకుండా ఉండలేను. గేయరచనలోనూ వచన కవిత్వ రచనలోనూ తన సామర్థ్యాన్ని ఇంతకు పూర్వమే నిరూపించుకున్నాడు. శ్రీ శ్రీ నడిపినంత "ఈజీ"గా కందపద్యాన్ని నడిపి అందులో కొత్త కొత్త అందాలు చిందించి దేవిప్రియ తన బహుముఖ ప్రతిభను ప్రదర్శించాడు. ఆయన 'రన్నింగ్ కామెంటరీలు'లు ఒక పుస్తకంగా త్వరలో వస్తే ఆ మార్గంలో ఆయన కాయనే సాటి అని తెలుసుకోగలుగుతారు.

దేవిప్రియ 'గరీబు గీతాలు' పద్యసంపుటికి పీఠిక.

1991 డిసెంబరు 26

# కందాల్లో అందాలు

పద్యకవిత్వ భవిష్యత్తును గురించి, ఆమాటకొస్తే వర్తమానం గురించి కూడా రకరకాల అనుమానాలు, కుశంకలు వెలువడుతున్న సమయంలో డా॥ వెంకటేశం రచించిన 'కందాల మకరందాలు' చదువుకోవటం ఓ చిత్రమైన అనుభూతి! ఒకవేళ పద్యకవిత్వం అంతరించిపోయినా, శతకం మాత్రం చిరకాలం బతుకుతుందనే నా నమ్మకం. పద్యాన్ని ప్రధాన వాహకంగా వాడుకోవటం మానేసిన వాళ్ళు కూడా శతకరూపంలో పద్యాన్ని వాడుకుంటోనే ఉన్నట్టున్నారు. ఒకనాటి శ్రీశ్రీ, నిన్నమొన్నటి దేవిప్రియ, ఇటీవల కేరా లక్ష్మి శతకంతో ప్రత్యక్షమైన అరుద్ర— నా ఈ నమ్మకానికి ఆధారాలు.

వస్తు కవిత్వం బలంగా ఉన్నప్పుడు ఆత్మ నివేదనకు శతకమే ప్రధాన మార్గంగా ఉండేది. కవి తన ఆర్తిని చెప్పుకోవాలన్నా లేక ప్రపంచ గతిని తాను చూస్తున్న విధం చెప్పాలన్నా, ఏదైనా సందేశం ఇవ్వాలన్నా లేక చిలిపిగా కొన్ని విషయాలు సరదాగా చెప్పాలన్నా లేక పైవన్నీ కలిపి చెప్పాలన్నా శతకం చక్కగా వొదిగిపోయే కావ్యరూపం. అందువల్ల ఒకవేళ నిజంగా పద్య కవిత్వం ఆరోగ్యం చెడిపోతేగనక, దాన్ని బతికించేది శతకమే అని నా నమ్మకం.

ఆధునిక కవిత్వం కథాశ్రయాన్ని వదిలేసి, భావాశ్రయం వైపు ప్రయాణంలో ఆత్మాశ్రయత్వం ఒక ముఖ్యమైన మజిలీ. కల్లూరి భాస్కర్ (ఆంధ్రప్రభ 12-3-93) ఎంత కాదన్నా లేక వేరన్నా, శతకాల్లోని ఆత్మాశ్రయత్వం ఆధునిక కవిత్వంలోని ఆత్మాశ్రయత్వానికి సన్నిహితమైందేనని నా ఉద్దేశం. ప్రబంధపద్ధతి కవిత్వాలు పరాఙ్ముఖమైనా, శతక కవిత్వం మాత్రం పరిష్కృతంగా ప్రభవిస్తూనే ఉంది. ఇందుకు కారణం శతకకవిత్వంలో ఉన్న ఆత్మాశ్రయ లక్షణమే అనుకుంటాను. ఆత్మాశ్రయమనేది అంత పెద్ద

గ్గొట్టు సాంకేతిక పద్యమేమీ కాదు. కవి తాను చెప్పదలుచుకున్నది- అది నీతి అయినా, సందేశమయినా లేక ఆర్తి అయినా, ఆవేదనయినా- సరాసరి పాఠకుడికి లేక శ్రోతకు చెప్పే పద్ధతే ఆత్మాశ్రయత్వం. అది శతకాల్లోనూ ఉంది. ఆధునిక ఖండకావ్యాల్లోనూ ఉంది.

ఆధునికుల్లో ప్రముఖులు ముఖ్యంగా ఆధునిక విషయాలను ప్రస్తావించదలుచుకున్నవారు ఎక్కువగా కందపద్య శతకాలనే రాసినట్టు కనిపిస్తున్నది. శ్రీశ్రీ, బోయి భీమన్న- న.చ. రామానుజచార్యులు, దేవిప్రియ, ఆరుద్ర- ఇట్లా చాలామంది కందపద్యాన్ని ఎన్నుకున్నట్టు కనిపిస్తుంది. రెంటికీ పెద్ద సంబంధం లేకపోయినా ఆధునికులు హాస్యంగానూ, సరదాగానూ రాయదలుచుకున్న శతకాలు కందాల్లోనే ఉన్నాయి. బహుశః వీళ్ళందరికీ ఆదిగురువు కవి చౌడప్ప కావచ్చు. అయితే సీరియస్ శతకాలు కూడా కందాల్లో లేకపోలేదు. అందులో ముఖ్యమయింది సుమతి శతకం, ఈ వెంకటేశంకు కొంత ప్రేరణ సుమతి శతకం, మరికొంత ఆధునిక కంద శతకాలు. శతకమంటే నూరు పద్యాల సంపుటి అని అర్థమున్నా, శతకాలన్నీ నూరు పద్యాలకే పరిమితం కాదు. నూరుకు తక్కువ కాకుండ అని అర్థం చెప్పుకోవచ్చు.

ఆధునికులు కందపద్యాన్ని ఎన్నుకోవటానికి అధిక నియమాలున్న పద్యంలో తమ ప్రతిభ చూపించాలన్నది ఒక కారణమైనా అంతకుమించి కంద పద్యం మాత్రాబద్ధం కావటం వల్ల లయల హొయలు ప్రదర్శించటానికి వీలవుతుందన్న బలమైన నమ్మకమే అసలు కారణమనుకుంటాను. మాత్రాబద్ధమైన పద్యంలో సంప్రదాయ బలం వల్ల ప్రాచీన కావ్యభాషాపాలు (పదాలు) తప్పకపోయినా, ఉద్దేశమే ఉంటే- ఆధునిక వ్యవహార రూపాలను అధికంగా ప్రయోగించి పాఠకుల భాషకు అతి సన్నిహితంగా తీసుకొచ్చే వీలుంది.

కందం చాలాచిన్న పద్యం కావటంవల్ల యతిప్రాసలు దగ్గరదగ్గరగా వచ్చి, అనుప్రాసగా మారి, అందులోనూ ప్రాసేతర స్థలాల్లో కూడ ఒకటి రెండు చోట్ల ప్రాసలాంటిదాన్ని పాటిస్తే పద్యానికి ధ్వని మాధుర్యాన్ని కలిగించవచ్చు. అదే బిందు పూర్వక ప్రాసైతే ఈ సౌందర్యం ఇనుమడిస్తుంది. ఈ రహస్యం వెంకటేశంకు తెలుసు. ఉదాహరణకు ఈ రెండు పద్యాలు చూడండి:

కందాలను రసవన్మా
కందాలుగ తీర్చి మనుపు కవనం చెప్పా
రెందరొ వారందరి కభి
వందన శతమందజేతు వరుసగ సుమనా!

శృంగారం అంగారం
పొంగించిన కవితలల్లి పొందెను పీఠం
హంగుగ విశ్వంభర గిరి
శృంగం చేరెను సినారె జేజేల్ సుమనా!

ఉదాహరించిన పద్యాల్లో మొదటి దాంట్లో మూడవ పాదంలో 'అందరి' అనే శబ్దం, నాల్గవ పాదంలో 'అందజేతు' అనే శబ్దం ప్రాసతో కలిసి పద్యానికి అనుప్రాస సౌందర్యాన్ని కూర్చాయి. అట్లాగే ఉదాహరించిన రెండవ పద్యంలో కూడ 'అంగారం' శబ్దంలో ఈ అనుప్రాస రీతి కనిపిస్తుంది. పద్య రచనా సౌందర్యం మీద దృష్టి ఉన్నవాళ్ళే ఈ రకమైన ప్రయోగాలు చేస్తారు. ఉదాహరణకు ద్విత్వ నకారప్రాసంలో పాములా బుసలు కొడుతున్న ఈ పద్యం చూడండి.

బస్సులు పైమొతు రాకను
మిస్సయి ఆఫీసు పోక మిగిలితె అచటే
కస్సను బుస్సను రేపిక
బస్సుల కిస్సా తెలియవి 'బాసుడు' సుమనా!

కందం నాలుగు మాత్రల గణాలతో నడిచే పద్యం. లెక్క ప్రకారం ఇది చతురశ్ర గతిలో నడవాలి. అయితే అంతా చతురశ్రగతిలోనే ఉంటే పద్యంలో వైవిధ్యం లేక విసుగెత్తించవచ్చు. లయ పరిజ్ఞానం ఉన్న కవి అవకాశం దొరికితే లయ వైవిధ్యం చూపించకుండా ఉండలేడు. నాలుగు మాత్రల గణాలు మూడు రావలసిన చోట లెక్క కుదురుతూనే రెండు సమభాగాలుగా అంటే ఆరు మాత్రల గణాలుగా విరిగేట్టు నడిపితే ఆధునిక ప్రయోగంలో వున్న త్రిశ్రగతి లయకు సన్నిహితమవుతుంది. ఉదాహరణకు—

శిలలా అవి పరికించగ (పుట 2)
పనిసాయము మనిసాయము (పుట 3)
హరిజనుడో గిరిజనుడో (పుట 4)

చెలికోపం తీర్చగలం (పుట 10) - ఇట్లాంటివి చాలా చోట్ల కనిపిస్తాయి. ఇది సాధారణంగా చాలామంది చేస్తారు. వెంకటేశం ఇంకొంచెం ముందుకు పోయి ఇతర రకాల మిశ్ర లయలను సాధించాడు. ఉదాహరణకు ఇది చూడండి:

నల్లని మేఘాలు ముసిరి
చల్లని పవనాలు విసిరి చలి బాధిస్తే
ఉల్లములో పుట్టి వణుకు
మెల్లగ తనువెల్ల పాకి మించును సుమనా!

ఈ పద్యంలో ఒకటి, రెండు, నాల్గు పాదాలను చతురశ్రగతిలో చదవలేము. త్రిశ్రగతిలో కష్టంగా చదవగలం. కాని నాలుగు - ఐదు - మూడు అనే మాత్రల విరుపుతో మిశ్రగతిగా చదివితేనే ఈ పద్యం సొగసుగా ఉంటుంది, ఆ చదవటంలో ఏదో మాత్రమీద ఎక్కువ ఊనిక పెట్టి చదివితే ఇంకా ఎక్కువ సొగసుగా ఉంటుంది. అసలు అట్లాగే చదువుతాం.

కంద పద్యంలో ఏ పాదానికి ఆ పాదం విరిగితే ఒక అందం. ఒక పాదం మరో పాదంలోకి చొచ్చుకుపోతే మరో అందం. మొదటిది చాలా మంది చేస్తారు. రెండోది పద్య సౌందర్యం తెలిసినవాళ్ళు చేస్తారు. వెంకటేశం ఈ రెండూ చేసినట్టు ఈ పుస్తకంలో సాక్ష్యాలున్నాయి. ఇంతకుముందు ఉదాహరించిన "కందాలను రచనన్మా కందాలుగ తీర్చి...." అనే పద్యంలో ఏ విధంగా ఒక పాదం మరో పాదంలోకి చొచ్చుకుపోయిందో గమనించవచ్చు. ఎక్కడా ఆపకుండా, పూర్తయ్యేవరకు గుక్క తిప్పుకోకుండా చదివించే పద్యం ఇది. ఇట్లా చొచ్చుకుపోయే పద్యంలో జాతీయాలు ఇమిడ్చ గలిగితే ఇంకా అందంగా ఉంటుంది.

"లత సుడిగాలికి అతలా

కుతలం అయిపోయినట్లు...." (పుట. 10) - అన్నచోట ఒకపాదం ఇంకో పాదంలోకి చొచ్చుకుపోవటమే కాదు, ఇక్కడ నిలిచిన జాతీయం ప్రాసనియమాన్ని కూడ కడుపులో దాచేసుకుంది.

ఇంగ్లీషు పదాలను తెలుగుమాటలంత సాఫీగా, అనాయాసంగా కంద పద్యంలో ఈ కవి ఇమిడించిన తీరు చాలా ఆకర్షణీయంగా ఉంది. రిక మండేషన్ వంటి మాటలు ఎంత అలవోకగా ఇమిడిపోయాయో, అట్లాగే_

జూ, పార్కుర్, మ్యూజియములు

అప్పై నౌబడ్ ప్రహాదు అల టాంక్బండువ్ (పుట. 11) - అన్న అర్ధ కందంలో ఇంగ్లీషుమాటలు ఎట్లా ఇమిడాయో చూడండి.

అన్నిటికీ ఉదాహరణ లెందుకు గాని వెంకటేశం కందాలు చదివేటప్పుడు ప్రాస ప్రయోగాలమీద ఓ కన్నేసి చదవటం మంచిది.

ద్విరుక్త వ్యంజనాలతోనూ, సంయుక్త వ్యంజనాలతోనూ ప్రాసలు వేయటం ఈయనకు చాలా సరదా. తమాషా ఏమిటంటే ఇట్లాంటి ప్రాసలు

కూడా అవి ప్రాసకోసం వేసిన పదాలనిపించవు. ఈ రకమైన ప్రాసలు చాలా చోట్ల కవులకు పరీక్షలు పెడతాయి. ఎంతో పద సంపద అధీనంలో వుంటే తప్ప ఈ పరీక్షలో నెగ్గటం కష్టం. దానితోపాటు తగిన అభ్యాసమూ ఉండాలి. ఈ రెండూ వెంకటేశంకు ఉన్నట్లు ఈ కందాలు చదివితే మనం గమనించవచ్చు. ముఖ్యంగా "నర్తింతురు కనుసన్న.... (పుట: 13)", "ఉత్సాహపు బిల్ క్లింటన్ .... (పుట. 14)" అన్న పద్యాలు చదివి చూడండి.

ఈ శతకం చదివేవారికి పజిల్ లాంటిది ఈయన వాడిన విసంధులు. విశ్యసంధులను కూడ ఈయన వికల్పం చేసి విసంధులు చేశాడు. ఈయనకి ఈ సంధి తెలియదందామా? తెలుగులో ఎం.ఏ. పిహెచ్.డి. చేసినవారికి ఈ సంధి తెలియదనటం అన్యాయం. ఇట్లా సంధి చేయక పోవటానికి బలమైన కారణమే ఉండాలి. నిజానికి కొద్ది మార్పులతో సంధులు పొసగించటం పెద్ద కష్టమూ కాదు. ఉదాహరణకి "అనుభవ సారమని బుధులు అందురు సుమనా!" దీన్ని "అనుభవ సారంబని బుధులందురు సుమనా!" అని ఏ గణభంగం, యతిభంగం లేకుండా శుభ్రంగా సంధి చేయవచ్చు. అయితే సంధి చేయటం కోసం "సారంబు" అనే అతిప్రాచీన (Archaic) రూపాన్ని వాడాల్సి వస్తుంది.

ఈ కందాలన్నిట్లోనూ భాషను సాధ్యమైనంతగా వ్యవహార భాషకు సన్నిహితంగా తేవాలన్న ప్రయత్నం కనిపిస్తున్నది. ఆ ప్రయత్నంలో భాగమే బహుశః ఈ విసంధి ప్రయోగం. నిజానికి తెలుగు వచనంలో విసంధులు ప్రచురంగానే రాస్తున్నారు. వెంకటేశం చేసిందల్లా వచనంలో వాడుకలో ఉన్నదాన్ని పద్యంలోకి కూడ ప్రవేశ పెట్టటం. అంటే మంచి లక్ష్యంతో చేసిన వ్యాకరణ నియమభంగం.

ఈ పుస్తకంలో కవి ఆర్తి, ఐడియాలజీ, వివిధ విషయాలమీద అరుదైన ఉద్దేశాలు కనిపిస్తాయి.

ఉదాహరణకి-

"చీకాకు పరిచి దళితుల
మూకుమ్మడి బానిసలుగ ముంచిరి నాడున్
చేకొన్న రిజర్వేషను
పోకార్చాలంటు నేడు పోరిరి సుమనా!" - వంటి పద్యాల్లో నిమ్న వర్గాలకు ఉన్న కొద్దిపాటి రాయితీలకు వ్యతిరేకంగా జరిగే ఆందోళనపట్ల కవి ఆర్తి వ్యక్తమవుతున్నది.

అట్లాగే పాపాయిల మీద ముచ్చటైన మూడుపద్యాలు శివ పేజీలో ఉన్నాయి. అందులో ఒకటి ముద్దుపేరుతో పిల్లల చెక్కిళ్ళను గిల్లే శాడి జాన్ని నిరసించే పద్యం. పిల్లలను ప్రేమించే మంచి మనస్సున్న వాళ్ళకే ఈ రకపు ఊహాలు సాధ్యం.

వెంకటేశం పదాలను ప్రయోగించేటప్పుడు వాటి సార్థక్యాన్ని దృష్టిలో ఉంచుకొని, ప్రయోగించటం ఈ శతకంలో కనిపిస్తుంది. ఉదాహరణకి-

"ఎటు చూడు మురికివాడలె
ఎటు నడిచిన దారులిరుకె ఏమని చెప్పన్
కటకట! యీ ఓజ్లు సిటీ
విటలాక్షుకె భీతిగొల్పు విధముగ సుమనా!"

ఈ పద్యంలో 'విటలాక్షుడు' అనే మాట చాలా అర్థవంతంగా వాడాడు. మూడు కన్నులున్న వాడికికూడ ఓజ్లుసిటీ దారులు భయంకరంగా ఉంటాయి. ఇక రెండు కన్నులున్న మనకెంత? అనే అర్థం ఇందులో ఉంది. అంతేకాకుండా మూడు కన్నులున్నవాడి మూడో కన్ను మంట (వెలుగు)

కన్ను. దారి చూపించగల కన్ను. అయినా అతనికే సాధ్యం కాదు. మన కెంత? అని.

అట్లాగే క్లుప్తీకరణ ద్వారా ఏకరూపం చెందిన రెండు మాటలను చమత్కారంగా వాడిన ఈ పద్యం చూడండి.

క్రేజీ చదువుల కోసము
కేజీకగు పుస్తకాలె కేజీలయ్యేన్
కేజీకయ్యే ఖర్చులు
పీజీ కంటెను అధికము వినరా సుమనా!

ఇందులో మొదటి కేజీ (K.G) కిండర్ గార్టన్. రెండవ కేజీ కిలోగ్రాం.

ఈ కవి మతసామరస్యాన్ని బోధించే పద్యాలు కొన్ని రాశాడు. అడుగు తరగతి వారికి జరిగే అన్యాయాలకు స్పందించాడు. చోటా మోటా నాయకులు వేసే వేషాలను విసుక్కున్నాడు. అసమసంఘ వ్యవస్థను అసహ్యించుకున్నాడు. ఇట్లా ఎన్నో రకాలుగా ప్రగతి భావాలను పద్యాల్లో ప్రకటించాడు. వాటికేంగాని, ఆధ్యాధునికమైన స్త్రీవాద భావాలను కూడ ప్రతిఫలించాడు. జెండర్ నమన్వము చిత్రిస్తూ రాసిన ఈ పద్యం అందుకు ఉదాహరణ—

సుతనేమో తక్కువగను
సుతునేమో ఎక్కువగను చూసెడివారల్
అతివల నవమానించే
మతిహీనులు మూర్ఖ జనులు మహిలో సుమనా!

ఈ పుస్తకంలో చాలామంచి అభిప్రాయాలున్నాయి. ఎన్నో నేర్చుకోదగిన అంశాలున్నాయి. మనకు కర్తవ్యబోధచేసే పద్యాలు చాలా ఉన్నాయి. ఎందుకో ఈ కవి హాస్యాని కెక్కువ ప్రాధాన్య మివ్వలేదు.

ఇంతకుముందు తెలుగులో వచ్చిన ఆధునిక కంద శతకాల్లో హాస్యం పాలె క్కువ. అయితే ఒక్క అపురూపమైన హాస్య పద్యం మాత్రం దొరికింది. అది ఇది:

పోలీసులు మిత్రులనే
ప్రేలాడే బోర్డు చూసి వింతగ జనముల్
ఈలాంటి జోకులేలని
ప్రేలేసుక ముక్కుమీద వెళ్ళిరి సుమనా!

ఈ పద్యం చదివితే "అదాయపు పన్ను శాఖ మిమ్మల్ని ఆహ్వా విస్తున్నది" అన్న బోర్డు నాకు గుర్తొచ్చింది. వారి ఆహ్వానం లాంటిదే వీరి మైత్రి కూడా!

కందపద్య లయ రహస్యాలను, గమన సౌందర్యాలను బాగా ఎరి గిన వెంకటేశం రచించిన కందాల మకరందాలను ఆహ్వానిస్తున్నాను. ఇది ఈయన మొదటి శతకమేనని రెండో శతకంలో కాస్త హాస్యాన్ని కూడా అందిస్తాడని ఆశిస్తాను.

ఎస్. ఆర్. వెంకటేశం

"కందాల మకరందాలు" పీఠిక, 1993 ఏప్రిల్ 22

# మంజీరనాదాలు

ఉత్తర భారతంలో సంస్కృత సాహిత్యానికి సమఉజ్జీగా దక్షిణాదిన తమిళ సాహిత్యం విలసిల్లింది. అందులో ఇలంగో రాకుమారుడు రచించిన "శిలప్పదిగారం" అనే కావ్యం చాలా ప్రసిద్ధమయింది. దీని రచనాకాలం క్రీ.శ. 3వ శతాబ్ది ప్రారంభంగా విమర్శకులు గుర్తించారు. (రెండో శతాబ్ది చివర అయినా కావచ్చు) కథా ప్రాంతం దక్షిణ భారతంలో పశ్చిమతీరం. ఆ కాలంలో దక్షిణాదిన హిందూ, జైన, బౌద్ధమతాలు సహజీవనం సాగించినై. ఆ కాలపు కళలను, మతాన్ని, జన జీవితాన్ని నాగరికతను 'శిలప్పదిగారం' ప్రతిబింబించింది. 'శిలప్పదిగారం' అంటే 'కళ్యాణ మంజీరాలు' అనే అర్థం.

స్థూలంగా కథ ఇది: పుహార్ నగరంలో ఒక ధనిక వ్యాపారి కూతురు కణ్ణకి. అదే ఊళ్లో కోవలన్ అనే అతను ఒక ధనిక వ్యాపారి కొడుకు. వీరిద్దరికీ పెళ్లి అవుతుంది. అదే ఊళ్లో మాధవి అనే నర్తకి ఉంది. కోవలన్ మాధవి చేత ఆకర్షితుడయి కణ్ణకిని ఉపేక్షిస్తాడు. కొంత కాలానికి కోవలన్ మళ్ళీ కణ్ణకిని చేరుకుంటాడు. కాని అప్పటికే కోవలన్ ఉన్న డబ్బు అంతా పోగొట్టుకుంటాడు. బతుకుతెరువుకోసం మధురై నగరం చేరుకుంటారు. మదురైలో కణ్ణకి తన పాద మంజీరాల్లో ఒకదాన్ని కోవలన్‌కు ఇచ్చి అమ్ముకొని రమ్మంటుంది; కోవలన్ ఒక కమ్మరి దగ్గరికి వెళ్ళి అమ్మజూపగా కోవలన్ దగ్గరిది దొంగ సొత్తని ఆ కమ్మరి ఆరోపిస్తాడు. నిజానికి ఆ ఊరి రాణిగారి మంజీరం ఒకదాన్ని ఈ కమ్మరే దొంగిలిస్తాడు. కోవలన్ తెచ్చింది రెండోది అని ఆ కమ్మరి భావన. ఆ అనుమానంతో కమ్మరి అతన్ని రాజుగారికి అప్పజెప్పాడు. రాజు నిజానిజాలు విచారించకుండా కోవలన్‌ను చంపించాడు. తరువాత కణ్ణకి దుఃఖంతో వచ్చి తన రెండో మంజీరాన్ని చూపి తన భర్త నిర్దోషిత్వాన్ని ఋజువు చేస్తుంది. నిజం తెలుసుకున్న రాజ దంపతులు పశ్చాత్తాపంతో ఆత్మత్యాగం చేస్తారు.

కణ్ణకి ఆ ఊరిని శపిస్తుంది. ఊరు తగలబడి పోతుంది. తరువాత రెండు వారాల్లో కణ్ణకి అమరత్వాన్ని పొందుతుంది.

ధనికుడు తన భార్యను వదిలి ఇతర యువతుల వలలో పడటం, మళ్ళీ తప్పు తెలుసుకోటం మొదలైన అంశాలలో కొత్తదనం లేదు. తరువాత కథ నడిపిన తీరులో కొంత ఆసక్తి కలిగించే విధంగా ఉంది. ఆధునికులు నవల అని పిలిచే సాహిత్య ప్రక్రియ లక్షణాలు దీనిలో కనిపిస్తాయి. ఈ కథనే అమృత్‌లాల్ నాగర్ అనే హిందీ రచయిత "సుహాగ్ కే నూపుర్" అనే నవలగా రాశాడు. శిలప్పదిగారం కథనే ప్రధానంగా తీసుకొని అందులో భౌతిక ప్రపంచ విరుద్ధమైన సంఘటనలను తొలగించాడు. సహజ సంఘటనలను చేర్చి పాత్రల అంతర్మథనాలను, అన్యోన్య సంఘర్షణలను చూపించాడు. మరీ ముఖ్యంగా మాధవి పాత్రను ఉన్నతంగా చిత్రించాడు. కణ్ణకి కళ్యాణ మంజీరాలు తనకు తెచ్చి పెట్టమని మాధవి కోవలన్‌ను అడుగుతుంది. డబ్బు కోసం కాదు. కణ్ణకి స్థాయిలో కోవలన్ పక్కన తాను గుర్తింపు పొందాలని మాధవి తపన. అంటే సాంఘికంగా తనకు రావాల్సిన న్యాయమైన స్థానం కోసం పోరాడుతుంది. అందుకోసం ప్రేమించిన కోవలన్‌ను కూడా వదులుకోటానికి సిద్ధపడుతుంది. తన బాధ్యతలేని తన కులం మూలంగా తనకు దక్కవలసిన స్థానం తనకు ఎందుకు దక్కక పోవాలని ఆవేదన చెందుతుంది. వేశ్యా కులాన్ని తయారు చేసిన సంఘాన్ని ధిక్కరిస్తుంది. ఎదిరిస్తుంది, చివరికి ఓడిపోతుంది. ఓడిపోక తప్పని కాలమది.

అసమ సాంఘిక వ్యవస్థ కొన్ని వర్గాల ప్రజలను సాంఘికమైన అన్యాయాలకు ఎట్లా గురిచేసింది. అందులో స్త్రీకి జరిగిన అన్యాయాన్ని ఈ నవల చాలా సున్నితంగా చిత్రించింది. అంతేకాదు ఎదిరించి పోరాడటమే గౌరవ ప్రదమైనదన్న సందేశాన్ని మాధవిద్వారా ఈ నవల అందిస్తుంది. ఆ కాలపు సాంఘిక పరిస్థితుల పరిధిలోనే అమృత్‌లాల్ నాగర్ ఎంతో

నిపుణతతో ఈ చిత్రణ చేశారు. ఆ కాలపు నాగరికతా, వాతావరణం చెడ కుండా తన సందేశాన్నందించిన అమృత్‌లాల్ నాగర్ ప్రశంసనీయులు. ఈ నవలను 'కళ్యాణ మంజీరాలు'గా అందెల రవళుల సందడి వినిపించే చక్కటి తెలుగు వచనంగా మలచిన కౌముదిగారు అభినందనీయులు. దీని రెండో ముద్రణ హైదరాబాద్ బుక్ ట్రస్టు వారికిచ్చినందుకు కూడా కౌముదిగారికి ధన్యవాదాలు. 'కళంకిని' అనే పేరుతో మొదట అచ్చయింది. అయితే "కళ్యాణ మంజీరాలు" అనే పేరు దీనికి బాగా సరిపోతుందని ఈ ముద్రణలో ఈ పేరు ఎన్నుకున్నాం.

ఇతర దేశాల రచనలతోపాటు ఇతర భారతీయ భాషలనుంచికూడా కళా విలువలున్న సందేశాత్మక నవలలను తెలుగు పాఠకులకు అందించాలనే ప్రయత్నంలో మలయాళంనుంచి శివశంకరపిళ్ళై రచించిన "కూలి గింజలు", బెంగాలీనుంచి మహాశ్వేతాదేవి రచించిన రాకాసి కోర ఇంతకు పూర్వం ప్రచురించాం. మహాశ్వేతాదేవిదే ఇంకో నవల "ఒక తల్లి" అనేది అచ్చులో ఉంది.

హిందీ నుంచి ఇప్పుడీ నవల అందిస్తున్నాం. హిందీ మూలానికి ఇది యథాతథానువాదం కాదు. కొన్ని మార్పులున్న స్వతంత్రానువాదం. ఎప్పటిలాగే మా ప్రయత్నాన్ని మా పాఠకులు హర్షిస్తారనీ, ఆదరిస్తారనీ మాకు నమ్మకమే.

హైదరాబాద్ బుక్ ట్రస్ట్ వారి "కళ్యాణ మంజీరాలు"
నవలకు సంపాదకీయం, 1983 ఆగస్టు 9

# నాకునచ్చిన మంచి నాటిక

ఒక అర్ధ శతాబ్దం కిందటి వరకూ తెలంగాణాలో జరిగిన భూస్వామ్య విధానపు దోపిడీ స్వభావాన్ని గురించి కథలు విన్నాం. పుస్తకాలు చదివాం. నాటకాలు చూశాం. బొల్లిముంత శివరామకృష్ణగారి 'మృత్యుంజయుడు' వట్టికోట ఆళ్వారుస్వామిగారి ప్రజల మనిషి, గంగు, దాశరథి రంగాచార్యులు 'మోదుగుపూలు' వంటి నవలల్లో ఇది కనిపిస్తున్నది. సుందరయ్యగారి 'వీరతెలంగాణా విప్లవపోరాటాలు' అనే పుస్తకంలో వాస్తవగాథలు నిక్షిప్తమయినాయి "మాభూమి" నాటక ప్రదర్శన ద్వారా తెలంగాణ దోపిడీ కథ అఖిలాంధ్రానికి అందింది. విద్యావంతులు తక్కువగా ఉన్న దేశంలో దృశ్య, శ్రవ్య రూపాల ద్వారానే ప్రజలకు సందేశం అందుతుంది. అందుకే పాటకు నాటకానికి ఇవాళ ప్రయోజనం ఎక్కువుంది.

సుంకర - వాసిరెడ్డిగార్ల మాభూమి నాటకం కథ తెలంగాణదే కాని, భాష కృష్ణాజిల్లాది. ఆ రచయితలకు పరిచయమైన భాష అది. అదీగాక ఆ నాటకం ప్రయోజనం తెలంగాణాలో పీడితులను చైతన్యవంతులను చెయ్యటం కాదు. తెలంగాణా గాథను తోటి తెలుగన్నలకు వినిపించటం. అందువల్ల ఆ నాటకంలో కృష్ణాజిల్లా భాష వాడటం ఒక లోపం కాదు. శాకుంతల నాటకం తెలుగువాళ్ళకి ప్రదర్శించినప్పుడు తెలుగులోనే ఉండాలికదా.

ఇదంతా ఒకనాటి కథ. ఇప్పటి సంగతేమిటి? ప్రభుత్వాలు మారినై. ప్రజాస్వామ్యవిధానం వచ్చింది, ఎన్నికలు దీనికి ఒక గుర్తుగా భావిస్తున్నాం. కాని తెలంగాణాలో మాత్రం పాత కథే కొత్త పద్ధతిలో పునరావృతమవుతున్నది. దోపిడి పోలేదు. దోపిడీ సారం మారలేదు. దోపిడీ రూపంలో మాత్రం కొన్నిమార్పులు కనిపిస్తున్నాయి. దోపిడీకి కొత్తహంగు లేర్పడ్డయి. అవే "ఎలెక్షన్లు". ఈ విషయాన్ని ఈ నాటిక సమర్థంగా ప్రతిపాదించింది.

ఈ నాటిక ప్రయోజనం "మాభూమి' ప్రయోజనం కాదు. పీడనలో నలుగుతున్న వాళ్ళకోసమే రాయబడ్డ నాటకం ఇది. అందువల్ల ఇది ఆ ప్రజల భాషలోనే ఉండాలి. ఇందుకో ఉత్తర తెలంగాణ భాష వాడబడింది. (ఈ భాషాస్వరూపం తెలుగు అకాడమీ వారి కరీంనగర్ బులెటిన్‌లో కని పిస్తుంది.) ఇందులో వాడిన భాష ఒట్టి భాషకాదు. ప్రజల బాధాగాధలను కోపతాపాలను, సమర్థంగా వ్యక్తీకరించే అసలు సిసలు నోటిమాట.

అసలు నాటిక మొదలెత్తుకోటమే ఒక చాటింపుతో. చాటింపుకు ఒట్టి విషయం చాలదు. మామూలు భాష కూడా చాలదు. ఆ సందర్భంలో వాడే భాషను పట్టుకోవాలి, చాటింపులో ఒక సంగీతముంది. లయ ఉంది. దీన్ని పట్టుకోవాలి. సరిగ్గా రచయిత ఈ పనిచేశాడు. పునరావృతమయ్యే పల్లవి లాంటి కొన్ని వాక్యాలు ఉంటాయి. అవి ఈ లయకు కారణాలవుతాయి. "ఇన్నోళ్లెవలో ఇననోళ్లెవలో!" అనేది ఈ చాటింపుకు పల్లవి లాంటిది. అట్లాగే "అటుగానోల్లు ఇటుగానోల్లు" అనేది కూడ చాటింపు భాషానిర్మాణంలో భాగమే. "వయసోల్లు, ముసలోల్లు, ఆడోల్లు, మొగోల్లు" అనే మాటల కూర్పు పాటలో కనిపించే మాత్రాగణాల కూర్పులాంటిది. ఇలాగే "విస్తారి" ఏడ్చే "ఏడుపులోనూ" భాషాలయ కనిపిస్తుంది.

ఈ నాటిక చిత్రించిన జీవితవాస్తవాలు ఈ నాటికకు వస్తుబలాన్ని ఇచ్చినాయి. పెత్తందారులు కోడిపెట్టని దోచుకోటం, పేదవారి స్త్రీల మానాలపహరించటం, 'సారా' కాంట్రాక్టర్లు సారాలో నీళ్ళుకలపటం, అవసరమయినప్పుడు ఈ దోపిడీదార్లు కలిసికట్టుగా ఉండటం ఇవన్నీ జీవిత వాస్తవాలు, ఉత్తర తెలంగాణాలో ఇప్పుడు నడుస్తున్న దోపిడీ ఇది. ఇన్ని విధాల వస్తువూ, భాషా కలిసిపోయిన ఈ నాటిక తన ప్రయోజనాన్ని నిర్వహించ గలదని నాకు గట్టినమ్మకం.

వల్లంపట్లనాగేశ్వరరావు "ఎలచ్చన్లచ్చినయ్" నాటికకు పీఠిక. 1987 జూన్.

# తెలుగువారి జీవితాలను సారవంతం చేసే పుస్తకాలు

తెలుగులో రుచి, అభిరుచి అనే రెండు మాటలు వాడుకలో ఉన్నాయి. తిండి పదార్థాలపై కాంక్షకూ, లలిత కళలపై ఆసక్తికీ ఈ రెండు మాటలనూ వాడుతున్నాం. ఈ రెండింటికీ అంత సాన్నిహిత్యం ఉంది. రుచులెంచి తినేవారికి లలిత కళలపై అభిరుచులుండటం కూడా మన అనుభవంలోదే.

మంచి వంటలు వండటం శాస్త్రమూ, కళా కూడా. అందుకే మనకు పాకశాస్త్రమూ, పాకకళా అని రెండు మాటలున్నాయి. ఏ పదార్థానికి ఏ పదార్థంతో పొత్తు ఉందో, ఏ పదార్థాన్ని ఏ దశలో వంటకంలో ఏ పాళ్ళలో చేర్చాలో అనే తెలివిడి కొంత శాస్త్రంవల్ల వస్తుంది. కొంత నేర్పువల్ల వస్తుంది.

తెలుగు వారికి వంటలపై ఆసక్తి మెండు అనటానికి ఒక గొప్ప నిదర్శనం ఉంది. బాలవ్యాకరణం క్రియాపరిచ్ఛేదం చూడండి. ఎన్ని సూత్రాలకు "వండు" ధాతువుతో వచ్చే క్రియలను ఉదాహరించాడో వ్యాకర్త.

చాలామంది మగవాళ్ళకు తమ భోజనంలోకి వంటకాలు ఎట్లా వస్తాయో తెలీదు. ఇటీవలి కాలంలో ఆడవాళ్ళకు వ్యవధి లేకనో, విసుగుదల వల్లనో రుచికరమైన వంటలు వండటంపై, ఆసక్తి సన్నగిల్లుతున్నది. ఇది హర్షించదగిన మార్పుకాదు. ఆడామగా భేదం లేకుండా స్త్రీ పురుషులు మంచి వంటలపై వాటి తయారీపై ఆసక్తి పెంచుకోటం అవసరం. జీవితాన్ని సారవంతం చేసుకోటం అవసరం. చింతల పద్మావతిగారు ఇంటింటా మంచి వంట పేరుతో వేసిన మూడు కాయగూరల వంట పుస్తకాలూ, మంచి మిల్టరీ వంట, కిచెన్ మనోరమా, మిరకిల్స్ విత్ నాన్ వెజ్ అనే మూడు మాంసాహారం వంట పుస్తకాలూ ఈ రకమైన ఆసక్తిని కలిగించటానికి ఉపయోగిస్తాయి.

పద్మావతిగారి పుస్తకాల్లో చాలా భాగం శ్రద్ధగా చదివాను. పదార్థాల పట్టిక ఇవ్వటమేకాక, చేసే విధానం చాలా జాగ్రత్తగా వివరించారు. ఉదాహరణకు "చికెన్ విత్ కరీ లీవ్స్" చేసే పద్ధతి వివరిస్తూ "దాల్చిన చెక్క వేసి వేయించి దూసిన కర్వేపాకు వేసి ఆకు సగం వేగాక చికెన్ వేసి సన్న సెగలో ముక్కలు ఎఱ్ఱబడేవరకు వేయిస్తూ ఉండాలి" ఈ వివరణలో నేను అండర్‌లైన్ చేసిన మాటల్లో రచయిత్రి జాగరూకత కనిపిస్తున్నది.

తీరిక దొరికినప్పుడు ఈ పుస్తకాలు కేవలం విషయ పరిజ్ఞానం సంపాయించటానికి కూడా చదువుకోవచ్చు. ప్రయోగాలు చేసి చూస్తే మరీ మంచిది. ఈ ఆరు పుస్తకాలూ ఇతరుల చేతుల్లో పడకుండా ఎంతో జాగ్రత్తగా దాచిపెట్టుకుంటున్నాను.

ఈ పుస్తకాలు తెలుగువారికి జిహ్వాచాపల్యాన్ని పెంచి, వారి జీవితాలను సారవంతం చేస్తాయని నా నమ్మకం. ఈ దృష్ట్యా పద్మావతి గారి కృషి విలువైనది.

చింతల పద్మావతి "నాన్ వెజ్ డిలైట్" కు పీఠిక - 1993.



# తప్పనిసరిగా చెప్పవలసిన కొన్ని మాటలు

"మహి మున్ వాగనుశాసనుఁడు సృజియించెన్ కుండలీంద్రుండు త
న్మహనీయ స్థితి మూలమై నిలువ....

అని వసుచరిత్ర కారుడన్నట్టుగా ఈ చేరాతలకు ప్రేరకుడు దేవిప్రియ. అవిచ్ఛిన్నతకు కారకులు నండూరి రామమోహనరావు గారు. దేవిప్రియ ప్రేరేపించక పోతే చేరాతలు అసలు మొదలయ్యేవి కావు. రామమోహనరావు గారు అభిమానించి ఆదరించకపోతే ఇవి ఎప్పుడో ఆగిపోయేవి మధ్యలో నేనే తొందరపాటు నిర్ణయం తీసుకోటానికి సిద్ధపడ్డప్పుడు రామమోహన రావుగారి అభిమానమే అడ్డువచ్చింది. ఈ ప్రేరక కారకులిద్దరూ చేరాతల పై చూపిన శ్రద్ధకూ, అభిమానానికి మాటల్లో ఏవిధంగానూ కృతజ్ఞతలు చెప్పలేను. వీరిద్దరూ చేరాతల గురించీ, చేరా గురించీ చాలా చెప్పారు. నిజానికి వాళ్ళు చెప్పిన తరువాత నేను చెప్పాల్సిందేమీ లేదు. అయినా గ్రంథకర్తగా ఆనవాయితీ ప్రకారం నాలుగు మాటలు చెప్పదల్చుకున్నాను.

చేరాతలకు వస్తు పరిమితి లేదు. అయినా ఇవి భాషా చ్ఛందస్సాహిత్యాలను వివరించినట్టు గ్రహించటం కష్టంకాదు. అందులో ఎక్కువ భాగం కవిత్వాన్నే స్పృశించినట్టు గ్రహించగలం. అందువల్ల ఈ మొదటి సంపుటి కవిత్వ పరామర్శకే పరిమితం చెయ్యటం మంచిదని మిత్రులు— ముఖ్యంగా, దేవిప్రియ, గోపీలు—సూచించారు. వారి సూచనలను ఆదేశాలుగా పాటించాను.

అయితే కవిత్వం గురించి రాసిన ఖండికలన్నీ ఇందులో చేరలేదు. వాటిలో కొన్ని నాకే నచ్చలేదు. మరికొన్ని ఆయా కవులకు రుచించలేదు. మొదలే అవి వివాదాస్పదమైనవి. ఆ వివాదాలను ఈ సంపుటి వరకూ విస్తరించటం వాంఛనీయం కాదు. గ్రంథ విస్తృతిని దృష్టిలో పెట్టుకుంటే ఆ వివాదాస్పద ఖండికలను ప్రస్తుతానికి విస్మరించటమే మంచిదని తోచింది.

చేర్చిన ఖండికల్లో అయినా విషయ ప్రాధాన్యంకోసం భారీగా కత్తెర వెయ్యాల్సివచ్చింది.

సంకోచాలు ఏమంత పెట్టుకోకుండా ఆయా కవుల మీద కొంచెం అతిగా చనువు తీసుకొని ఈ పరామర్శలు రాసినట్టు గుర్తించాను. నచ్చినా, నచ్చకపోయినా: కొందరికి కోపం వచ్చినా, మరికొందరికి చిరాకు కలిగినా చాలా మంది సాహిత్యాభిమానులు చేరాతలు చదవటానికి అలవాటుపడ్డారు. యువ కవులు ఉత్సాహంగా చదివారు. సీనియర్ కవులు, విద్వాంసులు చాలా ఆసక్తి చూపించారు. వీరి ప్రోత్సాహ ప్రభావం చేరాతలపై బాగా ఉందను కుంటాను. ఏదో కొత్త విషయం చెప్పాలన్న తపనకు, నిర్వహణలో జాగ్రత్తకు పాఠకుల ఆసక్తి ప్రమేయం చాలా ఉంది.

ఈశీర్షిక వ్యక్తులను వదిలేసి కేవలం విషయాన్నే అంటిపెట్టు కున్నదికాదు. విషయంతో పాటు వ్యక్తుల ప్రస్తావన తరచుగానూ, అధికం గానూ వచ్చిన ఘట్టాలున్నాయి. వ్యక్తులను ప్రత్యక్షంగా సంబోధించిన సందర్భాలుకూడా కొన్ని ఉన్నాయి. ఇవి కొందరికి రుచించలేదు. వ్యక్తు లనూ, విషయాలనూ విడదీయకుండానే వస్తుగత విమర్శను వ్యక్తిగత స్పర్శ (personal touch) తో సాగించవచ్చునని నమ్మేవాణ్ణి గనుక ఇందుకు చింతించటంలేదు. కాని ఈ మార్గం కొన్నిచోట్ల కొందర్ని నొప్పించినట్టుంది. అయితే అది అన్ని వేళలా ఉద్దేశ పూర్వకం కాదని మనవి చేసుకుంటున్నాను.

ఈ ఖండికల వరస చాలా వరకు కాలాక్రమానుగతం. కవయిత్రు లపై పరామర్శ అంతా నిరంతరాయంగా ఉంటే ఒక ధోరణి కర్షిమ విస్తరణ స్ఫురణకనుకూలంగా ఉంటుందని కాలక్రమాన్ని కొంచెం వ్యత్యస్త వెయ్యాల్సి వచ్చింది.

చేరాతలకు సాహిత్య చరిత్ర రచనకు లాగా పకడ్బందీగా వేసుకున్న ప్రణాళిక లేదు. ఏనాండిక కానాండిక ఒక సద్యోరచన. అందువల్ల ఆధునిక సాహిత్యంలో అత్యంత ముఖ్యపాత్ర వహించిన కొందరు కవులూ, కవయిత్రులూ ఇక్కడ కనిపించకపోవచ్చు. ఇది వారిని నిర్లక్ష్యం చెయ్యటంగా భావించ కూడదు.

ఈ రచనల్లో సాహిత్యానుభవ వ్యక్తీకరణకిచ్చిన ప్రాధాన్యం సిద్ధాంతాల కివ్వలేదు. అయితే ఆ అనుభవాన్ని సాధ్యమయినంత స్పష్ట రీతితో హేతుబద్ధంగా వ్యక్తీకరించే ప్రయత్నం చేశాను. ఈ ప్రయత్నంలో నా భాషాశాస్త్ర శిక్షణ ప్రత్యక్షంగానూ, పరోక్షంగానూ చాలా అక్కర కొచ్చింది. ఒక కవితా ఖండికను అర్థం చేసుకోటానికీ ఆస్వాదించటానికీ విశ్లేషించటానికి భాషాశాస్త్ర పరిశోధన పద్ధతులు బాగా పనికొస్తాయని అనుభవ పూర్వకంగా గ్రహించాను.

చేరాతల డిజైనర్‌గా, డిస్కవరర్‌గా దేవిప్రియ సంపాదక బాధ్యత నిర్వహించారు. గోపి సహకరించారు. పరుచూరు సుబ్బయ్య ప్రచురణ భారాన్ని వహించారు. అచ్చుతప్పుల్ని చాలా వరకు తగ్గించి పుస్తకాన్ని అందంగా తయారు చేశారు. ఏదో సందర్భంలో తాను వేసిన కార్టూన్ని ఈ పుస్తకానికి ముఖచిత్రంగా వాడుకోటాన్ని మోహన్ హర్షించలేడు గాని సహించారు. ఇవేవీ తిరిగి తీర్చుకోదగిన ఋణాలు కావు.

చేరాతలున్నంత నిర్మొహమాటంగా వీటిమీద విమర్శలుంటాయని ఊహించవచ్చు. అయితే అవి హేతుబద్ధంగా ఉండాలని ఆశించటం దురాశ కాదు కదా!

ఇంతకన్నా చెప్పాల్సిందేముంది ?

'చేరాతలు' మొదటి సంపుటంగా వచ్చిన 'సాహిత్య విమర్శనవ్యాసాలు'
వ్యాస సంకలనానికి స్వపీఠిక. [illegible] [illegible] 28,

CHEKURI RAMA RAO PEETHIKALU Rs. 60/-

New Found Land Street No. 7 Habsiguda Hyderabad-500007.

## పీఠికాధిపతి గురించి .....

"చేరా" అనే రెండు అక్షరాల పేరు ఇవ్వాళ తెలుగు సాహిత్య లోకంలో పెద్ద పీఠం వేసుకుని కూర్చుంది.

ఆధునిక తెలుగు విమర్శను సుసంపన్నం చేసిన ప్రముఖుల్లో చేరాగారి స్థానం ఎప్పటికీ పదిలం. "తెలుగు వాక్యానికి" ఈ 'భాషా' పరిశోధకుడు చేసిన సేవ ఒక వ్యాకరణ కాలం గుర్తుండిపోతుంది. వీరి భావుక హృదయానికి ఈ భాషాశాస్త్రం ఎప్పుడూ అడ్డుకాలేదు. "అరపేజీ సామ్రాజ్యంలో" వీరి "చేరాతలు" ఆధునిక కవిత్వాభిమానులకు కొత్త కోణాలను ఆవిష్కరించాయి. విమర్శకు కొత్త సిలబస్ ఇచ్చాయి.

చేరా విమర్శలో కాలికస్పృహతోపాటు ప్రాపంచిక సైద్ధాంతికతాత్త్వక భూమికలు అంతర్లీనంగా ఉంటాయి. వీరి అవగాహనపరిధి చాలా విస్తృతం. ఇవి గమనించనివారికి వైరుధ్యాలు ఆభాసిస్తాయి. సహజం.

ప్రధానంగా వీరిది శాస్త్రీయశైలి. అయితే కవిత్వ విమర్శలో మాత్రం-వద్దంటూనే-అప్పుడప్పుడు ఆలంకారికశైలి ప్రదర్శిస్తారు.

ఎనభయ్యో దశకపు అత్యాధునిక యువ కవుల్ని స్త్రీ వాద కవయిత్రుల్ని చాలామందిని వెలుగులోకి తీసుకువచ్చిన ఘనత వీరికే దక్కుతుంది.

వ్యక్తిగా చేరాగారు అంతరువులులేని స్నేహశీలి సాహిత్యజీవి నిగర్వి మృదుభాషి ప్రకృతి ప్రేమికుడు. అనారత అధ్యయన తత్పరుడు. కొండొకచో సాహితీ కలహాశనుండు. విశేషించి తప్పిపోయిన కవిప్రవరుడు. కవితా రసాస్వాదన మత్తచిత్తుడు.....

**ఎండ్లూరి సుధాకర్**

Printed at : Vijaya Block Making & Printing Works. Rajahmundry. Ph. 71444.